# నగర మీద పేమగీత

శ్రీ బాలగంగాధరతిలక్

ట్యాంక్‌బండ్ సన్నని నడుం చుట్టూ చెయ్యి చుట్టి,
అందమైన నగర ముఖాన్ని దగ్గరగా తీసుకొని,
ఆశలతో అలసమైన అబిడ్స్ కళ్లల్లోకి చూసి,
దీపాల వెలుతురు ప్రతిఫలించే చెక్కిళ్లపై ముద్దు పెట్టుకో.

సిగలో నౌపహాడ్ నాగరం తళుక్కున మెరుస్తుంది;
బంజారా హిల్సు వక్షోజా లుద్రిక్తంగా చలిస్తాయి;
అలా అలా నైలాన్ చీరకింద మెత్తని గాగరాలో
సికిందరాబాద్ జఘనోరు సౌందర్యం నిన్ను కవ్విస్తుంది;
వేలవేల బార్లలో కొన్ని వేల నిషాగీతాల మధ్య
బాళిగోలిపే జనరాలి నృత్యం పరవశింప చేస్తుంది;
ఓరగా తెరచిన జనానాల తలుపుల లోంచి
ఉండి ఉండి నిలువగాలి వస్తుంది;
హుసేన్ సాగర్ మీద ఒలికిన వెన్నెల లోంచి
ఒక విరహిణి మధుర విషాదగాథ వినిపిస్తుంది;
వాడిన పువ్వుల వాసన వేడివేడి పాదాలకు తగులుతూండగా
రోడ్లమీద అజ్ఞాతకామం ప్రతిరోజూ రాత్రి ప్రవహిస్తుంది;
తెలుగువాళ్ల తెలివిలేనితనం ధోవతి కుచ్చెళ్లతో పాటు మోయగా
యం. యల్. ఏ. క్వార్టర్సు దగ్గర ఎబ్బెట్టుగా జీరాడుతుంది;
దర్బారులో సిగ్గులేని, వగల్ని ఒలకబోసే నెరజాణతనం నుండి
దాపరికం లేని పారిశ్రామిక నాగరికతా నగ్నత్వంలోకి
ఎదుగుతూన్న నగరసుందరిని ఒదులొదులుగా కౌగిలించుకో.
మదం, ముదం, మృగమదపరిమళం మత్తెక్కిన కన్నుమూతలలో
పెట్రోలు వాసన ఫెళ్లుమని తగిలి ఉలిక్కి పడతావు!

మూసీనది ముతక శృంగారాన్ని, పాపకశ్మలాన్ని
మౌనంగా, దీనంగా మోసుకుపోతూంటుంది;
ముసలిగద్ద చార్మినార్ మీద గతవైభవాల్ని తలచుకొని
మూలుగుతూ 'మోసం!' అని అరుస్తుంది.

అయినా యౌవనం తగ్గిపోదు; లావణ్యం తగ్గలేదు; మెహబూబ్ జిందాబాద్!
ఫ్యూడల్ రహస్యాల్ని నేటికీ దాచుకున్న పుండ్రేక్షు కోదండం హైదరాబద్!

# విష్ణుకుండిన విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము

శ్రీ బి. ఎన్. శా

ఐదు రేకులుగల ఈ శాసనము నాగవరము నివాసియగు శ్రీ తమ్మళి ఆంజనేయులుకు లభించినది. గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము లభించిన ప్రాంతమందే ఈ శాసనము లభించినది. ఈ శాసనము పొలము ప్రక్కన ఉన్న పాడుబడిన బావిలో పూడికను తీయించుచుండగా లభించినది. రేకులన్నియు చిలుము పట్టి అక్షరములు కొన్ని చెడిపోయినవి. ఈ శాసనపు కడియము ఎచ్చటను కనిపించలేదు. శాసనములోని మొదటిరేకు ఎడమవైపు పైభాగము పగిలిపోయినది. యీశాసనపు రేకులు శ్రీ తమ్మళి ఆంజనేయులు ద్వారా శ్రీ పి. రాజారావుగారికి, రాజారావుగారినుండి శ్రీ రమా మనోహరరావుగారికి, వారినుండి నాకు లభించినవి.

ఈ శాసనము విష్ణుకుండిన వంశీయుడగు శ్రీ విక్రమేన్ద్ర భట్టారకవర్మ వేయించినవి. ఇతఁడు ఇన్ద్రభట్టారకవర్మ కుమారుఁడు. విక్రమేన్ద్రవర్మ పౌత్రుడు. ఈ శాసనమున విష్ణుకుండినుల వంశ చరిత్ర గోవిందవర్మతో ప్రారంభమగుచున్నది.

గోవిందవర్మ
|
మాధవవర్మ
|
విక్రమేన్ద్రవర్మ
|
ఇన్ద్రభట్టారకవర్మ
|
విక్రమేన్ద్రభట్టారకవర్మ
(శ.సం. 488)

ఈ శాసనమున ఐదు రాగిరేకు లున్నవి. ఒక్కొక్క రేకు పొడవు 18.8 సెం. మీ. వెడల్పు 6.5 సెం. మీ. ఈ రేకులకు గల కడియము, రాజముద్రిక ఎక్కడ పడిపోయినదో తెలియదు. నాగవరము వెళ్లి శ్రీ తమ్మళి ఆంజనేయులుగారిని కడియము విషయము అడిగియుంటిని. వారు "బావిలో గజము లోతువరకు పూడిక తీయించినాము. చుట్టుప్రక్కల వెతికించినాము. ఎక్కడను కడియము జాడ లేద"ని చెప్పినారు. నేను ఇంద్రపాల నగర శిథిలములను చూచునప్పుడును, అప్పటి శిలాశాసనములు తీయునప్పుడును ఆ ప్రాంతమందంతటను ఈ కడియము గురించి వెదికి విఫలుడనైతిని. మొత్తము శాసనము తూకము 1033 గ్రాములు. అనగా 1 కిలో 33 గ్రాములు.

ఈ శాసనమున ఐదురేకులున్నను ఒక రేకు మాత్రము వదలివేయబడినవి. శాసనము నాలుగవరేకు రెండవవైపుతో పూర్తియైనది. మొదటిరేకు రెండవప్రక్కనుండి శాసనము ప్రారంభమగుచున్నది. ఈ శాసనమునందలి పంక్తుల సంఖ్య 45.

| | | |
|---|---|---|
| మొదటిరేకు | రెండవ ప్రక్క | 7 పంక్తులు |
| రెండవరేకు | మొదటి ప్రక్క | 7 పంక్తులు |
| ,, | రెండవ ప్రక్క | 7 ,, |
| మూఁడవరేకు | మొదటి ప్రక్క | 6 ,, |
| ,, | రెండవ ప్రక్క | 6 ,, |
| నాలుగవరేకు | మొదటి ప్రక్క | 6 ,, |
| ,, | రెండవ ప్రక్క | 6 ,, |

ఐదవరేకు వదలివేయబడినది.

మొత్తము 45 పంక్తులు.

ఐదురేకులుగల ఈతామ్రశాసనములోని మొదటిరేకు ఎడమవైపువున్న రంధ్రమునుండి పైభాగము వరకు పగిలిపోయినది. మూఁడవరేకు రెండవ

ప్రక్కలోని చివరిపంక్తిలో "......తస్సర్వ్వ బాధ పరిహారేణ ఇరుణ్డేఱో నామ గ్రామో దత్తః" తరువాత అంగుళన్నర చోటు వదలివేయబడినది. నాలుగవరేకు మొదటిప్రక్క పైయంచు చిలుము పట్టి అకరము లన్నియు చెడిపోయినవి. అట్లే రెండవప్రక్క పైయంచు ప్రక్కగా నున్న యక్షర ములలో గొన్ని చెడిపోయి చదువుట కనువుగా లేవు. ఈనాలుగవరేకు ఎడమవైపు గల రంధ్రమునుండి క్రిందివరకు పగిలిపోయినది. ఐదవరేకు ఎడమవైపు క్రింది మూల విరిగిపోయినది. ఐదు రేకులకు 1.2 సెం. మీ. వ్యాసము గల రంధ్రము లున్నవి. కాని శాసనపు కడియము రాజముద్ర మాత్రము ఎచ్చటనో పోయినది. విష్ణుకుండిన గోవిందవర్మ ఇంద్రపాల నగర శాసనమువలె ఈ శాసనపు రేకుల కొనలు అక్కరము లను కాపాడుటకు అంచులుగ తీర్పబడి యుండలేదు. చాళుక్యులపూర్వ శాసనములు, మొదటి చాళుక్యుల శాసనములు ఇట్లే అంచులుగ తీర్పబడి లేవు. శాలం కాయన, పల్లవ, బృహత్ఫలాయన, ఆనందగోత్రికుల శాసనముల అంచులు తీర్చినట్లు లేవు.

ఈ శాసనము సంస్కృతములో వ్రాయబడి నది. శాసనారంభమున "దీప్త్యై దిఙ్మణ్డలం వ్యాప్తం యస్య బాలార్క తేజసః సత్యాశ్రయసుత శ్రీమా త్స జయ త్యుత్తమాశ్రయః" అను శ్లోక మున్నది. నాలుగవ రేకు మూడవ పంక్తిలో "నిగృ్హ తాం" అను శ్లోకమునుండి శాసనాంతము శ్లోకము లున్నవి. తక్కిన శాసనమంతయు సంస్కృత వచనములో నున్నది. చివరనున్న శ్లోకములు దాని ఫలమును తెలుపునవి. ఇందు శాసనము వేయబడిన కాలమును తెలుపు శ్లోకము కూడ "సాష్టా శీతి చతూః శతే శకయుతే సంవత్సరాణాం గతే"అని కలదు. చక్కని సంస్కృత వచనములో వ్రాయబడిన ఈ శాసనమున కాజ్ఞప్తి శ్రీమూలరాజు, సత్రపులలో ముఖ్యుడు. ఈ శాసనము సంస్కృత భాషలో వ్రాయబడినదైనను దాన మీయబడిన "ఇరు ణ్డేఱో" గ్రామనామము తెలుగు దేశమునకు సంబం ధించినది. విష్ణుకుండినుల శాసనములలో రెండవ మాధవవర్మ బహు యాగములను చేసినవాడు. అతని గూర్చిన వర్ణనము విష్ణుకుండినుల ఇతర తామ్ర శాసనములలో వలెనే యున్నది. ఈ శాసన భాషకు గోవిందవర్మ ఇంద్రపాల నగర తామ్రశాసనపు భాష కంతగా భేదము లేదు. శాసనాక్షరముల ఆకార పరిమాణములో మాత్రము ఈ భేదమును గమనింప వచ్చును.

క్రీస్తుశకము ఆరేడు శతాబ్దులలో నాంధ్ర దేశమునందు వ్యాప్తిలోనున్న తెలుగు కన్నడ లిపి ఈ శాసనమున వ్రాయబడినది. వేంగి లిపి అనగా శాలం కాయనుల నాటి లిపి క్రమముగా పరిణామము చెంది తెలుగు—కన్నడ లిపిగా మారినది. ఈ లిపి కొలది మార్పులతో చాళుక్యుల శాసనములందు కాన్పించు చున్నది. పరిమాణమున ఈ శాసనమునందలి యక్ష రములు చిన్నవిగ నున్నవి. గోవిందవర్మ ఇంద్రపాల నగర శాసనమునందలి యక్షరము లీ శాసనాక్షరముల కన్న పెద్దవిగా నున్నవి. అచ్చటచ్చట కొన్ని పెద్ద విగా నున్న యక్షరములును ఉన్నవి. ఇవియును 'గుంద్రఖత్తు' అక్షరములే. కుబ్జ విష్ణువర్ధనుని చీపురుపల్లి శాసనము[1], తిమ్మాపురము శాసనము[2], పృథ్వీమూలుని గోదావరి శాసనము[3], విక్రమేంద్ర వర్మ చిక్కుళ్ల శాసనము[4], ఇంద్రభట్టారకవర్మ రామతీర్థ శాసనము[5]లలోని యక్షరములను బోలిన అక్షరములు దీనియందున్నవి. ఈ శాసనమున కొన్ని యక్షరములు, అటు శాలంకాయన లిపికి, ఇటు చాళుక్య లిపికి మధ్యస్థముగా నుండి లిపి క్రమ పరిణామదశను సూచించుచున్నవి. మొదటిరేకు రెండవ ప్రక్క ఎడమవైపు సంఖ్యా సంకేతమున్నది. అది ఒక టిని సూచించును. రెండవరేకు రెండవప్రక్క ఎడమవైపు 'రెండు' అంకె గుర్తును, మూడవ రేకు రెండవప్రక్క ఎడమవైపు 'మూడు' అంకె గుర్తును, నాలుగవరేకు రెండవప్రక్క ఎడమవైపు 'నాలుగు' గుర్తును ఉన్నవి. ఈ సంఖ్యా సంకేతములు 1, 2, 3, 4, అను రేకుల సంఖ్యను సూచించునట్లుగా నున్నవి. గోవిందవర్మ ఇంద్రపాల నగర శాసనమందును ఈ పద్ధతియే అనుసరింపబడినది. ఇందు సంఖ్యా సంకేతము లీ క్రింది విధముగా నున్నవి.

---

(1) Ind. Ant. Vol XX page 16. (2) E I. Vol IX page 318. (3) J. BO.. B. A, S Vol. XVI Pa.. 11 . (4) E. I Vol. IV Page. 193. (5) E. I. Vol. XII 133.

| | | |
|---|---|---|
| ఒకటికి | గుర్తు | 3 |
| రెండు | ,, | 33 |
| మూఁడు | ,, | 333 |
| నాలుగు | ,, | L |

శాసనమందలి నాలుగవ రేకు రెండవ ప్రక్కతో శాసన మంతమైనది. కావున ఐదవరేకు వదలివేయఁబడినది.

శాసనమును చెక్కిన శిల్పి ఎంతో జాగరూకతతో అక్షరములను చెక్కినాడు. అక్షరములు వరుసలో నుండి చూచుట కందముగా నున్నవి.

ఈ శాసనమునందు వర్ణక్రమమునకు సంబంధించిన విశేషము చాల ఉన్నది. మొదటి సంస్కృత శ్లోకము తరువాత రెండవ పంక్తి ఆరంభమున ''స్వస్తి'' యున్నది. ''మండలం'' అనునది 'మణ్డలం' గా వ్రాయబడినది. బాలార్క ..... బాలాకఀ దుష్కర కర్మ్య కర్మా—దుష్కర కమ్యఀ కమ్మాఀ—భర్తుర్మహారాజ — భతుఀమ్మఀహారాజ కర్మాద్భుత—కమ్మాఀద్భుత — శ్రీ పార్వతేయపూర్వాపర—శ్రీ పావ్వఀతేయపూవ్వాఀపర.

ఇట్లు అనుస్వారమునకు బదులు అనునాసికాక్షరములు, 'రేఫ' పూర్వాక్షరము ద్విత్వమును రేఫకు బదులు ''ఀ'' వలపలగిలక వాడబడినవి. అనుస్వారమును సూచించుటకు అక్షరము తలపైన చుక్క నుంచుట సంస్కృతములో వలె పాటించినాడు. విసర్గ చిహ్నము రెండు చుక్కలతో సూచింపబడినది. ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు ఎక్కువగా శాసనమునందు కనిపించును. మూడు అక్షరములతో గూడిన అక్షరములును ఉన్నవి. ఇందలి యక్షరములలో 'స' 'య' 'న' 'గ' అక్షరములు కొద్ది మార్పుతో నేడు మనము వ్రాయు అక్షరములను పోలియున్నవి. శాసనమందలి వర్ణక్రమములో . దోషములు లేవు. ఈ శాసనమున మూడవరేకు రెండవ ప్రక్క చివరి పంక్తిలో 'ఇరుణ్డఱో' నామ గ్రామములో 'ఱ' వ్రాయబడినది. ఈ శకటరేఫము 'ది' వలె నుండి మధ్యన అడ్డగీత కల్గియున్నది. ముడి గీత పై వరకు నున్నది.

## శా స న వి ష య ము

ఈ శాసనమునకు దాత విక్రమేన్ద్రభట్టారకవర్మ శ్రీన్ద్ర భట్టారకుని కుమారుఁడు (శ్రీన్ద్ర భట్టారకవమ్మఀణః ప్రియసూను స్తదనురూపశౌర్యాఀతిశయ — రెండవరేకు మొదటిప్రక్క 6 వ పంక్తి). విక్రమేన్ద్ర భట్టారకవర్మ 'శౌర్యాతిశయముల చేతను, సమర్థమగు ప్రజా సమూహము గల దగుటచేత ... వచనముచేత రాజ్యభార మప్పగించి, పరమ ధార్మికుడును, విజయవంతుడును, అఖిల సామన్తరాజులు నమస్కరించునపుడు కిరీటమందలి మణుల కాంతులతో ప్రకాశించు పూజనీయ పాదద్వయము కల శ్రీమంతుడు అని ఈ శాసనమున కీర్తింపబడినాడు.

ఈ విక్రమేన్ద్ర భట్టారకవర్మకు ఉత్తమాశ్రయుఁడను బిరుద మున్నట్లు తెలియుచున్నది (నాలుగవరేకు రెండవప్రక్క 3 వ పంక్తి). ఈతని తండ్రి ఇంద్రభట్టారకునికి సత్యాశ్రయుఁడు అను బిరుద మున్నట్లు శాసనారంభ శ్లోకమును బట్టి తెలియుచున్నది.

ఈ శాసనమున విష్ణుకుండిన వంశమున మూఁడవవాఁడును, మొదటి మాధవపుత్రుఁడును నగు గోవింద వర్మ ప్రశంస కలదు. ఈ గోవిందవర్మ ఇంద్రపాల నగర తామ్రశాసనమును వేయించినాడు. విక్రమేన్ద్ర భట్టారకవర్మ శాసనమున విష్ణుకుండిన వంశము గోవిందవర్మ నుండి ఈ క్రింది విధముగా నున్నది:

గోవిందవర్మ—1
|
మాధవవర్మ—2 .
|
విక్రమేన్ద్రవర్మ
|
ఇంద్రభట్టారకవర్మ
|
విక్రమేన్ద్ర భట్టారకవర్మ
(శ. సం. 488—క్రీ. శ. 566)

విష్ణుకుండినులలో రెండవ మాధవవర్మ వాకాటక రాజకుమార్తెను వివాహమాడినవాడు. ఇతఁడు ఏకాదశాశ్వమేధ బహు సువర్ణ పౌణ్డరీక వాజపేయాది క్రతు సహస్రముల నాచరించినవాడును, సర్వమేధ, రాజసూయ పురుష మేధాది పుణ్య క్రతువులను నిత్యము యధావిధిగా నాచరించినవాఁడును, వేదోక్త .... సమస్త దుష్కర పుణ్యకర్మల

# విక్రమేంద్ర భట్టారికవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము

వనుష్ఠించినవాఁడును. తూర్పు దక్షిణము, పడమటి భాగములందు రేవానది నీటియొక్క వలయముచే నలంకరింపఁబడిన భూభాగమునకు ప్రభువైనవాఁడును అని కీర్తింపబడినాఁడు. ఇతని పుత్రుఁడు విక్రమేంద్రవర్మకు 'మహారాజ' బిరుదమున్న ట్లీ శాసనమువలన తెలియుచున్నది. ఈ విక్రమేంద్రవర్మ మాధవవర్మయొక్క ప్రియపుత్రుఁడనియు, వాకాటక మహాదేవి కుమారుడనియు, మహాకవి యనియు, బౌద్ధమతావలంబి యనియు, కీర్తింపఁబడినాఁడు. ("మహారాజ శ్రీమాధవ వర్మణః ప్రియపుత్రస్య వాకాటక మహాదేవీ సుతస్య మహాకవేః పరమ సౌగతస్య మహారాజశ్రీ విక్రమేన్ద్ర ....")

ఈ శాసనారంభమున విష్ణుకుండినులు భగవత్స్వరూపుడగు శ్రీ పర్వతస్వామి పాద కమలమును ధ్యానించుటవలన సకల ప్రజా పరిపాలనాధికారమును పొందినవారును బ్రహ్మ క్షత్ర తేజస్సును ధరించినవారును, విష్ణుమూర్తియొక్క పరాక్రమమును, నయ సంపదను కలిగినవారును అని కీర్తింపబడుటయే గాక, 'విష్ణుకుండిన వంశ్యులలో షడభిజ్ఞ ప్రతిహారి యొక్క దర్శనానుగ్రహము వలన సుగత సిద్ధాంతములందు గౌరవము కలిగినవాఁడును సర్వలోకమునకు దీక్షైన అందముతో కూడిన మహా విహారములను నిర్మించుటవలన బ్రాహ్మణోపకారజనితంబగు పుణ్యసంభారమును పొందినవాఁడగు మహా రాజశ్రీ గోవిందవర్మ ....' అని మాధవవర్మ తండ్రియగు గోవిందవర్మ ప్రశంసింపఁబడినాఁడు.

విక్రమేన్ద్రభట్టారకవర్మ గత కాలమును గురించి, చింతించువాడై స్వపర వంశముల కలంకార ప్రాయులగు రాజర్షుల నందరి నుచితరీతి గౌరవించి ధర్మబోధనము చేయుచుండగా తన కీర్తి కనురూపమగు పరాక్రమ ముండుటచే నితర రాజవంశములను తనవిగా (ఆత్మీయములుగా) చేసికొని పృథివీపతి పదమును గైకొనుటవలన అతిశయమగు మహిమగల శ్రీ మాధవరాజును పేరుగల వానిని, మనోహరాకారుని, నయ పరాక్రమాది గుణములతో కూడిన వానిని, పుట్టుకవలన గౌరవార్హమగు విష్ణుకుండిన కులము యొక్క మాహాత్మ్యమును తెలియజేసినవానిని, సర్వ సామంతకుల తిలకాయమానుఁ డగుటచే వ్యక్తమొనరించు నాభిజాత్యముగల వానిని, అవికలములైన గుణమణి దీప్తి సమూహముచే దిగంతరాళమును ప్రకాశింపజేయు వానిని, తన మూలరాజ వంశమును తన జన్మచే ననుగ్రహించుటచేత సాగరము లక్ష్మిచేత నలంకరింపబడినట్లు చేయువానిని, ఎదురులేనివానిని కుమారునిగా పొంది పలురకముల నందములై గొప్ప కట్టడపు నేర్పును కలిగి అద్భుతములైన స్తూపములు, విహారములనెడు చూడామణులచే నలంకరింపబడిన దక్షిణాపథముయొక్క శ్రీ పర్వతమునకు తూర్పు పడమర భాగములందున్న రాజసమూహము లనెడు హారముల మధ్య నిరుపమాన మగునట్లు ప్రకాశించుటచేత కౌస్తుభమణివలె ప్రకాశించు కీర్తి శరీరము గలవాడును గుణరూప సంపత్తులందు గోవిన్దు ననుసరించినవాడై మూర్తిమంతమగు గోవిందరాజుయొక్క కీర్తిని పెంపొందింపజేయు కోరికచేతను పరమ భట్టారికా మహాదేవిచేత ఇంద్రపురము నలంకరింపజేయఁ గోరినట్లుగా ప్రతిష్ఠింపబడిన శ్రీమంతంబగు పరమ భట్టారికా మహా విహారమునందు అస్మ దభిషేకానంతరము వరి ల్లుచున్న పదునొకండవ విజయ రాజ్య వత్సరమునందు కార్తీకమాస మందలి కృష్ణ పక్షమందు అష్టమినాఁడు నలుదిక్కులందున్న పూజ్యములగు భిక్షు సంఘముల యొక్క అనుభవము కొఱకు సర్వదాన సహితముగా సమస్త విఘ్నములను తొలగించి ఇరుణ్డెరో అను గ్రామము దానము చేయబడినది.

ఈ శాసనమున దానము చేయబడిన గ్రామము 'ఇరుణ్డెరో' ఇంద్రపురము—ఇంద్రపాలపురము, లేక ఇంద్రపాలనగరము. ఇచట బౌద్ధవిహార ముండెడి నను టకు తార్కాణము లున్నవి. ఈ విహారము పరమ భట్టారికా మహా విహారము. విహార ప్రశంస గోవింద వర్మ ఇంద్రపాల నగర తామ్రశాసనమందును కలదు. గోవిందవర్మ 'పేణ్కపఱ' గ్రామము నీ విహారమునకు దానము చేసినాఁడు.

# శాసనము మూలము



## మొదటి రేకు రెండవ ప్రక్క

శ్లో॥ 1. దీప్త్యా దిఙ్మండలం వ్యాప్తం యస్య బాలార్కతేజస స శ్రియ సుశ్రీమాత్స జయత్యుత్తమాశ్రయః

2. స్వస్తి భగవచ్ఛ్రీపర్వత స్వామిపాదానుధ్యానావాప్త ప్రజాపరిపాలనాధికారాణాం బ్రహ్మక్షత్ర

3. తేజో భృతాం విష్ణు విక్రమ నయసమ్పదాం విష్ణుకుణ్డీనాం షడభిజ్ఞ ప్రతిహారదగ్న

4. నానుగ్రహాజనిత సుగత శాసనాభి ప్రసాదస్య విబుధ భవన ప్రతిస్పర్ధి శోభా

5. సవ నేక మహా విహార ప్రతిష్ఠాపనాధిగతానన్త బ్రాహ్మణ పుణ్యసంభారస్య మహా

6. రా శ్రీ గోవిన్దవర్మణః పుత్రస్యైకాదశాశ్వమేధ బహు సువర్ణ పౌణ్డరీక వాజపేయ

7. శ్రీ సహస్ర సర్వమేధ రాజసూయ పురుషమేధాద్యాహాహా స్న్యగనుష్ఠిత శృతివి

# విక్రమేంద్రవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము



## రెండవ రేకు మొదటి ప్రక్క

1 శేష దుష్కరకర్మ్మ మ్మానుష్ఠానస్య ప్రాగ్దక్షిణా పరామ్మోనిధి (ధిని) రేవా సరిత్సలిలవలయ
2 విభూషణా. భువో భర్త్తుర్మ్మహారాజశ్రీ మాధవ వర్మ్మణః ప్రియ పుత్రస్య వాకాటక మహా
3. దేవీ సుతస్య మహా కవేః పరమసౌగతస్య మహారాజశ్రీ విక్రమేన్ద్రస్య సూనో రనే
4. క చాతుర్ద్దన్త విజయాధిగతాశేష చక్రవర్త్తి క్షేత్రాధి పత్యస్య స్ఫురదద
5. కరసహస్రావలీ పరిగత స్వభుజ దినకర ప్రభావ విధ్వస్తాశేష దాయాద
6. మణ్డల ఘన తిమిరపటలస్య శ్రీన్ద్రభట్టారక వర్మ్మణః ప్రియసూను స్తదనురూప
7. శౌర్యాతిశయ సమస రాజర్షి గుణసముద్యోగ సామర్థ్య ప్రకృతి మణ్డలేన

ఫొ ౨ ౧



రెండవ రేకు - రెండవ పక్క

1. శేశ (ష) వచవారోపిత రాజ్యభారః పరమధార్మికో ధర్మవిజయీ ప్రణతానేక సామన్తమ
2. కుటమణిమయూఖోద్భాసిత వరచరణార ంగళః శ్రీమా న్విక్రమేన్ద్రి భట్టారక వర్మార్ణణ
3. గతకాల భావినః స్వపరవంశాలంకార భూతా న్సర్వా నేవ రాజరిషి ననుహూపే
4. ణ సత్కృత్యేత్థ మవబోధయతి యథా ప్రథిత ప్రభావాన్య రాజవంశ సాత్మ
5. భూత పృథివీపతి పద ప్రసహ్యాహరణ వ్యక్తసరతిశయ మహిమానం శ్రీ మా
6. ధవరాజాభిధానం సుతచ్ఛలేన మనోహరాకారబద్ధం నయపరాక్రమాది గుణసన్దో
7. హా మభిర జాతాయా విష్ణుకుణ్డికుల బహుమతైక సంబన్ధితాభిఖ్యాత మాహాత్మ్య

# విక్రమేంద్రవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము



మూఁడవ రేకు - మొదటి ప్రక్క

1. మశేష సామన్తకుల తిలకాయమానాభిజన మహి లగుణమణి కిరణనిక
2. ర విచ్ఛురితం విపుల దిగన్తరాలం శ్రీ పృథివీమూల రాజవంశ ముత్పత్తి పరిగ్ర
3. శ్రియేన సాగర మలంకృతవత్యా ప్రతివిషయ మతిబహు ప్రకార మణి
4. దారకమ్మార్జద్భుత స్తూపవిహార చూడామణిభి రలంకృత సకల దక్షిణా
5. పథస్య శ్రీ పార్వతీయ పూర్వాపర క్షితిపతి పరంపరాహారసుద్ధ్య నిరు
6. పమ విరాజితయా కౌస్తుభాయమాన యశోజన్మనః గుణరూప సంపద్భి



మూడవ రేకు - రెండవ ప్రక్క

1. రనుగత గోవిన్దస్య శ్రీ గోవిన్ద (గోన్ద) రాజస్య మూర్తిమతీం శ్రియం ప్రత్యవిషం కృత
2. నోరథయా పరమభట్టారికా మహాదేవ్యా శ్రీమదన్ద్రిపుర ముచ్ఛే రంకస్యకామ
3. యేవ ప్రతిష్ఠాపితే శ్రీమతి పరమ భట్టారికా మహావిహారే స్మాభి ప్రవర్ధమా
4. న విజయరాజ్య సంవత్సరైకాదశే శార్దీకమాస కృష్ణపక్షే ష్ఠ.
5. మ్యా చాతుర్దిశార్య వర భిక్షు సంఘ పరిభోగాయ సర్వకాదాన సహి
6. త స్సర్వ బాధ పరిహారేణ ఇరుణ్డజో నామ గ్ర దత్తః

# విక్రమేంద్రవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము



నాలుగవ రేకు - మొదటి పక్క

1. ......దేవ ద్విజ ఋషిభిః శ్రుతిస్మృతి సదాచారానువృత్తిభిః సహకారి......
2 పాలనీయః స్వాంత్రస్యోభ ప్రమాదాజ్ఞాన క్షుద్ర పరివాగదోష వశా ద్ధర్మార్గ
3. విలోపాయ ప్రవర్తితాత తాన్యేమాని స్మృతివిహితాని పాతకాని భవన్తి॥ నిగ్రహార్త
4. తాం భర్తృగోఘ్నిప బాల యోషి ద్విజఘ్నినః సాంగతి స్సా భవేద్వృ
5 త్తి హాగతః శాసనాం కృతామ్॥ బహుభి ర్వసుధా ద త్తా విశ్వానుపా
6 లి యస్య యస్య యదా భూమి స్తస్య తస్య తదాఫలమ్ షష్టిం



నాలుగవ రేకు - రెండవ ప్రక్క

1. వర్ష సహస్రాణి స్వర్గే తిష్ఠతి భూమిదః ఆక్షేప్తా చానుమన్తా చ తాన్యేవ
2. నరకే వసేత్ ॥ కృత్వా పల్లవభంగ పేలవబలం సింహోత్త్యయం పల్లవం ... త్వా
3. వృత్త్య యదాగతః ప్రథమత శ్శక్రాభిధానం పురం ప్రాసాదాచ్ఛాసన త్తిమ్మా శయ
4. ఇతి ఖ్యాతి స్సదేవం స్వయః సాష్టాక్షి శిశః శతే శక యుతే స్వావ
5. త్సరాణాంగతే॥ యేనోద్ధృతా భగ్న కులస్య లక్ష్మీ రథ అస్య నీ నయవి
6. క్రమాభ్యాం ఆజ్ఞాపనాఖ్యాతకుల ప్రసూతః శ్రీ మూలరాజః స్వత్రపేషు ముఖ్య।

# విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము

## శాసనానువాదము

బాలసూర్య తేజో విరాజమానుండగు నే రాజు యొక్క కీర్తిచే దిఙ్మండలము వ్యాపింపఁబడినదో అట్టి ఉత్తమ శరణ్యుఁడును పూజ్యుఁడును నగు సత్యాశ్రయుని కుమారుఁడు విజయము నందుచున్నాడు. స్వస్తి. భగవత్స్వరూపులగు శ్రీ పర్వతస్వామి పాద కమలములను ధ్యానించుటవలన సకల ప్రజా పరిపాల, నాధికారమును పొందినవారును, బ్రహ్మక్షత్ర తేజస్సును ధరించినవారును, విష్ణుమూర్తియొక్క పరాక్రమమును యసంపదను కలిగినవారును నగు విష్ణుకుండిన వంశ్యులలో షడభిజ్ఞ ప్రతిహారియొక్క దర్శనానుగ్రహము వలన సుగత సిద్ధాంతములందు గౌరవము కలిగినవాడును స్వర్గలోకమునకు దీటైన అందముతో కూడిన మహా విహారములను నిర్మించుటవలన బ్రాహ్మణోపకార జనితంబగు పుణ్య సంభారమును పొందినవాఁడును అగు మహారాజశ్రీ గోవిందవర్మ యొక్క పుత్రుఁడైనవాఁడును, ఏకాదశాశ్వమేధ బహు సువర్ణ పౌణ్డరీక వాజపేయాదిక్రతు సహస్రముల నాచరించినవాఁడును, సర్వమేధ రాజసూయ పురుష మేధాధి పుణ్యక్రతువులను నిత్యము యధావిధిగా నాచరించినవాఁడును, వేదోక్త సమస్త దుష్కర పుణ్యకర్మల ననుష్ఠించినవాడును తూర్పు, దక్షిణము, పడమటి భాగములందు రేవానది నీటియొక్క వలయముచే నలంకరింపఁబడిన భూభాగమునకు ప్రభువైనవాఁడును అగు మాధవవర్మ యొక్క ప్రియపుత్రుఁడును,వాకాటక మహాదేవి కుమారుఁడును, మహాకవియై బౌద్ధమతావలంబియైన మహారాజశ్రీ విక్రమేంద్రుని యొక్క కుమారుఁడును, బహు పర్యాయములు దిగ్విజయ మొనర్చుటవలన సమస్త చక్రవర్తుల యొక్క రాజ్యములపైన నాధిపత్యము గలిగియున్నవాఁడును, ప్రకాశమానమైన నిజ భుజ పరాక్రమ సహస్రదీప్తులచే పరివృతుఁడై దినకర సదృశమగు ప్రతాపదీప్తిచే దాయాది మండల రూపమున నున్న సమస్త గాఢాంధకార పటలమును నశింపజేసినవాఁడగు శ్రీన్ద్ర భట్టారకుని యొక్క కుమారుఁడు తదను రూప శౌర్యాతిశయములచేతను, సమస్త రాజర్షి గుణ సదాచార సంపత్తిచేతను సమర్థమగు ప్రజా సమూహము గలఁ దగుటచేత .... వచనముచేత రాజ్యభార మప్పగించి పరమ ధార్మికుఁడును, విజయవంతుఁడును అఖిల సామన్తరాజులు నమస్కరించునపుడు కిరీటమందలి మణుల కాంతులతో ప్రకాశించుపూజనీయ పాదద్వయము కల శ్రీమంతుండగు విక్రమేన్ద్ర భట్టారకవర్మ గత కాలమును గురించి చింతించువాఁడై, స్వపర వంశముల కలంకారప్రాయులగు రాజర్షు లందఱిని నుచితరీతిని గౌరవించి ధర్మబోధనము చేయుచుండగా తన కీర్తి కనురూపమగు పరాక్రమ ముండుటచే నితర రాజవంశములను తనవిగా (ఆత్మీయులుగా) చేసికొని పృథివీపతి పదమును బలాత్కారముగా గైకొనుటచేత నతిశయమగు మహిమగల శ్రీ మాధవరాజను పేరు గలవానిని, మనోహరాకారుని, నయము, పరాక్రమము మొదలగు గుణములతో గూడినవానిని, పుట్టుకవలన గౌరవార్హమగు విష్ణుకుండిన కులముయొక్క మాహాత్మ్యమును తెలియఁజేసినవానిని, సర్వ సామంత కుల తిలకాయమాను డగుటచే వ్యక్తమొనరించు నాభిజాత్యము గలవానిని, అవికలములైన గుణమణి దీప్తి సమూహముచే దిగంతరాళమును ప్రకాశింపఁజేయునానిని, తన మూలరాజవంశమును తన జన్మచే ననుగ్రహించుటచేత సాగరము లక్ష్మిచేత నలంకరింపబడినట్లు చేసినవానిని, ఎదురులేని వానిని కుమారునిగా పొంది పలురకముల నందములై గొప్ప కట్టడపు నేర్పును కలిగి అద్భుతములైన స్తూపములు, విహారము లనెడు చూడామణుల చేత నలంకరింపబడిన దక్షిణాపథము యొక్క శ్రీపర్వతమునకు తూర్పు పడమర భాగము లందున్న రాజసమూహము లనెడు హారముల మధ్య నిరుపమాన మగునట్లు ప్రకాశించుటచేత కౌస్తుభమణి వలె ప్రకాశించు కీర్తి శరీరము గలవాఁడును, గుణరూప సంపత్తులందు గోవిందు ననుసరించినవాఁడై మూర్తిమంతమగు గోవిందరాజుయొక్క కీర్తిని పెంపొందింపఁ జేయు కోరికచేతను, పరమ భట్టారికా మహాదేవిచేత ఇంద్రపురము నలంకరింపఁ జేయగోరునట్లుగా ప్రతిష్ఠాపింపఁబడిన శ్రీమంతంబగు పరమ భట్టారికా మహా విహారమునందు అస్మదభిషేకానంతరము వర్ధిల్లుచున్న పదునొకండవ విజయరాజ్య వత్సరమునందు కార్తికమాన మందలి కృష్ణపక్షమందు అష్టమినాఁడు నలుదిక్కులందున్న పూజ్యములగు భిక్షు సంఘముల యొక్క అనుభవముకొఱకు సర్వదానములతో సహితముగా సమస్త విఘ్నములను తొలగించి ఇరుణ్డెఱో అను గ్రామము దానము చేయఁబడినది.

దేవతలచేతను, రాజులచేతను, ఋషులచేతను శ్రుతిస్మృత్యుక్త సదాచారానుష్ఠాన యుక్తులగు వారి చేతను నిది సంరక్షింపఁ దగినది. ఎవ డిచ్చుట లోభము ప్రమాదము, అజ్ఞానము, క్షుద్రపరివారము మొదలగు దోషముల వలన ధర్మవిలోపమునకు ప్రయత్నించునో వానికీ వేదోక్తములైన పాతకములు సంభవించును. ప్రభువులకు, గోవులకు, విప్రులకు, బాలురకు, స్త్రీలకు, విద్వాంసులకు నపకారము చేయు వానికెట్టి గతి యగునో యట్టిదే వేసిన శాసనము నుల్లంఘించినవానికిని నగును. పూర్వము భూమి చాల మందిచే దానము చేయఁబడినది. భూమి పూర్వము చాల మందిచేత పరిపాలింపబడినది. ఏయే సమయములలో భూమి ఎవరెవరికి సంబంధించి యున్నదో వారివారికి ఆ భూమియొక్క అనుభవము ఫలితము చెందును. అరవైవేల సంవత్సరముల కాలము భూదానము చేసిన వాఁడు స్వర్గములో నివసించును. దాని కాక్షేపము పలుకువాఁడును, దాని ననుమతించువాఁడును నరకమందే నివసించును. పల్లవుని వలె (విటునివలె) స్వల్ప బలముగల సింహోత్యయుఁడను పల్లవుని భంగపఱచి తిరిగివచ్చి మొదటుగా శక్రాభిదానము అను పట్టణమును ఉత్తమాశ్రయుఁడు అను పేరున కీర్తిగాంచిన రాజు దానము చేసెను. ఆ దానము శక సంవత్సరము సాష్టాశీతి చతుశ్శతమునందు (488) గడచిన పిదప జరిగినది. ఎవరిచేత ।వఱునంశము యొక్క వతన మందుచున్న కీర్తి యుద్ధరింపఁబడినదో ... నయవిక్రమములచేత ... కులమునందు పుట్టిన సత్రపులలో ప్రముఖుడైన శ్రీ మూలరాజు....

## కా ల ని ర్ణ య ము

ఈ శాసనమును వేయించిన విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రభట్టారకుని కుమారుడు. ఇతఁడు శక సంవత్సరము 488 వ సంవత్సరము ముగిసిన పిదప తన విజయరాజ్య సంవత్సరమున వేయించినాఁడు. అనగా క్రీ. శ. 566. ఈ శాసన మాతని యభిషేకానంతరము వర్తిల్లుచున్న పదునొకండవ విజయరాజ్య సంవత్సరమునందు కార్తికమాస సంబంధి కృష్ణపక్షమందు అష్టమినాఁడు, సరియగు శక సంవత్సరము 488 న వేయఁబడినది. ఈ శాసనకాలము నాధారముగా గొని విష్ణుకుండినుల కాలనిర్ణయము చేసినాను. గోవిందవర్మ ఇంద్రపాల నగర శాసనమును గూర్చి చెప్పునపుడు విష్ణుకుండిన వంశ స్థాపకుఁడు మహారాజేంద్రవర్మయని తెలిపినాను. ఈ రెండు ఇంద్రపాల నగర తామ్రశాసనములననుసరించి విష్ణుకుండిన వంశ వృక్షమును కాలమును నిర్ణయించినాను. విష్ణుకుండినులు బౌద్ధమతాభిమానులు. ఇంద్రపాల నగరము మొదట బౌద్ధక్షేత్రముగా నుండి కాలక్రమమున శైవమత కేంద్రముగా వర్తిల్లినది. ఈ నగర మిప్పుడు శిథిలావస లో నున్నది.

హయరింఖాముఖ ధూళిధూసర పరిన్యస్తాంకోపేతమై
రయజాత శ్రమతోయ బిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయమున్ బార్థున కిచ్చువేడ్కఁ దని నా శస్త్రాళిఘాతం జాల నో
ర్చియు బోరించు మహానుభావు మదిలో జింతింతు నశ్రాంతమున్.

(పోతన — భాగ — భీష్మస్తవ)

## అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము:

# యెంకిపాటలు - కిన్నెరసానిపాటలు

### డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

పాటలు బయలుదేరిన కాలంలో అధికార్ల సూర్యనారాయణరావుగారు 'జానకి' అన్న ప్రేయసికీ, ఆమె ప్రియునికీగల అమల ప్రేమను గురించిన ఖండకావ్యాలు 1917 నాటికే రచించి, నండూరి సుబ్బారావుగారికి వినిపించారు. ఆనాటి తెలుగునాటి సాంఘిక పరిస్థితులలో ప్రౌఢ ప్రేయసులు భార్యాభర్తలుకాక, వేరొక జంట ఉండగల అవకాశములులేవు. కనుక శరీరాకర్షణను అతిక్రమించిన ప్రేమను వర్ణించ యత్నించిన అధికార్లవారు జానకినీ, ఆమె భర్తనూ ఎంచుకొని, గీతాలు రచించారు. వీటిలో దాంపత్య ప్రేమ ముగ్ధ మనోహరంగా గోచరిస్తుంది. జానకి చక్కనిది. అయినా నల్లని వరుని పెండ్లాడింది. ఇరుగు పొరుగమ్మలక్కలు అడిగితే 'వలపు నిలిపిన వాడు నలుపైననేమె, నా బాలకృష్ణుండు నలుపైననేమె' అంటుంది. ప్రాణ విభు డెప్పుడో కొంచెము తన ప్రణయాన్ని అలతిచేస్తే, "అణువు కంటెను అణువుగా నగపడినను, మహితమౌవానికంటెను మహితమిద్ది" అంటుందీమె. ఆతడు 'మఱ్ఱినీడలందు ప్రకృతి పరచిన పచ్చికపట్ల మీద విశ్రమింతము జానకీ వెడలి రమ్మం'టాడూ, వియోగ వేళలలో 'మనసు నీ వద్దనే యుండు, తనువె సీతా పోవుచుండె' నంటాడూ, 'పక్షులెల్ల కులాయముల్ పట్టిపోయి' చల్లగా చందమామ వచ్చినప్పుడు 'ఏమి చేయుచునుండునో యింటిలోన నాదు జానకి వారతనాల బొమ్మ' అనుకుంటాడు. సుందరాంగుల నెందర చూచినా, జానకి ముఖమే అతని మనస్సులో నిలుస్తుంది. 'నానాతి వాక్యంబు గానామృతంబు, నాలేమరాగంబు నా వైభవంబు, నా సీత ప్రణయంబె నాదు ప్రాణంబు' అనుకుంటూ, తిరిగి వస్తాడూ, 'చిరవియోగానలంబున చిత్త మెరియ కనక కనక జానకి నాథుగాంచినపుడు, కనుగొనల బాష్పకణములు గారుచుండ తొగరు పెదవుల చిరునవ్వు తోచు' సతికి. తెలియని ప్రేమయే బలమైనదని చిలుకలు, కనరాని ప్రేమ ఘనమైనదని గాలీ, పాడితే పలుకని ప్రేమయే పావనమని జానకి మనసులో చల్లగా పాడుతుంది. చింత మఱచిన ఈ దంపతులను అధికార్లవారే కాకుండా మనమంతా ఆశీర్వదిస్తాము. రాయప్రోలు, అబ్బూరి కవుల చేతులలో ప్రేమ స్థిరాశ్రయము లేనట్టుగా కొంత కళవిళపడి అధికార్ల చేతిలో స్నిగ్ధమై, దాంపత్య ప్రేమగా నిలిచింది. నండూరివారు అధికార్లకడనే ప్రేమ కవితకు ఓనమాలు నేర్చినారు.

ప్రేమ కవిత్వము చిరకాలంగా పాటలలోనే మెలగినది. హాలుడు ప్రేమపట్ల ప్రాకృతాని కిచ్చిన గౌరవాన్ని పాటకు కూడా పంచవచ్చును. తెలుగు గేయాలు నిన్న మొన్నటివరకూ భక్తికో, ప్రేమకో అంకితాలని మన మందరమూ ఎరుగుదుము. నండూరి సుబ్బారావుగారు తమ ప్రేమ కవితలకు పాటను ఎంచుకోవడము ఇందువల్లనే. విశేషించి జంపెలవే—నాలుగు అయిదక్షరాల ఆవృతాల పాదాల—రచనలు ఎక్కువగా వాడడమువల్ల కూడా వారు సంప్రదాయపు ప్రేమ గీతాల దారినే అనుసరించారని చూపిస్తుంది.

గురజాడవారు ముందుకు తెచ్చిన వ్యావహారిక భాషను తెలుగువారు గ్రహించలేకపోయినారు. బసవరాజువారు ఒక్కరు—పద్యాన్నిమించిన ఆవేశాన్ని భరించగలవు కనక— పాటలు స్వీకరించారూ, గురజాడవారిపాటి నియమ పాలనము చేయక 'లోకాని కుత్తుత్త దీపావళీ', 'నట్ట నడి సంద్రాన నావలో వున్నాను' అంటూ మాట్లాడే భాషలో వ్రాశారు. గురజాడవారు వ్యాగతాలలో 'పంజరంబున నున్న కట్లను పగులదన్నగలేక క్రుక్కాతి' నని విచారించినా, బోధనలో మాత్రము 'పండితుల కష్ట భాషకూ, మాట్లాడుకునే(జీవత్) భాషకూ నడిమి భాషను నిర్మించుకోమనే చెప్పేరుగాని, అచ్చంగా మాట్లాడుకునే భాషనే వాడండి' అని చెప్పలేదు. వారు నీలగిరి పాటలకు వాడుక భాషను వాడలేదు. వారు సంస్కారులు మాత్రమే. విప్లవకారులుకారు. వారి వ్రాతలలోనూ, వ్యాసాలలోనూ, లేని విప్లవాన్ని వారికి నవీనులు అంటగట్టడము స్వార్థము వల్లనే, నిష్పాక్షిక అవలోకనమువల్ల కా దంటున్నాము. ఈ విప్లవమన్నది గిడుగువారి

'అద్దములో నా రాజు అంతనీరూపు ! ఇంత ముత్తెములోన ఇమిడె నేలాగు?' అంటుంది ముత్యములో తన నీడ చూసుకునే నాయుడితో యెంకి. నాయుడు జవాబు 'ఎన్ని పొంకాలున్న యెంకివే నీవు! ఇంత నా గుండెలో యిమిడిపోలేదా?' అని. దిలీప మహారాజూ సుదక్షిణాదేవీ లేళ్ల కళ్లల్లో ఒకళ్లొకరి కళ్ల సౌందర్యము చూసుకున్నారంటాడు కవి కుల గురువు. మాధవునిచేత 'త్వమసి మమభూషణం త్వమసిమమ జీవనం త్వమసి మమ భవజలధిరత్నం'' అని—మాధ్వీక మధురమైన శైలిలో అయితేనేం?—వాచ్యంగా చెప్పిస్తాడు జయదేవుడు. పై యూహ తనకు తట్టియుంటే సంతోషించి యుండును ఆ మహాకవి. 'మాట వరస కెపుడైనా అన్నావా' అన్న ఇటీవలి సినీపాటలోనూ, వాచ్య మాధుర్యమూ, చమత్కారమూనే తోస్తున్నాయిగాని, ఈ పాట ఔన్నత్యము కానరాదు.

'యెంకి పాటల గాలి దుమారము'తో యెంకి పాటలు కొంతకాలము ఆగినా, అక్కడా అక్కడా వినవస్తూ 1953 నాటికి మరొక సంపుటంగా వచ్చాయి 'కొత్త పాటలు'. కాలక్రమ రచనను అనుసరించి వ్రాసేటప్పుడు ఈ కొత్త పాటలను గురించిన రాత తరవాత తరవాత చేయవలసినదేకాని, తక్కిన తెలుగు రచనలేవీ ఈ కొత్త పాటల రాకకు కారణముకాక పోవడమువల్ల యెంకి పాటల తరువాయిగానే వీటిని చెప్పవచ్చుననుకున్నాము. తొలి పాటల్లో నండూరి సుబ్బారావుగారు యెంకిని తీర్చి ప్రేమ విద్దెలో ఓనమాలు వర్ణించారు. ఆ పాటలలో యెంకీనాయుళ్ళు పరస్పరాశ్రయులే. కొత్త పాటలలో వారు ఇద్దరూ ఇంకా పెరిగేరు. రవల వెలుగుల గంగ రమ్మంటే యెంకి శివమెత్తి తానాలు చేసింది. 'సిరులతో ముత్యాల సరుల చెల్లాటలతో సిరిసిరిమువ్వలా చిందులా గంతులా' స్నానాలుచేసి, కాశీదేవుని యెదుట గరవాన నిలిస్తే ఆయన (గంగ తలమీదినుంచి ఎప్పుడు దిగిందీ అని) తల తడుముకొని తానె తబ్బిబ్బులైనాడు. మన యెంకే అని నాయుడున్నా, చనవులకు పోరాదు. ఆమె యెప్పుడూ కొత్త నవ్వుల కులుకు, కొత్త మెరుపుల తళుకు, 'రెక్కలతో పైకెగిరి చుక్కల్లె దిగు'తుంది. కొండ తిరిగీ, కోన తిరిగీ, గరికపూల కంఠమాలకూర్చి, ఆవు నడిగీ, అడివి నడిచీ, గుమ్మపాలూ, కొమ్మతేనే పొందుపరచీ, చాయ వెన్నెలలో లోయ బయళ్లలో పచ్చిక మెత్తల పానుపుపైన 'కోకో' అని అరచి నాయుణ్ణి 'కో' అనమంటుంది. నాయుడి కోపాలకోట రూపుమాపడానికి పూలరంగములో కాలు దువ్వుతుంది. నాయుడు ఏ వూరో పోతే ఎంకే దొరయింట అతని వేషముతో నటిస్తుందట. అవుల్ని నాయునివలెనే అదిలిస్తుంది. పసిబాలుణ్ణే అతనివలెనే కసరుతుంది. అయితే, ఈ వింతమగాని, నాయుడు ఆవంతకంటే వేరమంతా నాయుడిదే పౌరుషము నాయుడిమీదే! ఎంతెంత దూరాన ఎందరిలో నాయుడున్నా మాటిగా అతని వెనక చూసిందా, అతడు తనవైపు తిరగవలసినదే. అయితే యెంకి గర్వపోతుకాదు. రంగుకోక ధరించి రెప్పవాల్చక నిలచి, అలికిడికి వులికిపడి నలుదెసల విరగబడే దీపసుందరి దరిదాపుకు పోలేనని ఆమెకు తెలుసు. ఇక నాయుడో? యెంకి దూరాన ఉన్నప్పుడు ఏటి దరినుండి 'సావాసమింకెవరో సందడెవరో' అనుకుంటాడు. యెంకి అర్థమయినాక, ఆమె కళ్ళలో చూస్తాడు. కాని, 'ఏకాడొ తలపుంచు' యెంకి మెరిసి సిగ్గులాను కదలింపగోరి ఆడిగిందె ఆడుగులాడు. ఆమె కళ్లను జారు-జంకు కనగోరి పయనాలు నటించి బయలు దేరతాడు. 'ఏ తపసునే జేయవలెనో యెంకితో ఎటుల నేనేక మవగనో' అని ఆరోచిస్తాడు. 'యిప్పు డెటులుంటివో చెప్పుకోవోయీ' తని ఆమె అడిగితే 'చిన్నె వన్నెల రామచిలక' లాగున్నావంటాడు. 'ఈ గొంతు పలికేది ఎవరి పదమోయీ' అంటే 'ఒంక ఒరపులులేని యెంకివే' పదమంటాడు. వనమంతలో చక్కదన మెవరిదంటే 'పొంకాల పోకిళ్ల ఎంకిదే నిజ'మంటాడు. ఈ పాటలలో తలపోసి, తలపోసి నండూరి సుబ్బారావుగారు యెంకీ నాయుళ్ల లందపు కళలు కంపోసినారు. ఇప్పుడడగండి ''యెంకెవ్వరు?''ని. ఆయనే అన్నారు యెంకెవ్వరని లోక మెపుడైన కదిపితే వెలుగు నీడలవైపు వేలు చూపింతు. యెంకి పాటలను ప్రభకట్టి విశ్వ సాహిత్య వీథులుతొక్కి రావచ్చు తెలుగువారు.

ఎరగని ప్రణయపు వెలుగులతోపాటు మనము చూడని మెరుపు లందాలు 'యేటి కడుపున దాగి' నిదరోయేతోటా 'యెలుతురంతా మేసి నెమరేసేయేరూ, యేటి మరగలవలె మరుగు మనసుల్లూ, పేపూది పెట్టేదీ పీవు తట్టేదీ నీళ్ళు చిలికేదీ నిలిచి నూసేదీ పడే అచ్చెరువూ, యెంకి సరసాలాడ జంకుతావుంటే నూసి, నూడక, కన్నుమూసి తెరిచే గోపు మా లచ్చిమీ, చాటు చూపుల కులికే ఏటి చంద్రుడూ, 'నిలువంత చెవిజేసి పిలుపు వినవోరగిలి కటిబిగించి శిరసు కానిమ్మని విసిరే దీపసుందరీ కానవస్తారు యెంకి పాటలలో. చివరికి ఆటపాటలలోనె మరచిన రాజు చెయ్దములకు కందుటే ఎరుగని తన మనసు గాయము కాగా, అతనికే చేటని కంట నీరు రానీని' యెంకి మన మనస్సులో మిగిలిపోతుంది. యెంకి మధురవాణీకాంతంల తోబుట్టువు. ఆమెను సృష్టించి మహోజ్జ్వల భావాల్ని నిర్మించి ఆంధ్ర కవిత్వానికి అందపు బరువు చేర్చారు నండూరి సుబ్బారావుగారు. ''ఇంతేనటే చంద్ర మెంతొాయమకొంటే, మనకు మారీడుకూ మద్దెమందేవా?'' అంటుంది యెంకి. ఏమీ అని అడిగితే, ''నా సిరి, నా జాతి నా వారె పోవాడ మరిగి నా మనసు సాగరమయ్యె నన్నారు. ఇంతేనటే చంద్రుడు?'' మెరుపుని వెక్కి తిప్పి కొట్టారు కవిగారు. యెంకి భావాలకు మణి మకుటమిది.

# యెంకిపాటలు - కిన్నెరసానిపాటలు

చూడండి: "నా పేరె నా రాజపాట అను అపవాదు ఈ జన్మకే కాదు ఎప్పటికిపోదు" సీతమ్మకు సంస్కృత కవులు ఇవ్వలేక పోయిన సుధామధుర భావాన్ని ఈ తెలుగుకవి యెంకికి ఇచ్చారు.

యెంకి పాటలకు ప్రారంభములో వాడిన భాషను పరిణతిలో వాడలేదు సుబ్బారావుగారు. మీదు మిక్కిలి బసవరాజువారి శాపము నిజము చేశారా అనిపించేటట్టుగా పచ్చి కర్షక భాషతో ప్రారంభించిన పాటల్ని గ్రాంథిక భాషలో పూర్తి చేశారు. కనుక కర్షక వాతావరణమును స్ఫురింపజేసే ఉద్దేశ్యముతోనే తొలి పాటలలో కర్షకులు వాడే పదాల్ని ప్రయోగించి ఉంటారని ఈ వ్యాసము మొదట్లో అన్నది నిజమే అయిందికదా అంటాను. చివరి పాటలలో యెంకినాయుళ్లు ప్రేమయోగులు. పరిణతి చెందినవారి మనోరంగాన్ని బొమ్మ కట్టడానికి బరువైన భాష కావలసి వచ్చింది, వాడేరు కవిగారు.

చరణము చరణానికీ, భావము సాంద్రతరముచేస్తూ, చివ్వరిచరణములో వీణ తీగెలమీద గెంతినట్టు ఝమ్మనిపించే పాటలే కాకుండా మూడు చరణాల చివరి నాలుగో చరణంతో ఆ మూడు చరణాల భావాల్ని అతికి మొత్తపు ఖండానికి సద్యః పరనిర్వృతీ కావ్యత్వసిద్ధి చేకూర్చిన రచనలు కూడా ఉన్నాయి ఎంకి పాటల్లో. అందుకే అన్నాను బసవరాజువారి తంత్రము యెంకి పాటల నిర్మాణానికి తోడ్పైంది అని.

శివరాజు సుబ్బారావుగారు అనే బుచ్చిబాబుగారు యెంకిని నాయికనుచేసి, ఒక నాటిక రచించారు. వారి దృష్టికి నాయుడు ప్రేమ యోగానికి ఒక మెట్టు దిగువగా ఉన్నట్టు కనబడింది. యెంకి ప్రేమయోగిని, వివాహము అనే కృతక బంధము ఆమె కిష్టములేదు. నాయుడు ప్రేమికుడే, అయితే సంఘానికి వెరచి పెండ్లి చేసుకుంటే మాత్రమేమి? అని యెంకిని ఒప్పించ బోతాడు. ఆమె చిక్కక నిత్య స్వాతంత్ర్య సీమలోనికి—వెలుగు నీడల నడిమికి వెళ్ళిపోతుంది. ఈరచనలో బుచ్చిబాబుగారు యెంకిని పైకెత్తేరు నిజమే. కాని, నాయుణ్ణి జారవిడవడానికి యెంకి పాటలలో కారణము కానరాదే అంటాను.

యెంకిపాటల రచనతో ఆంధ్రకవిత్వము ఆరంభము నుంచీ అధిష్ఠించివుంచిన వ్యుత్పత్తిమీదనుండి దిగి ప్రతిభను అధిష్ఠించిందంటాను. ప్రబంధాల కాలమువరకూ సంస్కృత కావ్యాలూ, పురాణాలూ ఆధారంగా తెలుగులో సాగిన రచన రచయితల పాండిత్యముమీదా, పలుకుబళ్లమీదా సాగిపోయిందిగాని, వారి ప్రతిభను కల్పనా శక్తినీ రేపలేదు. ప్రబంధాలలో ప్రవేశించిన ఉద్భట కవుల అలంకార కల్పనా శక్తే పోషించిందిగాని, కథన కౌశలమూ, పాత్ర నిర్మాణశక్తి పెంచలేదు. పురాణ సామగ్రినే చీట్లపేకను కలిపినట్లుగా కలుపుతూ, ప్రబంధ కవులు తమ ఇంద్రియాలతోకాక, పూర్వ కవుల కల్పనలు పూర్తిగా కప్పివేసిన భావనతో చూచారు అష్టాదశ వర్ణనా లక్ష్యములను. రాజసభలలో ఆనాడు కవులకు జరిగిన పరీక్షలు వ్యుత్పత్తికే. ఆధునికయుగంలో, అనగా 1910 కి తర్వాత కవుల ప్రతిభకు వూపిరి తిరిగింది. పూర్వుల కవిత్వములో ప్రతిభ ఏమీ లేదని అనడములేదు నేను. పలుకుబడి వ్యుత్పత్తిది. తుంగభద్రలాగా సెలయేళ్ళలాగా పాండిత్యపు బండల నడుమనుండి ఒదిగి ఒదిగి ఏ కొంచెమో ప్రతిభ ప్రవహించినా, ఉన్నదనడానికేగాని వూగించడానికి చాలలేదు.—ఆధునికులకు పాండిత్యము తక్కువ. పరిచయమా ప్రతిభాన్వితమగు ఆంగ్ల కవిత్వముతో. చెప్పిన ఏ

యము. కనుక సంప్రదాయము మోసుకువచ్చిన నియమాల్ని ఒకటొకటే జారవిడిచారూ, కావ్య రచనను సులభము చేసుకున్నారు. యెంకి పాటలు కొన వూపిరితో మిగిలివున్న వ్యాకరణ సూత్రాన్ని తెంపేసి రవీంద్రుని ఊర్వశిలాగ ప్రతిభా తరంగ శీర్షముపైన ఒంటికాలుతో నిలబడ్డాయి. ప్రతిభా బలమే యెంకి పాటల జీవము. ప్రతిభ నవనవోన్మేష శాలినియట. యెంకి పాటల ఇతివృత్తము—దాంపత్య జీవనము—తెలుగు కవిత్వానికి కొత్త; భావాలు కొత్త; నాయకీ నాయకులివి, వారి పరిసరాల సౌందర్యానివి, అవుని, పూలవి. ప్రకృతి కొత్త: ఏటి మరగలు నాయుడి మనస్సులాగ మరుగుతాయి. ఏటి కడుపులో తోట నిద్ర పోతుందీ, వెన్నెలలో ఏరు రవల వెలుగులు నింపుకుంటుంది. పళ్ళంతా చెవి చేసుకుని అలికిడికి ఔనని తల విసురుతుంది దీపశిఖ. ప్రబంధాల వర్ణనలా భావాలా తునకలు వినివిని పండిత కవుల మెదడు పురులు విడదీసి విడదీసి, పద్యగతితో విస్సహాయంగా ఈడిగిలబడుతూ పోతూండిన తెలుగు చదువరి హృదయానికి చక్కని చల్లని వర్షము యెంకిపాటలు. వీటిలోపద గుంభనపు తాషా మర్పాలూ సమాసాల రామడోళ్ళూ పదాడంబరపు తూతూబాకాలూ వినపడవు. భాషా పాండిత్యపు స్క్రూ(స్క్రే)వర్లులేని పూరి ఇండ్ల పల్లె ఇది. మోసెను ప్రియురాలు ఆమె వివాహానికి ముందు చెప్పిన అమృతవాక్కులు జ్ఞప్తికి వస్తాయి యెంకిపాటలు తమ సౌందర్యాన్ని గురించి చెప్పుకుంటే. అస్తు. వాటి రచయితకు శుభమగునుగాక.

యెంకిపాటల విజయముతో పాటకు కవిత్వములో చోటు నిలిచింది. పద్యమో పదమో ఏదయితేనేం కవికి? అన్న అమృతవాక్కు అశరీర వాక్కుగా వినబడింది కవులకు. కృష్ణ శాస్త్రి గారు "ఆకులో—ఆకునై" అన్న గేయముతో ప్రారంభించారు తమ కావ్య రచనను. దువ్వూరి రామిరెడ్డిగారు 'గాలి యడుగుల నెవరి

కోసము ఓ మోహాశీలా' అని అభిసారికను తీర్చిదిద్దేరు. విశ్వనాథ వారు 'ముదురాకు రాలేటి ముదిమి నాళులలోన, తొడిగేటి చివురాకు తొగరు సంజలలోన ఆకున్నైనా కానుగా, అయినచో సోకేది చిరుగాలి నన్ను' అని పాడుకున్నారు. తురగా వెంకట్రామయ్యగారు 'కష్టాలు వచ్చినా కాలమే తరిమినా కన్నీరు రాల్చకే కలుష మెరుగని చెలీ, ప్రకృతి రంగస్థల ప్రళయ నాటకములో ఆడుటకు జంకేల పాడుటకు భయమేల' నని చెలిని సమాశ్వసించారూ, ''ఈ మాయ లోకమే ఈశ్వరుని రాజ్యమా మాయవాదీ కవీ మాటబొంకోయి; కరకు గత్తులడాల్చు నరహంతకుల ఇంటిబానిసై భూదేవి పడి యుండె నీ వేళ ధనికునకు దైవమే దాసుడయ్యెను జూడు''మని అగ్నికణాలు కురిపించారు. కొడవటిగంటి వెంకట సుబ్బయ్య 'అగు మాగుము తెరువరీ ఆయాసభారము సహనయింపుము' అంటూ తమ 'సంధ్యారాగము' సంపుటాన్ని ప్రారంభించారు. గంగిరెద్దు బొంతల సౌందర్యంలోలాగ ఛందోగతి సౌందర్యంలో వూరేగుతూన్న పద్యానికి ధాష్టీకపు పలుకుబడి పోయింది. అంత వరకూ పల్లెపట్టు పదాలను అనుకరించిన వరుసలలో పాటలు వ్రాస్తూండిన కవుకొండలా బాపిరాజా కవులు పాటని అప్పుపు సాహిత్యానికి వాడేరు. గురజాడ కవి సంస్కారరూపంలో ప్రవేశ పెట్టనెంచిన మాత్రాచ్ఛందస్సులూ, వ్యవహార భాషా కవిత్వ పారశ్యమూ అన్నవి ఈ విప్లవంలో హోటు హక్కు సంపాదించుకున్నాయి.

యెంకిపాటలకు వచ్చిన ప్రచారంతో కిన్నెరసాని పాటలు వచ్చాయి. విశ్వనాథవారి పూనికలు పెద్దవి. బైరవు పద్దతివచ్చి కాబోలు ఆంధ్ర పౌరుషం ఖండ కావ్యాలు రచించారు. వాటికి సహాయ నిరాకరణోద్యమ ప్రోద్బలమూ ఉండిందనుకుంటాను. యెంకి పాటల్ని నండూరి సుబ్బారావుగారు సభలలో చక్కగా పాడేవారట. వాటికి వచ్చిన ప్రచారమువల్ల ప్రాభావితులై విశ్వనాథవారు కిన్నెరసాని పాటలు రచించారూ, సభలలో పాడేరు. భద్రాచలానికి దిగువన గోదావరిలో దక్షిణపు వైపునుంచి కలిసే ఒక వాగు కిన్నెరసాని. పేరు అతి ఆకర్షవంతంగావుంది. ఈ పేరునుబట్టే కథ అల్లుకుపోయారు సత్యనారాయణగారు. కోడంటి కమును భరించలేక పోయిందట కిన్నెరసాని. ఆమె భర్త తల్లిని యేమనలేకా, కిన్నెరను సముదాయించలేకా, కలవిల వడ్డాడట. కిన్నెరకు మహాకోపం వచ్చిందట. ఆవేశ హృదయంతో కిన్నెర అడవులవెంట పరుగెత్తింది. భర్తపోయి ఆమెను పోవద్దని కౌగలించుకొన్నాడు. ఆమె అతని కౌగిట్లోనే కరిగి నీరై, వాగై ప్రవహించింది. అతడు శోకించి శోకించి శిల అయినాడు.'' పాట రూపంలో ఈ కథలేదు. ముందుచెప్పేశారు కవిగారు. కావ్యాలకు ఈ రీతిగా ముందు కథను చెప్పేసి, తరవాత కావ్య రచన ప్రారంభించడములో ఖండ కావ్యానికి నిండురూపము రాక, కావ్యఖండము అయిపోతుంది. కళకు ఉపోద్ఘాతము ఎందుకూ?

కిన్నెర నీరైపోయి ప్రవహించి నప్పటినుంచి ఆమె భర్త పడిన పరిదేవనమును 'కిన్నెర పుట్టుక' అనీ, కొంతదూరము 'పరవళ్ళ నడిచి', 'నడవగా నడవగా' 'వలి రాయివలె మారిపడి యున్న చోటునే విడలేక తిరిగి, జల దేవతలవెంట కిన్నెరసాని పొగిపోవుటను, 'కిన్నెర నడకలు' అనీ, 'కిన్నెర నృత్యము'నూ, 'కిన్నెర సంగీతము'నూ తగని మోహముతో కదలిరాజా పొంగుటనూ 'కిన్నెర దుఃఖము'నూ, 'గోదావరీ సంగమము'నూ పాటలుగా రచించారు కవిగారు. పాటలు మాత్రమే చదివితే అత్తగారి పోరూ, 'అటువంటి కాపురం చేసి చేసికొంటిని'ని కిన్నెర చెందిన పగకు కారణమూ తెలియరావు. పాటలన్నీ జంపె వరుసలలోనే ఉన్నాయి. ఈ గుణములో వీటికి యెంకి పాటలలో పోలిక కలదు.

కిన్నెర నీరైపోయినప్పటి తర్వాత కవికి, అబ్బూరి రామకృష్ణారావుగారి నదీసుందరి మనస్సులో మెదిలింది కాబోలు. కవేరుని పెంచిన బిడ్డ కావేరి సహ్యాద్రి నికుంజములో ప్రవేశించి నది యైనది. స్త్రీ రూపంలో వుండినప్పుడున్నా ఆమె వర్ణనములో మొదలకే సూర్యోదయము వర్ణించి, రామకృష్ణారావు గారు కావ్యారంభాని సమర్పించారు. ఇక్కడ విశ్వనాథవారు కిన్నెర భర్త పరిదేవనములో ''మునుపే నీ కన్నులు గని అనుకొంటిని నీవు నదీవనితవు' అనిపించారూ, ''ఈవు రసాకృతి వగుటను ఈ వైఖరి ప్రవహించితి''వనిపించి శ్లేషించారు. కావేరి సస్య లక్ష్మికిసాయముగా, పావులకు క్షాళనముగా దేవేరిఅయి వచ్చింది' వనకన్యలు ఆమెకు మంగళ గీతాలు పాడేరు. ఇక్కడ కిన్నెరసానిని పాపము జలదేవతలువచ్చి పదపడమని బలవంతపెట్టి నడిపించారు. కారణము తెలియదుగాని, వనదేవతలూ పూలు కుమ్మరించారు. భూదేవతలు ఎదురుపోయి దీవించారు. వాయు దేవతలు రమ్మని పాట పాడేరు. ఎందుకనీ? 'ఒయ్యారి నడలతో' వచ్చిందని కాబోలు. కావేరి దేవేరిగా రావడమూ, తరులతాగుల్మములు పూలు జల్లడమూ రమ్యము. కిన్నెర బలవంతపు ప్రదర్శనమున కూడ భూదేవతలూ, వాయు దేవతలూ సంతోషించడము రమ్యము కాదంటాను. కిన్నెరసాని పాటలను విశ్వనాథవారు 'ఇదిగో చూడండి నా రచన' అని మనమీద విసరినారా అనిపిస్తుంది. అట్లాంటి దానిలో మనకు ఇంపుగూర్చే మెరుగు తక్కువగానే ఉంటుంది, ఆశ్చర్యమేమిటి?

# మారన మహాకవి కాలము

## శ్రీ వేకుమళ్ల కామేశ్వరరావు

సంస్కృతములో రచింపఁబడ్డ మార్కండేయ పురాణమును మారన మహాకవి యదే పేరున తెలుగు చేసి, నాగయ గన్నయ యను సైన్యాధిపతికి నంకిత మిచ్చెను. కృతిభర్త యైన గన్నయను గుఱించి యా మహాకవి కొన్ని యంశములనైనఁ దెలిపినాడు; కాని తనను గుఱించి రెండే మాటలను, అదైనను, గద్యలోఁ జెప్పుకొన్నాడు—తండ్రి పేరు తిక్కన, గురువు పేరు తిక్కసోమయాజి. గ్రంథమును వ్రాసిన కవి యొక్క చరిత్ర యెంత ప్రధానమైనదో ఈ కాలపు వారమైన మన మెఱుఁగుదుము. కాని యానాటి కవులెఱుఁగకపోవుట చేత నెన్నియో చిక్కులు తటస్థించుచున్నవి. దానికి మారన కవి యొక నిదర్శనము.

మారనకవి తండ్రి పేరు తిక్కన కదా! తిక్కన యను పేరును బట్టి యా కవి కుటుంబము నెల్లూరి ప్రాంతముది యని మనము నిశ్చయింప వచ్చును. కాఁబట్టి యితఁడు సమీపముననున్న తిక్కన మహాకవి వద్ద శిష్యత్వమునకుఁ జేరినాడు. దానివలన యితఁడు తిక్కన కాలమువాడని స్థూలముగా నిర్ణయ మగుచున్నది. కాని మారన మహాకవి కాలమును నిశితముగా నిర్ణయించుటకు సాధనలేమైన నున్నవా యను విషయమును బరీక్షించుటకు ముందుగాఁ దెలిసి కొనవలసిన యంశములున్నవి.

ఈ గ్రంథ రచన యెచ్చట జరిగినది? గ్రంథ రచనకు దనను (మారయ్యను) పిలువఁబంపినప్పుడు నాగయ గన్నయ యెక్కడ కొలువుదీరెనో కవి ప్రత్యేక ముగాఁ దెలుపలేదు. కాని గన్నయ సైన్యాధ్యక్షుఁడుగానె కాక, కటక పాలుఁడుగా కూడ నుండెనని, కవి మూడు చోట్ల ఇట్లు విశదపరచినాడు—కాకతిక్ష్మాతలాధీశ కటకపాలుఁడు (ఆ 1—ప 39), కాకతి నరపాలక కటక పాలన స్థిరశౌర్యా (ఆ 7—ప 286), కాకతిక్షితీశ్వర పురపాలన ప్రకటశౌర్య (ఆ 8 ప 288). కాకతీయ సామ్రాజ్యముయొక్క కటకము (ముఖ్యపట్టణము) ఓరుగల్లు కదా! కాఁబట్టి ఓరుగంటి నగర పరిపాల కునిగా కూడ నాగయ గన్నయ ఉన్నాడు. అట్లు మార్కండేయ పురాణ రచన ఓరుగంటిలోనె జరిగినదని దృఢముగాఁ జెప్పవచ్చును.

గన్నయ వంశీకుల శాసనము లింతవరకును బైటపడలేదు.

మారన కవి కాలమును గనుగొనుటకుఁ గల యాధారములు—1. అతఁడు తిక్కన సోమయాజికి శిష్యుఁడు. 2. అతడు గణపతిదేవ చక్రవర్తిని, ప్రతాప రుద్రదేవుని తన గ్రంథములోఁ బ్రశంసించినాడు. గణపతిదేవుని (క్రీ. శ. 1199—1260) గుఱించి యే సందేహముండుటకు నవకాశములేదు. కాని ప్రతాప రుద్రుని విషయమట్టిదికాదు. మొదట తిక్కన సోమ యాజిని బట్టి మారన కవి కాలమును సూక్ష్మముగా నిర్ణయించుటకుఁ బ్రయత్నించ చూచెదము.

మనుమసిద్ధిరాజు నెల్లూరు ముఖ్యపట్టణ ముగా, చోడరాజ్యమును బాలించినాడు. అతని మంత్రి సత్తముఁడు తిక్కన మహాకవి. మనుమసిద్ధి వంశ వృక్షములోని యొక భాగమును, వారిలో నిద్దరి జీవితకాలములు నిచ్చటఁ దెలిపెదను—

రాజేంద్ర మనుమసిద్ధి

|

తిక్కరాజు (1188—1256)

పేరు తెలియదు మనుమసిద్ధి (1215—1260)

మనుమసిద్ధిరాజు ఆస్థానమున తిక్కన కవి యుండినాడు కదా! అప్పటికి నతని వయస్సును

సూక్ష్మముగా నిర్ణయించుటకుఁ దగిన సాధనలు లేవు. అయితే తిక్కనకు తన గ్రంథము సంకితమిచ్చిన మూలఘటిక కేతన కవిఁ గొంతవఱకు తోడుపడు చున్నాడు.

కేతన కవి తాను రచించిన దశకుమార చరిత్రను [1]కొట్టరువు తిక్కన కవికి సంకితమిచ్చినాడు. అతని వల్లనే తిక్కన యొక్క ఇంటిపేరు కొట్టరువు వారని తెలియుచున్నది. దశకుమార చరిత్రము సంస్కృతములో దండి మహాకవి రచించియున్నాడు. దానిని కేతన కవి తెలుగు చేసినాడు. కేతనకు లభినవ దండి యను బిరుదమున్నది. ఆ బిరుదు అతఁడు వ్రాసిన తెలుగు దశకుమార చరిత్రవల్ల వచ్చినదో లేదో చర్చింపవచ్చును. అతఁడు సంస్కృతాద్యనేక కావ్యరచనా విశారదుఁడు (పీఠిక, ప 24). అది సరే! అతఁడు దశ కుమార చరిత్ర రచన నుపక్రమించుచు, తనకు అభినవదండి యను బిరుదున్నదని యిట్లు చెప్పు కొన్నాడు—

సీ. వేంగి విషయమున వెంటిఘాయను పేర
నభిరామమగు సగ్రహారమునకు
నగ్రణియగువాని, అభినవదండి నా
బొలుపు మీఱిన వాని, బ్రోలనార్యు
ననుఁగుఁదమ్ముని, సంస్కృతాది భాషల గావ్య
కర్తృత్వమున నుతిఁ గన్నవాని,
గౌండిన్యగోత్రుని, బండరు కేత దం
డాధీశుమఱంది, సద్వ్యయన పరుని—

(పీఠిక, ప 23)

అంతియేకాక నా పీఠికలోనె 'దశకుమార చరిత్రము చెప్పఁబూనితిన్' (పీఠిక, ప 25) లని వ్రాకుచ్చి నాడు. కాఁబట్టి యతనికి గ్రంథరచనకుఁ బూర్వమె అభినవదండి యను బిరుదున్నట్లుగా మనకుఁ దోచును. కాని యతని మాటలను నమ్ముటకులేదు. అయితే అతఁడు గ్రంథ రచనను సాగించిన తర్వాతనో, లేక ముగించిన పిమ్మటనో వచ్చిన బిరుదును గ్రంథావతారిక లోనె యెట్లు పేర్కొనఁగలిగి నాడను సందేహము పుట్టకమానదు. అతడు ప్రబంధమును గొంతవఱకు వ్రాసియో, లేక సంపూర్ణముగా రచించియో, గ్రంథావ తారికా రచన నెత్తుకొని, దానిలో తనకు లభించిన బిరుదును జెప్పుకొన్నాడని చెప్పకతప్పదు. దానిని తర్కిం

చుట కవి యొక్క [illegible] మూర్ఖము. [illegible] వంటి సొగడికయె తిక్కన [illegible] పురాణములలో [illegible] స్మరించుచు '[illegible]' (ఆ 1 ప 10) అని పేర్కొన్నాడు. [illegible] వచ్చినట్లు, దశకుమార చరిత్రము [illegible] గూడ [illegible]

కేతన కవి వేనాటి [illegible]!
పాకనాటి [illegible] తిక్క...
గ్రంథము [illegible] ప్రోత్సహించుటకు [illegible] కేతనకవియొక్క [illegible] దండ[illegible]; [illegible] తెలియదు. కాని [illegible] వెనాటి చోడ ప్రభు[illegible] కేతన కవి నాదరించుట[illegible] [illegible] గనుటకపోదు.

తిక్కన, మహాకవియే కాక మంత్రియు కాఁబట్టి కేతన తన గ్రంథము [illegible] రెండు కారణములున్నవి. [illegible] కాఁబట్టి [illegible] [illegible] మంత్రియు కేతన [illegible] త్యమునె సాగించినాడు. [illegible] యొక మహాకవి [illegible] గ్రంథమునిచ్చి [illegible] మహాకవి తెలుగు గ్రంథములనె కాక [illegible] గ్రంథ ములను గూడ వ్రాసినాడు.

---

1. కొట్టరువు అను ఇంటిపేరు గల బ్రాహ్మణులు ఇప్పుడు కృష్ణాజిల్లాలోని [illegible] గూడ నున్నారు (నేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన ప్రజ్ఞాప్రభాకరము (1951) పుట. 5.

2. సంగము వంశజుడైన కంపరాజు భార్య గంగాదేవి తన భర్త విజయములను వర్ణించుచు వ్రాసిన మధురా విజయమను సంస్కృతగ్రంథమునం దిక్కన సోమయాజిని సంస్కృత కవులలోఁ జేర్చి వర్ణించినది. కాని అందునను నాతఁడు రచించిన గ్రంథనామముల నీయలేదు.(ఆంధ్రకవి తరంగిణి, సం 2. పుట 143.)

దశకుమార చరిత్ర ప్రబంధములో తిక్కన మహాకవి యొక్క గ్రంథరచనను గూర్చి ఈ క్రింది పొగడికలు గలవు—అపూర్వార్థ శబ్ద చారు కవితన్మై నెగడిన బాణోచ్ఛిష్టం జగత్త్రయం బనిన పలుకు సఫలంబయ్యెన్ (పీ 90), కృతులు రచియింప...నేరునికిం దీరునె...తిక్కఁడొక్కఁడు దక్కన్ (పీ 91), తెనుఁగున సంస్కృతమునఁ బలుకుటం దైతానుభయకవి మిత్ర నామము...తిక్కఁడు దాల్చెన్ (పీ 92), అతిత నానా కావ్యములు చెప్ప నుభయభాషలయందు ననుట ప్రశంస త్రోవ (పీ93), ఉభయకవి మిత్రునకున్ (ఆ4ప129) కావ్యకళాభిరామికిన్ (ఆ 5 ప 134), సారకవితా నిర్మాణ చాతుర్య (ఆ7 ప 164), కవితాధుర్యుండు (ఆ9ప84). అన్ని పొగడికలను కేతనకవి తెలిపినాడు కాని ఆ మహాకవి వ్రాసిన యొక్క తెలుఁగు గ్రంథమునుగాని, సంస్కృత గ్రంథమునుగాని పేర్కొనలేదు. కాని పై పొగడికల నుండి మనము, తిక్కన ఒక్క ఉత్తర రామాయణమును వ్రాయుటయే కాక, ఆంధ్ర మహాభారతమును గూడ ఏ రచ్వంతో చేసియుండవచ్చునని గ్రహింపవచ్చును. తిక్కన యొక్క హరిహరనాథ భక్తిని గురించి కేతన కవి తన గ్రంథములో దెలుప లేదు. కాబట్టి యానాటి కింకను తిక్కనకవి మహాభారత రచనను ప్రారంభింపలేదని వాదింపఁ బూనుట వ్యర్థము. కేతన కవికి అట్టి సూక్ష్మములతో సంబంధములేదు. అతఁడు స్థూలాంశములనె కాని సూక్ష్మాంశముల జోలికిఁ బోవునాఁడు కాఁడు. తిక్కన కవి యొక్క శిష్యుఁడైన మారనకవి తన గురువైన తిక్కనను స్తుతించిన పద్యము (ఆ1 ప 10)లోనైనను తిక్కన యొక్క హరిహరారాధనపరతను గురించి చెప్పడయ్యె!

కేతన తన గ్రంథము నంకితమిచ్చు కాలమునకు తిక్కనకవి సోమయాజియైనాఁడా లేదా యను మాట యొక సమస్య కాదు. కేతన కవి తిక్కనకవి యొక్క యాజికత్వమును గూర్చి చెప్పిన పొగడికలు—క్రతు పురుషత్వ ప్రసిద్ధుఁడు (పీ 88), మహితదక్షిణలైన బహువిధ యాగంబు లొనరింపనుంట నర్జనము చొప్పు (పీ 93), అధ్వరాబ్జ దినవాథునకున్ (పీ 95), సంతత సమర్పిత మఖభుఙ్ముఖ నిలింప పితృసర్గనకున్ (పీ 96), యాగవ్యాఖ్యాతుణ (ఆ3ప165), సకలాధ్వర క్రియాకర్మఠ పాటవదున్మానికున్ (ఆ 5 ప 134), మఖ సంతోషిత మరుత్సమాజునకున్ (ఆ5ప135), యాజక మండలోత్తమా (ఆ 8 ప 94), యాగాహ(?)రణ నిపుణ చిత్తుండు (ఆ 9 ప 86), ఆగమ గోష్ఠీఘటన ప్రదేశము (ఆ 10 ప 192). వాటిని బట్టి తిక్కనకవి దశకుమార చరిత్రము నంకితము పొందినప్పటికె సోమయాజియైనాఁడని నిరభ్యంతరముగాఁ జెప్పుకొన వచ్చును. అంతేకాదు. అతఁడు ఉత్తరరామాయణ కావ్యగద్యలోనె తాను సోమయాజినని చెప్పుకొన్నాఁడు. భారత రచన కొంతయైనను దశకుమారచరిత్రను అంకితము గొన్ననాటికి జరిగియుండును. ఆంధ్ర మహాభారత పీఠికలో తాను తిక్కశర్మను అని కూడ ఆ మహాకవి చెప్పుకొన్నాఁడు.

తిక్కన యొక్క జీవిత విశేషములనెన్నిటినో తెలియజేయుగల యవకాశము కేతన కవికి నుండినది. కాని దాని నుపయోగించుకొనక లాంఛనపు పొగడికలతో నింపివేసినాఁడు. మారన మహాకవి తిక్కనను పరతత్త్వ బోధను (ఆ 1 ప 10) అని మాత్రమే పేర్కొన్నాఁడు. కేతన మారనలు తిక్కనకవి జీవితములోని యంశములను దెలుపక, తమకు గలిగిన యమూల్యావకాశములను వ్యర్థము గావించుకొన్నారు. కేతనకవి దశకుమార చరిత్రను గాక తిక్కన మహాకవి చరిత్రను వ్రాసియున్నచో వాఙ్మయములో నతనికి సాటి జీవిత చరిత్రకారుఁడుండఁడు.

కేతన కవి తిక్కనకవికి తన ప్రబంధము నంకితమిచ్చు సరికి మనుమసిద్ధిరాజు జీవించియున్నాఁడను విషయ మాగ్రంథమునందె—"ఇట్టు కీర్తిపాత్రంబైన మనుమసిద్ధి మహీవల్లభునకుఁ గరుణారస పాత్రంబైన కొట్టరువు తిక్కనామాత్యుండు నిజకులక్రమాగతంబగు మంత్రిపదంబున వర్ధిల్లుచు" (పీ, ప 20) లని చెప్పబడినది. అంతియేకాక మనుమసిద్ధి యెంత కాలము జీవించెనో తెలుసుకొనుటకు ఇతరత్ర ఆధారము కూడ నున్నది.[3] ఆ రాజు శాసనములు 1257 దాటి కనఁబడుటలేదని చాగంటి శేషయ్యగారు వ్రాసియున్నారు. కాని 1260 నాటి శిలాశాసన మొకటి కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోని అనుమంచిపల్లెలోని శిథిలమగు గర్భాలయముతో నున్నదని[4] వీరేశలింగ కవి

3. ఆంధ్ర కవితరంగిణి సం 2, పుట 249.

4. ఆంధ్రకవుల చరిత్ర (1917) పుటలు 85, 98.

తెలిపినాడు. కాఁబట్టి యీరాజు 1260 లోఁ గూడ నున్నాడని నిరాక్షేపణగాఁ జెప్పవచ్చును. అటుపిమ్మట నాతని శాసనములు దొరకనందున నదియె అతని ఆఖరి సంవత్సరమని భావించుటలో విచిత్రమేమియు నుండదు. అతఁడు తఱచుగా దాయాదులతో జరుగు చుండిన యుద్ధములలో మృతిఁజెంది యుండవచ్చును. అతనికి తరచుగా సాయపడుచుండిన కాకతీయ చక్రవర్తి, అతని రాజ్యమును తన సామ్రాజ్యములోఁ గలుపుకొని యుండవచ్చును. అట్లు దాయాదులకు రాజ్యకాంక్ష వదలియుండును.

మనుమసిద్ధి వంశీయుల శాసనము లితర స్థలములలోఁ గూడ కనఁబడుచున్నవి. అతనికి మనుమఁడని చెప్పఁదగినవాఁ మనుమగండగోపాలుఁడు కొణిదెన ముఖ్య పట్టణముగాఁ బరిపాలించుచు క్రీ. శ. 1297 లో నొక శాసనమును వేయించినాడు. ఇంక ప్రకృత విషయము—

తిక్కరాజు చాలకాలము రాజ్యపాలన చేసి 1256 లో స్వర్గస్థుఁడు కాగా, మనుమసిద్ధి సింహాసన మెక్కెను. అప్పటికి నతని వయస్సు నలువది యున్న కొన్నచో నతఁడు సుమారు ఐయిదు సంవత్సరములు మాత్రమె రాజ్యము చేసి 1260 కి దివంగతుఁడగుట చేత నలువదియైదేండ్ల చిన్నప్రాయముననె జీవిత యాత్రను ముగించుకొనె ననవచ్చును. కావున నతని జీవిత కాలము 1215 నుండి 1260వరకు మాత్రమె యగును.

తిక్కన మహాకవిని మనుమసిద్ధి మామ యని పిలుచుచుండుట చేత నా మహాకవి యీరాజు కంటె పెద్దవాఁడని యూహింపవచ్చును. ఆ రాజు కంటె నతఁడు ఐయిదేండ్లు పెద్దవాఁడని చెప్పుకొన్నచో,తిక్కన జన్మ సంవత్సరము 1210 యగును.

మనుమసిద్ధిరాజు పరిపాలించు చుండిన (1256 –60) కాలముండె తిక్కన మహాకవి యతనికి ఉత్తరరామాయణము నంకితమిచ్చెను. ఆ గ్రంథరచనా కాలము 1256 ప్రాంతము కావచ్చును. అంతియెకాక మనుమసిద్ధి పరిపాలించు చుండగానె కేతనకవి దశకుమార చరిత్రను వ్రాసియుండుటచేత నా గ్రంథ రచనా కాలము 1260 ప్రాంతము కావచ్చును.

ఆ సమయమునకుఁ దిక్కన మహాకవి ఉత్తర రామాయణమును ముగించి, మహాభారత రచనకుఁ దొరకొన్నాడు. తిక్కన కవి మహాభారతమునంతను రచించి ప్రపంచమునకుఁ బ్రకటించినాడా లేక ఒక్కొక పర్వమునె పూర్తిచేసి విడుదలచేసినాడా యను ప్రశ్నలు చొప్పదంటు ప్రశ్నలు మాత్రమె.

మారన మహాకవి వ్రాసిన మార్కండేయ పురాణ రచనా కాలమును, ఆ మహాకవి జీవితకాలమును గమనింపవలసియున్నది. ఆ కవి తాను తిక్కన సోమయాజి శిష్యుఁడనని గద్యలో—"శ్రీమదుభయకవి మిత్రు తిక్కన సోమయాజి ప్రసాద లబ్ధ సరస్వతీ పాత్ర, తిక్కనామాత్య పుత్ర, మారయ నామధేయ ప్రణీతంబైన —"అని చెప్పినాడు. అట్టి సందర్భముతో మారన కవి 1260 కి ముందె తిక్కన కవి శిష్యుఁడని భావింపవచ్చును. శిష్యునకు 1260 కి నిరువదేండ్ల ప్రాయముండవచ్చును.

మార్కండేయ పురాణములోని కృతిపతి వంశ వర్ణనమును బట్టి కూడ మారన కవి కాలమును నిర్ణయించుటకు ప్రయత్నించెదను.

మార్కండేయ పురాణమును నాగయ గన్నయ సైన్యాధిపతి కృతి పొందినాడు. అతఁడు ప్రతాపరుద్ర సేనానిఁ డని యీ గ్రంథమున నిర్వివాదముగా చెప్పబడినది. అంతకంటె ఏ కొంచెము వారో తెలియదు. అతని వంశక్రమము (ఆ 1 ప 12—43) ఇట్లున్నది—

మల్లడు (=పోలాంబ) మేచయ
|
నాగయ (=మల్లాంబ)
|
గన్నయ (కృతిభర్త) ఎల్లయ మేచయ

మల్లయ, అతని కుమారుఁడు నాగయ కూడ సైన్యాధిపతులె! ఎవరి వద్దనో చెప్పబడలేదు. మేచయ మాత్రము గణపతిదేవ చక్రవర్తి యొక్క ఎంబరి. అతని యల్లుఁడు నాగయ. కావున వారిద్దరును గణపతిదేవుని కాలములోని వారెయని గ్రహింపవచ్చును. నాగయ యొక్క పుత్రుఁడైన గన్నయ మాత్రము ప్రతాపరుద్రదేవుని వద్ద కటకపాలుఁడు. అతని తమ్ము లిద్దరును సైన్యాధిపతులు. వారిద్దరిలో మేచయను

5. ఆంధ్రకవి తరంగిణి సం 2, పుట 250.

గురించి కవి ప్రత్యేకముగా చెప్పినాడు. అతడు ప్రతాపరుద్రుని యొక్క సైన్యాధిపతి. ఈ వర్ణనలలో చెప్పబడిన ప్రతాపరుద్రదేవు డెవడు?

మారన తన గ్రంథములో ప్రతాపరుద్రదేవుని పేరును మూడుచోట్ల (ఆ 1 ప 12, 24, 43) తెలిపినాడు. అంతియేకాక అతనికి రుద్రదేవ నామముగూడ కలదని ఇట్లు వ్రాసినాడు—

క. శ్రీ రుద్రదేవ నృపతి
స్ఫారదయాలబ్ధ విభవ! శౌర్యేంద్రభవా!
మారాస్త్ర దళిత చేతో
నారీజన సుప్రసన్న! నాగయ గన్నా! (ఆ 5 ప1)

మార్కండేయ పురాణములో 'చలమర్త్యగండ ప్రతాప మనుజవిభుడు'(ఆ 1 ప 43) అని చెప్పబడినది. కాలమును సూక్ష్మముగా నిర్ణయించుటకు చలమర్త్యగండ బిరుదము తోడ్పడుటలేదు. ఏలనన, ఆ బిరుదు ఆ వంశము వారికి చిరకాలము నుండి వచ్చుచున్నది. రెండవ బేతరాజు[6] (క్రీ. శ. 1080—1115), గణపతిదేవ చక్రవర్తి యొక్క సైన్యాధిపతులైన [7]గంగయ సాహిణి, జన్నిగసాహిణి, రుద్రాంబ యొక్క సైన్యాధ్యక్షుడైన త్రిపురాంతక దేవుడును గూడ ఆ బిరుదును ధరించిరి.

ప్రతాపరుద్రుడు అనినంతమాత్రమున ఫలానా ప్రతాపరుద్రుడని చెప్పలేము. గణపతిదేవుని తండ్రియైన రుద్రదేవుడు కూడ ప్రతాపరుద్రుడే. అతడు మొదటి ప్రతాపరుద్రుడు. కానియతడు చాల పూర్వపువాడగుటచేత వానితో మనకు ప్రసక్తిలేదు. మన పనికి యవసరమగు వంశముట్టుకు కాకతీయ వంశ వృక్ష భాగము నిందు తెలుపుచున్నాను.

---

6. కాకతీయ సంచిక అనుబంధము పుట 1.

7. కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర 5 వ భాగము పుటలు 215, 408, 499.

ప్రోలరాజు II (1110—1158)

రుద్రదేవుడు (1158—1195)　　మహాదేవరాజు (1195—1199)　　?

గణపతిదేవుడు　　కుందమాంబ
(1199—1260)

|

కోట గణపాంబ (=గణపతి)　　రుద్రాంబ 1260—1295 (= చాళుక్య వీరభద్రుడు)

పెంపుడు కూతురైన ముమ్మడమ్మ (=కాకతి మహాదేవరాజు*)　　రుయ్యాంబ (=ఇందులూరి అన్నయామాత్యుడు)

|

ప్రతాపరుద్రుడు
(1295—1324)

* ముళుకుంటి తామ్రశాసనము— ఎపిగ్రాఫీకా కర్ణాటకా, తుమకూరు, నెం. 14 (భారతి, డిశంబరు 1960, పుట, 43)

* కాకతి మహాదేవరాజు అను నీతఁడు రుద్రదేవుని (1158—1195) పేరు తెలియని తమ్ములలో నొకని వంశస్థుడు (భారతి. డిశం. 1960. పుట43)

గన్నని తాత మేచయ నాయకుఁడు. ఆ మేచయ గణపతిదేవ చక్రవర్తి (1199—1260) యొక్క కొలువులో నుండగా నతని కూతురి కొడుకైన గన్నయ రెండవ ప్రతాపరుద్రుని కొలువులో నుండెననఁడగునా? 1260 కి ముందె తిక్కనకు శిష్యునిగా నుండిన మారయ సుమారుగా నలుబది యేండ్ల పిమ్మట రాజ్యమునకు వచ్చిన రెండవ ప్రతాపరుద్రుని కొలువులోనున్న గన్నసేనానికిఁ గృతినిచ్చెననుట సహజమా అను ప్రశ్నను బరీక్షించవలసి యున్నది.

గణపతిదేవుని కాలములో నుండిన మేచయ నాయకుని కూతురి "[illegible]"యను గన్నయ రెండవ ప్రతాపరుద్రుని కొలువులో నుండెననుటకు [illegible] [illegible] [illegible]చున్నది. [illegible] [illegible] [illegible] అసహజమని [illegible] రుద్రమాంబ [illegible] రాజ్యము (1260 నుండి 1295) [illegible] [illegible] [illegible]. [illegible] [illegible] ప్రతాపరుద్రుడు [illegible] (1295 - 1323) రాజ్యభారమును వహించినాడు. [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. గణపతిదేవుని కాలములోనుండి [illegible] [illegible], రుద్రమదేవి [illegible] [illegible] కాలమునుండి రెండవ ప్రతాపరుద్రుని [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] ప్రతాపరుద్రుని [illegible] [illegible].

రెండవ ప్రతాపరుద్రుని (1295- 1323) ప్రతాపరుద్రీయము [illegible] [illegible] [illegible]. [illegible] [illegible] [illegible] [illegible] కూతురున్నదనియు, [illegible] [illegible] [illegible] [illegible] [illegible], [illegible] [illegible] రుద్రదేవమహారాజు అని [illegible] [illegible] ముగా వ్రాసియున్నారు. [illegible], [illegible] ముమ్మడమ్మ [illegible] [illegible] [illegible] [illegible] [illegible]! రుద్రమ [illegible] [illegible] [illegible] దేవుడు [illegible] [illegible], [illegible] [illegible] [illegible] చేసినట్లుగ శాసనములందు [illegible] [illegible]. 1253 నాటిదైన శిలాశాసనములో రుద్రమాంబను రుద్రదేవుడను పేరితో [illegible] [illegible] [illegible] మనుచున్నది. [illegible] [illegible] నాయకుడు [illegible] గుండ దండాధిపుడు 1259లో వేయించిన బూదపూరు శాసనములో "శ్రీమన్మహామండలేశ్వర రుద్రదేవ మహారాజులు ఒరంగల్లు వీడు పట్టణముగా సుఖసంకథా వినోదంబున పృథ్వీరాజ్యము సేయుచుండ" అని తెలిపినాడు. రుద్రాంబకు

8. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి వారి సం. 3, భాగ 2, 3, 4, పుట 117.

9. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి వారి సం. 7 భాగము 2 పుట 121.

నిజముగా వివాహమయినట్లుగా 1259 నాటి[10] జుత్తిగ శాసనమునుండి గ్రహింపవచ్చును. ఆమె భర్త పేరు చాళుక్య వీరభద్రుడు. అయినను గూడ నామె పురుష నామముతోనే వ్యవహరింపబడుచుండెను. గణపతిదేవుని యనంతరము ఆమె 1260లో సింహాసన మెక్కెను. ఆమె సైన్యాధ్యక్షుడైన త్రిపురాంతక దేవ మహారాజు తాను వేయించిన[11] ఒక శాసనములో రుద్రాంబను పురుషనామమునసె—"రుద్రదేవ మహారాజ చరణ సరసిజ యుగళ సమారాధనుడ" అని తెలుపుకొన్నాడు. 1290 నాటిదైన నిశ్శంక ఇమ్మడి మల్లికార్జునుని శాసనములో కాకతి రుద్రాంబ గణపతిదేవుని పుత్రుడుగా వర్ణింపబడినది.

అట్లు రెండవ ప్రతాపరుద్రునకు (1295—1323) పూర్వము రుద్రాంబయు రుద్రదేవ మహారాజను పేరున బిలువబడెను. రుద్ర శబ్దమునకు ప్రతాప పదమును చేర్చుటలో వింత ఏమియులేదు. మొదటి రుద్రదేవునకుంగూడ నట్టి విశేషణమును జేర్చి వాడిన పట్టులు గలవు. మార్కండేయ పురాణములో ప్రతాప రుద్రదేవ, రుద్రదేవ అను పేర్లు రెండును గనబడు చున్నవి కదా! కాబట్టి దానిలో చెప్పబడిన నామము రుద్రాంబదెకాని యన్యులదికాదు. విద్యానాథుని ప్రతాపరుద్రీయములో రుద్రాంబ పురుషనామముతో పేర్కొనబడినట్లె మార్కండేయ పురాణములో కూడను. అందుచేత నాగయ గన్నయ రుద్రాంబ వద్దనె సైన్యాధిపతిగా నుండెనని నిశ్చయింపనగును.

ఇక్కడ మరియొక విశేషము. మారయకవి గణపతి దేవుని కాలములో మేచయ నాయకుడు తలవరిగా నుండెనని చెప్పినాడు. ఇతని యల్లుడు 'నాగచమూవిభుడు' కదా! మామయల్లుళ్లు ఏక కాలమున నున్నారనవచ్చును. కాబట్టి యతడు కూడ గణపతిదేవుని కాలములోనే ఉన్నాడని గ్రహింపవచ్చును. మారనకవి గణపతిదేవుని కాలమును గురించి చెప్పిన పిమ్మట ప్రతాపరుద్రుని గురించి చెప్పినాడు. ఆ ప్రతాప రుద్రుడె రెండవప్రతాపరుద్రుడైన పక్షమున, గణపతి దేవునికిని బిమ్మట ముప్పదియైదు సంవత్సరముల దీర్ఘకాలము రాజ్యము చేసిన రుద్రాంబ (రుద్రదేవ మహారాజు) విషయమేమైనది? కవి పెద్ద కప్పదాటు వేసినా రుద్రాంబ పరిపాలన కాలమునకు సరిపడ లేదా? కాబట్టి ప్రతాపరుద్రుడను పేరున మారన కవి రుద్రమదేవినే పేర్కొన్నాడని చెప్పుకొనుట బహు సమంజసము. అందుచేత మేచయ నాయకుడును వాని యల్లుడు నాగయయును, గణపతిదేవుని కాలములో ప్రఖ్యాతి వహింపగా, మనుమడైన గన్నయ, రుద్రాంబ కాలములో పేరుపొందినాడు. మారనకవి పేర్కొన్న ప్రతాపరుద్రుడు రుద్రాంబయె.

గన్నయ పుట్టుక గణపతిదేవుని యాఖరి రాజ్య సంవత్సరమైన 1260 యని గ్రహింపవచ్చును. గన్నయ వయస్సును నిర్ణయించుటకు ఇతర సాధన ఉన్నవా?

మార్కండేయ పురాణములో గన్నయ వంశ వృక్షము వర్ణింపబడినది కదా! నాగయకు మేచయ తన కుమార్తె నిచ్చి పెండ్లి చేసెనని చెప్పి, వారి సంతానమైన ముగ్గురను వర్ణించెను. ఆ ముగ్గురి లోను పెద్దవాడు గన్నయ. అతడు నట్టి సైన్యాధిపతి గానె వర్ణింపబడినాడు కాని వివాహితుడని చెప్పబడ లేదు. కాబట్టి మార్కండేయ పురాణమును కృతి నందు నరికి గన్నయ కింకను పెండ్లి కాలేదని చెప్ప గలమా? అట్టిది సాధ్యముకాదు. కవులు తాము అంకితమిచ్చిన వారి వంశవృక్షమును దెలుపుచు, కృతి పతి యొక్క భార్యను, బిడ్డలను దెలిపినవారు దెలిపిరి, లేనివారులేదు. కేతనకవి యొక్క గ్రంథమును అంకితము బొందునప్పటికి తిక్కనకు యేబది సంవత్స రముల ప్రాయమైన నుండును. కాని యతనికి వివాహ మైనట్లుగాని, బిడ్డలున్నట్లుగాని కేతన వ్రాయ లేదు. అంతమాత్రము చేత తిక్కనను అనాటి కింకను వివాహమైన కాలేదనుట అజ్ఞానము కదా! కాబట్టి కృతిపతి యొక్క భార్యాపుత్రులను వర్ణించిన వారు వర్ణించినారు, లేనివారు లేదు. అది కాలనిర్ణయమున కాధారమని పూర్తిగా భావింపరాదు.

మారయకవి తిక్కనసోమయాజికి తన యిరువదియవ యేట శిష్యుడుకాగా, 1290కి అతడు ఏబది సంవత్సరములవాడై యుండును. 1210 లో జన్మించినాడనబడెడు తిక్కన మహాకవి 1290 వఱకు

---

10. A. R. 343 of 1921 (ఆంధ్ర కవి తరంగిణి సం 3 పుట 42.)

11. (1) కాకతీయాంధ్రయుగరాజచరిత్ర సం 5 పుట 498.

(2) నిశంక ఇమ్మడి మల్లికార్జునుని శాసనం (భారతి మార్చి 1959 పుట 18.)

జీవించియున్నచో ఎనుబది సంవత్సరములవాడై పెట్టి పండువలె నుండును. కాని తిక్కన నిర్యాణమును గురించి సాంప్రదాయికముగా వచ్చుచున్న పద్య మిట్లున్నది—

క. అంబర రవి శశి శాకా
బ్దంబులు చనఁ[12] గాళయుక్తి భాద్రపదపు మా
సంబున నంబరమణి బిం
బంబునఁ దగు తిక్కయజ్వ బ్రహ్మముఁ జేరెన్.

దాని ప్రకారము కవిబ్రహ్మ క్రీ. శ. 1288 (శా. శ. 1210)నాడు నిర్యాణము చెందెనని చెప్పవలసియున్నది. అదియె నిజము కావచ్చును. కాఁబట్టి యాతఁడు సరిగా డెబ్బది యెనిమిది సంవత్సరములు మాత్రమె జీవించియుండును.

అయితే మార్కండేయ పురాణరచనా కాలము నాటికి తిక్కన మహామహుడు జీవించియుండెనాయను ప్రశ్నకు సమాధానము లభించునేమో చూచెదము. మారనకవి తిక్కనకు శిష్యుఁడె. కాని యాకవి తన గురువును వేరు పద్యమున వ్రాసి చెప్పుకొనక, తన గ్రంథము యొక్క గద్యలో మాత్రమె పేర్కొన్నాడు. అయితే కవి స్తుతిలో నన్నయభట్టుకి పిమ్మట స్తుతించినాడు. దానిలో "సంతత త్రిభువన కీర్తనీయ యశుఁడు"ని తెలియజేసినాడు. ఆ పదసంపుటినిఁ బట్టి మార్కండేయ పురాణరచనా కాలము నాటికి తిక్కన కవి కీర్తిశేషుఁడయ్యెనని చెప్పదగియున్నది. ఆ గ్రంథ రచన 1288 కి పిమ్మట జరిగియుండును. అయితే రుద్రాంబ పరిపాలన 1290 కి ముగిసినది. ఆ పుస్తకము ఆమె పరిపాలనా కాలములోనె వ్రాయఁబడినది. కావున మార్కండేయ పురాణము 1288—90 మధ్యకాలమున సృష్టింపఁబడినదని నిర్ణయింపవచ్చును.

ఇక్కడ మరియొక చిన్న సమస్యను విచారింప వలసి యున్నది.

1323 లో కాకతీయ సామ్రాజ్యము నాశన మైనది. రెండవ ప్రతాపరుద్రుఁడు శత్రువుల చేజిక్కినాడు. అతడే కాక అతని సైన్యాధిపతులు కొందఱు కూడ పట్టుబడినారు. వారిలో[13] నాగయ గన్నయ యను వాఁడొకఁడున్నాడు. అతని చరిత్ర మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతల నుండి తెలియుచున్నది. ఆ గన్నయ మహమ్మదీయ మతమును స్వీకరించినాడు. మల్లిక్‌మకబూల్ అను పేరును పెట్టుకొన్నాడు. పిమ్మట ఓరుగంటిని పాలించుటకు ఢిల్లీ సుల్తాను చేతఁ బంపబడినాడు.

కాని యది సాధ్యముకాలేదు. ఇతర స్థలములలోఁ బరిపాలించి 1372—73 లో మరణించినాడు..... 1260 ప్రాంతములో జన్మించి, పిమ్మట మారనకవి నుండి మార్కండేయ పురాణమునుఁ గృతిఁగొనిన నాగయ గన్నయయే నా మతమును మార్చుకొన్నవాఁడు? అతఁడే యైన పక్షమున, నాగయ గన్నయ 1260 లో జన్మించి 1372 లో అనగా నూటపన్నెండవ యేట మరణించెనని చెప్పవలసియున్నది. అది పూర్తిగా అసంభవము. దానిని సంభవనముగా జేయుటకు తల క్రిందులు తెక్కలను వేయవచ్చును. అంతట నదియె అసంభవమని రుజువుపడును. కాబట్టి వారిద్దఱును వేర్వేరు పురుషులని నిర్ణయించుట మేలు. ఈ రెండవ నాగయ గన్నయ యొక్క పుట్టువు మనకు తెలియదు.

మారన మహాకవి డెబ్బది సంవత్సరముల వఱకు జీవించియుండవచ్చును. అప్పటికి నతని జీవితము 1240 నుండి 1310 వఱకు యుండును. అట్లు రుద్రాంబకుఁ బిమ్మట రెండవ ప్రతాపరుద్రుని కాలములో గూడ మారనకవి యుండుట కవకాశ మున్నది. అయితే అతఁడు పేరు ప్రఖ్యాతుల కొసము తాపత్రయ పడిన వ్యక్తిగాఁ గనఁబడడు. ఆనాటి చరిత్ర కొంతవఱకు ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర నుండి తెలియుచున్నది. అందు మారన పేరు గానరాదు. అతఁడు చక్రవర్తినిగాక, యతని సిబ్బంది నాశ్రయించి కాలము వెళ్లబుచ్చినాడని మనము భావింపవచ్చును.

12. శా. శ. 1210 కాళయుక్తి గాక సర్వధారి యగుచున్నది. కాళయుక్తి పదము నెత్తివేసి సర్వధారిని వేసుకొన్నను పద్యలక్షణమునకు బాధలేదు.

13. భారతి, బహుధాన్య మాఘమాస సంచిక (ఆంధ్ర కవి తరంగిణి సం 3, పుట 169.)

# తెలుగు ఛందస్సు ఎలాగ ఏర్పడి ఉంటుంది?

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

నన్నయగారికి ముందే చిరకాలమునుంచీ తెనుగులో పద్యాలు వ్రాసే సాంప్రదాయ ముండినది. రగడలూ, తరువోజలూ సీసపద్యాలూ, ఆయనకు పూర్వముండిన శాసనాలలో గోచరిస్తున్నాయి. ఆయన కన్నడకావ్యాల్ని ఎరిగినవారు కనక వాటిలోని పద్యరీతుల్ని తెలుగులోకి తెచ్చి, సంస్కృత వృత్తాల్ని స్వీకరించీ, తెలుగు జాతీయ ఛందస్సులను ఇంచుకంత సంస్కరించీ, మొత్తంగా చాలా వైవిధ్యముండేటట్లు ''ఆదికావ్య'' రచన చేశారు. తెలుగు కవులు— కొందరెవరో ద్విపదలలో రచించినా—మొత్తమ్మీద అందరూ ఆ పద్యాలలోనే తమ రచనలు చేశారూ, కావ్యాలు పద్యాలలోనే ఉండాలి అన్న— ఎవరూ వ్రాసిపెట్టని —నియమము అమలులోకి వచ్చేసింది. సంస్కృత వృత్తాలలో లేని యతిప్రాస నియమాలు తెలుగులో ప్రవేశించాయీ, ఆ వృత్తాలలో ఉన్న విరామము తెలుగులో మాయమైంది. అన్ని నియమాలకూ లోబడి కవులు కావ్య రచన చేశారూ, ఈ నియమ వ్యతిక్రమము జరిగిన చోట్ల విమర్శకులు కవులను దుయ్యబట్టారు. ఛందో నియమాలు దేవదత్తములే అనేటంత పట్టుదల ఉంది ఈనాటి విద్యావంతులలో. ఆధునికులు వచన పద్యాలు వ్రాస్తుంటే ఉపేక్షించడమే కాకుండా అవి అరాజకపు వ్రాతలనీ సభాముఖాన్ని వినిపించరానివనీ వెక్కిరిస్తున్నారు కూడాను పద్య రచయితలు. పూర్వము కూడా పద్యాలలో కాక ద్విపదలలో కావ్యాలు వ్రాసిన వారిని 'ముది విటులు, విధవ లంజలు' తో జతచేసి ఆక్షేపించారు పెద్ద పెద్ద కవులు. అంత ఉన్నత స్థాయిలో ఉంచి మనవారు గౌరవిస్తూన్న ఛందస్సు ఏ రీతిగా ఏర్పడి ఉంటుంది? అనే జిజ్ఞాసతో ఎక్కువగా వాడుకలో ఉన్న పద్యరీతులను పరిశీలించినాను 'అంతర సాక్ష్యము దొరుకుతుంది గదా' అని. 'పద్యాలు కూడా పాటలు ఉపయోగించే అవృతాలనే ఉపయోగించుకున్నాయి' అన్న అనుమానాని ( inference ) కి వచ్చాను. జూన్ నెల భారతిలోని నా ''కవిత్వములో ఛందస్సు ఉండి తీరాలా'' అన్న వ్యాసములో ఈ సత్యమును సూచించే ఉండినాను.

బాహ్య సాక్ష్యము కోసము డాక్టరు గిడుగు సీతాపతి గారి 'తెలుగులో ఛందో రీతులు' అన్న గ్రంథమును చూచినాను. దాన లభించిన వస్తు విది : (తెలుగు) వృత్తములలో అక్షర సంఖ్యా నియమము ప్రధానమైనది. జాతులలో (గణ నియమమే కాని) అక్షర సంఖ్యా నియమము లేదు. అక్షరములు ఒకటి మొదలు 26 వరకును (నాలుగు పాదములలోనూ) గలిగిన (వృత్తముల) వి 26 ఛందములు గలవు. మొదటి ఛందములో ఒక గురువు కానీ ఒక లఘువు కానీ ఉంటుంది ఒక్కొక్క పాదములో. కనుక మొదటి ఛందములో రెండు వేర్వేరు వృత్తాలుండ గలవు రెండో ఛందములో ప్రతీ పాదమునకూ ఉండవలసిన రెండు అక్షరముల కూర్పులో మొత్తము నాలుగు భేదాలు (గగ, గల, లగ, లలములు) ఏర్పడ గలవు. కనుక రెండో ఛందములో నాలుగు సమవృత్త (భేద) ములుండగలవు ఈరీతిగా 3, 4, 5 .... 26 అక్షరములు గల వృత్త భేదములన్నీ లెక్కవేస్తే అవి మొత్తము 134217726 గా తేల్తాయి. వృత్తములకు చివరి అక్షరము గురువు గానే ఉండవలెనన్న నియమమువల్ల ఇవి పై సంఖ్యలో సగము అనగా

ఉపక్రమించిరి. ఈ విధముగా చెప్పుకొని పెయిసచో తొమ్మిదింటితో వాగునా అను ప్రశ్న మేము వేయుట లేదు. ఆ ప్రకరణములో వరుసగానో మొత్తము విూదనో ఈ తొమ్మిది లక్షణముల వివరణము నుండుట క్రమ పద్ధతి. ప్రకరణములో అదే లేకపోగా ఇతరము లేవేవో ఉండుట బుద్ధిమంతులైన పాఠకులను చకితుల నొనర్చును. ఇక ఆ వ్రాసిన దానిలో కవిత్రయము వారి శైలికిని పోతన శైలికిని భేదములు కనిపించుచున్నవని జాబితాగా ఏడింటి నిచ్చిరి. వానిలో మూడింటిని మాత్ర ముదాహరింతుము :

| ''కవిత్రయము | పోతన |
| --- | --- |
| 3. ఆంధ్ర పద బాహుళ్యము | సంస్కృత పద బాహుళ్యము |
| 6. పదవాక్య సౌష్ఠవము | రసోచిత రచనా వైఖరి |
| 7. అర్థ సారస్యము | రస సౌభాగ్యము.'' |

పై భేదముల ఔచిత్యము వేరుగా వివరింప నక్కర లేదు. గ్రంథకర్త 'పోతన'ను గూర్చి వ్రాయుచున్నారు కనుక, కవిత్రయము వారి కవిత పద వాక్యముల కూర్పు అర్థ సౌష్ఠవముతో నాగిపోగా, పోతన మాత్రమే రసస్థాయి నందుకొన్నాడని తేలుచున్నది. ఏ వ్రతమును గూర్చి చెప్పినను చిల్లర పురాణములు అదియే 'వ్రతానా ముత్తమా వ్రతమ్' అని చెప్పుచుండు స్థాయిలోనికి దిగజారినది. పోతనయందు మనకెంత భక్తియున్నను, కవిత్రయముతో పోల్చుచున్నామను జాగరూకత యక్కర లేదా ? ఇది చదివిన ఇతర రాష్ట్రముల పాఠకులకు కవిత్రయముపై నెట్టి యభిప్రాయము కలుగునో అనియైన ఆలోచింప నక్కర లేదా ?

ఏ విధముగా చూచినను ఈ గ్రంథము ఉద్దిష్ట ప్రయోజనమును సాధించు స్థాయిలో లేదని చెప్పవలసి నందుకు విచార పడుచున్నాము.

ఇక ప్రచురణ కర్తలకు సంబంధించిన దొక్కటి తెలిపి ముగింతుము. అది అచ్చు తప్పులను గూర్చినది. మధ్య కాలములో వచ్చిన మజిలీ పుస్తకముల అచ్చు తప్పులతో సమాన స్థాయిని ఇందులోని తప్పులు కొంచెము హెచ్చు తగ్గుగా అందుకొన్నవి. స్పేసింగు అనవసరమైన చోట్ల ఉండి అవసరమైన చోట్ల నుండదు. వత్తులు తరుచుగా వదలి వేయబడినవి. అందులో ముఖ్యముగా తవత్తు టవత్తుగానే తరుచుగా ఉన్నది. సంస్కృత శ్లోకములలో తప్పులు లెక్కలేనన్ని యున్నవి. ఈ మాట అతిశయోక్తులుగా పాఠకులకు తోచునేమో యని రెండు ఉదాహరణములు మాత్రము క్రింద నిచ్చుచున్నాము :

పే. 175: తల్లి దండ్రియు దైవంబుఁ దలప గురుఁడ
కావె యతఁ డేమి చేసినఁ గనల నగునె ?

పై రెండు పంక్తులలో ఆరు స్పేసింగు తప్పులు.

పే. 178 :

| | తప్పు | ఒప్పు |
| --- | --- | --- |
| పం. 5 | పరీక్షత్తు | |
| '' 8 | బహు సమర్థతో | సమర్థతలో |
| '' 9 | నీలకంఠస్తన ప్రశంస | స్తవ |
| '' 12 | వైవస్వతము | వైవస్వతమును |
| '' 19 | స్వపిత్రూణాం | స్వపిత్రూణాం |

పై 178 పేజీ వానిలో అచ్చు సరిగా లేనట్టి సందేహాస్పదములుగా నున్న తప్పులను, స్పేసింగు తప్పులను వదిలి వేసి పైన చూపినాము.



67108863 అవుతాయి. మనకు పరిచితములైన 'మదన విలసితము, విద్యున్మాలా, ఉపేంద్రవజ్రము=తోటకము, స్రగ్విణి భుజంగప్రయాతము, మాలిని, పంచ చామరము, శిఖరిణి=మందాక్రాంత, మత్తకోకిల, శార్దూల విక్రీడితము, మత్తేభ విక్రీడితము=ఉత్పలమాల, చంపకమాల=స్రగ్ధర, మహాస్రగ్ధర, కవిరాజ విరాజితము, మంగళ మహాశ్రీ, వృత్తాలు వరుసగా 7, 8, 11, 12, 15, 16, 17, 18,19, 20, 21, 22, 23, 26 ఛందస్సులలోని వృత్తభేదములు.''

ఏతావాతా, 67108863 సాధ్య వృత్తములలో మనకు పరిచితములైన కొద్ది వృత్తాలే ఈనాటికి నిలిచినవి. చిత్రకవి పెద్దన 263 గురించి చెప్పగా అప్పకవి 227 చెప్పినాడట (వడ్ల మూడివారి 'పరిచయము'.) ఈ వృత్తములు సమగ్ర లక్ష్య లక్షణ నామకరణ విచారమును డాక్టరు సీతాపతిగారి* వంటి పండితులకే వదలి మనము ప్రస్తుతము ఛందోపావిత్ర్యమును గురించి ఆలోచిద్దాము. నేను మొదటనే చెప్పిన అంతర సాక్ష్యాన్నీ బాహ్య సాక్ష్యాన్నీ జతచేసి తర్కిస్తే ''లెక్కకు సాధ్యమైన ఆరుకోట్ల డెబ్బయి లక్షల వృత్తాలలోనూ కవులకు సుమారు యాభయి వరకనే స్వీకారము లైనవి'' అన్న తీర్మాన మేర్పడుతుంది. ఈ యాభయ్యీ, ఏ సుగుణము వల్ల ఎంచుకోబడ్డవీ అంటే, ''వాటిలో లయ స్ఫుటముగా ఉండుట వల్ల'' అని జవాబు వస్తున్న దంటున్నాను; సీతాపతిగారు చెప్పనే చెప్పినారు: ''త్ర్యస్ర గతిలో నున్నవి, పంచచామరము, సుగంధి, ఉత్సాహ, తరళ, తరలి; చతురస్ర లోనివి, పాదప, తోటక, రమణక, మానిని, కవిరాజ విరాజిత, మలయజ, సాధ్వీ, లాక్షణి, స్వాగత, వంశస్థ, విద్యున్మాల, క్రౌంచ పదము; ఖండ గతిలో నున్నవి, స్రగ్విణి, భుజంగ ప్రయాత, మనమయూరము, వసంత తిలక, మంగళ మహాశ్రీ; మిశ్రగతి లోనివి మత్తకోకిల, ధృవకోకిల'', అని. ఇక మిగిలిన వాటిలో కందము చతుర్స్రగతిదీ, ఉత్పలమాల, చంపకమాల, ప్రభు, వృత్తాలు చతురస్రగతి లోనివి. ద్విపద, తరువోజ, సీసము, లయవిభాతి, లయగ్రాహి ఖండగతివి. గీతము రెండు త్ర్యస్ర—, రెండు ఖండ—, మళ్లీ రెండు త్ర్యస్ర—, మాత్రాగణాల మిశ్రమము కాగా, ఆటవెలది మూడు త్ర్యస్ర—, రెండు ఖండ— ఆ వృత్తాల మిశ్రమమైంది. ఈ పద్యాలకు వాడుటకు వీలున్న గణములు అన్నీ ఈ లకప్పు వింగడింపునకు లొంగివచ్చేటంత అనుకూలములు కావు కాని నలములకు బదులు అయిదు మాత్రల గణాలు వాడితేనే ఆట వెలదీ, తేటగీతీ, సీసమూ సరిగా నడుచునని అందరూ ఎరిగిన విషయమే. కనుక ఆ పద్యాలలో నలములు పట్టవు కకార్కి ర్తికి వేస్తే లయ కుంటుపడుతుంది. పద్యాల్ని పాడినప్పుడు మాత్రానియమము ఎక్కిరిపోతుంది కనక ఆ గొడవే అక్కర లేదు పద్య గాయకులకు. ప్రతి పద్యాన్నీ దాని నడక స్ఫురించే రీతిగా చదివినప్పుడే ఈ గతులు నిలిచో, తెగిపోయో స్ఫురిస్తాయి.

ఏతా వాతా, పరిచిత గతులు గర్భీకృతము చేసుకున్న ఛందోరీతులే తరచు వాడుతున్నారు కవులు. ఈ గతులు, పాటలలో స్ఫురించే సమయమనే ప్రాణముగా గలట్టివి. మరి పద్య ఛందస్సు అవతరించి సాధించిన ఘనకార్య మేమిటి? అని. ఆ లయను క్లిష్టమూ, కష్టమూ చేసింది. ఎలాగా? అంటారా, మనవి చేస్తున్నా.

> శార్దూల విక్రీడితము చూడండి సంస్కృతానిది :
> బర్హోత్తంస విలాసి కున్తల భరం
> మాధుర్య మగ్నాననం

అన్నది ఒక పాదం. యతి దగ్గర విరామం ఉంటుంది సంస్కృతంలో. దీని లయ—నడక—పూర్వార్ధంలో క్లిష్టము. రెండో భాగములో రెండు అయిదు మాత్రల గణాలూ, ఒక గురువూ తెలుస్తున్నాయి. పాదాంతమందు మూడు మాత్రల కాలం ఆగవచ్చును మూడో అయిదు మాత్రల గణానికి. మొదటి భాగంలో చతురస్రగతిలో నాలుగు ఆవృతాలు దాటి ఒక్క గురువున్నది. ఇంకొక రెండు మాత్రల కాల విరామంతో అయిదు ఆవృతాలౌతాయి. చివ్వర పూర్ణానుస్వార మున్నది కనుక రెండు మాత్రల కాలమూ ఆగడము అనుకూలమే. దీన్ని తెలుగులోకి తెచ్చుకుని, విరామం ఎగగొట్టి, పాదాంతమందైనా విరతి లేకుండా తరిమితే దీని గతి దుర్గతి కాక వేరేమి కాగలదు? సీతాపతిగారు తెలుగు శార్దూలాన్ని విశ్లేషించి యతిని చతురస్ర గణము లోపల దూర్చినారు. దాని పూర్తిగా చతురస్ర గతియే సిద్ధించినది. ''లయ (ఏదయితేనేం?) గుప్తముగా.. ఉన్నదని'' వారూ తేల్చినారు. లయ లేని పద్యాలను ఎవరూ వ్రాయకపోవడముతో అవిలోపించి పోయినవి. 'మహాస్రగ్ధర' పేరుగొప్ప కోసమే కాక పోతే దాని వ్రాసినవారు కొద్దిమంది మాసివేసి ఉందురు.

కనుక తెలుగు పద్య ఛందస్సు కవిత్వమునకు—వాల్మీకి శ్లోకాన్ని లాగ—విశ్లేషిస్తే వచ్చినట్టిది కాదు. అంటే సహజము కాదు; కృతకమే కనుక ఇది అనివార్యము కాదు. అయితే, కృతకముకాని ఛందస్సు ఎక్కడేనా ఉన్నదా అని అడుగుతారు పాఠకులు. ఛందస్సు లేటి [illegible] స్ఫురణ [illegible]

---

* పద్య భేదములను గురించి వారు ''1919 [illegible]'' శ్రమిస్తున్నారు. పూర్తిచేసిన గౌరవము వారికి దక్కుటే న్యాయము.

వరికి కలగకుండా ఏ ఛందస్సులో రాసినా అది సహజమే. ఇక్కడ ఒక్క మాట. త్యాగరాజు ''ఎంత నేర్చినా ఎంత జూచినా, కొంత దాసులే'' అన్న పల్లవిని విని చకితులైనవా రందరూ, ఆ తరువాతి ''సంతతంబు శ్రీ కాంత స్వాంత సిద్ధాంతమైన మార్గ చింతలేని వారెంత నేర్చినా '' అని వినగానే'' ''అయితే ఫరవాలేద''నుకున్నట్టుగా, పద్యాలు రచించే వారందరూ చక్కగానే వ్రాస్తున్నామనుకుంటారు. ఎవరి పద్యాల్లోనైనా కేవల ఛందోస్ఫురణ అక్కడక్కడ కలుగుతుంది. కనుకనే అన్నాను పద్యమే కృతక మని. వేమన్నకు ఆటవెలది, ధూర్జటికి వృత్తమూ, శ్రీనాథుడికి సీసమూ చాలా మట్టుకు సహజాలు. వాటిల్లో వారి రచన మొత్తం మీద ఛందస్సు కట్లకు లోనైనట్లు కానరాదు. అయితే వారికీ అన్ని పద్యాలూ సహజంగా కుదరవు. ఉమాకాన్తం గారన్న ఛందో వ్యతిక్రమాలూ భాషా వ్యతిక్రమాలు కట్టుబాట్ల వల్లనే కలుగుతాయి. కనుక 'ఈ ఛందస్సు' లో వ్రాయాలనీ ఈ వృత్తాల్లోనే పూర్తిచెయ్యాలనీ ఉద్యమించకండి మీభావాలు చదువరికి చక్కగా అందేటట్టు వ్రాయండి అంటున్నాను.

నాలుగు 'ర' గణాలు చేర్చితే స్రగ్విణి, అవే 'య' గణాలైతే భుజంగప్రయాతమూ, 'భ' గణాలైతే పాదపమూ (దీనిలో చివరి లఘువులు రెండూ గురువులైనాయి), 'స'గణాలైతే తోటకమూ, 'న' గణాలైతే తరళమూ, నలములైతే రమణకమూ, ఏర్పడుతున్నాయి. అదొకటీ ఇదొకటీ అదొకటీ ఇదొకటీ చొప్పున చేర్చితే లలిత, మలయజ, సాధ్వీ, లయ విభాతి ఏర్పడుతున్నాయి. ఇలాగ సామాన్య గణాల్ని పేర్చి కృతకంగా నిర్మించినట్టిదే గాని ఛందస్సూ, కవితా రచనలు చాలా చాలా రచించిన తర్వాత, ''ఇంచక్కగా కుదిరేదేమిటి ?'' అని విశ్లేషించుకున్నట్టిది కాదు. అలాగ జరిగి ఉంటే ప్రకృతి సిద్ధమైన వరసలు కొన్నయినా సిద్ధించి ఉండును. ఇప్పుడు జరిగిన దేమిటి—? పాటల వరసలో వాడుతున్న వాటినే రెండు ఆ వృత్తాలలోని సమీపాక్షరాలను అతికి గురువు చేసి (ఉత్పలమాలలో రెండో నాలుగు మాత్రల గణాన్నీ మూడో నాలుగు మాత్రల గణాన్నీ గురువుగా అతికినట్లు) ఆ వృత్తాల్ని అతికి పద్య వరస చేశారు. సరిగ్గా ఇలాగే ఉన్న మరో వరసని చంపకమాల అన్నారు. ఇలాగ ఆవృత్తాల సరాలకు పేర్పేరు పేర్లు పెట్టి, యతిప్రాసల్ని తగిల్చారు. ఈ ఛందస్సు అనివార్యము ఎందుకౌతుంది ? కానే కాదు.

ఛందస్సుకి శాస్త్రసిద్ధమైన నిర్మాణ మున్నది గదా, దానిని కృతక మనుటేలా ? అని అనుమానిస్తారు పాఠకులు. ఆ నిర్మాణపు లెక్కని ఈ వ్యాసములోని మొదటి నాలుగు అక్షరాలూ ఒక వృత్తము. తర్వాతి రెండు రెండు అక్షరాలూ (నాలుగు రెండ్లు) ఒక వృత్తము. మూడు మూడు ఇంకో వృత్తము. నాలుగు నాలుగులూ, నాలుగు అయిదులూ, నాలుగు ఆరులూ, ఇలాగ నాలుగు ఇరవైయార్లు వరకూ 26 ఛందస్సులకూ ఉదాహరణలైన ఇరవైయారు వృత్తాలు ! చివర అక్షరాలు దీర్ఘాలు చెయ్యడమూ, యతులు కుదర్చడమూ కష్టమేమీ కాదు లెండి. పనికిరానంత విశాలముగా ఉంది ఛందశ్శాస్త్రము. సీతాపతిగారు పట్టిన సీసభేదములూ, కంద భేదములూ ఇతర పద్యాల అవతారములూ అన్నీ చేర ఛందస్సు చెప్పే 134217726 లో ఎన్నవ వంతో! ఇంకా చాలా మిగిలి ఉంది పరిశోధన !

'కవిత్వానికి ఏదో వరస ఉండి తీరాలి' అంటున్నారు కొందరు. ఆ వరస యేదో కవికి వదిలేయండి. వరస అక్కర లేదనుకుని కవి వచన పద్యాలు రచిస్తే ఏదో నేరము జరిగినట్లు 'పొలికేక'లు పెట్టడమేలా ? కవే ఎంచుకుంటాడు కావలసిన వరసని. మీస్కేలు బద్దలూ ప్రొట్రాక్టరులూ పట్టుకుని తిప్ప బోతారెందుకూ ఆతని సృష్టినీ ? అది బాగుండకపోతే బాగులేని రచనలకూపంలో పడిపోతుంది, బాగుంటేనే నిలుస్తుంది.

# అకాడమీ బహుమతులు: శ్రీ విలాయత్ ఖాన్ విమర్శ

ప్రముఖ సితార్ విద్వాంసుడు ఉస్తాద్ విలాయత్‌ఖాన్ కేంద్ర సంగీత నాటక అకాడమీవారు తనకివ్వజూపిన బహుమతిని తిరస్కరించారు. ఇందుకు కారణాలను ఆయన వివరిస్తూ ఈ బహుమతులు ఇవ్వడానికి నిర్ణయాలు జరుగుతున్న తీరు సవ్యంగా లేదనే విషయం ప్రజలదృష్టికి, ప్రభుత్వం దృష్టికి తీసుక రాగోరి, కావాలనే బహుమతి స్వీకరణకు తాను నిరాకరించినట్టు తెలియ జేశారు.

ఈ బహుమతుల నిర్ణయ పద్ధతి పూర్తిగా మారిపోవాలని, అలా జరిగినప్పుడే అకాడమీ నిర్ణయాలు ప్రజల యొక్క కళాకారులయొక్క మన్ననలు పొందగలవనికూడా శ్రీ విలాయత్ ఖాన్ స్పష్టం చేశారు. అకాడమీ నిర్ణయాలు కళాకారుని ప్రతిభనుబట్టి, సూత్రబద్ధంగా కాకుండా నిరంకుశంగా జరుగుతున్నాయని అంటూ తనకు బహుమతి ఇవ్వాలని ఏ పరీక్ష లేదా సూత్రాల ప్రకారం నిర్ణయించారో తెలియ జేయుమని అకాడమీ వారికి లేఖ వ్రాసినా, దానికి స్పష్టమైన సమాధానం రాలేదన్నారు. అందువల్లనే బహుమతిని తిరస్కరిస్తున్నట్టు మరొక లేఖ వ్రాశామని కూడా తెల్పారు.

# కవిత్వాని అలంకారమూ ఛందస్సూ ండి తీరాలా ?

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

చిరకాలంగా కవిత్వానికి అలంకార సంపదను సమకూర్చి పెట్టుతున్నారు కవులు. ఆ అలంకారములను గుర్తించి మెచ్చుకుంటున్నారు చదువరులు. ఛందస్సులాగే అలంకారము కవిత్వానికి ఉండి తీరాలనే నమ్మకము చాలా చాలా మందికి ఉన్నది. ఇంకా మాట్లాడితే "కవిత్వానికి ఛందస్సు లేకపోతే మానె, దాన్ని గద్య కవిత్వ మంటాము, కాని అలంకారము లేకపోతే ఎలాగా ?" అనే వారు చాలా మంది ఉంటారు. ఆలంకారికులు— మమ్మటాచార్యులు ఒకరని జ్ఞాపకము— అలంకారములేనిదే కవిత్వమే లేదని వాదించిన వారూ ఉన్నారు.

'అలంకారము కవిత్వానికి అందము సమకూరుస్తుంది' అని వాదిస్తే అది పూర్తి సత్యము కాదు. అది బంధమూ సంకెలా కూడా కాగల'దని చేరిస్తేనే పూర్తి సత్య మవుతుంది. 'అలంకారము' అంటేనే "అది పైనించి తెచ్చి పెట్టినట్టిది" అని స్ఫురిస్తుంది. మరి బాగూ భ్రష్టూ రెండూ కాక బాగొకటే ఎలాగ ఉండగలదూ ? ఈ ఊహ కొత్తదేమీ కాదు. ఉపమాలంకారము వంటి సరళాతి సరళాలంకారము పట్లనే 'పిచోపమ' ప్రవేశించ గలదని ఆలంకారికులు గుర్తించి చెప్పినారు. అయితే అన్ని అలంకారాలకూ ఉచ్చ—, నీచ—,ములను వివరించినారు కారు; 'గ్రంథ విస్తరభీతి'తోనని నే నంటాను.

అయితే ఇక్కడ నా పని అలంకార శాస్త్ర విమర్శన కాదు. ఆ శాస్త్రము వదలిపెట్టిన పై వస్తువును ఇంచుకంత స్పృశిస్తా అది అలంకారముల గౌరవానికి కాక వాటి అపకీర్తికే దోహదమైనదని సూచించడమే. అదిన్నీ ఎందుకనీ ? అలంకారాల గలగలలూ, బరువూ, కవిత్వపు నిసర్గ సౌందర్యానికి అక్కరలేని ఆటంకాలని సూచించడానికి. రవీంద్రుడన్నాడు ఒక చోట. "నా గీతము అలంకారాలన్నిటినీ తీసి పెట్టేసింది, వాటి గలగలలు నీ గుసగుసల్ని వినపడ నియ్యవు" అని. ఈ నిజము పరిశీలించండంటున్నాను.

మన సంప్రదాయములో 'వాద బలము' 'వాది బలము' అని రెండు పురాతన గజకచ్ఛ పాలున్నాయి. ఆ రెండింటిలో ఏది మిన్న ? అన్న ప్రశ్నకు తర తరాలలో వచ్చిన మేధావులు ఆచరణ పూర్వకంగా అటూ ఇటూ సమాధానా లిచ్చారు. అయితే జరిగిన వైషమ్య మేమిటంటే, వర్తమాన మవుతున్న వాదానికి అనుకూలంగా నిలిచి సాక్ష్యాన్ని విశ్లేషించి, దాన్ని ఊపి, పుట్టకీట్లు కదల్చి ఆ వాదాన్ని మార్చిన మేధావుల దారిలో ప్రతీ ఒక్కరూపడి పిడి వాదము చేయడము. వీరు సాక్ష్యాన్ని బట్టి తమ తీర్మానాలు ఏర్పరుచుకోరు. తీర్మానము ముందు చేసేసుకుంటారూ తరవాత తమకు అడ్డువచ్చిన సాక్ష్యాన్ని కాదనడమో, మడత పెట్టడమో ప్రారంభిస్తారు. "అలంకారము లేని కవిత్వమే ఉండదు" అని వాదించిన ఆలంకారికులు ఆ బృందములోని వారంటాను నేను. అలంకారము లేని నిసర్గ రస శోభితమైన రచనను పట్టి, కిందా మీదా పెట్టి, "అదిగో ఆ మూల నుంచి అలంకారము తొంగి చూస్తూనే ఉంది" అంటూ రాద్ధాంతము చేస్తారు వారు. వాద ప్రతి వాదాలు సాక్ష్యము మీద ఆధార పడాలి కాని ఏదో విధంగా ప్రతికూల సాక్ష్యానికి కాళ్లు కొట్టేద్దామన్న యత్నము మీద నాధారపడరాదు. ఉభయ భారతీదేవి ఆచార్య శంకరులను ఎన్నాళ్లు తప్పించుకో గలిగింది ?

నే నిప్పుడు చెప్పబోయేది, ''కవిత్వానికి అలంకార రచన అత్యవసరము కానే కాదు'' అని. ఛందస్సు అత్యవసరము కాదు, అలాగే అలంకారమూను. ''ఛందస్సూ అలంకారమూ ఉన్న రచనలు భ్రష్టములా'' అని అడుగుతారేమో ? నేనా మాట అనలేదు, అనబోను. ''ఛందస్సూ, అలంకారమూ లేక పోయిన మాత్రాన రసాభ్యుచిత రచన కవిత్వము కాదనడము కురుచి అని అంటున్నాను. అవి కవిత్వానికి ఉండి తీరాలనడము సంకుచిత రుచిని తెలుపులుంది కాని సత్యాన్ని తెలపదంటున్నాను. ఈ వచన పద్యం చదవండి :

## పీటి నకళ్లు

దీపంలాంటి గ్రామంలో
దేదీప్య మానంగా వెలుగుతున్న కిరణాలు
వాళ్ళ రైతులు
భూమ్యాకాశాలు ఆ లోక రవ్వాలు
ఎప్పటి నుంచో ఉదయించుతున్న చంద్రుడు
పిండి ఆరబోసినట్టు వెన్నెల
ఆ పొట్ల తీగె మీద, ఆ అరటియాకు మీద
ఆ గ్రామీణ బాలిక లేత చెక్కిళ్ళ మీద
పంచినా పంచ బడని వెన్నెల్ను
పంచబోకు పట్నే కరెంటు కాంతిలో కలుపబోకు
నాగరికుడా ! ప్రత్తిని పిండి బండికెత్తావు
ప్రత్తి మొక్క నీ వెంట రాదు సుమా
వద్దు ! వద్దు ! ! ఆ రాట్నం, ఆ కదురు,
ఆ ముసలమ్మను కదిలించబోకు
ఆ పల్లె నేటిది కాదు.
పిట్టకు గూడు, చెట్టుకు నీరు
గూటి నుండి పిట్టను తోలకు
పల్లె నుండి రైతును పిలువకు
గూట పిట్ట పొదుగుతుంది
మేడకు అది బెదురుతుంది
కాటుక పిట్టలు త్రాగే తేనెలు
నీ గానుగలో దొరకవు
గోధుమ కంకులు రాలే నేలలు
నీ హద్దుల్లో ఒదుగవు
ఆ రద్దీ ఆబాదర ఒందీ
ఏదో కక్కుర్తికి చేసిన పెండ్లికి
కట్టిన తోరణ పాకుల్లా మందిని
గ్రుచ్చినావు నగరంలో ఒకే దారంతో
వానుకి భూమిని మోస్తున్నది
జాతిని పల్లెలు మోస్తున్నవి,
పల్లె దొసగు పల్లే తీర్చును
పిల్లని ఏడ్పును తల్లే మాన్పును
అతని ఏడ్పు ఢిల్లీ తీర్పుకు
అయ్యో నడాన నవ్వే పోవును
దేశంలో నాలుగు మూలల
పూచిన పువ్వుల్లా పల్లెలు
పల్లెల్లో పెరిగిన మొక్కకు
నగరంలో సాదులు పెట్టకు
అదిగో వస్తున్నది సభ్యత్వపుముంపు
ఆ రైతు ఈ నాగలి ఏమై పోవును
నాగార్జున సాగరాన
కొండ మీది మ్యూజియంలో
పీటికి నకళ్ళు తీసి ఉంచుము.

దీనిలో అలంకారాలు లేవని అనబోవడము లేదు నేను. అలంకారాలు తీసి అవతల పెట్టినా, నరాలను నూళ్ళు మనిపిస్తోందంటాను. కవిగారు (                    ) అలంకారము వాడకుండా ప్రాసేయత్నం చేస్తే అనిబద్ధకవనానికి ఇది ఇంకా చక్కని ఉదాహరణ అయి ఉండును. కవిత్వానికి చైతన్యము రసము. చైతన్యము మన చైతన్యాన్ని ఝుల్లు మనిపిస్తుంది, దానికి ఫలితము ఆర్ద్రతా ఆనందమూను. ఛందస్సూ అలంకారమూ రసాభ్యుచిత రచనకు విజాతీయములు, అదనపు చేర్పులు.

నన్నయగారి ఉదంకుని నాగస్తవమూ, కద్రువ ప్రార్థనా, దేవయాని వేడికోలూ వంటి చోట్ల అలంకారాలుండవు. పెద్దనగారి అగ్నిస్తవము, చెరికత్తెల ఊరడింపులలో అలంకారాలుండవు. తిక్కనగారు రసాభ్యుచిత బంధాలలో అలంకారాలు వాడరు. భావము తీవ్రమైనచోట అలంకారము పూర్తిగా పల్చబడి పోతుంది. నాచన సోమనాథుని 'ఊర్వశీ నరక సంవాదము'లో అలంకారము సామెతగా కుంచించుకుంది. శ్రీనాథుని దమయంతీ నలసంవాదము, పెద్దన వరూధినీ ప్రవర సంవాదమూ, ఎన్నైనా ఉదాహరణ లివ్వవచ్చును, నిరలంకార నిసర్గ కవిత్వ శోభకు. మరి అలంకారముండి తీరాలనడము ఏమన్న మాట ? ఇవన్నీ ఛందో రచనలు కావా అంటారేమో, ముందుగా అలంకారము కవిత్వానికి తప్పనిసరి కాదు అని నిరూపించడమే నా ఆశయము, ఛందస్సుకు రెండో భాగంలో వస్తాను.

ఆధునికుల రచనలలో గురజాడ కథా గేయాలూ, బసవరాజు గోపికా విరహమూ (ఒంటిగా ఉయ్యాల), కవు కొండల

# అలంకారమూ ఛందస్సూ ఉండి తీరాలా ?

'రాళ్ల పడవ', శివ శంకరుల విభ్రమము, వీరశైవుడు, స్పర్శ; వేదుల ఆశా గానమూ, కృష్ణశాస్త్రి 'దారులన్నియు మూసె' 'అవధరింతువు' 'వేయ బోవని తలుపు' నిరలంకార రచనలే. ఎంకి పాటలలో 'యెనక జల్మము' 'ఇంతేనవే సంద్రదము' 'ఆట పాటలలోన' 'ఆరిపేయవే'.... చాలాచాలా ఉన్నాయి నిరలంకార రచనలు, రసమయ రచనలు. రవీంద్రుని రచనలు చాలా మట్టుకు నిరలంకార—, అనిబద్ధ—, రచనలే (ఇంగ్లీషు వచ్చి ప్రపంచ ప్రసిద్ధి గన్న రచనలు గీతములు కావుగదా!) వర్డ్స్వర్త్ ఖండకావ్యాలు, ',We are seven, Alice Fell, Lucy Gray'' వంటివి నిరలంకార రచనలే. రామలింగా రెడ్డిగారు కవిత్వ తత్త్వ విచారములో అలంకారాలు భావావేశానికి —నదీ ప్రవాహానికి బండలు లాగ— ఎలాగ అడ్డు అవుతున్నాయో నిరూపించారు, ఆ దృష్టితో ఒక మారు పరిశీలించడంటున్నాను.

కవిత్వానికి ప్రయోజనము, చదువరికి అనుభవమూ తద్వారా ఆనందమూ కలగడము. అలంకారపు గురి మనస్సుకి, హృదయానికి కాదు. పోతన గారి సరోవర వర్ణన వినండి : ''వైకుంఠ పురంబునుం బోలి శంఖ చక్ర కమలాలంకృతంబై, భాగ్యవంతుని భాగధేయంబునుంబోలి గురుమకర కుళీర మీన మిథునం బై'' ఇక్కడ పోలిక మాటలకే, మాటల అర్థానికి కాదు. పెద్దనగారి ''మరున కొసంగ కాలము. . . .'' కూడా చంద్రోదయ సౌందర్యాన్ని మన కనుభవము చెయ్యడానికి కాదు, మరి తన కల్పనాశక్తిని ప్రదర్శించడానికే. కాళిదాస కవి 'దీపశిఖ' కూడా పోలికలోని చమత్కారాన్ని చూపిస్తుంది గాని సన్నివేశ సౌందర్యాన్ని కాదంటున్నాను. పోలికలోని కృతకత్వము దాన్ని తిరగవేస్తే తెలుస్తుందంటాను. పోలికని తీసుకు రాకుండా చదువరికి వర్ణ్య వస్తు సౌందర్యాన్ని అందించక, కవి పోలికని తెచ్చి అతికి, తన భారాన్ని తగ్గించుకుంటున్నాడు. ప్రబంధ సుందరి అంగాంగ వర్ణనలూ, తలిశెట్టి రామారావు గారి 'ప్రబంధ సుందరి' చిత్రమునూ జ్ఞాపకము చేసుకోండి. అయితే ''ఉపమానాన్ని దాని వికారము దగ్గరకు లాగుటా రెందుకూ ?'' అని మీారడగ వచ్చును. ''ఉపమానములో వికారము ఎంతో కొంత ఉంటుంది'' అని నిరూపించడానికి. కొంచెపు వికారము మట్టుకు ఎందుకూ ? అని. ఈ ఉదాహరణము చిత్తగించండి. పుట్టు గుడ్డి తాతయ్యని సలహా అడిగేరట : 'తాతయ్యా పాపడికి పాలు ఇవ్వవచ్చునా ?' అని. 'పాలు ఎలా గుంటాయి ?' 'గోడలా గుంటాయి,' 'గోడ ఎలా గుంటుంది ?' 'కొంగలా గుంటుంది' 'కొంగ ఎలాగుంటుంది?' 'ఇలాగ ఉంటుంది' అని మోచేతిని వేళ్లనీ కొంగ ఆకారంలో వంచి తాతయ్య చేతికి అందించారట. ''అబ్బో, వద్దు, గొంతు కలో గుచ్చుకుంటుందన్నాడట తాత. ఈ కథకు నీతి ఉన్నది. ''పోలికలో ఒక గుణమే ద్యోతకమవుతుంది. వినేవాడి శక్తి లోపాన్నిబట్టి ఆ గుణము కాక ఇంకొక గుణము ముందుకు తోసుకొచ్చి కనిపించవచ్చును.'' అని నేనంటున్నానుగదా, వినేవాడి శక్తి లోపమే కాదూ, చెప్పేవాడి అజాగ్రత్తవల్ల కూడా వూతము సందర్భాన్ని తప్పవచ్చును, అని. ఇంతమాత్రమే కాదు, మొత్తపు సౌందర్యమును స్ఫురింప జేయవాలసి ఉండగా, ఒకచోటి ఏకదేశ, సౌందర్యానికి పోలిక ఇస్తూపోతే మొత్తపు వర్ణన స్ఫోటకపు మచ్చల ముఖంగా తయారౌతుంది. ఒక్క పోలికే ఇచ్చినా, ఉపమానము ఏకదేశమే అయి, ఉపమేయముయొక్క నిర్దేశిత సౌందర్యాన్ని అనుభవము చెయ్యలేదంటున్నాను. మొత్తపు సౌందర్యాన్ని స్ఫురింపజేయవలసి ఉండగా, ఏకదేశ సౌందర్యాన్ని భూత అద్దము క్రింద పెట్టినట్లు చూపడము బిరుదైన పని కాదంటున్నాను. ''పద్మముఖి, పద్మహస్త, పాదపద్మములు వంటివి సర్వజనాంగీ కృతములై రాణించలేదా'' అంటే, చిర ప్రయోగములలో ఒక సుగుణమును చూపడానికి నిలిచి, ఈ మాటలు తమ నైసర్గికార్థమును నష్టపోయి మైళ్ల రాళ్లవలెనే నిలిచిన వంటాను. సౌందర్యాన్ని ఒక మట్టాన్ని ఎత్తి అందించగల శక్తి వీటికి భూత పూర్వము, ఈనాడు లేదంటున్నాను. ఈమాటలకే కాదుఇలాటి వాటికన్నిటికీ-Honeyed spring, dearest dear వంటి వాటికి వలెనే ఉప యోగాను కూల్యత అనే ఒకనాటి బలమే, కాలక్రమాన్న నెత్తురూ, నరమూ ఎండినందువల్ల నేటి అస్థిపంజరత్వముగా నిలిచిందంటాను. 'బాధాసర్ప దష్టులార', 'ఆలింగ నాసవము' అన్నవి పనికట్టుకుని దూరంగా తోసి ఊరిద్దామన్న యత్నాలు. 'గదిలో చినుకుల వలె చీకట్లు' 'నిశ్శబ్దం కారులోంది.' వెంకి కల్పనలు. 'జీవిత వనాంతర సీమల నశ్రువాహినీ సైకతమందు, హృత్సుమ విషాద దళమ్ముల జిమ్మి పోతివి' 'జీవనగంగా హరిత తటంబున చింతా వట తరు మూలమునన్ ఏలయఘోముఖివై'' వంటివి కాలక్షేపపు కల్పనలు. ''నీవెక్క దలచుకున్న రైలు, ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు. నీ అదర్శాలన్నీ కలల బ్రేకులోనే పారెయ్యాలి. ఈప్సితాలన్నీ ఎక్స్ప్రెసంటాడు టీ.టీ.సీ.'' వంటివి వైచిత్రి సాధించేటివి. వీటివల్ల రసపిపాసి దాహము తీరదు. రసమయ రచనే మానవ హృదయాల్ని చల్లబరుస్తుందీ, ఘొల్లుమనిపిస్తుందీ, మధురిస్తుంది.

అలంకారము కవిగారి కల్పన. వర్ణ్య వస్తువు యొక్క నిసర్గ శోభకాదు. మన అలంకారములు మరొక దేశమూ—, రాష్ట్రమూ—, మండలమూ—, వారికి రుచించక పోవచ్చును. అలాగే కవిత్వములోని అలంకారాలూను. నిసర్గ సరస శోభగల

అలంకారాలూను. నిసర్గరస శోభగల కవిత్వము భాషాంతరీక రించినా శోభ కోల్పోవదు. వైచిత్రి, అలంకారము, శ్లేష, ఉన్న కవిత్వము యొక్క చమత్కారము ప్రాంతీయమే కాగలదు, విశ్వ జనీనము కాలేదు.

ఛందస్సు సంగతీ ఇంతే. వచనములో లేక పద్యములో మాత్రము ఉన్నది ఏమిటీ? నడక. కవిత్వానికి ఆ నడక— లేదా, ఏదో నియమబద్ధమైన నడక ఉండి తీరాలా? ఎందుకనీ? పూర్వులు అవలంబించారు గనకనా? ఇదేమిటో వాదమూ? అసలు పద్యము ఎలాగ ఏర్పడిందీ? అని కొంచెం తర్కిద్దాము. కవులందరూ వాల్మీకిలాగ ''మానిషాద'' అంటూ శోకాన్ని శ్లోకంగా చెప్పేయలేదు సరిగదా వాల్మీకే తన రచననంతటినీ ''మానిషాద'' చెప్పిన ఆ వేగంతో చెప్పలేదు. మాటలకు ఒక వరసను గుర్తించి, అవరసతో తమ భావాల్ని చెప్పారు కవులు. ఆ వరసకి ఉన్న నడక లక్షణమైన ఆకర్షణ సమకూర్చింది పద్యానికి. దీనికి ఒక దశలోరాగము తోడైంది. మూడు విశేషా లలోనూ ఏ విశేషము రాణించినా లాగేస్తుంది ఏనే వారిని. మరి ప్రతీ రచనకీ ఇవన్నీ ఉండి తీరాలనడమేమి వాదమూ?

ఏ వాఙ్మయములోనైనా పాటముందు, పద్యము తరు వాత, ఆతరవాత వచనము. పాటలోని అడుగులు అన్నీ సమాన పొడవుగలవి. మూడేసి అక్షరాలూ, నాలుగేసి, ఐదేసీ, రెండు నాలుగూ, మూడు నాలుగూ, ఎనిమిది, అక్షరాలతో పాటంలోని ఆవృతాలు సాగిపోతాయి. ఇది చాలా సరళమైన ఏర్పాటు, పేర్లు మాత్రం త్రిశ్ర, చతురశ్ర, ఖండ, రూపక, మిశ్ర, ఆది, అంటూ గాంభీర్యం సూచిస్తున్నప్పటికీ, లయ కోసము చేసుకున్నారు తొలి శతాబ్దాల వారు ఈ ఏర్పాటుని.

మన వాఙ్మయంలో పద్యం ఏ రీతిగా ప్రవేశించిందో చక్కగా తెలీదు. జాతులు అనే ఛందో రచనలు లయనిూద నాధారపడినవే. తరువోజ, ద్విపద, సీసము, అయిదేసి లఘువుల ఆవృతాలతో సాగుతాయి. దేశి ఛందములు సమలయనిూద సాగే టివేగాని గణాధారములు కావు.

ఉత్పలమాల, చంపకమాల, శార్దులము, మత్తేభమూ అన్న వృత్తాల్ని చూదాము. గణములకు సాధారణముగా మూడేసి అక్ష రాలుండడమూ, ఆ మూడు అక్షరాలకు కలిపి నాలుగేసి లఘువు లుండడమూ చూస్తే ఈ గణ రచనలుకూడా చతురశ్రగతి రచనలేనేమో అనిపిస్తుంది. విశ్లేషిస్తే తేలేది అదే! ''శ్రీమధు, రాధ, రీవినవె, శేషగి, రీశుడ, నేను, మల్లికా'' అన్న ఉత్పలమాల పాదమూ, కాబట్టే చంపకమాల పాదమూ, చతురశ్రగతి రచనే. కంద పద్యము ''కూరిమి, గలదిన, ములలో, నేరము లేతో, చవెపుడు, నిక్కము, మరియూ,'' అంటూ చతురశ్ర గతితోనే సాగుతుంది. శార్దూల విక్రీడితమూ మత్తేభమూ'' బర్హో, త్తంసవి, లాసి, కున్తలభ, రం'' అంటూ యతివరకూ చతు రశ్రగతీ చివ్వర ఒక గురువుతో సాగుతాయి. యతి అన్నది కాల విరామం కనక పాదం అక్కడ రెండు లఘువుల కాలం ఊపిరి తీసుకున్నదనుకుంటే అంతవరకూ నడిచే గతి చతురశ్ర గతియే అవుతుంది. ''మాధుర్య మగ్నాననం'' అన్న పశ్చాద్భాగము రెండు అయిదు లఘువుల ఆవృతాల తరువాత ఒక గురువుతో పూర్తి అవుతుంది. ఇక్కడ మూడు లఘువుల కాలము విరా మము అని అనుకుంటే మత్తేభ శార్దూలాలు అయిదు ఆవృతాలు చతురశ్ర గతిలోనూ మూడు ఆవృతాలు ఖండ గతిలోనూ ఉన్న వరసల జోడింపులాగ కానవస్తుంది. మొత్తము ఎనిమిది ఆవృతాల కాలము అన్నమాట. కంద పద్యముకూడ ఎనిమిది ఆవృతాం జంటయే. ద్విపద రెండు పాదాలూ మొత్తం ఎని మిది ఆవృతాలే. కవిరాజవిరాజితము ఎనిమిది నాలుగు లఘువుల ఆవృతాలు గంది. గీత పద్యము తకిట, కిటతకిట కిటతకిట తకిట తకిట అంటూ రెండు పాదాలతోనూ అటనెంది ''తకిట తకిట తకిట కిటతకిట కిటతకిట, తకిట తకిట తకిట తకిట తకిట'' అనిన్నీ పదేసి ఆవృతాలలో సాగుతాయి. కనుక పద్యాలుకూడా ఆవృతాల సరములేనంటున్నాను. గణ విభజన వల్ల నడకలో వైవిధ్యము ఉన్నట్లు గోచరము కావడమే కాని మొత్తంమీద లయలో పెద్ద వైవిధ్యమేదీ లేదంటున్నాను. ఈ సత్యాన్ని మన యక్షగాన రచయితలు గుర్తించే ఉండినారూ, ఇది కొత్త నింత ఏమీ కాదంటూన్నాను. యక్షగానాల్లో కందా ర్ధదరువు, ఉత్పలార్ధ—, చంపకార్ధ—, శార్దూలా, మత్తేభా, ఆర్ధ—, గీతార్ధ—, ఆట వెలద్యర్ధ—, ములు రచించడమునకు ఆధారము ఈ పద్యాలన్నిటా పాటంలో ఉపయోగ మౌతుండిన ఆవృతాలు అస్థిపంజరంలాగ ఆ దరువుల తొలి నడకని నిల బెట్టుతూండడమేనంటున్నాను. పద్యాల రకాలు ఎన్నో ఉన్న ప్పటికీ మానవ స్వభావ అనుకూలమైన చతురశ్ర, ఖండ, త్రిశ్ర గతుల ఆవృతాలు ఉండుట వల్లనే పైన విశ్లేషించిన పద్యాలకు విశేషోపయోగము కనబడుతోందంటున్నాను.

రగడలు అనేక గతులని ఛందో గ్రంథాలలో వివరించ బడి ఉంటాయి. హయగతి రగడ, వృషభగతి రగడ ద్విరదగతి రగడ అంటూ, ఇవన్నీ గణ ఛందస్సునుబట్టి చూస్తే బహు క్లిష్టములు, వైవిధ్యము చాలా ఉంటుంది వాటిలో. ఈ రగడ లకే ఆవృత విశ్లేషము చేస్తే కడవంత గుమ్మడికాయా కత్తి పీటకు లోకువ' అన్నట్లు వాటి ఛందస్సు చక్కగా తెగివిడి పోతుంది. జానపద గేయముల ఛందస్సును వరించేవట్లు వ్యాకర ణాలంకార విద్వాంసులు అప్ప కవి వంటివారు పడే తంటాలు మనకి అపరిచితములు కావు. ఆ చిక్కులు ఎందుకు వచ్చాయో

ఆలోచిస్తే, మాత్రాఛ్ఛందస్సులు పద్యాలుగా మారినప్పుడు అన్నిరకాలుగా ఎలాగు మారతాయో సులువుగా అన్వయమై పోతుంది. మాత్రా ఛందస్సులోని నాలుగు లఘువుల ఆవృతము పద్య ఛందస్సులో, భగణము, జగణము, సగణము, నలము అన్న నాలుగింటిలో ఏదైనా కాగలదు. అక్కడిది ఒకటి ఇక్కడ నాలుగై కంద పద్యపు ఛందస్సును పద్య ఛాందసులు వర్ణించిన వైవిధ్యమును పరిశీలిస్తే చతురశ్ర గతిలో నడిచే గతినే, అక్షరాల మార్పుని లెక్క తీసుకుంటే ఎంత చిత్రముగా వర్ణించవచ్చునో తెలుస్తుంది. అంత దూరము పోనేల? ఉత్పలమాలలోని తొలి అక్షరము గురువైతే ''భరన భభరవ'' ఆ అక్షరమే రెండు లఘువులైతే ''నజ భజ జజర'', ఎందుకీ తేడాకు భేషజము చెప్పండి? ఈ మహా పద్యాల రచనకు పొరపాటు జరిగితే బెడిసి కొట్టించే శక్తులున్నాయని కల్పనలు చేసి పద్యాలతో ఆడుకునే మహాశక్తిని తామే గుత్తగొనడానికా? ఇంకెందుకేనేనా?

ఏతావాతా తేలేదిది : పద్య ఛందస్సు కైలాస పర్వతమునుంచి దిగివచ్చిన పూత గంగా ప్రవాహమేమీకాదు. నర మానవుడు పాడిన పాటల తీరును చూచి వాటిలో ఒక వరుసను పట్టి నరమానవులు ఏర్పరచినట్టిదే. ఈ పద్యాలను అనుసరించిన వారు పద కవుల్ని హేళనచేసేవారుట, ఇంతోటి మహాశక్తి వారికి లేకపోయిందని! తిక్కనగారంతటి 'కవిబ్రహ్మ' గారికి కూడా నిర్వచన రచన గొప్పదనిపించింది తొలినాటి రాజసపు రోజులలో.

సంస్కృతములోని వృత్తాల్ని ఎరువుతెచ్చుకుంటూ, తెలుగువారు సంస్కృతములో ఉన్న విరామాన్ని తీసేసి లేని అక్షరయతి, ప్రాసలను ప్రవేశపెట్టారు. అంటే వృత్త రచన 'మే డ్డిఫికల్టు' అన్నమాట. వీటన్నిటికీ విడువరాని పావిత్ర్యము నంటగట్టడమెందుకో?

తెలుగులో మనమెరిగినవే ప్రబంధాలూ పద్య కావ్యాలూ ఎన్నో ఉన్నాయి. ప్రధానమైన రసానుభవమును గాలికి వదలి, అష్టాదశవర్ణనలతో, అలంకారపు గలగలతో ఏదో పుస్తకము వ్రాయాడానికని— కూచిమంచి తిమ్మనకవి రసికజన మనోభిరామము వంటి — ఏదో కథతో ప్రబంధాలు వ్రాశారు అనేకులు. వాటిని మనము వినము సభలలోగాని, విమర్శలలో గాని. పద్యమాత్ర రచనలే అవి. మరి అన్ని చప్పని కావ్యముల ఆవిర్భావానికి పద్యమే కవిత్వమనే అపోహయేగదా కారణము? మనమా అపోహను ఇంకా పొడిగించడమేల? అశు కవిత్వము, బంధ కవిత్వము, గర్భ కవిత్వము, శత ఘంటకవనము అనే రచనలన్నిటికీ పద్యమే కదా కవనము' అన్న బిరుదును తగిలించినది? పద్య మాత్రము కవిత్వము కాగలదా? ''ఆంధ్రపత్రిక ఇక్కడ అమ్మబడును,'' ''అన్ని రకముల మందులు అమ్మబడును'' ''స్పైరు నువ్వుల చాయపప్పు నూనె'' చిలకమర్తిలక్ష్మీనరసింహ మూర్తి'' ''వావిలాల వాసుదేవశాస్త్రి'' ఇవి కవిత్వాలా? కాదు. పద్యాలలో ఆయుర్వేదము, అలంకారశాస్త్రము, వేదాంతము, వ్యాకరణము, పద నిఘంటువులు, రచిస్తే అవి కావ్యాలా? పంచ రత్నాలూ ఇత్యాదులన్నీ కవిత్వాలా? వీటి కవిత్వపు చలామణి మన రుచినికిందకి దిగలాగింది. ఇంకా లాగుతున్నది. మరి పద్యము మీద ఎందుకని మోజు?

# అనిబద్ధ కవిత్వము : ప్రశ్నోత్తరాలు

1. ''అనిబద్ధ కవిత్వము అంటే ఎలాటి కవిత్వమండీ?''

''నియమాలచేత బద్ధమైన కవిత్వము నిబద్ధ కవిత్వము, ఏ నియమాల చేతనూ బద్ధము కాని కవిత్వము అనిబద్ధ కవిత్వము''.

* * * *

2. ''నియమాలంటే ఏవని మీ ఉద్దేశము ?'?

''ఛందో—, వ్యాకరణ—, అలంకార—, కవి సమయ—, నియమాలు. యతి ప్రాసలు ఛందో నియమాలే.''

* * * *

3. ''ఏ నియమమూ లేని విశృంఖలా వ్యాపారము సమాజానికే అపాయకారిగదా, మరి సారస్వతానికి గుణము కాగలదంటారా ?''

''శృంఖలలు సారస్వతానికి ఉపకారులు కాగలవని మీరంటారా ? సమాజములో ప్రతీవారూ స్వంత లాభం కొంత మానుకు, పొరుగువాడికి తోడ్పడాలి. ఎవరి లాభం వారు చూసుకుంటూ పోవడము విశృంఖలా వృత్తి. అది సమాజానికి అపాయకారి. సారస్వతము విరామ సమయాన్ని ఆనందదాయకము చేసే యత్నము కదా ? మరి అది ఇలాగ ఉండాలి, అలాగ ఉండాలి అని నియమించడమేల ? సమాజానికి అపాయకారిగా పారదారికా శృంగారాన్ని అగ్గించే రచనలైతే గర్హించవలసినదే తిట్టు పత్రికలూ, బూతు పత్రికలూ వంటి వాటిని. నిరపాయకర రచనలకు నియమా లెందుకు ? మీరు విశృంఖలా వ్యాపారము అన్నది ఇతరులకు బాధ కలిగించే పనుల పట్లనే కాని తక్కిన వాటికి చెల్లదుకదా ?''

* * * *

4. "అయితే అందరూ కవిత్వము వ్రాసేస్తారు. మంచీ చెడ్డా, పేడా బెల్లమూ ఏకమైపోతాయి."

"వ్యాకరణయుక్తంగా వ్రాయనక్కరలేదూ, వ్యవహార భాషలో వ్రాయవచ్చును అని రామమూర్తి పంతులుగారు ఘోషించినప్పుడూ ఇలాంటి 'అపాయాన్నే' సూచించారు కొందరు, అడ్డమైనవాళ్ళూ వ్రాయడము ప్రారంభిస్తారు, అంతా కలగాపులగము అయిపోతుందని. అయితే వ్రాసేవాళ్ళు అనంత మయిపోలేదు, పత్రికలు కంగాళీ అయిపోనూ లేదు. ఈనాడు వచన గేయాలనే పేరుతో రచనలు పత్రికలలోనూ, సంపుటాలలోనూ చాలా వస్తున్నాయి. అయితే బాగున్నవి ఏ కొద్దో, వేళ్ళమీద లెక్కపెట్టవచ్చును. కనక నియమాల్ని సడలించినంతమాత్రాన 'కవిత్వము' పెచ్చు పెరిగిపోదు. అచ్చయిన కవిత్వమంతా నిలిచి అలరించగలదా ? కాక, పద్యాలు మాత్రము అడ్డమైనవాళ్ళంతా వ్రాయలేదా ? నిలిచినవెన్ని, అన్నీ నిలిచాయా ?"

*　　*　　*　　*

5. "యతిప్రాసలతో, పద్య ఛందస్సులో, పూర్వ కవులు వేలకొద్దీ పద్యాలలో కావ్యాలు రచించలేదా ? అలాగ వ్రాయడముచేతగాక ఛందస్సు పోవాలీ, అలంకారము అక్కర్లేదూ, అని ఆధునికులు దేవుళ్ళాడుతున్నారు, అన్న విమర్శ వస్తే మీరేమంటారూ ?"

"వారి నమ్మకము చొప్పున పూర్వులు వారికి ఇష్టమైనట్లు వ్రాశారు. మా నమ్మకము చొప్పున మేము మా యిష్టము వచ్చినట్లు వ్రాస్తాము, తగ వెందుకూ ? అంటారు ఆధునికులు. మేము వారిలాగే ఎందుకు వ్రాయాలీ ? వ్యాసాలూ, చిన్న కథలూ, నాటికలూ, నాటకాలూ వారు వ్రాయలేదే, మరి మేమూ వ్రాయకూడ దంటారా ? ....ఇక వారు చేసిన కసరత్తులు మేము చేయలేదని మామీద కోప మెందుకూ ? వారి కెదురుగా విమర్శించే రసికులు లేరు. ఏ పల్లెలోనో కూర్చుని తమ నేర్పుని కుప్పలు పెట్టారు వారు మా పరిస్థితులు వేరు—తెల్లవారేసరికి వేలకొద్దీ పాఠకుల ముందు పడతాయి మా రచనలు దేవుడి ముందు పాడుకునే గాయకుల్లాగు. వారు వారి భావనా బలాన్నే ప్రదర్శించారు గాని గురి చూచి రచించలేదు. మాకు అలా కుదరదు. మాకున్న వడ పోతలు వారికి లేవు. మా పరిస్థితులు వేరు. మేము వారిలాగే ఎందుకు రాయాలీ ? మా యిష్టము వచ్చినట్టు రాస్తాము. బాగుందీ, బాగులేదు అని అనండి. వారిలాగు రాయలేదు, వీరిలాగు రాయలేదు అని పోలికలేల ? యతిప్రాసలు పూర్వులు తమ నెత్తిమీద పెట్టుకున్న బరువులు. ప్రస్తరలకు కాబోలు నాలుగు యతులు. ఎన్ని ఎక్కువుంటే అంత గొప్పా ? మాకు వారి నియమాలు అక్కరలేదు. 'గడియకు నూరు పద్యములు గంటములేక రచించే డాబులు మాకు వద్దు. మేము గంటము అతో వ్రాయము, కాగితాలమీద పేనాలతో వ్రాస్తాము. గంటంతో తాటాకుమీద వ్రాస్తేనే కవిత్వమా ? యతి ప్రాసలూ అంతే. మా దృష్టిలో ఆ శబ్దాలంకారాలు ఉండి తీరాలని నియమ మేమిటి ? పూర్వులు పావకోళ్ళమీద నడిచారు. గణ ఛందస్సుతో పద్యాలు రాశారు. మేము పావకోళ్ళ మీదే నడిచి వారిలాగే పద్యాలు రాయాలా ? ఎందుకనీ ? మేము వ్రాసే తీరుని భూతకాలం నిర్ణయించాలా ? మేము పూర్వులు చేసే పనులనీ చేసి చూపించాలా ? అలాగ అనే రసికుల మెప్పు మాకు అక్కరలేదు. మీరు అటుతిరిగి కూర్చుని అవి చదువుకొండి, అంటారు నవీనులు."

6 "ఈనాడు కుప్పలు తెప్పలుగా పుస్తకాలలోనూ, పత్రికల్లోనూ, సంపుటాలలోనూ, వచన పద్యాలో, గేయాలో కావ్యాలో, ఏవో వస్తున్నాయి అవేనా మీ అనిబద్ధ కవిత్వాలంటే ?"

అవి అనిబద్ధ రచనలు అన్నది నిజము మాట. కవిత్వమా ? కాదా ? అన్నది వేరే మాట. కవిత్వమో కాదో రసికులు, విమర్శకులు నిర్ణయింపండి. అనుభవాల్ని రేకెత్తించే పాత అనుభవాన్నే కొత్తగా స్ఫురింపచేసే, కొత్త అనుభవాన్నిచ్చే రచనల్ని కవిత్వ మంటాను నేను. అనిబద్ధంగా రాస్తే అనిబద్ధమే, దానిలో కవిత్వ ముంటేనే అది అనిబద్ధ కవిత్వ మౌతుంది. చేతికి వచ్చినట్లు వ్రాస్తే అది కవిత్వ మెలా గౌతుందీ ?"

7 'కవిత్వము అనిబద్ధమే అయిఉండాలా ? నిబద్ధమైతే అది కవిత్వము కాకపోతుందా ?'

'కవిత్వము నిబద్ధమైనా అనిబద్ధమైనా కవిత్వమే. ఎంతవరకూ నిబద్ధమో అంతవరకూ ఆ కవిత్వము నైసర్గిక సౌందర్యాన్ని జార విడిచిందన్నమాటా కృతక సౌందర్యాన్ని కప్పుకున్నదన్నమాటానూ. పద్యాన్ని పాడితే వచ్చే సౌందర్యమే కవితానిధి కాదని గ్రహించలేనివా రెందరో ! మరి నడక (అంటే ఛందస్సు) వల్లా, (కవిగారు అతిశయోక్తి చేసో ఉత్ప్రేక్షించో కట్టిన నగని తీసుకొచ్చి అమరిస్తే.) కవిగారి భావనవల్లా వర్ణ్య వస్తువుని ఆవరించిన ఆకర్షణ కృతకమని గుర్తించేవా రెంతమంది ఉండగలరూ ? కనక సాలంకార కవనమూ, ఛందోబద్ధమైన రచనా కవిత్వముగా చలామణి అయిపోతాయి. అవి నిబద్ధములని రసికులు ఎంత త్వరగా గ్రహిస్తే అంత మేలు."

# అనిబద్ధ కవిత్వము: ప్రశ్నోత్తరాలు

8. “ఛందస్సూ, అలంకారమూ కవిత్వానికి అందము తీసుకు రావంటారా ?”

“మీరంటూన్న ‘అందము’ కృతకము, సహజము కాదంటున్నాను. రసఘట్టాలలో అలంకారాలు ప్రయోగిస్తే రసాభాసము అవుతుందని అందరికీ తెలుసు. రామలింగారెడ్డిగారి బోధ అంతా అదే. మరి, శోకము శ్లోకమైనది గదా అని ఆ శ్లోకపు వరుసను పట్టి కావ్యాలకు కావ్యాలు రచిస్తే, వాటి శరీరమంతా భావావేశంతో దీపిస్తుందా ? సుందర వస్తువుని విశ్లేషించి, ఆ ఇటుకలతో సౌందర్యము నిర్మించడము సాధ్యమా ? చైతన్య వంతుడైన కవి తన సౌందర్య చైతన్యానికి అనుకూలమైన వరసలో రచించిచాలిగాని ఈ వరసలో రచించాలని ఉద్యమించడము రచనని నిబద్ధము చెయ్యడము కాదా ? మరీ, వాల్మీకి శోకము పుట్టుకే ఆ వరసలో బైటపడింది కదా మరి ఆనందమూ, భక్తీ, జుగుప్సా వంటివి ఆ వరసలోనే సహజంగా వస్తాయా ? సామెతలు గమనించండి. వాటిలో యతీ ప్రాసా ఇన్నో అక్షరము రావాలని నియమమున్నదా ? నానుడులలో యతులు ఉండనే ఉండవు కొన్నిచోట్ల. వాటి అర్థగౌరవమూ అనుభవ సాంద్రతా కాక యతి ప్రాసలా వాటిని నిలబెట్టుతూన్నదీ ? ఛందస్సుని ట్రేడ్ మార్కుగా ఉపయోగించే కర్మం కవికేల ? తన ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ, ఇతరుల కిద్దామని కవి రచన కుపక్రమించగానే ఈ కట్లతోనే ఇవ్వాలన్న నియమమెందుకూ ? ఆ నియమము కవిత్వానికి మొదటి అటంకము కాదూ ?”

9. “అయితే దేశదేశాల కవులు కవిత్వాన్ని ఛందోబద్ధంగానే రచించా రెందుకూ ?”

“సంప్రదాయాన్ని అతిక్రమించడము ఇష్టములేక. ఈ ప్రశ్నని వెల్లకిల బెట్టి చూపిస్తాయి మరో రెండు ప్రశ్నలు, వాటిని వేస్తాను. (1) మన తొలి కవులు ఏ ఏడో ఎనిమిదో శతాబ్దాలలోనో రచన ప్రారంభించారు గదా, స్వంత రచన ప్రారంభించారు గదా, స్వంత రచన చెయ్యక, భాషాంతరీకరణాలే చేశారేమీ ? (2) ప్రతీపద్య రకానికీ దానికే విశిష్టమైన నడక ఉన్నది కదా, చదవమనగానే ఆబాల గోపాలము ఆ నడకని ముంచేసే రాగముతో పద్యాన్ని కప్పి ‘చదువు’తారేమీ? ఇలాటి ప్రశ్నలు ఎన్నైనా వస్తాయి.... సంప్రదాయం ఏనుగు కాళ్లతో సాగిపోతుంది... దానిని ప్రశ్న వెయ్యడము మాట సటుంచి కొంచెము మార్పునెంచిన వారు కూడా సంప్రదాయానుసారుల “ముదివిటులు, విధవలంజలు, పద కవితలు” అన్న తిట్లకు గురియైనారు. పద కవిత్వానికి లోటేమిటీ, యతి ప్రాసలుగార్లున్నారు, నాట్యానికి ఆధారమైన సమలయ ఉన్నది ! నియమాలు కష్టంగా లేవని గదా పదకవిత్వాన్ని కనీసము చేశారు ? వచనము అసలే లేకుండా పద్యాలతోనే వ్రాయడము ఒక గొప్పదనము అయి పోయింది. గడియకు నూఱు పద్యములు గంటము లేక రచించే నేర్పుని టప్పాలు కొట్టడానికి కవులు పద్యాలు రచిస్తే వాటిలో లేని సంగీత నాట్య గుణ సంపన్నతని కనిపెట్టుకుంటూ జిలుగు విమర్శలు చేస్తున్నారు పండితులు.”

10. “ఛందస్సులో సంగీత నాట్యగుణ సంపన్నత లేదంటారా ?”

“సంగీతము స్వరాలకు సంబంధించినది. భాషలో స్వరాలుండవు. మీరు పాడితే తప్ప వచనము కూడా— మీకు ఇష్టమైతే— పాడుకుంటే స్వరాలు వస్తాయి. కనక, పద్యంలోని స్వరాలు తెచ్చి పెట్టుకున్నట్టివి. ఇంగ్లీషు పద్యాలు సభా వేదికల నుండి పాడరు. మీరు తెలుగుపద్యాన్ని పాడుతున్నారు. అది మీ ఇష్టము. పద్యంలో రాగం లేదు, కవికి రాగము రానక్కరలేదు. పద్యాన్ని పాడేస్తే దానిలో సంగీతమున్నదనుకుంటే ఎవరేం చెయ్యగలరు ? పద్యానికీ గద్యానికీ తేడా గణముల వరుస. పొడుగు అడుగు పొట్టి అడుగూ వరసగా వేసుకుంటూ సాగుతుంది పద్యము. ఇది కాలవిభాగమే కాని నాద విభాగము కాదు. ఇక యతిప్రాసలు మళ్లీ వస్తూండడమువల్ల పునరుచ్చారణవల్ల కలిగే సంతుష్టి ఉంటుంది కాని సంగీతము ఏమీ ప్రవేశించదు కవనంలో. చిన్న పిల్లలు ‘పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మ కొడకా’ అన్న కథలో మళ్లీమళ్లీ వచ్చే మాటల్ని ఆసక్తితో వింటారూ, జానపదులు ‘తందాన రాజనందానా’ ‘హరిహరీ నారాయణాది నారాయణా కరుణించి మమ్మేలు కమలలోచనుడా’ అన్న పల్లవిని ఎన్నిమార్లు వచ్చినా సహిస్తారు. రసికులలో ఈ తత్వము అనుప్రాసాసక్తిగా పరిణమించిందంటాను. “అడిగెదనని కడువడి జను నడిగిన దను మగుడ నుడువడని నడయుడుగున్” లోని ‘డ’కారమూ, “కరి దిగుచు మకరి సరసికి, కరి దరికిని మకరి దిగుచు గరకరి బెరయున్” లోని ‘ర’ కారమూ. “ఏలా లతాజాల డోలాసమాలోల బాలామణీ గాన భాసురములు” లోని లకారమూ మళ్లీ మళ్లీ వచ్చే గుణము వల్లనే సంతుష్టపరుస్తాయి గాని వాటి నాదము వల్ల కానేకాదు. అను ప్రాసములో ఉన్నట్టిది నాదమూ సంగీతమూ కాదు, మరి పునరావృత్తి మాత్రమే.

ఇక నాట్యము సంగతి. లయ, సృష్టిలోనే ఉన్నది. సూర్య చంద్రుల ఉదయాస్తమయాలలో, ఋతువుల వరుసలో జీవిత పుటల వాట్లలో, నాట్యములో కూడా ఉంది. పద్యములోనూ ఉంది. మరి “పద్యములో నాట్యగుణ సంపద ఉన్నది, ప్రకృతి గుణ సంపద ఉన్నది, జీవిత గుణ సంపద ఉన్నది” అనడము ఎలాంటిదీ ? పద్యములోని పాదములు నాలుగూ ఒక లాగే ఉండి వరసగా వస్తూ ఉండడము పునరావృత్తి. పాదములోని గణములు గురు లఘువులను పేర్చుటలో— ఛిద్రములైన ఆవృతములు. ఆవృతముల సమలయ విరిచారూ, ఒక ఆవృతము అయిపోగానే తరవాతి దానితో టాక్కి పెట్టారు గుర్వక్షరములతో. ఈ మార్పువల్ల ఉత్పలమాం

చంపకమాల అనే చతురశ్రగతి ఆ వృత్తాల మాలలు ఆ చతురశ్రగతి విరిగి, సమ పూసల దండలుగా కాక పొడుగూ పొట్టి పూసల దండలుగా తీరినవి. వీటిలో అంతర్వాహినిగా నడిచే చతురశ్రగతి పద్యార్థదరువులలో తప్ప సభాపతనాలలో— రాగము ప్రవేశించుట వల్ల— స్ఫురించడమే లేదు. మరి నాట్య గుణ సంపదను మెచ్చుకునే వారు దేనిని చూసి మురిసి ... ?''

11. ''ఆంగ్ల కవులూ విమర్శకులూ వ్రాసిన వ్యాసాలలో 'The poet sings' అంటూ, 'The Music of a Verse' అంటూ ఉన్న మాటలు ఉత్తుత్తివేనా ?''

''లయకూ, తూగుడుకూ, అక్షరాను ప్రాసమునకూ వారు Music అనే మాట వ్యవహరించారు. కాని పద్యాన్ని పాడరు వారు. మనము పద్యము చదవడము పేరుతో కూన రాగాలు తీస్తాము. వారి వెర్రివారిదీ, మన వెర్రిమనదీనూ. రెండూ వెర్రులు మాత్రమే.''

12. ''అదుగో, ఆ లయ, తూగుదూ, అనుప్రాసమూ ఉంటే ఆ రచన అవి లేనప్పటి కంటె బాగుండదదూ ?''

''ఏమిటో ప్రశ్నలో చెప్పేను. ఆ అందమన్నది కృతక మని. నిసర్గమైన భావము ఛందస్సులో పోతపోస్తే కొత్త—, కృతకపు—, ఆటంకమేనా కలుగుతుందీ, ఆ బద్ధపు మెఱుగురానేనా వస్తుంది. ఈ ఛందస్సు కుళ్లాయీ, అలంకారపు దుస్తులు లేకపోతేనేమీ ? అని. అలవాటయింది కనకనా ?''

13. 'అంటే నిసర్గమైన భావము అలాగే ఇచ్చేయాలంటారా ?'

'అలాగే ఇచ్చేస్తే అది ప్రకృతే అవుతుంది, కళ అవదు. ఏ రీతిగా ఇస్తే చదువరికి మీ భావము అందుతుందో చూసుకుని అలాగ ఇవ్వాలి. ఈ ఛందస్సులో ఇవ్వాలి. అనడమూ 'ఈ అందము ఆ అందము లాగ ఉన్నదని' చెప్పాలనడమూ ఆటంకాలంటాను.''

14. ''అలాంటి అనిబద్ధకవిత్వము ఎవరేనా రచిస్తున్నారా ?''

''రవీంద్రుడు చాలాచాలా రచించాడు. వాటిలో, స్ఫురించిన అందాన్ని అనుభవించక, ఈ రచనలో ఏమిటుందీ అని పండిత మనస్కులు అలంకారాల కోసము వెతికేరు. కొందరు రవీంద్రుని రచనలు నచ్చలేదన్నారు.

రవీంద్రుని రచనలు ప్రపంచానికి అనిబద్ధంగా, ఇంగ్లీషులో అందేయి. కొందరు బంగాళీ భాషలో ఆ రచనలు గీతాలే అని జ్ఞాపకము చేస్తున్నారు. మనకూ, ప్రపంచానికీ అందిన రూపాన్ని గురించే నేను చెప్పేది. ఆ రూపాన్ని రవీంద్రుడే తీర్చాడు— చాలా మట్టుకు. మన మెరగని బంగాళీ రూపము గొడవ మనకేల.

తెలుగులో దేవరకొండ బాలగంగాధర తిలక్ వ్రాస్తున్నది చాలా మట్టుకు అనిబద్ధము.''

15. ''చాలా మట్టుకు అని కొంత ముఖావికము చేస్తున్నారేం ?''

''మనవి చేస్తున్నా. మాటకి ఆయన 'నేను కాని నేను'లో వ్రాశారు 'నా గది అవతల ఎవరో నవ్వుని నొక్కిపట్టిన ధ్వని నీళ్లను కంచినట్లు' అని. నీళ్లని కంచిన ధ్వని, నొక్కి పట్టడము లాంటిది ఎలా గౌతుందో నాకు తెలియులేదు. ఆయన అనుభవంలో నీళ్లను కంచిన ధ్వని ఆయన ఊహించిన లేక అనుభవించిన నొక్కిపట్టిన నవ్వుని పోలి ఉండవచ్చు. ఈ వైయక్తిక అనుభవాన్ని అందరిదీనీ అన్నట్లు వాడేరు ఆయన. ఈ పోలిక అనిబద్ధము కాదంటాను. అలాటిదే 'రోడసిరో చీకటిలో అంతర్విత సంగీతం తాలూకు ప్రులి చుట్టుకొన్నట్టు' కూడాను. వారే 'విరహోత్కంఠితలో' 'నవ్వడైతే చాలు ప్రభూ, రివ్వున స్మరశరం హృదయాన్ని దూసుక్కపోలేంది' అన్నారు. 'స్మరశరం' అంటే నిశ్చితమైన అర్థం లేదు. ఇక్కడ సంప్రదాయం పల్చన చేసింది రచనని. ''త్వరమాణమైనా తనుపు స్వీయ యౌవన భారాన తడబడి పోతున్న' దన్నారు. 'స్వీయ' సంప్రదాయ రచన పట్టుకొచ్చి పడవేసిన పర్వతము. 'అనన్య దతిశయోక్తి శిలమైన నాతనూ కావ్యాన్ని' అన్నది వైచిత్రి కోసము యత్నించి వేసిన వల. ''ఏ కాంత కుంత నిహతమ్ము రస్త్రైక మద్భావనా శకుంతమ్ము'' పురాణ కల్పనా శాఖ విరిగి పడ్డట్టుంది.''

16. ''ఈ అనిబద్ధకవనాలు నిలుస్తాయా చిరకాలం?'',

''ఎందుకు నిలవవూ ? పద్యాలు కట్టుబడిలో ఉంటాయి గనక జ్ఞాపకముంచుకోవడము కొంచెము కష్టము. అయితేనేం ? మునపటి రోజుల తాలూకు పుస్తకాలు కాదుగా ఈ నాడూ ? అచ్చుపడి అంతటా లభిస్తాయి. ఇంగ్లీషు కవిత్వము మనకు అంతగా జ్ఞాపకము లేక పోయినా కావాలన్నప్పుడు తీసి చూసుకుంటాము. కదా ?''

17. ''ఇంగ్లీషువారూ, ఫ్రెంచివారూ ఈ అనిబద్ధ కవనాన్ని ఆదరిస్తారా ?''

''వారు ఆదరించాలని రాయడము లేదు మన కవులు. కాని నా విశ్వాసము ఈ కవనము విశ్వ సాహిత్యంలోనికి వెన్నెల లాగ వ్యాపిస్తుందని. ఇది దేశ కాలానబద్ధం, సంప్రదాయానబద్ధం. ఒక జాతికి ప్రత్యేకమైన నమ్మకాలూ, ఉత్ప్రేక్షలూ, ఈ కవిత్వంలో ఉండవు. తెలుగుకవి ప్రపంచాన్ని వినమంటూ కోయిల గొంతు విప్పుతున్నాడు అనిబద్ధ కవిత్వములో. ఎవరి కోసము వింటుందీ ప్రపంచము ?''

# కవిత్వాని అలంకారమూ ఛందస్సూ ఉండి తీరాలా ?

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

చిరకాలంగా కవిత్వానికి అలంకార సంపదను సమకూర్చి పెట్టుతున్నారు కవులు. ఆ అలంకారములను గుర్తించి మెచ్చుకుంటున్నారు చదువరులు. ఛందస్సులాగే అలంకారము కవిత్వానికి ఉండి తీరాలనే నమ్మకము చాలా చాలా మందికి ఉన్నది. ఇంకా మాట్లాడితే "కవిత్వానికి ఛందస్సు లేకపోతే మానె, దాన్ని గద్య కవిత్వ మంటాము, కాని అలంకారము లేకపోతే ఎలాగా ?" అనే వారు చాలా మంది ఉంటారు. ఆలంకారికులు— ముమ్మటాచార్యులు ఒకరని జ్ఞాపకము— అలంకారములేనిదే కవిత్వమే లేదని వాదించిన వారూ ఉన్నారు.

'అలంకారము కవిత్వానికి అందము సమకూరుస్తుంది' అని వాదిస్తే అది పూర్తి సత్యము కాదు. అది బంధమూ సంకెలా కూడా కాగల'దని చేరిస్తేనే పూర్తి సత్య మవుతుంది. 'అలంకారము' అంటేనే "అది పై నించి తెచ్చి పెట్టినట్టిది" అని స్ఫురిస్తుంది. మరి బాగూ భ్రష్టూ రెండూ కాక బాగోకటే ఎలాగ ఉండగలదూ ? ఈ ఊహ కొత్తదేమీ కాదు. ఉపమాలంకారము వంటి సరళాతి సరళాలంకారము పట్లనే 'నీచోపమ' ప్రవేశించ గలదని ఆలంకారికులు గుర్తించి చెప్పినారు. అయితే అన్ని అలంకారాలకూ ఉచ్చ—, నీచ—,ములను వివరించినారు కారు; 'గ్రంథ విస్తరభీతి'తోనని నే నంటాను.

అయితే ఇక్కడ నా పని అలంకార శాస్త్ర విమర్శన కాదు. ఆ శాస్త్రము వదలిపెట్టిన పై వస్తువును ఇంచుకంత స్పృశిస్తా అది అలంకారముల గౌరవానికి కాక వాటి అపకీర్తికే దోహదమైనదని సూచించడమే. అదిన్నీ ఎందుకనీ ? అలంకారాల గలగలలూ, బరువూ, కవిత్వపు నిసర్గ సౌందర్యానికి అక్కరలేని ఆటంకాలని సూచించడానికి. రవీంద్రుడన్నాడు ఒక చోట. "నా గీతము అలంకారాలన్నిటినీ తీసి పెట్టేసింది, వాటి గలగలలు నీ గుసగుసల్ని వినపడ నియ్యవు" అని. ఈ నిజము పరిశీలించండంటున్నాను.

మన సంప్రదాయములో 'వాద బలము' 'వాది బలము' అని రెండు పురాతన గజకచ్ఛ పాలున్నాయి. ఆ రెండింటిలో ఏది మిన్న ? అన్న ప్రశ్నకు తర తరాలలో వచ్చిన మేధావులు ఆచరణ పూర్వకంగా అటూ ఇటూ సమాధానా లిచ్చారు. అయితే జరిగిన వైషమ్య మేమిటంటే, వర్తమాన మవుతున్న వాదానికి అనుకూలంగా నిలిచి సాక్ష్యాన్ని విశ్లేషించి, దాన్ని ఊపి, పుట్టకీట్లు కదల్చి ఆ వాదాన్ని మార్చిన మేధావుల దారిలో ప్రతీ ఒక్కరూపడి పిడి వాదము చేయడము. వీరు సాక్ష్యాన్ని బట్టి తమ తీర్మానాలు ఏర్పరుచుకోరు. తీర్మానము ముందు చేసేసుకుంటారూ తరవాత తమకు అడ్డువచ్చిన సాక్ష్యాన్ని కాదనడమో, మడత పెట్టడమో ప్రారంభిస్తారు. "అలంకారము లేని కవిత్వమే ఉండదు" అని వాదించిన ఆలంకారికులు ఆ బృందములోని వారంటాను నేను. అలంకారము లేని నిసర్గ రస శోభితమైన రచనను పట్టి, కిందా మీదా పెట్టి, "అదిగో ఆ మూల నుంచి అలంకారము తొంగి చూస్తూనే ఉంది" అంటూ రాద్ధాంతము చేస్తారు వారు. వాద ప్రతి వాదాలు సాక్ష్యము మీద ఆధార పడాలి కాని ఏదో విధంగా ప్రతికూల సాక్ష్యానికి కాళ్ళు కొట్టేద్దామన్న యత్నము మీద నాధారపడరాదు. ఉభయ భారతీదేవి ఆచార్య శంకరులను ఎన్నాళ్ళు తప్పించుకో గలిగిందీ ?

నే నిప్పుడు చెప్పబోయేది, ''కవిత్వానికి అలంకార రచన అత్యవసరము కానే కాదు'' అని. ఛందస్సు అత్యవసరము కాదు, అలాగే అలంకారమూను. ''ఛందస్సూ అలంకారమూ ఉన్న రచనలు భ్రష్టములా'' అని అడుగుతారేమో ? నేనా మాట అనలేదు, అనబోను. ''ఛందస్సూ, అలంకారమూ లేక పోయిన మాత్రాన రసాభ్యుచిత రచన కవిత్వము కాదనడము కురుచి అని అంటున్నాను. అవి కవిత్వానికి ఉండి తీరాలనడము సంకుచిత రుచిని తెలుపుతుంది కాని సర్వాన్ని తెలపదంటున్నాను. ఈ వచన పద్యం చదవండి :

### నీటికి నకళ్లు

దీపంలాంటి గ్రామంలో
దేదీప్య మానంగా వెలుగుతున్న కిరణాలు
వాళ్ళ రైతులు
భూమ్యాకాశాలు ఆ లోక రమ్యాలు
ఎప్పటి నుంచో ఉదయించుచున్న చంద్రుడు
పిండి ఆరబోసినట్టు వెన్నెల
ఆ పొట్ల మీద, ఆ అరటియాకు మీద
ఆ గ్రామీణ బాలిక లేత చెక్కిళ్ళ మీద
పంచినా పంచ బడని వెన్నెల్ను
పంచబోకు పట్టి కరెంటు కాంతిలో కలుపబోకు
నాగరికుడా ! ప్రత్తిని పిండి బండికెత్తావు
ప్రత్తి మొక్క నీ వెంట రాదు సుమా
వద్దు ! వద్దు ! ! ఆ రాట్నం, ఆ కదురు,
ఆ ముసలమ్మను కదిలించబోకు
ఆ పల్లె నేటిది కాదు.
పిట్టకు గూడు, చెట్టుకు నీరు
గూటి నుండి పిట్టను తోలకు
పల్లె నుండి రైతును పిలువకు
గూట పిట్ట పాడుగుతుంది
మేడకు అది బెదురుతుంది
కాటుక పిట్టలు త్రాగే తేనెలు
నీ గామగలో దొరకవు
గోధుమ కంకులు రాలే నేలలు
నీ హద్దుల్లో ఒదుగవు
ఆ రద్దీ ఆబాదర ఒందీ
ఏదో కక్కుర్తికి చేసిన పెండ్లికి
కట్టిన తోరణ పాకుల్లా మందిని
గ్రుచ్చినావు నగరంలో ఒకే దారంతో
వానుకి భూమిని మోస్తున్నది
జాతిని పల్లెలు మోస్తున్నవి,
పల్లె దొసగు పల్లే తీర్చును
పిల్లని ఏడ్పును తల్లే మాన్పును
అతని ఏడ్పు ఢిల్లీ తీర్పుకు
అయ్యో నదాన నవ్వే పోవును
దేశంలో నాలుగు మూలల
పూచిన పువ్వుల్లా పల్లెలు
పల్లెల్లో పెరిగిన మొక్కకు
నగరంలో పాదులు పెట్టకు
అదిగో వస్తున్నది సభ్యత్వపుముంపు
ఆ రైతు ఈ నాగరి ఏన్నై పోవును
నాగార్జున సాగరాన
కొండ మీది మ్యూజియంలో
నీటికి నకళ్ళు తీసి ఉంచుము.

దీనిలో అలంకారాలు లేవని అనబోవడము లేదు నేను. అలంకారాలు తీసి అవతల పెట్టినా, సరాలను ఝల్లు మనిపిస్తోందంటాను. కవిగారు ( ) అలంకారము వాడకుండా వ్రాసేయుత్నం చేస్తే అనిబద్ధరచనానికి ఇది ఇంకా చక్కని ఉదాహరణ అయి ఉండును. కవిత్వానికి చైతన్యము రసము. చైతన్యము మన చైతన్యాన్ని ఝల్లు మనిపిస్తుంది, దానికి ఫలితమే ఆర్ద్రరా ఆనందమూను. ఛందస్సూ అలంకారమూ రసాభ్యుచిత రచనకు విజాతీయములు, అదనపు చేర్పులు.

నన్నయగారి ఉదంకుని నాగస్తవమూ, కద్రువ ప్రార్థనా, దేవయాని వేడికోలూ వంటి చోట్ల అలంకారాలుండవు. పెద్దనగారి అగ్నిస్తవము, చెలికత్తెల ఊరడింపులలో అలంకారాలుండవు. తిక్కనగారు రసాభ్యుచిత బంధాలలో అలంకారాలు వాడరు. భావము తీవ్రమైనచోట అలంకారము పూర్తిగా వల్లబడి పోతుంది. నాచన సోమనాథుని 'ఊర్వశీ నరక సంవాదము'లో అలంకారము సామెతగా కుంచించుకుంది. శ్రీనాథుని దమయంతీ నలసంవాదము, పెద్దన వరూధినీ ప్రవర సంవాదమూ, ఎన్నైనా ఉదాహరణ లివ్వవచ్చును, నిరలంకార నిసర్గ కవిత్వ శోభకు. మరి అలంకారముండి తీరాలనడము ఏమన్న మాట ? ఇవన్నీ ఛందో రచనలు కావా అంటారేమో, ముందుగా అలంకారము కవిత్వానికి తప్పనిసరి కాదు అని నిరూపించడమే నా ఆశయము, ఛందస్సుకు రెండో భాగంలో వస్తాను.

ఆధునికుల రచనలలో గురజాడ కథా గేయాలూ, బసవరాజు గోపికా విరహమూ (ఒంటిగా ఉయ్యాల), కవు కొండల

'రాళ్ల పడవ', శివ శంకరుల విభ్రమము, వీరశైవుడు, స్పర్శ; వేదుల ఆశా గానమూ, కృష్ణశాస్త్రి 'దారులన్నియు మూసె' 'అవధరింతువు' 'వేయ బోవని తలుపు' నిరలంకార రచనలే. ఎంకి పాటలలో 'యెనక జల్మము' 'ఇంతేనటే సంద్రము' 'ఆట పాటలలోన' 'ఆరిపేయవే'.... చాలాచాలా ఉన్నాయి నిరలంకార రచనలు, రసమయ రచనలు. రవీంద్రుని రచనలు చాలా మట్టుకు నిరలంకార—, అనిబద్ధ—, రచనలే (ఇంగ్లీషు వచ్చి ప్రపంచ ప్రసిద్ధి గన్న రచనలు గీతములు కావుగదా !) వర్డ్స్వర్తు ఖండకావ్యాలు, ',We are seven, Alice Fell, Lucy Gray'' వంటివి నిరలంకార రచనలే. రామలింగారెడ్డిగారు కవిత్వ తత్త్వ విచారములో అలంకారాలు భావావేశానికి —నదీ ప్రవాహానికి బండలు లాగ— ఎలాగ అడ్డు అవుతున్నాయో నిరూపించారు, ఆ దృష్టితో ఒక మారు పరిశీలించడంటున్నాను.

కవిత్వానికి ప్రయోజనము, చదువరికి అనుభవమూ తద్వారా ఆనందమూ కలగడము. అలంకారపు గురి మనస్సుకి, హృదయానికి కాదు. పోతన గారి సరోవర వర్ణన వినండి : ''వైకుంఠ పురంబునుం బోలి శంఖ చక్ర కమలాలంకృతంబై, భాగ్యవంతుని భాగధేయంబునుంబోలి గురుమకర కుళీర మీన మిథునం బై'' ఇక్కడ పోలిక మాటలకే, మాటల అర్థానికి కాదు. పెద్దనగారి ''మరున కొసంగ కాలము. . . .'' కూడా చంద్రోదయ సౌందర్యాన్ని మన కనుభవము చెయ్యడానికి కాదు, మరి తన కల్పనాశక్తిని ప్రదర్శించడానికే. కాళిదాస కవి 'దీపశిఖ' కూడా పోలికలోని చమత్కారాన్ని చూపిస్తుంది గాని సన్నివేశ సౌందర్యాన్ని కాదంటున్నాను. పోలికలోని కృతకత్వము దాన్ని తిరగవేస్తే తెలుస్తుందంటాను. పోలికని తీసుకు రాకుండా చదువరికి వర్ణ్య వస్తు సౌందర్యాన్ని అందించక, కవి పోలికని తెచ్చి అతికి, తన భారాన్ని తగ్గించుకుంటున్నాడు. ప్రబంధ సుందరి అంగాంగ వర్ణనలూ, తలిశెట్టి రామారావు గారి 'ప్రబంధ సుందరి' చిత్రమునూ జ్ఞాపకము చేసుకోండి. అయితే ''ఉపమానాన్ని దాని వికారము దగ్గరకు లాగుతా రెందుకూ ?'' అని మీరడగ వచ్చును. ''ఉపమానములో వికారము ఎంతో కొంత ఉంటుంది'' అని నిరూపించడానికి. కొంచెపు వికారము మట్టుకు ఎందుకూ ? అని. ఈ ఉదాహరణము చిత్తగించండి. పుట్టు గుడ్డి తాతయ్యని సలహా అడిగేరట : 'తాతయ్యా పాపడికి పాలు ఇవ్వవచ్చునా ?' అని. 'పాలు ఎలా గుంటాయి ?' 'గోడలా గుంటాయి,' 'గోడ ఎలా గుంటుంది ?' 'కొంగలా గుంటుంది' 'కొంగ ఎలాగుంటుంది?' 'ఇలాగ ఉంటుంది' అని మోచేతిని వేళ్లనీ కొంగ ఆకారంలో వంచి తాతయ్య చేతికి అందించారట. ''అబ్బో, వద్దు, గొంతుకలో గుచ్చుకుంటుందన్నాడట తాత. ఈ కథకు నీతి ఉన్నది. ''పోలికలో ఒక గుణమే ద్యోతకమవుతుంది. వినేవాడి శక్తి లోపాన్నిబట్టి ఆ గుణము కాక ఇంకొక గుణము ముందుకు తోసుకొచ్చి కనిపించవచ్చును.'' అని నేనంటున్నానుగదా, వినేవాడి శక్తి లోపమే కాదూ, చెప్పేవాడి అజాగ్రత్తవల్ల కూడా వూతము సందర్భాన్ని తప్పవచ్చును, అని. ఇంతమాత్రమే కాదు, మొత్తపు సౌందర్యమును స్ఫురింప జేయవాలసి ఉండగా, ఒకచోటి, ఏకదేశ, సౌందర్యానికి పోలిక ఇస్తూపోతే మొత్తపు వర్ణన స్ఫోటకపు మచ్చల ముఖంగా తయారౌతుంది. ఒక్క పోలికే ఇచ్చినా, ఉపమానము ఏకదేశమే అయి, ఉపమేయముయొక్క నిర్దేశిత సౌందర్యాన్ని అనుభవము చెయ్యలేదంటున్నాను. మొత్తపు సౌందర్యాన్ని స్ఫురింపజేయవలసి ఉండగా, ఏకదేశ సౌందర్యాన్ని భూత అద్దము క్రింద పెట్టినట్లు చూపడము బిరుదైన పని కాదంటున్నాను. ''పద్మముఖి, పద్మహస్త, పాదపద్మములు వంటివి సర్వజనాంగీ కృతములై రాణించలేదా'' అంటే, చిర ప్రయోగములలో ఒక సుగుణమును చూపడానికి నిలిచి, ఈ మాటలు తమ నైసర్గికార్థమును నష్టపోయి మైళ్ల రాళ్లవలెనే నిలిచిన వంటాను. సౌందర్యాన్ని ఒక మట్టాన్ని ఎత్తి అందించగల శక్తి వీటికి భూత పూర్వము, ఈనాడు లేదంటున్నాను. ఈమాటలకే కాదుఇలాటి వాటికన్నిటికీ-Honeyed spring, dearest dear వంటి వాటికి వలెనే ఉప యోగాను కూల్యత అనే ఒకనాటి బలమే, కాలక్రమాన్న నెత్తురూ, నరమూ ఎండినందువల్ల నేటి అస్థిపంజరత్వముగా నిలిచిందంటాను. 'బాధాసర్ప దష్టులార', 'ఆలింగ నాసవము' అన్నవి పనికట్టుకుని దూరంగా తోసి ఊరిద్దామన్న యత్నాలు. 'గదిలో చినుకుల వలె చీకట్లు' 'నిశ్శబ్దం కారుతోంది.' పెంకి కల్పనలు. 'జీవిత వనాంతర సీమల నశ్రువాహినీ సైకతమందు, హృత్సుమ విషాద దళమ్ముల జిమ్మి పోతివి' 'జీవనగంగా హరిత తటంబున చింతా వట తరు మూలమునన్ ఏలయధోముఖివై'' వంటివి కాలక్షేపపు కల్పనలు. ''నీవెక్క దలచుకున్న రైలు, ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు. నీ ఆదర్శాలన్నీ కలల బ్రేకులోనే పారెయ్యాలి. ఈప్సితాలన్నీ ఎక్స్ప్రెసంటాడు టీ.టీ.సీ.'' వంటివి వైచిత్రి సాధించేటివి. వీటివల్ల రసపిపాసి దాహము తీరదు. రసమయ రచనే మానవ హృదయాల్ని చల్లబరుస్తుందీ, ఝుల్లుమని పిస్తుందీ, మధురిస్తుంది.

అలంకారము కవిగారి కల్పన. వర్ణ్య వస్తువు యొక్క నిసర్గ శోభకాదు. మన అలంకారములు మరొక దేశమూ—, రాష్ట్రమూ—, మండలమూ—, వారికి రుచించక పోవచ్చును. అలాగే కవిత్వములోని అలంకారాలూను, నిసర్గ పరస శోభగల

అలంకారాలూను. నిసర్గరస శోభగల కవిత్వము భాషాంతరీక రించినా శోభ కోల్పోవదు. వైచిత్రి, అలంకారము, శ్లేష, ఉన్న కవిత్వము యొక్క చమత్కారము ప్రాంతీయమే కాగలదు, విశ్వ జనీనము కాలేదు.

ఛందస్సు సంగతి ఇంతే. వచనములో లేక పద్యములో మాత్రము ఉన్నది ఏమిటి? నడక. కవిత్వానికి ఆ నడక— లేదా, ఏదో నియమబద్ధమైన నడక ఉండి తీరాలా? ఎందుకనీ? పూర్వులు అవలంబించారు గనకనా? ఇదేమిటో వాదమూ? అసలు పద్యము ఎలాగ ఏర్పడిందీ? అని కొంచెం తర్కిద్దాము. కవులందరూ వాల్మీకిలాగ ''మానిషాద'' అంటూ శోకాన్ని శ్లోకంగా చెప్పేయలేదు సరిగదా వాల్మీకే తన రచనంతటినీ ''మానిషాద'' చెప్పిన ఆ వేగంతో చెప్పలేదు. మాటలకు ఒక వరసను గుర్తించి, అవరసతో తమ భావాల్ని చెప్పారు కవులు. ఆ వరసకి ఉన్న నడక లక్షణమైన ఆకర్షణ సమకూర్చింది పద్యానికి. దీనికి ఒక దశలోరాగము తోడైంది. మూడు విశేష అలోనూ ఏ విశేషము రాణించినా లాగేస్తుంది వినే వారిని. మరి ప్రతీ రచనకీ ఇవన్నీ ఉండి తీరాలనడమేమి వాదమూ?

ఏ వాఙ్మయములోనైనా పాటముందు, పద్యము తరువాత, ఆతరవాత వచనము. పాటలోని అడుగులు అన్నీ సమాన పొడవుగలవి. మూడేసి అక్షరాలూ, నాలుగేసి, ఐదేసీ, రెండు నాలుగూ, మూడు నాలుగూ, ఎనిమిది, అక్షరాంతో పాటంలోని ఆవృతాలు సాగిపోతాయి. ఇది చాలా సరళమైన ఏర్పాటు, పేర్లు మాత్రం త్రిశ్ర, చతురశ్ర, ఖండ, రూపక, మిశ్ర, ఆది, అంటూ గాంభీర్యం సూచిస్తున్నప్పటికీ, లయ కోసము చేసుకున్నారు తొలి శతాబ్దాల వారు ఈ ఏర్పాటుని.

మన వాఙ్మయంలో పద్యం ఏ రీతిగా ప్రవేశించిందో చక్కగా తెలీదు. జాతులు అనే ఛందో రచనలు లయమీద నాధారపడినవే. తరువోజ, ద్విపద, సీసము, అయిదేసి లఘువుల ఆవృతాలతో సాగుతాయి. దేశి ఛందములు సమలయమీద సాగే టివేగాని గణాధారములు కావు.

ఉత్పలమాల, చంపకమాల, శార్దులము, మత్తేభమూ అన్న వృత్తాల్ని చూదాము. గణములకు సాధారణముగా మూడేసి అక్షరాలుండడమూ, ఆ మూడు అక్షరాలకు కలిపి నాలుగేసి లఘువులుండడమూ చూస్తే ఈ గణ రచనలుకూడా చతురశ్రగతి రచనలేనేమో అనిపిస్తుంది. విశ్లేషిస్తే తేలేది అదే! ''శ్రీమధు, రాధ, రీవినవె, శేషగి, రీశుడ, నేను, మల్లికా'' అన్న ఉత్పలమాల పాదమూ, కాబట్టే చంపకమాల పాదమూ, చతురశ్రగతి రచనే. కంద పద్యము ''కూరిమి, గలదిన, ములలో, నేరము లేతో, చవెపుడు, నిక్కము, మరియా,'' అంటూ చతురశ్ర గతితోనే సాగుతుంది. శార్దూల విక్రీడితమూ మత్తేభమూ'' బర్హా, త్తంసవి, లాసి, కున్తలభ, రం'' అంటూ యతివరకూ చతురశ్రగతీ చివ్వర ఒక గురువుతో సాగుతాయి. యతి అన్నది కాల విరామం కనక పాదం అక్కడ రెండు లఘువుల కాలం ఊపిరి తీసుకున్నదనుకుంటే అంతవరకూ నడిచే గతి చతురశ్ర గతియే అవుతుంది. ''మాధుర్య మన్నానసం'' అన్న పత్న్యాస్యాసము రెండు అయిదు లఘువుల ఆవృతాల తరువాత ఒక గురువుతో పూర్తి అవుతుంది. ఇక్కడ మూడు లఘువుల కాలము విరామము అని అనుకుంటే మత్తేభ శార్దూలాలు అయిదు ఆవృతాలు చతురశ్ర గతిలోనూ మూడు ఆవృతాలు ఖండ గతిలోనూ ఉన్న వరసల జోడింపులాగ కానవస్తుంది. మొత్తము ఎనిమిది ఆవృతాల కాలము అన్నమాట. కంద పద్యముకూడ ఎనిమిది ఆవృతాల జంటయే. ద్విపద రెండు పాదాలూ మొత్తం ఎనిమిది ఆవృతాలే. కవిరాజవిరాజితము ఎనిమిది నాలుగు లఘువుల ఆవృతాలు గంది. గీత పద్యము తకిట, కిటతకిట కిటతకిట తకిట తకిట అంటూ రెండు పాదాలలోనూ అటవెలది ''తకిట తకిట తకిట కిటతకిట కిటతకిట, తకిట తకిట తకిట తకిట తకిట'' అనిన్నీ వదేసి ఆవృతాలతో సాగుతాయి. కనుక పద్యాలుకూడా ఆవృతాల సరములేనంటున్నాను. గణ విభజన వల్ల నడకలో వైవిధ్యము ఉన్నట్టు గోచరము కానడమే కాని మొత్తంమీద లయలో పెద్ద వైవిధ్యమేదీ లేదంటున్నాను. ఈ సత్యాన్ని మన యక్షగాన రచయితలు గుర్తించే ఉంటిఁవారూ, ఇది కొత్త నింత ఏమీ కాదంటున్నాను. యక్షగానాల్లో కందార్ధదరువు, ఉత్పలార్ధ—, చంపకార్ధ—, శార్దూలా, మత్తేభా, ఆర్ధ—, గీతార్ధ—, ఆట వెలద్యర్ధ—, ములు రచించడమునకు ఆధారము ఈ పద్యాలన్నిటా పాటలలో ఉపయోగ పడౌతుండిన ఆవృతాలు అస్థిపంజరాలులాగ ఆ దరువుల తొలి నడకని నిల బెట్టుతూండడమేనంటున్నాను. పద్యాల రకాలు ఎన్నో ఉన్న ప్పటికీ మానవ స్వభావ అనుకూలమైన చతురశ్ర, ఖండ, తిశ్ర గతుల ఆవృతాలు ఉండుట వల్లనే పైన విశ్లేషించిన పద్యాలకు విశేషోపయోగము కనబడుతోందంటున్నాను.

రగడలు అనేక గతులని ఛందో గ్రంథాలలో వవరించ బడి ఉంటాయి. హయగతి రగడ, వృషభగతి రగడ ద్విరదగతి రగడ అంటూ, ఇవన్నీ గణ ఛందస్సునుబట్టి చూస్తే బహు క్లిష్టములు, వైవిధ్యము చాలా ఉంటుంది వాటిలో. ఈ రగడ లకే ఆవృత విశ్లేషము చేస్తే కడవంత గుమ్మడికాయా కత్తి పీటకు లోకువ' అన్నట్లు వాటి ఛందస్సు చక్కగా తెగివిడి పోతుంది. జానపద గేయముల ఛందస్సును వరించేవట్లు వ్యాకర ణాలంకార విద్వాంసులు అప్ప కవి వంటివారు పడే తంటాలు మనకి అపరిచితములు కావు. ఆ చిక్కులు ఎందుకు వచ్చాయో

## అర్థశతాబ్దపు ఆంధ్రకవిత్వము:

# శ్రీ కృష్ణశాస్త్రి

### డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

కృష్ణశాస్త్రిగారి రచన వెంకటపార్వతీశ్వరుల రచనలవల్లా, సమకాలిక పరిస్థితులవల్లా ప్రభావితమైంది. వెంకటపార్వతీశ్వరులు ఆలోచన నుంచి ఆవేశములోనికి కొంత కొంత ప్రవేశించారూ, వీరు ఆవేశమునుంచి ఆలోచనలలోనికి తొంగి చూస్తారు. వారు ప్రాచీన సంప్రదాయానుసారులు, వీరు తిరుగుబాటుదారులు. కనుక వారి ఆమ్రేడిత కవిత్వాన్ని శబ్దవాచ్యతనూ వీరు శ్రవణ సుఖానికి లోభించి కొంత అనుకరించినా వాటినే చిరకాలముపట్టి మనలను పల్లార్చలేదు. (శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చేశారు ఆ పని.)

కృష్ణశాస్త్రిగారి రచనలమీద రెండో ప్రభావము స్వేచ్ఛది. ఆంగ్ల కవులు షెల్లీ వంటివారి కవన పఠనమూ, బిసెంటమ్మా మహాత్ముడూ వెలిగించిన స్వాతంత్ర్యజ్యోతీ వీరిలో రెండు మూడు స్వేచ్ఛలను రేకెత్తించింది. మొదటిది 'నా సంగతే వేరు' అన్న ఆత్మ విశ్వాసము. 'ఎవ్వరని యెంతురో నన్ను, ఏననంత శోక భీకర తిమిర లోకైక పతిని' అన్నారు. సామాన్య మానవులు బలహీనతనుగా విశ్వసించే కన్నీటిని వీరు 'అపూర్వ మత్యంత మానంద మొసగు నిరుపమ నితాంత దుఃఖంపు నిధు' లంటారు. 'మీరు మనసారగా వేడ్వనీరు నన్ను' అంటారు. ఈ వింత ఏమిటి ? అని ఆలోచిస్తే నాకు ఒక సమాధానము తట్టుతున్నది. చిత్తగించండి మనవిచేస్తాను.

కృష్ణశాస్త్రిగారు భక్తులు, అనేక భక్తి కీర్తనలు రచించారు. అనుతాపమూ, ప్రపత్తీ భక్తికి అంగములు. 'ఎట్లు నిన్నూహసేయుటో యెరుగలేక వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు' నంటారు. 'తారకారత్న భాసుర తారహార సుప్రభామాలికాజాల శోభితుడవు .... వీథి వీథుల వాడల విపినములను భిక్షుకునిబోలె తిరుగాడు పేదనోయి' అంటారు. 'ఏది నీకిత్తునందు నా హృదయనాథ కాన్కగానే మొసంగగా గలను నీకు .... వలపూర కరవుదీర గాటమగు వేడి కన్నీటి చుక్క దక్క కాన్కగావే మొసంగగా గలను నీకు' అంటారు. 'కురియుమురా కన్నీటిని మరి మరి విలపింపుమురా, సరము గూర్చి పరమేశుడె దాల్చును రా పాపీ' అన్నారు. పరమేశ్వరుని యెదుట వినయముతో, ప్రపత్తితో కన్నీరు కార్చుట గంగాస్నానము వంటిదే. ఈ 'కన్నీరు' కృష్ణశాస్త్రిగారి కావ్యమంజరి కొక దానికి శీర్షకే అయినది. కృష్ణశాస్త్రి గారికే కాక వారు నిర్మించిన పాత్రలకు కూడా ఈ కన్నీరు జీవము. పెరియాళ్వారు 'తీరా నీ వేతెంచిన, ధారలైన అశ్రులనీ రూపు తోచదేమి స్వామీ' అంటారు. గోదాదేవి వారి గని నంతనే బాష్పవారి క్రమ్మ' నంటుంది, రంగదేవుని కన్నులు చూసిన ధనుర్దాసు 'ఏడుస్తాడు', రాధ 'అలరు పన్నీరొ నా చలువ కన్నీరు నీ తలిరు పాదములకై కృష్ణ' అంటుంది. కనుక కృష్ణశాస్త్రిగారికి కన్నీరు పూజాద్రవ్యముగ... విధి బలీయమై 'ప్రేయసి' 'సడిలేని నడిరేయి బడిపోయి' నది. ఆమెకొరకు పడిన నిర్వేద నౌకకు ఆయన కన్నీరే నదియైనది. పూర్వరాగ కవిత ప్రియురాలు కోసము అనుభవించిన దుఃఖమే ఆమెకూ కవికీ ఏకైక శేషబంధమైనది. ఈ బంధమును—అనగా తన దుఃఖమును—వీడుట కీయనకు ఇష్టము కాలేదు. కనుక ఈయన 'నాకు మరణమ్ము వలదనినాను' అన్నారూ, దుఃఖమునూ కన్నీటినీ కౌగిలించుకున్నారు. "నన్ను గనియేరు జాలి జెందంగవల' దన్నారు. 'నా విలాప నిబిడ గీతికావళీ విస్వనమ్ము నర్ధరాత్ర గర్భమ్ము మరియు మరియు భీషణ కాళిమోన్మత్తగాగ జేయుతరి నన్ను మీరు వీక్షింపలేదా ?' అని సవాలు చేస్తున్నారు ! తన దఃఖముతో తనకు గల బంధముమీది మమతతో, ఈ సవాలు తన దుఃఖాన్నంతటినీ—తానే చూచి దాని భీషణ కాళిమను మెచ్చుకునే—నటననుగా అన్వయిస్తున్నదైనా చూసుకోలేదు ఈయన. 'నా సంగతే వేరు' అన్న ఆత్మ విశ్వాసమే 'నా దుఃఖము కూడా వీక్షనార్హమే, నాకు కన్నీటి సరుల దొంతరలూ నిశ్శ్వసతాళ వృంతాలూ' ఉన్నాయి. 'నన్ను గనియేరు జాలి జెందగ వలదు' అన్న అదలింపులకు కూడా దారి తీసింది.

వీరిలోని రెండో స్వేచ్ఛ సాంఘిక సారస్వత రాజకీయ సంస్కారములు కోరే స్వేచ్ఛ. మానవుడన్న వాణ్ణి ఇంకొక మానవుడు ముట్టరాదనుట చైతన్యానికి అవమానమనీ పరప్రభుత్వానికి భృత్యులై ఊరేగే అధికారుల ధాష్టికము నీచమనీ, సంప్రదాయ శృంఖలాలు మోస్తూనే రచించడము కృతకమూ నికృష్టమూ అనీ ఘోషించారీయన. పతితుల మహాప్రస్థానములో చేరి 'కదలి నడువగలము మేము మడమ త్రిప్పి రాము మేము' అన్నారూ, 'జిలుగు వసనాల మణిమయోజ్జ్వల మనోజ్ఞ కాంచ నాంచిత భూషణ గణము బూని రాజవీథుల రతనాల రథము నెక్కి' ఊరేగే ఉద్యోగి దివాంధాన్ని

తిట్టారూ, రాయి అప్పయు కంఠస్వరంబు దాల్చి గానముచేసే నవోదయ కాలంలో 'పికమ పాడకుము' ని శపించిన ఆచారాను సారి ఛాందసాన్ని నిరసించారు. మాత్రాచ్ఛందస్సులూ పద్య చ్ఛందస్సులూ యదేచ్ఛంగా వాడుకున్నారూ పద్యములో భావము ఎక్కడ పూర్తి అయిపోతే అక్కడ ఆపేశారు రచన. పెద్ద పుటలో ఒక్క పద్యము వేసి దాన్ని తేల్చి చూపిం చారూ ఖండ కావ్యాలకు శీర్షిక ఇవ్వకుండా చుక్కలు పెట్టారు. (శుష్కాచారాభిమానులు ఇంత మాత్రానికే అల్లరి చేశారు.) తరువాతి దశలలో 'స్వాతంత్ర్య రథము' వంటి నాటికలూ ప్రగతి శీలములగు రాజకీయ తత్త్వ సూచకములుగా 'ప్రాభాత ప్రాంగణాన ప్రమోగెను నగారా' 'ఆకాశము నొసట పొడిచె నరుణారుణ తార' అన్న గేయాలూ రచించారు. అయితే వీరి ఈ స్వేచ్ఛ వీరి రచనలలోనూ, చర్యలలోనూ గౌణాతి గౌణముగానే ఉండి పోయింది.

వీరి మూఢోస్వేచ్ఛ స్వేచ్ఛా ప్రేమగా పొడచూపింది. ఆధునిక కవిత్వ ప్రారంభంనించీ ప్రబంధ శృంగారాన్ని సమ ర్థించడానికీ శృంగారాన్ని ఉపాదేయంగా నిరూపించడానికీ గుర జాడ అవ్యాజప్రేమనీ, రాయప్రోలు అప్రాప్త ప్రేమ, అపరిణత ప్రేమ, విశ్వప్రేమల్నీ, అబ్బూరి పూర్వప్రేమ, మృతప్రేమ, క్షణిక ప్రేమ, దాంపత్య ప్రేమలనూ, దువ్వూరి నైసర్గిక ప్రేమనూ, అధికార్లూ, బసవరాజూ, నండూరీ దాంపత్య ప్రేమనూ చిత్రించి శారీరకాకర్షణపైన మొలిచే సర్వ సాధారణ 'ప్రేమను' వెనక్కి నెట్టారు. ఈ ప్రేమను—ఇది నైసర్గికమన్న కార ణాన్ని పట్టుకుని పెద్దజేసి—'అలరు పడంతి చక్కిలిగింత వెట్టి విరిచేడె పులకింప నరనను బాడి, మరియొక్క ననతోడ మంతనం బాడి వేరొక్క సుమకాంత వ్రీడ బోగొట్టి తిరిగే తేటి 'వలపు' ను ప్రపంచించి, 'సౌరభములేల జిమ్ము పుష్ప వ్రజంబు ? చంద్రికల నేల వెదజల్లు చందమామ ? ఏల సలిలంబు పాఱు, గాడ్పేల విసరు, నే ల నా హృదయంబు ప్రేమించు నిన్ను' అన్న వశీకరణ మంత్రాలతో, 'ఏటి పని యిది లోకమా హృదయదళన దారుణ మహోగ్ర కార్యంబు దలచినావు, ప్రణయ మధురిమ మెఱుగవు పాప మనవు, పక్షముల దూల్చి బంధింతు వంజరాన' అన్న హెూదా ఉపన్యాసాలతో, 'హృదయ వనజాత సుమ మృదు మనోహరదళము లదయతను ద్రుంచి నారే పెంధూళి జిదివి వెదజల్లినారే' అన్న ఆక్రోశ నటనలతో ఒక్క ఖండములో కాకపోయినా, 'అన్వేషణము, ఏల ప్రేమిం తును, అయ్యో, లోకము, శాపము, అబ్బ' అన్న ఖండాలలో స్వేచ్ఛాప్రేమనుగా దిద్ది తీర్చారు కృష్ణశాస్త్రిగారు. తిరిగి తిరిగి, లాలసను వర్ణిస్తున్నాయని తెలుగు ప్రబంధాలను నిషే ధించే తొలినాటి ఉద్యమానికి బలము చేకూరే ఘట్టానికి వచ్చాయి ఈ రచనలు. అయితే వాటిల్లోది దాంపత్య శృంగా రము, గురజాడవారు 'మాట మంతి' లో అన్నట్టుగా నిరపాయ కరము. ఈ స్వేచ్ఛా ప్రేమ పారదారికము, సంఘ శాంతికి ధూమకేతువు !

కవిత్వానికి నీతితో పనిలేదనీ, ఆర్ద్ర భావాలతో అందా లతో నిండిన రచన ఏదయినా గ్రహణయోగ్యమే ననీ ఒక వాదము బయలుదేరిందా రోజుల్లో. నిజమే. నీతిని బోధిం చడము కాదు కవిత్వానికి పని, నీతి శతకాల్ని కవిత్వముగా జమ కట్టలేము. అయితే, నీతితో పనిలేదు అన్న మాటలకు అర్థము 'అవినీతినైనా పట్టి చూపించు' అని కాదు. కావ్య సాహిత్యమనేది కథనకావ్యములు భావ్యకావ్యములు అన్న రెండుభాగాలుగా కనపడు తుంది. కథన కావ్యాలు మానవుని కథను వర్ణిస్తూ, చదువరుల మానవత్వానికి అపేక్ష కలిగిస్తూ లాగి, ఆ కథవల్ల ధ్వనించే సత్యాన్ని చదువరులకు కాంతాసమ్మితంగా వారికి తెలియ కుండానే బోధ చేస్తాయి. ఈ కథనములో మంచీ చెడ్డా అందమూ అసహ్యతా వంటి ద్వంద్వాలు దేనికది మోతాదు బరువు కాకుండా ఉంటాయి. ఎక్కడేనా ఒక భాగము అప స్వరముగా పొడుగైతే రసాభాసము లయిందంటారు రసికులు. మొత్తపు కథ పెద్దదైతే దాని మొత్తపు ప్రభావములో ఈ చిన్న రసాభాస ఘట్టము తలయెత్తి నిలవక మునిగి పోతుంది. ఈ కథను మాత్రము పెంచి చిన్న ప్రబంధంగా రచిస్తే తారాశశాంకమూ అహల్యా సంక్రందనమూ లాగ తయారై అనీతి బోధకము అవుతుంది. అలాంటివి రచించ డమా కవి చేయవలసిన కార్యము ? .... భావ కావ్యాలలో కూడా చదువరిని నిండు మానవునిగా తీర్చడానికి సాయపడే భావాల్ని తీర్చి దిస్తే చదువరికి క్రొత్త అనుభవమూ, వికా సమూ కలుగుతుంది. ఈ భావాలలో నీతి ఉండనక్కరలేదు, క్రొత్త అనుభవముంటే చాలు. వర్డ్స్‌వర్త్ చిన్న కావ్యాలూ కీట్సు ఖండ కావ్యాలూ సాధిస్తాయి ఈ ఆశయాన్ని. ఏ సైతాను ఉపన్యాసాన్ని మాత్రమో రచించి పూలుకుని కవికి నీతితో పని లేదంటే ? తిక్కనగారు కీచకుని అధర్మ విరహాన్ని మూడు మారులు వర్ణించారు. వాల్మీకి రావణాసురుని సీతా విరహాన్ని ఒక్కమారూ వర్ణించడు. చదువరికి కీచకుని అధర్మ మోహ ముపై సానుభూతి కలుగవచ్చునా ? అని అడిగేరు ఉమా కాన్తముగారు ! నీతితో పనిలేదు గాని ! చదువరుల్ని షాక్ చేసే సంఘ విరోధి కళాభాయి రచనలకు పని ఉన్నదా కవితలో ? అయితే రక్షించి ఈ స్వేచ్ఛా ప్రేమవాదుల స్వార్థమూ లాలసా పద్యాలలో నుంచి తప్పుకుని గుడిపాటివారి వచన రచనలలోనికి వెళ్లిపోయినాయి ఇటు తర్వాత.

కృష్ణశాస్త్రిగారి రచనలకు ఆవేశము ప్రాణమూ శక్తీని. ఈ ఆవేశము ఎన్ని అవతారాలో ఎత్తుతుంది. ఆవేశము కవిని ఆవరించినప్పుడు ఒక్క ఉదాహరణ ఇచ్చి సంతుష్టి పడలేడు కవి. 'ఏను స్వేచ్ఛా కుమారుడ నేను గగనపథ విహార విహంగమపతిని నేను, శోహన వినీల జలధరమూర్తి నేను, ప్రళయ ఝంఝా ప్రభంజనస్వామి నేను' అని ఉదాహరణల విసురుతాడు. ఇది నితాంత తమిస్రకాంత, మిది దరిద్ర, మీ నిశాం తమ్ము శూన్యతని ఛాయమీద ఛాయ నెక్కిస్తాడు. శర్వరీ శీతపవన పక్షముల మలిపి, స్వాదు యమునోర్మి సంగీత ఝరుల

# శ్రీ కృష్ణశాస్త్రి

గలసి కౌముదీ ధౌత శుభ్రదిక్తటుల పొలసి మురళికా మాధురుల రుచులు దాటి దాటి వచ్చిన వంటాడు. 'ఏటిత తొలకరి వానగా చిన్ని పొనగ బొంగి పొరలెడు కాల్వగా నింగి కెగయు కడలిగా పిల్ల గ్రోవిని వెడలు వింత తీయదనముల లీనమై పోయె నెడదని జల్లులతో ముట్టడిస్తాడు. 'ఇచటనే—యిచటనే—యత—డిచట నేను—ఇచట నీ జాజిపూ పొదరింట నేను అతండు కన్నుల గట్టిన సరణి దోచు' నని మళ్లీ మళ్లీ విసురుతాడు.

"నాకు గాదులు లేవు, నాకు షస్సులు లేవు, నేను హేమంత కృష్ణానంత శర్వరిని, నాకు కాలమ్మొక్కటే కారు రూపు, నా శోకమ్ము వలెనె నా బ్రదుకు వలెనె, నా వలెనె" అంటూ రీయస. ఇంత చిన్న ఆవరణలో నింత భావావేశము గల పంక్తులు నే నిప్పటికి ఎఱుగను. అభిప్రాయాలుగానూ, వూహలుగానూ కవులు సామాన్యంగా ఇచ్చే వస్తువు ఆవేశము చేరడముతో భావాలుగా వస్తుంది. "ఇది ఎంతో, బాగున్నది" అన్నప్పుడు కంటె 'ఇది ఎంత బాగుందో' అంటే మనము ఎక్కువ అనుభవిస్తాము. "కైత యొకండు గా దిపుడు కాలము సర్వము మారె వ్యర్థపుంజాతురి హెచ్చె నల్పమగు సాహితితో పెద పెద్ద పాత్రముల్ జూతురు తప్పు దిద్దుదురు శూరత నచ్చె కవీంద్రులందు, సీ ! మూతులు గట్టివైచికొన బోలదె సత్కవులైన వారికిన్" అన్న ఊహలు "ఇపుడు ప్రళయమ్ము క్రమ్మిన దేమొ కాక దొరకదో నిల్వ నీడగా చిఱుతపాట కింత యురుకొనె యిమ్మహోవంత విశ్వ మలమికొను చీకటుల కలకలము వలన" అని శక్తివంతమైన భావాలుగా వస్తాయి వీరినుంచి. దువ్వూరి రామిరెడ్డి "సాంధ్యకి మ్మీరవర్ణ వస్త్రములు దాల్చి, గిరితట విహార శృంగారకేళి సొలసి రమణ జరియించు జలధ రాళ్ళకుని గాగవేల సృజియింపడో నన్ను నీశ్వరుండు" అని ఆశను వివరిస్తే, విశ్వనాథవారు "ముదురాకు రాలేటి ముదిమి నాళులలోన, తొడిగేటి చివురాకు తొగరు సంజ లోన, ఆకునై నా కానుగా, అయినచో, సోకేది చిఱుగాలి నన్ను మెల్ల, తాకేది మిణుగురుల హొన్ను" అని ఆశకు కారణము కూడా చెప్పారు, కృష్ణశాస్త్రిగారు "గలగలని వీచు చిఱుగాలిలో గెరటమై, జలజలని పాఱు సెలపాటలో దేటనై, ఈ యడవి దాటిపోనా, ఎట్లయిన నిచటనే యాగిపోనా" అవేశారు కారణాలే చెప్పకుండా. విశ్వనాథవారి కృష్ణుడు విరహవ్యగ్రయైన రాధ చింతా సాధనికేగి "రాధా" అన్నాడుట. కృష్ణశాస్త్రిగారి ఊర్వశి "పడికి రేయి వెన్నెల యెద చలించు పిలుపెగా 'నా సఖా' యని వేగిరి" స్తుంది. కృష్ణశాస్త్రిగారి భావాలు వెన్నెల యెద చలింపచేసేట్టుగా వస్తాయి.

వారి భాష కూడా తీర్చిదిద్ది నట్టిది. చిన్నతనము లో వారి తండ్రీ పెదతండ్రీ—మహా పండితులు— రెండు మూడు రచనల్ని చూపించి 'ఏది బాగుందిరా నాన్నా' అని అడిగేవారట. అలాంటి శిక్షణవల్ల ఈయన కలవడినది నదీప్రవాహ సదృశమైన శైలీ శక్తివంతమైన ఎంపికామ. (తలిరాకు జొంపముల పందుల త్రోవలు, (కాఱు మొయిళ్ళ) కాటుక పొగలు, ఏ త్రోవరుల్ త్రొక్కని దారులు, పసపడని చేయు, వేయబోవని తలుపు, యెదలో పరియెద, మాయని వాకిలి, తిగువని వింటివాడు, వంటి శక్తివంతమైన నవ్య నిర్మాణాలు ఇంకొకరెవరూ చేసినట్లు కానరాదు. 'విసృత క్రూర క్షుధాక్షుభిత మృత్యు కఠోర విగత పాండుర శుష్క వదన దంష్ట్రాగ్ని' అని సంస్కృతమూ, 'మ్రోగు పాటల పేటినా గళమ్ము వలె తీయ తీయ నై వది పులుగు తెరవ గూడు' అని తెలుగూ, 'ఏలా వచ్చె హవాహుమాయి వయి వాడే కుచ్చు పాగాం షెహోకేలా, పచ్చ జరీ బుటా మొఖ మలంగీ దాల్చి చైత్రుండు కెం, గేలన్ సోగ గులాబి కొమ్మ కొరడా కీలించి సారా నెరా, ప్యాలా సారెకు సారెకున్ పెదవులన్ పట్టించుచున్ నవ్వుచున్' అని ఖయాము తెలుగూ, వైష్ణవుల అరవ తెలుగూ అందముగా వాడగలరు కృష్ణశాస్త్రిగారూ, ఆషాఢ యోషామణీ కేశపాశాన అల్లుకొన్నది తటిద్వల్లియో' అనీ, 'తరుణతమాల కిసాల సమాన, శ్యామల కోమల చారు శరీరా' అని 'మస్పణ కుసుమ హృద్గళన్మరంద స్నపితచరణ యుగళా వసంతా' అనీ ఇక్షుఖండ సదృశ రచనా చేస్తారు. నాకు వచ్చిన అసంతృప్తల్లా, వారు తేనె బిందువుల్ని చిలికే శ్రద్ధను పెంచి తేనె పెఱలాంటి ఖండకావ్యాల్ని నటరాజు, ఆకులో ఆకునై, నీలాభ్ర సరసిలో, దారు లన్నియు మోపె వంటివే ఎందుకు చేయరూ అని. తెలుగు ప్రబంధాలు అందపు టూహల్ని సుందర భావాల్ని కాలిబాట లాగ తీర్చి చదువరిని లాగక, ఎక్కడి కక్కడ ఇతర ఊహలతో దట్టించి పతిచేసి, కనిగాలు చాప వేసుకుని కూర్చుని గోష్ఠి నడుపుతున్నట్టు తయారు చేశాయి. ఆంగ్ల కవులు—కీట్సు, బైరను టెనిసన్నూ వంటివారు—పూలదారుల్లాగ తయారు చేశారు తమ ఖండకావ్యాల్ని. వాటిని చూసీ కూడా మనవారు చెఱకు గడల్లాగ ఎందుకు నిర్మించరూ ? కలకండ ముక్కలు జల్లులూ సంతుష్టి పడిపోతారేమో ?

కవిత్వము చదువరికి ఇంద్రియ గోచరము కావాలి. అప్పుడు కవి వర్ణించిన ప్రకృతి చదువరికి గోచరించడమూ తద్వారా చదువరికి అనుభవము కలగడమూ జరుగుతుంది. కవి భావాల్నే వెలిబుచ్చినప్పుడు ఆ భావాలు మహా పండితుడైన కవికే గాని సామాన్య చదువరిని జల్లు మనిపించేవి కాకపోతే కవి మానాన్న కవి రచించుకుంటూ పోవడమే మిగుల్తుంది కాని చదువరిని అంటదు. పద్యనకు ఈ చిక్కు లేదు. తనకు ఆవేశ కారణమైన ప్రకృతి చైతన్యాన్ని కవి వర్ణించి విడిచినా, ఎంతో కొంత ఉద్రిక్తత చదువరికీ కలుగుతుంది. అయితే ఈ వర్ణిత వస్తువు చదువరికి ఎంత చక్కగా కనబడితే అంత ఎక్కువగా అది అతణ్ణి స్పందింపజేస్తుంది. కనుకనే అన్నాను కవిత్వానికి ఇంద్రియ గోచరమయ్యే గుణము ఉండాలని. కృష్ణశాస్త్రిగారి రచనకు ఈ గుణము బాగా ఉంది. 'గలగలని వీచు చిఱుగాలి', 'తలిరాకు జొంపముల పందుల త్రోవల వేలవాలు తుహిన కిరణ కోమలరేఖ', 'చంద్రాతప పాంతరాళ రజత తల్పము' "బృందావన వీథులందు యమునా నవభంగ మృదంగ వాద్యములు' 'నీలాభ్ర

సరసిలో రాయంచవలె విహారము చేసే జాబిల్లీ, యమునోర్మి సంగీత ఝరుల గలసి వినిపించే మురళీ నినాదమూ, కనులలో మిల మిల నిలిచే బాష్ప మౌక్తికమూ' చక్కగా గోచరిస్తాయి.

కీట్సు కవి 'చెవి సోకిన గీతములు మధురములే అయితే, చెవికి సోకగరాని గీతములు మధురాతి మధురము'' అన్నాడు. కృష్ణశాస్త్రిగారు 'శర్వరీ శీత పవన పక్షముల పులసి, కౌముదీ ధౌత శుభ్ర దిక్తటుల సొలసి'న మురళీనాదాన్ని మాత్రమే కాక 'కనుచూపుదాటు నామని బాయు కోయిల గొంతులో చిక్కు వసంత గీతి' నీ, 'విభువీడి శుష్కించు విరహిణి సెలయేటి కడుపులో నడగిన కడలి మ్రోత' నీ, చెవికి సోకించకుండానే వినిపించారు. దిశ దిశాంతగత శకుంత దివ్యగానమును విని వినిపించిన ధన్యత వీరిదే. ఒక అనుభవముయొక్క స్మృతిని ఉపయోగించుకొని ఆ అనుభ వాన్ని చదువరులలో రేపడము చక్కని నేర్పు. ప్రకృతికి చైత న్యాలూ, భావాలూ ఆరోపించి వర్ణించడమూ చేర్పే. ఈ భావాల వల్ల ప్రకృతి చిత్రము సాంద్రమై కంటికి కట్టడమూ, ఈ భావాల అనుభవము ఆ ప్రకృతి దర్శనానుభవానికి తోడ్పడ డమూ జరుగుతుంది. 'వరిపంటి విరిచేడె చిన్నారి సిగ్గు' అని విన్నప్పుడు, మనము గుర్తించని వరి మొక్క వంపును చిన్నారి సిగ్గు అన్నమాట అవకుంఠనము తీసి చూపిస్తుంది. గాలి, ''ఇంత చిఱుగీతి యెద వేగిరించెనేని పాడుకొమనటా, తాండవ నృత్య మాడుకొనునట ! అతడు, 'పాట పదములకై నిత్య పథికు డయ్యెనట. వనమల్లికాపతి హిమాంబువులలో జలక మాడిం' దట. 'తొలి ప్రొద్దు తెమ్మెర త్రోవలో బయనమై' పరువెత్తినదట కోయిల పాట. 'మొండి చేతుల నెత్తి' 'వనతరుల్ శూన్య దృక్కుల దిశలు చూచు' నట. ప్రాయంపు వంశి 'మలయ పవను కౌగిలిలోనె పులకరించి హాయిగా గంతమెత్తునట. 'ప్రావృడంబోధర స్వామి జీవనంపు భారము తొలంగిపోవ .... తన పాదలు చెప్పుకుంటూ 'గొణుగు' కుంటాడట. 'ఎంతొ దాహమ్ము గొన్న శ్రవణముల విచ్చి గీతరవము కొరకు వెదకునట. గాలి 'మృదు వసనాంచలముల గుసగుసలు' 'చరణ మంజీరము కొసరు జాలి పలుకరింతలు' విన రాలేదుట. మూగవోయిన (నా) గళమ్మునను గూడ నిదురవోయిన సెలయేటి రొదలు కలవట. 'నీప పాదప శాఖికాగ్ర పత్ర కుటిల మార్గాలలో ఇరులు గుసగుస లాడు' నట. 'రాగాంశు మాలికా కాంతి నాట్యాలు సలుపునట- అమృతగళరవమ్మునకు రెక్కలు విరిసిపోతున్నవట. చలువ తెమ్మెర జాణ చలచిత్తుడట. ప్రకృతికి మానవ చైతన్యము నలవరిచే దృష్టి రవీంద్రుని వర్ణనలకు జీవము. తెలుగు కవు లకు కొంచెమే పట్టుబడినా కృష్ణశాస్త్రిగారికే పట్టుబడింది ఎక్కువగా ఆ దృష్టి. దీనిని సాధించే యత్నములో వీరి వర్ణన పలుచోట్ల మన అనుభవశక్తిని దాటిపోవడమూ కద్దు— ప్రబంధ కవుల ఉత్ప్రేక్షలవలె. 'పాడుచు చిమ్ముకై పడి పోదు నిలకు' 'చరణ కరుణా మధుకణము' సుదరారము ఊహ లోనికి వెళ్ళిపోయింది అలంకారము.'గాలి వీలాలపాట' గాలి నీలమా? ఈల నీలాలు ఎఱుగుదుము, గాలి నీలా లేమిటో! పడక వెఱిగని తేనె' 'పాట రెక్కల రొద' ఎక్కడికో వెళ్ళిపోతాయి.

కృష్ణశాస్త్రిగారి రచనలో కొన్ని చిత్ర విచిత్రా లున్నాయి. ఒక ఇంద్రియాన్ని పలకరించడములో తృప్తిపొందక, వీరి కవి త్వము రెండు మూ డింద్రియాల్ని లేవగొట్టుతూ ఉంటుంది. ''ఈ నిశాంచమ్ము శూన్య, మిం దెన్నడో రహస్యథిల సుప్తిగలవర మంది లేచి గుబులుకొను లేత నెత్తావి గుసగుస లివో'' ''తేనె తేట చినుకేని లేని యీ పాట'' ''నీ వెలుగు చూపాక రేయి విక సించి వాసించి మిలమిలా తళతళా మెరసినది కురిసినది.'' ''హాలాహలాంధకారానల జ్వాల'' ''కరుణార్ద్ర వీక్షణ పరిమళ ములు'' ! ఇవి కవి చదువరుల రుచితో, చైతన్యంతో, చేసే ప్రయోగాలు. పోయినవి పోతాయి, కదిపినవి నిలుస్తాయి. అమృతగాన శీతల తుషారములు, పలుకుదేనెలూ, పవ్వతావులూ సుగమములే. హాలాహల అనల అంధకార జ్వాల ! వెంటబెట్టి వెతకాలి ఇదేమిటో. విశ్వవీణ అనే ఉత్ప్రేక్షా ఇలాటిదే. దశ దిశాతంత్రులు (దశతంత్రుల వీణట!) ఒక్క సుధాశ్రుతిని బెనంగుటూ, చుక్కలు మెట్లగుటా, వింతలలో వింత. 'వీణ' అన్నమాట ముందు అనేసి వర్ణించడము ప్రారంభిస్తే అలం కారము ఇలాగే తయారౌతుంది. పిలుపు అవలమై విశ్వ బ్దాన్ని కాల్చడమూ ఇలాటిదే. కృష్ణపక్షమూ, ప్రవాసము ఊర్వశీ చదువుతూ రాగారాగా రచన మంచులాగ అదృశ్య మౌతూ ''యేలో యెటకో యెటకో జలదాల దాటి తారకల విశాల నీలపథ రాజులనెల్ల పతిక్రమించిపోయి కలియు సోలిపోలి చదలేటి తుషారపు స్వప్నరాసులన్.'' పారలే కాలువలు, ప-పు తడి, విషాద సుఖము అన్నవి సామాన్యుల అనుభవానికి దూరము. మొయిళ్ల కాటుక పొగలు, ఉడుమణి విషాదపూరిత ద్యుతులూ కూడా ఊహాసాధారే.

''మీ మీ అనుభవాల్నిబట్టి రచించండ' ని శివశంకరశాస్త్రి (ఇప్పుడు స్వామి)గారు చేసిన ఆదేశాన్ని కృష్ణశాస్త్రిగారు మితిమీరి పాలించారనిపిస్తుంది ఆయన కొన్ని రచనల్ని పరిశీలిస్తే. అనుభ వాన్ని బట్టి రచించమంటే ఈయన అనుభవాల్నే రచించారు. కవి అనుభవాలు కవిత్వము కాదు, చదువరికి అనుభవాలు కలి గించే రచన కవిత్వము. తా నూహించిన, లేదా అనుభవించిన, ఆనందాన్ని చదువరులకు కూడా కలిగించే ఉద్దేశంతో కవి రచన చేస్తాడు. వ్రాస్తున్నప్పుడు కవిగా వ్రాస్తాడూ, పాఠ కుడుగా చదివి బాగున్నదా లేదా చూసుకుంటాడు కవి. ఒక మాట మారుస్తాడు, ఇంకొక మాటకు చోటు మారుస్తాడూ మళ్లీ చదువుతాడూ సంతుష్టిగా ఉంటే ముందు పద్యం రచించడానికి ఉపక్రమిస్తాడు. కవిలో రచయితా ఉన్నాడూ, చదువరీ—అనగా రసికుడూ—ఉన్నాడు. కవిగా రచిస్తూ రసికు డుగా ఆ రచన అనుభవాన్ని రేపుతున్నదా లేదా అని చూసు కుంటూ చేస్తాడు రచన. అనగా తనవంటి రసికులకు శక్తి వంతంగా తాకి అనుభవాన్ని కలిగించేదిగా తయారుచేస్తాడు రచనని. నేను నా కోసమే రాసుకున్నాననే కవి చెప్పేది నిజము

# శ్రీ కృష్ణశాస్త్రి

కాదు. రచించేటప్పుడు కవి తన కెదురుగా పాఠకు డున్నాడని ఊహించి రచన చెయ్యటం కనుక పాఠకుని కోసము అతడు రచించలేదనడము వట్టి అపోహ. మీరు మిమ్మల్ని అద్దంతో చూసుకుంటూ అలంకరించుకుంటున్నారంటే మీరు ఇతరులకు వెకిలిగా కనబడకుండా సర్దుకుంటున్నారనీ, అందంగా కనబడ డానికి దిద్దుకుంటున్నారనీ కదా అర్థము ? అదే రీతిగా కావ్యాన్నీ, వర్ణచిత్రాన్నీ, శిల్పాన్నీ నిర్మిస్తూ అడుగడుక్కీ రచన ఎట్లా సాగుతున్నదో చూసుకుంటున్నారంటే ఆ సరిగ్గా ఉన్నదో లేదో చూచే వ్యక్తి ఆమోదము కోసము రచిస్తున్నా రన్నమాటే కదా ? ఈ వ్యక్తి సర్వ రసిక లోకానికీ ప్రాతి నిధ్యము వహించిన మీ రాసిక్యమే రూపంగా కలవాడు. కనుక రచన ఎట్లా ఉన్నదీ అని చూసుకున్నవాడల్లా రసికలోకానికి ఉద్దేశించి రచించినవాడే అవుతున్నాడు. రచించేవాడల్లా తన రచన తన ఉద్దేశాన్ని కడతేర్చేటట్టు సాగుతున్నదా లేదా అని చూసుకునితీరాలి. ప్రేయసుడూ కవీ తప్పక చూసుకోవాలి. పిచ్చివాడు చూసుకోడు. తన భావాలు (రసిక) పాఠకునికి కూడా కలగాలని—అది జల్లుమనిపించాలని—చూసుకునే కవి తన రచనని చెక్కి తయారు చేస్తాడు. తన రచనకు ముక్కూ మూలమూ దిద్ది, సర్వ మానవులూ సామాన్యంగా ఉండే తటస్థ స్థితిలో నున్న చదువరి చెయ్యి పట్టి తన కావ్య ప్రపంచంలోనికి తీసుకుపోయి ఆవేగం హెచ్చించి చదువరిని బయల్దేరే ఏరోప్లేనులాగ లాగి భావావేశంలోకి ఎత్తి వదు ల్తాడు. చదువరి భావావేశంలో మగ్గి అనుభవం పొంది ఆనం దిస్తాడు. కథాకావ్య మయ్యేది, భావకావ్య మయ్యేది "అపుడు గొంతెత్తి యేడ్చినాను" అని ప్రారంభిస్తే చదువరి సంకో చిస్తూనే చదువుతాడు. "ఎప్పుడు ? ఏమొచ్చింది ? గొంతెత్తి ఏడ్చే స్థితికి ఎలాగు వచ్చాడూ రచయితా ?" అన్న సందేహా లుండిపోతాయి. కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షములో 26 ఖండములు ముక్కూ మూలముతోనే పుట్టినవి. అబ్బ ! అన్న ఖండము "హృదయ వనజాత మమ మృదు మనోహరదళము లదయతను ద్రుంచినారే, పెంధూళి జిదిమి వెదజల్లినారే" అని ప్రారంభించింది. ఎవరేనా "ఏమి ? ఎందుకు అలాగ జరిగింది ?" అని అడుగు తారు. దానికేమీ సమాధానం లేదు. ఈ ఆరోపణే మరోరీతిగా వచ్చింది. రెండో చరణంలో. ప్రశ్నా సందేహమూ అలాగే ఉండిపోయాయి. మాటవరసకి, ఒకడు భార్యని హత్యచేసి ఉంపుడుకత్తె కామె నగలిచ్చా డనుకోండి. వాణ్ణి తన్నినవారిని గురించి వాడు ఈ మాటలే అనవచ్చును గదా ? నలుగురి యెదటా వాపోయేవారు పూర్వాపరాలు దాచడమేమి ? .... 'ఆశ' అన్న ఖండములో ప్రశ్నలే ఉన్నాయి పొడుపు కథల్లాగ ఎంత గళ ఘోర గంభీర ఫెళఫెళార్భటులతో అడిగినా అదే ప్రశ్న. ఈ ప్రశ్నలలో నిశ్రేణి మెట్లకు వలె ఒకదాని కంటె ఒకదానికి ఎత్తు లేదు. అన్నిటినీ బిగించి సందేశ మివ్వగల చివరి పాదమూ లేదు. ఇది భావాలమూట. ఆ భావ మిక్కడా ఈ భావ మక్కడా పెట్టినా ఏ మార్పూ రాదు. మరో నాలుగు చరణాలు కలిపినా వర్ణగింజంత బరువేనా ఎక్కువకాదు. 'ప్రౌఢరాయక్షితీంద్ర' అన్న పద్యాలలోదే ఇది, రచన మాత్రము ఆధునిక కవిది. "నన్ను గనియేరు జాలి జెందంగ వలదు" అని ప్రారంభించిన పంక్తులకు కూడా పూర్వాపరాలు తెలియవు. లేవు గనుక ! ఇది ఖండకావ్యము కాదు, కావ్య ఖండము. దారిలో దొరికిన ఒక పుట లాంటిది. గళఘోర గంభీర ఫెళఫెళార్భటులు దీనిలోనూ ఉన్నాయి.

"మీరు మనసారగా వేద్వనీరు నన్ను" అన్న ఖండమునకు పూర్వభాగము తెగిపోయింది. 'ఒకసారి నన్ను విడుపుడు' అన్న మాటలు, ఈ పలికే వ్యక్తిని ఎవరో పట్టుకున్నట్టు సూచి స్తున్నాయి. అంతమాత్రమే. పూర్వగాథ తెలియడము లేదు. నా గుప్పిటిలోది ఏమిటో చెప్పమన్న ప్రశ్నకిలాగే, చకితు డౌతాడు చదువరి. సంఘటన (Composition) చిత్ర ములో ఒక ముక్క కత్తిరించి మిగిలిన ముక్కని ఎదుట పెట్టినట్లే ఈ ఖండము ఎదుట పెట్టడమూను. 'కటువ పూ బ్రతుకులో' అన్న రచనలు నాటకాల్లో అభాగినుల వచ నాలు లాగ వినపడుతున్నాయి.

ముక్కూ మూలమూ తెలిసే రచనల్లోనైనా భావ ఝరీగమనములేని రచన లున్నాయి. ఏవో కొన్ని పద్యాలు గుచ్చి పెట్టితే అది ఖండ కావ్యము అయిపోదు. స్వేచ్ఛా గానములో ప్రతిజ్ఞ లున్నాయి అయిదు పద్యాల్లో. ఒక పద్యం తీసినా, ఒకటి కలిపినా మార్పు రాదు. 'స్వేచ్ఛా గానము 2' లోని వరుసలో సార్థకత లేదు. వెత్తి పాట వెత్తికి ఎంతో దూరము లేదు. ఇదేదైనా ఖండకావ్యానికి భాషాంతరీకరణ మేమో. 'ఏను నిద్దుర వోవుదునో యేమొ' అన్నది రవీంద్రుని రచనకు తెలుగు. 'కవికుమార' లో మూడు పద్యాలకీ ఐక్యత లేదు. ఏది తీసేసినా మొత్తపు కావ్యానికి నష్టము కలుగదు. 'మహోదధి' లో భావాలకు బంధము లేదు. మూడు నాలుగు అయిదు ఆరు పాదాలు తీసేసినా నష్టము ఏమీ రాదు! ఎనిమిదోదీ అంతే. వీ టన్నిటా ఆఖరి పాదాలు బిగుతు సళ్లి పోయాయి. 'లోకము'లోని మూడు పద్యాలూ ముక్తకములు, సప్తశతి గాథలవలె నున్నవి. 'ఆఋని దివ్వె' లో మొదటి రెండు పద్యాలతోనూ సఖునికి సంబోధన. తరవాతి మూడింటా సాదా మనికి, చెప్పవలసె ఇలాగు చెప్పేరా ?

కృష్ణశాస్త్రిగారు "శబ్ద సంస్కార మెచ్చటను జారగ నీక పదమైత్రి అర్థ సంపదల బొదలు' నట్లు 'పొసగ ముత్తెపు సరుల్ పోహళించిన లీల' పద్యాలు రచించగలరు. వారి నాటిక లలో అలాంటి రచన సమృద్ధిగా గలదు. భావ చంచల ఆలాటి చోట ఎన్నిమార్లో జరాలున మెరుస్తుంది. (ద్రాక్షరసము లోని పండ్లవలె మధు బిందువుల వంటి వీరి పద్యాలు నాటిక ల్లో రాణించాయి.) 'ఉలికిపడి లేచు కోవెలతోట వలిగలి' 'తొలి ప్రొద్దు కొండపై మొలిచె నొక దేవళము, వెలుగు గుడి మొగసాల నిలిచె యాత్రాజనము' 'పొడుపు వాకిలి గనమ తల్పులు

సడల్చి కనబడని చేయి యేది విప్పినదో కాని నాలుగాళం లోపల మూలమూలలందు చొరబడి పోయినాడా మని దొర !' 'హరి జాతానికి మరిగిపోయే రక్త హృదయం, శాంత ధవళమైన మైమూర్తి'ట ! 'ప్రక్కనున్న సైకతవీధి కంటె మూగగా నున్నది' ట యమున. 'కడలి యేదో గౌతమేదో ఏకమైన ఏడు పాయలు !' నాటినుండి నేటివరకూ ఇంపుగ మోగుతున్నది వీరి కవితాకన్య చరణ మంజీర కింకిణి. మధు బిందువుల నందించే పూవులు వీరి కవితావనములో వికసించాయి, వికసిస్తున్నాయి. బృందన్విడిన కృష్ణస్వామి, కైలాసగిరినుండి కాశికీ, కాశికాపురి నుండి యెదటికీ వచ్చి టిన కన్నీటి బిందువులను, సరము గూర్చుట కోసమై చేయిచాచాలని ఈయన ఆశయము. వెన్నెల్లు పరచినా విన్న పానుపు మీద కన్ను విప్పక పన్నుండు కరిమబ్బు చాటునుంచి, తరుణతమాల కిసాల సమాన శ్యామల కోమల చారు శరీరి, హరిచందన వనమ్ము నుండి మ్రోయు చైత్రమాస పదకింకిణీరవముల కోలాహలమ్ములతో హాహాహూమాయితమై, తరళ తరళమలయానిలలోల తరంగవలిత! వసనాంచలముల గుసగుసలతో, వచ్చును గాక జగత్ప్రభువు! రచింతురుగాక వీరు తేనె పెల్లువంటి నిండైన ఖండ కావ్యములు.

కృష్ణశాస్త్రిగారి రచనలలో, అంతకన్నా యెక్కువగా ఆయన కావ్య పఠనాలతో, ఆధునిక కవిత్వానికి సత్తా చేకూరినది. వారి వ్యక్తి అప్పటివారి రచనలలో పూర్తిగా రూపొందలేదు. సంప్రదాయమును అతిక్రమించని శైలితో వారు రచించి, చక్కగా పాడుతూ వినిపించేవారు. కనుక 'ఏదియొ అపూర్వ మధుర రక్తి స్ఫురియించు గాని, అర్థమ్ము గాని' భావ కవిత్వముగా జను కట్టేరు యువకులు వారి రచనని. వాచ్యార్థము వట్టి తేటతెల్లముకాని అంతరార్థమేదో వారి రచనలలో ఇమిడి ఉన్నదని నమ్మేవా రెంద రెందరో. ఈ నమ్మకలో అజ్ఞాత అగోచర సౌందర్యాన్ని దేన్నో అన్వేషిస్తూ రచించడమూ, గిరించిన ప్రేయసినో అప్రాప్త మనోహరినో ఉద్దేశించి దుఃఖ గీతాలు రచించడమూ, లోకపు వైముఖ్యమును ఊహించుకుని పడదిట్టడమూ ప్రారంభించారు 1920 తరువాతి నాటి నవ కవులు. వేదనా దుఃఖమూ, ఏదో చెప్పరాని సౌందర్యాన్వేషణా, ప్రియురాలి పాదలాక్షకు హృదయరక్త మర్పించడమూ, ప్రియురాలిని కూడగట్టుకుని మృత్యు మందిరంలో దూకుతా మనడమూ ఆనాటి రచనలలో జల్లు జల్లులుగా కురిశాయి. కావ్య పఠనాలూ కృష్ణశాస్త్రి రూపానుకరణాలూ చెప్పనే అక్కర్లేదు. 'భావ కవి' కి రూపమూ కావ్య వస్తువూ, (గీత పద్య) ఛందస్సూ, నాట్యరంగమూ ఏర్పడ్డాయి. ఈ భావ కవిత్వపు గుడారుకు కృష్ణశాస్త్రిగారు మూలస్తంభమై నిలిచారు. అయితే మన దురదృష్టము వారి అనుయాయుల రచనల లోనూ కావ్యసిద్ధి కలిగి రసానందము కలిగించగల నిండు భావ కావ్యాలకంటె కవిత్వపు తునకలు గల సంక్లిష్ట రచనలే ఎక్కువ వచ్చాయి.

సీ. జీవిని జీవి భక్షింపఁ జేసితి వింతె
కొనిపెట్టినావె చేతనుల కెల్ల ?
చేసినంత భుజింపఁ జేసినా వింతె కా
కెక్కువ లెవ్వరికిచ్చినావు ?
కర్మసూత్రంబునఁ గట్టి త్రిప్పెదవు గా
కిచ్చ నొక్కనిఁ బోవ నిచ్చినావె ?
వెనఁ బృథక్ప్రకృతుల వేయుఁ బెట్టితిగా
కందఱ కైకమత్య మిడినావె ?
గీ. తెలిసె నీ రక్షకత్వంబు దేవదేవ !
వేఱెగతిలేక నిన్ను సేవింపవలసె
చిత్రచిత్ర ప్రభావ ! దాక్షిణ్యభావ
హతవిమతజీవ ! శ్రీకాకుళాంధ్రదేవ !

తేడా. మిజోవిద్రోహుల పద్ధతి, నాగవిద్రోహుల పద్ధతి ఒక్కటిగా వుంది. ఇప్పుడు యీ సమస్య ఇట్లా జటిల సమస్యగా తయారైంది. పటస్కర్ సంఘం నివేదిక ప్రాతిపదికగా ఈమిజో సమస్య గాని, లేక అస్సాం కొండప్రాంతపు సమస్యగాని పరిష్కారం అవుతాయా? ఆ ఆశ ఇప్పుడు కన్పించడం లేదు. ముందు ఇది యెట్లా పరిణమిస్తుందో చెప్పలేము. ప్రభుత్వం ఇప్పుడు పటస్కర్ నివేదికను పరిశీలించబోవడం లేదన్న వార్తలు వినవస్తున్నాయి. అంటే ఎన్నికలు పూర్తిఅయ్యేదాకా ఈ వ్యవహారం సంగతి ఎత్తుకోదని అర్థమా? చెప్పలేము. ఏది ఎట్లా వున్నప్పటికి, యీ మిజో సమస్య, యీ పర్వతప్రాంతపు జిల్లాల వ్యవహారం త్వరితగతిని పరిష్కారం కావడం అవసరం.

## కలగూరగంప:

# సింధులిపి - బ్రాహ్మీలిపి

అక్షరశాస్త్రవేత్తలను, ముఖ్యంగా శిలాలేఖా శాస్త్రవేత్తలను ప్రధానమైన సమస్యలు కొన్ని ఎదుర్కొంటున్నాయి. ఈ సమస్యలమూలంగా భారత దేశం పురా చరిత్రను పునర్నిర్మించడం కష్టం అవుతున్నది. కొన్నికొన్ని విషయాలు అంతుపట్టడం లేదు. అందువల్ల చరిత్రకు సంబంధించిన స్థలాలలో త్రవ్వకాలు సాగిస్తూ, ఈ అంతుపట్టని విషయాల అంతు ఏమిటో తేల్చుకొనడానికి చరిత్రవేత్తలు పెద్దప్రయత్నాలు చేస్తున్నారు. దిబ్బలను గాలిస్తున్నారు. రాళ్లను కదిలిస్తున్నారు. శిలలమీద వ్రాసివున్న అక్షరాల అర్థం ఏమున్నా అంతు పడుతుందేమో నని అన్వేషిస్తున్నారు. ఇటువంటి అన్వేషకులలో శ్రీ ఎస్. కే. రే ఒకరు.

భారతదేశచరిత్రకు సంబంధించిన ఒక కాలాన్ని—అది అతి పురాతనమైనకాలం కూడాను—గురించి ఇదమిద్ధం అని తేల్చడానికి సింధులిపి ఒక ఆధారంఅయితే ఆ లిపి సంగతి ఇంతవరకు అంతుచిక్కలేదు. ఏవో అక్షరాలు, మాటలు వున్నాయిగాని, వాటి అర్థం ఏమిటో అవగతం కావడంలేదు. 1935 నుంచి శ్రీ రే యీ అక్షరాల సంగతి ఏమిటో పరిశోధన సాగిస్తున్నారు. ఇప్పుడు ఆయనకు దీని అంతు ఏమిటో తేల్చడానికి కొంతవరకు సమర్థమైన ఆధారం ఒకటి లభించినట్లు కన్పిస్తున్నది.

దక్షిణ భారత దేశంలో సొనూర్‌వద్ద, బెంగాల్‌లో గంగానదిఒడ్డున వున్న చంద్రకేతుఘర్ వద్ద చరిత్రకు సంబంధించిన త్రవ్వకాలు కొనసాగుతున్నాయి. చంద్రకేతుఘర్ వద్ద ఎచ్చట ఈ త్రవ్వకాలు సాగుతున్నాయో? ఆ స్థలం ఒకప్పుడు గంగలో ఒక పాయసముద్రంలోపడుతూవచ్చిన స్థలంగా భావించబడుతున్నది. ఇప్పుడు ఈ రెండు చోట్ల కొనసాగుతున్న త్రవ్వకాలవలన, బయిటపడిన విశేషాలవలన భారత పురావిచరిత్రకు సంబంధించిన కొన్నిరహస్యాలు—ఇంతవరకు దుర్గ్రాహ్యంగా వుంటూ వున్నవి—పరిష్కారం కాగల అవకాశం ఏర్పడుతున్నట్లు శ్రీ రే భావిస్తున్నారు. భారత దేశంలో శిలాలేఖనానికి సంబంధించిన వివరాలు మసక మసకగా వుంటున్నాయి. ఇప్పుడు ఆ మసకచీకటి తొలగి వెలుగులు ప్రసరించే అవకాశం కుదిరివస్తున్నట్లు శ్రీ రే పేర్కొంటున్నారు.

భారతదేశం చరిత్రలో సింధునాగరికత ఒక కాలానికి సంబంధించింది. ఆ తర్వాత ఈ చరిత్ర సంగతి ఏమో అంతు పట్టడం లేదు. మౌర్యులు మగధలో రాజ్యం కట్టుకున్న తర్వాతనుంచీ తిరిగి చరిత్ర సంగతి అంతుపడుతున్నది. ఈ రెండుకాలాల మధ్య కాలంలో నడిచిన చరిత్ర సంగతి ఏమిటి? ఈ నడిమి కాలం దాదాపు వెయ్యి సంవత్సరాలన్నా వుంటుందని చారిత్రకులు భావిస్తున్నారు. సింధు నాగరికత క్రీ. పూ. 1500 ప్రాంతంలో అంతం పోయిందంటారు. కాని మనచరిత్ర క్రీ. పూ. 300 నాటి కాలాన్ని దాటి అంతుపట్టడం లేదు. సరియైన ఆధారాలతో తెలుస్తున్న చరిత్ర అంతవరకే ఎరుకకు వస్తున్నది.

సింధునాగరికతనాటి కాలము, మౌర్యుల కాలములకు మధ్య నడిచిన కాలంలో జనం ఎటువంటి 'లిపు'లను వాడారు ? లిపియొక్క పరిణామం యేవిధంగా వుంది? మౌర్యులకాలంలో బ్రాహ్మీ లిపి వాడుకలో వున్నదన్న విషయం అందరికీ తెలిసిందే; సింధులిపికి, బ్రహ్మీ లిపికి సంబంధాన్ని కుదిర్చే లిపి ఏదన్నా వున్నదా? ఇటువంటి సమస్యలు ఇక్కడ ఇన్నివున్నాయి. ఈ సమస్యయొక్క పరిష్కారానికి ఇప్పుడు సొనూర్, చంద్రకేతుఘర్‌లలో జరుగుతున్న త్రవ్వకాలు తోడ్పడుతున్నట్లు భావించబడుతున్నది.

ఈ త్రవ్వకాలలో అనేకమైన మృణ్ముద్రలు దొరికాయి. అశ్మముద్రలు కూడా లభించాయి. ఇవి సింధునాగరికత, మౌర్య రాజ్య కాలములకు మధ్య నడిచిన కాలమునకు సంబంధించినవి. ఈ ముద్రల మీద ఏవో అక్షరాలు, సంజ్ఞలు వున్నాయి. ఇప్పుడు లభించిన యీ ముద్రల ద్వారమున సింధు లిపి, బ్రాహ్మీలిపుల నడిమి కాలముల నాటి 'లిపు'ల విషయమును తెలుసుకొనడము తేలిక అవుతున్న దని శ్రీ రే భావిస్తున్నారు. ఈ ముద్రలమీద వున్న అక్షరాలు దాదాపు సింధులిపిని పోలివున్నాయి. కొంత భేదం కూడా వుంది. అందువల్ల సింధు లిపి ఆ అనంతర కాలాలలో ఎట్లా పరిణామాలు చెందుతూ వచ్చింది తెలియడానికి ఈ లిపి సహాయకారి, ఆధారము కావచ్చునని శ్రీ రే చెబుతున్నారు.

ఈలిపిని, సింధులిపిని, బ్రాహ్మీలిపిని ఉపయోగించి, సింధు లిపిని బ్రాహ్మీలిపితో అనుసంధించే ప్రయత్నంలో శ్రీ రే దాదాపు 40 పట్టీలు తయారుచేశారు. ఈ పట్టీలలో ఒకటి మౌర్యులు సామ్రాజ్యాన్ని కట్టకముందు నడిచినకాలానికి చెందినది కూడా ఒకటివుంది. ఇది క్రీ.పూ. 300—900 మధ్యకాలంనాటి లిపి విశేషం కావచ్చునని భావించ బడుతున్నది. ఈ లిపి విశేషం పశ్చిమబెంగాల్‌లో చంద్రకేతుఘర్‌వద్ద జరుగుతున్న త్రవ్వకాలలో లభించింది. కలకత్తా విశ్వవిద్యాలయంలోని అసుతోష్ మ్యూజియంవారు దీనిని సంపాయించారు.

ఇప్పుడు ఈ క్రొత్తలిపి విశేషాలు లభ్యము కావడముతో సింధులిపిని అవగతం చేసుకొనడానికి అయిన మార్గం సుగమం అయినట్లు శ్రీ రే చెబుతున్నారు. బ్రాహ్మీ, సానూర్, చంద్రకేతుఘర్ లిపుల ద్వారా, సింధులిపి రహస్యాన్ని భేదించవచ్చునని, అంతుపట్టకుండా వుండిన యీ పురాచరిత్ర రహస్యం కాలక్రమాన పరిష్కారం కాగలదని కూడా ఆయన అంటున్నారు.

## సంస్కృత విశ్వపరిషత్

సంస్కృత విశ్వపరిషత్తును స్థాపించి ఇప్పటికి దాదాపు 14 సంవత్సరాలు కావచ్చుచున్నది. ఈ పరిషత్తు మొదటి సమావేశము 1951లో సోమ్‌నాథ్‌లో జరిగినది. ఆ తరువాత తిరుపతి మొదలైన చోట్ల ఈ పరిషత్తు సమావేశాలు జరుగుచూ వచ్చినవి. ఈ సంవత్సరము మేనెల చివరలో తిరిగి యీ పరిషత్తు సమావేశము బెంగుళూరులో జరిగినది. ఇది ఎనిమిదవ సమావేశము. దీనినిబట్టి ప్రతిసంవత్సరము ఈ సమావేశములు జరగుటలేదని అర్థమగుచున్నది. ఇప్పుడు యీ ఎనిమిదవ సమావేశము శ్రీ కే. ఎం. మున్షీ అధ్యక్షతను జరిగినది. రాష్ట్రపతి డా. రాధాకృష్ణన్ ఈ సభలను ప్రారంభము చేసినారు.

శ్రీ మున్షీ తమ అధ్యక్షోపన్యాసములో సంస్కృతమును గురించి కొన్ని ముఖ్య విషయములు వివరించినారు. వానిని ఇచ్చట పొందుపరచుచున్నాము.

''మనదేశములో భాషా సంబంధమైన, సాంస్కృతిక సంబంధమైన, ఆధ్యాత్మిక సంబంధమైన అభివృద్ధిలో సంస్కృతముయొక్క ప్రాముఖ్యము ఏలాగున వుంటూ వచ్చినదియు చెప్పనవసరములేదు. ఈ విషయము అంతయు సాకల్యముగా తెలిసినవారికి త్రిభాషాసూత్రమును చూచినట్లయితే భయము వేయుచున్నది. ఈసూత్రము ఇంగ్లీషు, హిందీ, ప్రాంతీయ భాష ఇట్లావున్నది. ఆసూత్రమును అమలుపరచడము అంటే, సంస్కృతమునకు మరణశిక్ష విధించడమే. కొంతకాలము గడిచిన తర్వాత తలపెత్తే నూతనమేధావి వర్గమునకు సంస్కృతములంటే పట్టకనేపోవచ్చును.

సంస్కృతముయొక్క బలము లేకుండా ప్రాంతీయ భాషలలో విద్యాబోధనకు దిగడము దేశము యొక్క సాంస్కృతిక ఐకమత్యమును దెబ్బతీయడమే. అందువలన సెకండరీ విద్యాదశలో ఏదో ఒక స్థాయిలో సంస్కృతమును నిర్బంధము చేయవలసిన అవసరము కన్పడుతున్నది. ప్రభుత్వములు, ప్రజాసంస్థలు వ్యక్తులు కూడా ఇందు నిమిత్తము ఆసక్తితో

కృషి చేయడము అవసరము. మన విద్యావిధానములో సంస్కృతమునకు స్థానములేకుండా చేయడమనగా మన జీవితములో ఆద్యభాషకు వున్న ప్రాధాన్యమునకు స్థానమును గుర్తించక దానిని మూలలకు నెట్టడమే కాగలదు. సంస్కృత భాషయేమి, సంస్కృత వాఙ్మయ మేమి మనకు, మన దేశమునకు అక్షుణ్ణమైన పరంపరను సమకూర్చడము చరిత్రలో అత్యాశ్చర్యకరమైన విషయము.

సంస్కృతమును బోధించుటలో పూర్వ పద్ధతి ఒకటి వున్నది. ఆ తరువాత బ్రిటిష్‌వారి కాలమున క్రొత్త పద్ధతిలో సంస్కృతమును అధ్యయనము చేయుట ఆరంభమైనది. ఈ నవీన పద్ధతిలో ప్రతిభను పోషించు ఏర్పాటులేదు. ఇది శవ పరీక్షవతుగా తయారైనది. పాత పద్ధతిదారి పాత పద్ధతిది, నవీన పద్ధతిదారి నవీనపద్ధతిది అయినవి. ఇందువలన కొన్ని క్లిష్ట సమస్య లేర్పడినవి. శాస్త్రముల అధ్యయనము, వాని పరిణామము అరికట్టబడినది. పూర్వ పద్ధతి పండితులన్న ఆదరణము తగ్గిపోవుచున్నది. వారి సంఖ్య కూడ తగ్గుచున్నది. స్వాతంత్ర్యము రాకముందు ఈ పండితులను, ఆ విద్యలను ఆదరించెడువారు కొందరు ఉండెడివారు. ఇప్పుడులేరు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు వీరిని ఇప్పుడు ఆదరించవలయు నంతగా ఆదరించడములేదు. అందువలన పాత పద్ధతిలో సంస్కృతము నభ్యసించిన పండితులలో నిస్పృహ అధికమైపోవుచున్నది.

కొన్ని కొన్ని విశ్వ విద్యాలయములలో పురాభారత చరిత్రను గరపుటకుగాను నియమితులగుచున్న ఆచార్యులలో మూలమున పంచతంత్రమును చదివి అర్థము చేసికొనెడి మాత్రము సంస్కృతము రానివారు కూడ ఉన్నారు. అయితే భారతదేశ సంప్రదాయమును సంరక్షించుకొనవలయునన్నచో పాత పద్ధతి సంస్కృతాధ్యయనమును వదిలిపెట్టి లాభములేదు. ఇటు యీ పూర్వ పద్ధతిని, అటు నవీన పద్ధతిని కూడ సంరక్షించవలయునన్నచో, ఈ రెండు పద్ధతులయందలి మేలి విషయములను సమన్వయముచేసి, అధ్యయన పద్ధతిని ఏర్పరించవలయు నవసరమున్నది.

ఇందుకుగాను జరగవలయు పనులు ఇవి: (1) దేశము అంతటా సంస్కృత విద్యాబోధనము ఏక తీరున వుండవలయును. సంస్కృత విద్యాబోధనము నందు కొంతవరకు పాతపద్ధతి అనుసరింపబడవలయును

(2) విశ్వవిద్యాలయముస్థాయిలో సంస్కృతమును ప్రత్యేక విషయముగా నభ్యసింపగోరువారు భాషా శాస్త్ర, సరూప్య శబ్ద శాస్త్రములయందేగాక, సంస్కృతమునందలి వివిధ శాస్త్రములను కూడ పాత పద్ధతిలో కొంతవరకైనను నభ్యసించియుండవలెను

ఇది ఇట్లుగా జరిగినచో ప్రొఫెసరు, పండిట్ విభేదము క్రమముగా రహితమై పోగలదు. నవీన పద్ధతి సంస్కృత పాండిత్య విశేషము దేశమున పాదుకొనును.''

సంస్కృత విశ్వపరిషత్‌వారు యీ సమావేశములో కొన్ని ముఖ్యమైన తీర్మానములు చేసిరి. (1) మాతృ భాషల మూలమునందు ఇచ్చిగాని, లేక మరి ఇతరమైన పద్ధతిద్వారాగాని సంస్కృత భాషాధ్యయనమునకు గతి కల్పించుటకు వీలుగా అధికారులతో మంతనములు జరుపుటకు ఒక ప్రతినిధివర్గమును పంపుటకు నిశ్చయము చేసినారు. ఈ ప్రతినిధివర్గములో డా. సి. పి. రామస్వామిఅయ్యరు, డా. ఏ. ఎల్. మొదలియార్, డా. సునీతకుమార్ ఛటర్జీ, డా. బి. రామకృష్ణరావు, శ్రీ పి. బి. గజేంద్రగాడ్కర్, శ్రీ ఆర్. ఆర్. దివాకర్ లు సభ్యులు.

(2) ప్రభుత్వోద్యోగములలో ప్రవేశించగోరువారికి సంస్కృతములో పరీక్ష ఇచ్చుట నిర్బంధముచేయవలెను.

(3) ప్రతి రాష్ట్రమునందును సంస్కృత పరిషత్తులను నెలకొల్పవలెను. వీనిని సమన్వయము చేయుటకు కేంద్ర పరిషత్తు ఒకటి ఉండవలయును.

—హా. శి.

# గోధుమల ప్రసక్తి

వేదకాలమునుండి భారత వర్షములో గోధుమలు ఆహారముగా వాడినట్లు చాల తార్కాణలు చూపవచ్చును. ఆర్యావర్తములో అధిక సంఖ్యాకులు గోధుమలే నైవేద్యంపెట్టి దేవతారాధన చేసేవారు. స్కాంద

వాదంలో సారంలేదు. ఎందుచేతనంటే మనం ఏ దేశాలతో మన దేశాన్ని యీ విషయంలో పోల్చి చెప్పు కుంటూవుంటామో, ఆ దేశాలు మనకన్నా ఎక్కువ సహజ సంపదలు కలవి, పారిశ్రామికంగా అభివృద్ధి చెందినవీ అయివుండటమే ఇందుకు కారణం. ప్రపంచంలో మనతో యీ జనాభా పెరుగుదల విషయంలో పోల్చదగిన రాజ్యాలు ప్రధానంగా కొన్నే ఉన్నాయి. వానిలో చైనా, కొరియా, ఫార్మోజా మొదలైన వాటిని ముఖ్యంగా పేర్కొనవచ్చు. ఈ దేశాలలో చైనా మనం ఎదుర్కొంటున్నటువంటి సమస్యలనే ఎదుర్కొంటున్నా, ఆ దేశం ఎక్కువ వైశాల్యం కల్గింది, ఎక్కువ సహజసంపదలు కల్గింది అన్న విషయం ఒకటి వుంది.

పరిశ్రమలు అభివృద్ధిచెందుతూవున్న కొద్దీ జనాభా సమస్య తేలిక పడుతుందన్న వాదం ఇంకొకటివుంది. జనాభా తక్కువవగావున్న దేశాలలో ఈ వాదం కొంత వరకు చెల్లవచ్చు. కాని అక్కడకూడా చెల్లుతున్నట్లు కన్పించదు. రష్యా ఒక ఉదాహరణం. అమెరికాకు కూడా యీ జనాభా సమస్య లేకపోలేదని డా॥ చంద్రశేఖర్ ఇటీవల అమెరికాలో ఒకచోట మాట్లాడుతూ అన్నారు.

జనాభా పెరుగుదలకు దేశంలో జననపురేటు, మరణపు రేట్లకు సన్నిహిత సంబంధంవుంది. జననాలు అధికము, మరణాలు తక్కువ అయితే జనాభా పెరుగుతుంది. ఏ దేశంలోనైనాసరే పరిస్థితులు మామూలుగా ఉన్నప్పుడు 1000 కి 40 జననాలు పెద్ద విషయం కాదని, అది మామూలు విషయమని ప్రొఫెసర్ టాసిగ్ ఎప్పుడో అన్నారు. ఆయన వాడిన మాట—Normally constituted population— అని. ఆ జనాభా అట్లా వున్నప్పుడు 1000 కి 40 జననాలు అయితే ఇబ్బందిలేదు. మరి ఆ జనాభా— Normally constituted —కానప్పుడు 40 చొప్పున పెరుగుదల కూడా అధికమే అవుతుంది. ఇప్పుడు భారతదేశం జనాభా పెరుగుదల విషయంలో ఎదుర్కొంటున్న ప్రధానమైన సమస్యే ఇది.

ఒకప్పుడు మన ఆర్థికవేత్తలు జనాభా సమస్యలను గూర్చి ఆలోచన చేసినప్పుడు భారతదేశంలో జననాలు ఎట్లాఎక్కువో, మరణాలు అట్లానే ఎక్కువ గనుక, మొత్తంజనాభా లెక్కకువచ్చేజనంతక్కువగానే ఉంటుందని అంటూ ఉండేవారు. వారు అట్లా అనిన రోజుల్లో పరిస్థితికూడా అట్లాగే ఉండేది. కాని ఇప్పుడు ఆ పరిస్థితులలో ఎంతో మార్పు వచ్చింది. ఈ విషయం పైన పేర్కొనడం జరిగేవుంది. దేశం అభివృద్ధి చెందుతూ ఉండగా, ప్రజలకు సౌకర్యాలు కల్పన అవుతూవుండగా, ప్రజల ఆరోగ్యాదికమైన విషయాలలో శ్రద్ధ అధికం అవుతూవుండగా, మరణముల సంఖ్య పూర్వంకన్నా తగ్గుతున్నది. జననముల సంఖ్య పెరుగుతున్నది. ఇతర దేశాలతో పోల్చి చూచుకుంటే, ఈ మరణములసంఖ్య అధికమే కావచ్చు. కాని మన దేశంలో పరిస్థితులతో పోల్చుకుచూచుకుంటే తక్కువే. ఆ కారణంచేత, ఇచ్చట పరిస్థితిమారి, మొత్తం జనాభాలో కొత్తగా లెక్కకు వచ్చే జనం సంఖ్య అధికం అవుతున్నది. అందుచేతనే దేశంలో కుటుంబ నియంత్రణం మొదలైన సిద్ధాంతాలు ప్రచారంలోకి వస్తున్నాయి. జననముల సంఖ్య హెచ్చుగా ఉండటానికి ఏవి, ఈ దేశంలో ఉదాహరణకు, 1920 ప్రాంతాలలో చెప్పబడినవో, ఇప్పుడుగూడా దాదాపు అవే కారణాలుగా ఉన్నాయి. అప్పుడు మరణము సంఖ్య అధికంగా ఉండటానికి ఏవి కారణాలు చెర్పబడిఉన్నవో అవి ఇప్పుడు కొంతకు కొంత సర్దుకుంటున్నాయి. కొత్తగా స్వాతంత్ర్యాన్ని పొంది ఆర్థికమైన అభివృద్ధిని సాధించడానికి పూనుకున్న దేశాలు అన్నింటిలోను దాదాపు పరిస్థితులు ఇదేవిధంగా ఉన్నాయి. అయితే భారతదేశం, చైనాలవంటి దేశాల విశిష్టత ఏమంటే, ఈ రెండు దేశాలున్నూ, జనాభా అధికంగా పెరిగే లక్షణంగల ప్రాంతాలుగా ఉన్నాయి.

లేఖలు :

# సమగ్ర ఆంధ్ర సాహిత్యము

ఆర్యా

భారతి పాఠకులలో నేనొకడను. ఇంతకాలానికి 66 ఫిబ్రవరినెల భారతిలో 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం'' అనే శీర్షికతో శ్రీ నిడుదవోలు వెంకటరావు గారు వ్రాస్తున్న వ్యాసమందలి ఒక పద్యం నన్నెంతో ఆకర్షించింది. అదేమిటన శేషనాథుడు తెలుగుసంస్కృత భాషావిశిష్టతలనుగూర్చి చెప్పిన పూర్తిపద్యాన్ని యిందులో వుదహరించారు. ఆ పద్యాన్ని చదివినప్పుడు నేనెంతో ఆనందించి వారికి నా హృదయ పూర్వక నమస్కృతుల నందించదలచితిని. ఆపద్యం క్రింద నుదహరిస్తాను.

''జనని సమస్త భాషలకు
సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థ గౌరవ వికాసి
తెనుంగభిరమ్యమంతకున్
గనుంగొనఁ జాత బీజమునకం బెను
కోమల పత్ర పుష్ప శో
భన మృదు పల్లవాభినవరమ్య
రసాలము సొంపు నింపదే.

ఇందులో నాల్గవపాదం యతి తప్పని తలంచు చుంటిని. అసలు పాఠాంతరం అదేనా? లేక ''శోభనమృదు పల్లవాభినవ భవ్య రసాలము సొంపు నింపదే'' అనియా ; ఒకవేళ 'అభినవ భవ్య' అయితే ''అభినవ రమ్య రసాలము'' అన్నంత నిండుతనం లేదను కుంటాను.

ఏది ఎలాగున్నా అసలు పాఠాంతరం తప్పక తెలియజేస్తారని ఆశిస్తాను. ఇంతగా ఎందుకు కోరవలసివచ్చినదంటే అది కంఠస్థం చేయదగిన పద్యం. అందుకని మిమ్మల నింతగా ప్రార్థిస్తున్నాను.

— ఉల్లి రామసుబ్బయ్య.

## ఓడ్యాణ దేశము

ఆర్యా !

మార్చినెల (1966) భారతిలో కలగారగంప శీర్షిక క్రింద 'నాంధ్రదేశమునకు ఓడ్యాణ దేశమని పేరున్నదా?' యను విషయముపై శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారి వ్యాసము చూచితిని. బౌద్ధ యాత్రికుడు ఫాహియాన్ వ్రాతం ప్రకారము భారతదేశములో ధాన్య కటక సమీపప్రాంతమునకు 'ఉడ్డియాన దేశము' అని పేరున్నట్లు 1956 డిశంబరు భారతిలో శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వ్రాసినట్లు ఆ వ్యాసములో నుదహరించినారు. శ్రీకాకుళముజిల్లాలో సోంపేట, ఇచ్ఛాపురం తాలూకాల పొడవునగల సముద్రతీరప్రాంత జనపదముల నన్నిటిని ప్రజలు నేడును 'ఉద్దాన'మనిపిలుచు చుంటారు. ఓడ్యాణమన్నపేరు జన సామాన్యమునోట నానాటికి 'ఉద్దాన'ముగ మారియుండవచ్చునని నా యనుమానము. కొన్నాళ్ళక్రిందట భారతిలో పుస్తక సమీక్షలో శ్రీకాకుళముజిల్లాకు చెందిన కవిగారొకరు ఆ 'ఉద్దాన' ప్రాంతమునే 'ఉద్యానము'గా సంస్కరించి కావ్యమునుగూడ వ్రాసినట్లు చదివితిని. ధాన్య కటక మనగా ఒరిస్సాలోనున్న 'కటక్' అగునెడల నిప్పటి 'ఉద్దాన' ప్రాంతమే యప్పటి ఓడ్యాణదేశమని చెప్పుటకు వీలున్నదికదా. ఈ యుత్తరమును వ్రాయుటలో నా యుద్దేశము శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

గారి వ్యాసమును పూర్వపక్షముచేయుట మాత్రము గాదు. నేను చారిత్రిక విషయములను పరిశోధించువాడనుగాను. శ్రీకాకుళముజిల్లా మా స్వంతజిల్లా యగుటచే ప్రస్తుతము ఆ ప్రాంతము 'ఉద్దాన'మని వ్యవహరింపబడుచుండుటచే నీ విషయమును జిజ్ఞాసువుల దృష్టికి తీసికొనివచ్చిన యెడల 'ఓడ్యాణదేశ'పు టునికిని గురించి వారు చేయు ప్రయత్నమునకు ఇది సహాయకారి కాగలదను తలంపుతో మాత్రమే.

—పుట్కా మురళీరావు.

## ఆంధ్ర వాఙ్మయంలో స్తబ్ధత

ఆర్యా!

మార్చి 1966 భారతిలో శ్రీ పరిగి రాధాకృష్ణగారు ఆంధ్ర వాఙ్మయంలో స్తబ్దత అన్న విషయంపైన వ్రాసిన లేఖ చూచాను.

నేను 1965 డిశంబరు భారతిలో ఇదే విషయంపై వ్రాస్తూ శాస్త్రకారులమీద ఏవేవో అయోగ్యమైన ఆరోపణలు చేశాననీ, గుండెలు బాదుకున్నాననీ శ్రీ పరిగి రాధాకృష్ణగారు వ్రాశారు. సామరస్య వైఖరి ఉండాలనీ—సహనం ఉండాలనీ వారు వ్రాయడం బాగానే ఉన్నది. కాని ఈ రెండు గుణాలే శ్రీ రాధాకృష్ణగారి లేఖలో లోపించాయి. ఆయన దృష్టిలో నచ్చని అభిప్రాయాలు విమర్శించవచ్చు—కాని "గుండెలు బాదుకోవడం"—"సంకుచితమనోభావాలు" ఎందుకు? ఈ మాటలను బట్టేఅసహనం—సామరస్య వైఖరి లేకపోవడం శ్రీ రాధాకృష్ణగారి స్వార్జితాలని తేలిపోతున్నది. అసలు గుండెలు బాదుకున్నదీ వారే కాని నేను కాదు. నాకది చేతకాదు. "కీర్తి కండూతి" కూడా వారికి జాస్తిగా ఉన్నదన్నమాట. గుప్తనామంతో వ్రాస్తున్నవాళ్లకు 'కండూతి' ఉన్నదని భావించడం అసందర్భంగావుంది. కీర్తి కావాలంటే అసలు పేరు పెట్టుకోవాలి! మారుపేరుతో రాదు. అసలు కీర్తి కావాలనుకుంటేమాత్రం తప్పేమున్నది!

రచనల్ని విమర్శించనక్కరలేదనీ, కాలమే తేలుస్తుందని శ్రీ రాధాకృష్ణగారు అన్నమాట లోకానుకూలంగాలేవు. రచన అంటూ ఉన్నప్పుడు విమర్శవుంది. రచనే ఒక విమర్శ. విమర్శే అక్కరలేదనే సాహసానికి ఎవ్వరూ ఒడికట్టలేదు. శ్రీ రాధాకృష్ణగారి అభిప్రాయాన్ని మన్నిస్తే—ఆయన వ్రాసిన విమర్శ కూడా అనుచితమే అవుతుంది. నా విమర్శనను కూడా కాలానికే వదలివేయవచ్చుగా! అయినా అసలు కాలానికి వదలివేయటం అంటే ఏమిటి! కాలం వచ్చి చెబుతుందా! ఈ సందర్భంలో ఇంకా ఏమి వ్రాసినా పునరుక్తిగాను అధికప్రసంగంగాను ఉంటుంది.

ఈ చర్చ జరిగిన ధోరణిని శ్రీ రాధాకృష్ణగారు సరిగా గ్రహించిఉంటే, ఈ అసహనమైన సాహసానికి వచ్చివుండేవారుకాదు. అక్టోబరు 1965 భారతిలో హా. శి. గారు మన రచయితలలో స్తబ్దతను గురించి వ్రాశారు. అందులో ఆయన తెలుగుదేశంలో ఒక్క మేధావివర్గంలోనేగాక, తక్కిన అన్ని వర్గాల లోను ప్రాదుర్భవించిన చైతన్యముయొక్క దారిద్ర్యానికి గుర్తులుకనపడుతున్నాయనీ,రచయితలు ప్రతిభను చంపుకొని వైక్లబ్యానికి గురిఅయ్యారనీ, ఒక విధమైన జాడ్యస్థితిని భజిస్తున్నారనీ, స్తబ్దతలో వున్నారనీ—అసలు ఆదినుంచీ తెలుగుభాషకు తర్కామాల గతి పట్టిందని, స్వోపజ్ఞమైన వూహాశాలిత్వం లేకపోయిందనీ వ్రాస్తూ—మొత్తం యావత్తు వాఙ్మయంమీదా, అందరు రచయితలమీద అభియోగం తెచ్చారు. ఈ అభియోగం అంగీకరిస్తే—తెలుగు వాఙ్మయమంతా నాసిరకందేనని ఒప్పుకుంటున్నామన్న మాట. ఈ అభియోగం సరికాదని ప్రథమంగా నేను వ్రాశాను.

ఆటువంటప్పుడు శాస్త్రకారులమీద అన్న నాలుగు ప్రాసంగిక వచనాలకు బాధ ఎందుకూ? పైగా శాస్త్ర

కారులమీద నాకు ద్వేషంలేదు. ఈమాట నేను చెప్పేవున్నాను. తాము అభ్యసించి పరిశ్రమించిన శాస్త్ర విద్యలను వదిలి సాహిత్యరంగంలో ప్రవేశించడంవల్ల ఈ శాస్త్రకారులు అటు ఆ శాస్త్రానికి, ఇటు సాహిత్యానికీ న్యాయం చేకూర్చలేక పోతున్నారు. ఇదే నేను చెప్పింది—చెప్పదలచింది.

సదుద్దేశాలతో వ్రాసిన వాక్యాలకు కూడా దురభిప్రాయాలు అంటగట్టవచ్చును. వ్రాసినవాళ్లు ఆ అర్థాలతో వ్రాయలేదని చెప్పినతర్వాత కూడా—ఇంకా వాటినే పట్టుకు వేలాడటం సహృదయత కాదు. సహనముకాదు. సరసత్వముకాదు. ఆది యేమో వేరే చెప్పనక్కరలేదు.

తు. రా. (శ్రీ పాముక.)

# సమాధానము

ఆర్యా!

అక్టోబరు 1965 భారతిలో నేను వ్రాసిన ఒక లేఖాంశాన్ని పురస్కరించుకొని కొంత చర్చ జరిగింది. ఆ చర్చను చూచాను. జవాబు వ్రాస్తున్నాను.

నేను వ్రాసిన లేఖ ఆంధ్ర వాఙ్మయంలో స్తబ్దతను గురించినది. ఇప్పుడు ఈ చర్చ నడిచిన తీరులో కూడా ఆ స్తబ్దతే గోచరించింది. నాలేఖలోని అసలు విషయమైన 'స్తబ్దత' అనే అంశాన్ని వదిలి, ఈ చర్చలో పాల్గొన్నవారు ఇతర విషయాలను గురించి తగాదాలు పడ్డారు. నేను వేసిన ప్రశ్న—ఇప్పుడు తెలుగు వాఙ్మయం స్తబ్దతను భజిస్తున్నదా, లేదా—అన్నది. సమాధానం కూడా ఆ లేఖలోనే వ్రాశాను. స్తబ్దత వుంది. అది వట్టి స్తబ్దతకాదు. పదహారణాల స్తబ్దత.

ఆ లేఖలో నేను సార్ర్త్, యుజెన్‌స్కీ, స్ట్రాచీ మొదలైనవాళ్లు వ్రాసిన వ్రాతలను గురించి ప్రస్తావించాను. తెలుగు భాషలో అటువంటి విషయాలపై, ఆవిధంగా రచనలు ఎందుకు జరగడంలేదు? అని అడిగాను. అందుకు సమాధానంలేదు. అటువంటి రచనలే మన భాషలో జరిగివుంటే, ఈ చర్చలో పాల్గొన్నవారు—ఇవిగో, అటువంటి రచనలు ఇన్ని ఉన్నాయి—అని చెప్పవచ్చుగదా! ఆ మాట ఎవ్వరూ చెప్పలేదు. దీనిని ఏమంటాము? ఇది మన వాఙ్మయంలో ఏర్పడిన స్తబ్దతకు గుర్తు, అవునా, కాదా? నేను గుర్తుగానే భావిస్తున్నాను.

ఇక అనుసరణ లనువాదాలగురించి ప్రఖ్యాత చారిత్రకులు, పరిశోధకులులయిన ప్రొఫెసర్ కోశాంబి గారు తను ఒక గ్రంథంలో ఈ మాటలు వ్రాశారు.

"The intelluctnal apes the latest British fashions in clothing but even more in literature and the arts. The Indian novel, and short story, even in Indian languages, are modern creations based upon foreign models or foreign inspiration.' The Indian Drama is more than thousand years old, but the literate Indian stage today, and over whelmingly the Indian cinima, is patterned after theatre and movies in other Conutries. Indian poetry has however, resisted the change somewhat better, though foreign influence is demonstratable in choice of themes andfreer metres. The magnificient treasure of European (contimental) literary and cultural tradition is generally ignored by this intelligentia, except at third hand through badly chosen English book."

దీనినిబట్టి నాబోటివారు మరికొందరు మన దేశంలోవున్నారని అర్థం అవుతున్నది. నేను కోరేది ఇదే. ఈ మానసిక వైక్లబ్యంనుంచి, ఈ మేధో దారిద్ర్యంనుంచి, వట్టి అనుకరణనుంచి, ఎప్పుడు బయటపడి ప్రతిభావంతమైన రచనలకు తెలుగు మేధావులు పూనుకుంటారు?—అని. —హో. శి.

[ఈ చర్చను ఇంతటితో ముగిస్తున్నాము. —సం[

# "నృత్య రత్నావళి"

శ్రీ నే. కృష్ణమూర్తి

కాకతీయ కాలమున ఆంధ్రదేశమున నాట్యకళ రాజపోషణచే వృద్ధి చెందెను. నాట్య మభ్యసించి అభినయించువారికి, వాద్యాది కుతప ప్రయోగవేత్తలకు భూ గృహదానము లిచ్చినట్లు, ధర్మసాగర, చేబ్రోలు, మల్కాపుర శాసనములే అక్షర మగు తార్కాణములు. ప్రతాపరుద్రకాలమున మాచల్దేవియను ప్రఖ్యాత అభినేత్రి యుండినట్లు క్రీడాభిరామ వీథి నాటకమున కలదు. కామ విభుని మాచెర్ల రాజ్యమున కంజలోచనయను నర్తకి నృత్య మొనర్చినట్లు పల్నాటి వీర చరిత్రమందు గలదు. నేటి విజయవాడలో శివాలయమున మాచల్దేవియను నర్తకియు, ఆమెకు నాట్యము నేర్పుచున్నట్లు నాట్యాచార్యుని ప్రతిమలతో నున్న శాసనము కలదు.

ఇట్టి కళాపోషణగల వాతావరణ స్థితులలో మహా సామ్రాజ్యాధిపతియగు గణపతిదేవుని * బావమరది, గజసాహిణియగు అయ్యవంశజుడైన జాయ సేనాపతి ''నృత్య రత్నావళి', 'సంగీత రత్నావళి' యను పుస్తకముల వ్రాయుట సమంజసమగు కళావ్యాప్తి యయ్యెను. ఈనాటి కులీన కులస్త్రీలు ఈ విద్యను నేర్చుటయే కానవచ్చుచున్నదిగాని, పురాతన పుస్తకముల చదివి, అందు నిబిడీకృతమైన సంప్రదాయముల గుర్తెరిగి కళా వ్యాపకముచేయు యత్నములు మృగ్యములు. సరి రాలేని పాశ్చాత్య పోకడల నేటి కళాకారులు మిశ్రమముచేసి, సంకర యుతముగ నృత్య ప్రదర్శనముల విరివిగా లోకమున వ్యాప్తి చేయుచున్నారు. ఇందులకు ముఖ్య కారణము ప్రేక్షకులకు ఈ నృత్య శాస్త్ర మపరిచితముగా నుండుటయే! అక్షరాస్యులు హెచ్చుగుకొలది పురాతన శాస్త్రములు, కళా ప్రసంగ కావ్యములు విరివిగా చదువ వలసిన యుగ కాలమున మనమున్నాము. ఇట్టి శాస్త్ర పరిచయము నాగరికతా చిహ్నము. మాటునున్న కళారత్న విషయముల వెలికితీసి, ప్రభుత్వాధిపత్యమున స్థాపింపబడిన కళాసంస్థలు అనతి కాలముననే ఈ కళా విస్తారము చేయవలసియున్నవి. ప్రజలకు కళావిద్యయందు అభిమానము హెచ్చగు కార్యక్రమముల పథకమార్గముల నడుపవలసియున్నది.

నృత్య రత్నావళి వ్రాత పుస్తకము తెనుగు, గ్రంథ లిపులలో రెండు ప్రతులు తంజావూరుమున కలవు. దానిని పరిష్కరించి ప్రచురించు కాలము రానున్నది.

తెనుగు లిపియందు గల పుస్తకముల తప్పు లనేకములు కలవు. తప్పులన్నియు వ్రాయనగానివి, తాటియాకుల ధ్వంసము చేయు క్రిమి కీటకములవి.

గ్రంథారంభమున జాయసేనాని నృత్య ప్రయోగము చూడని నేత్రములు నిష్ప్రయోజనములని కవిత్వమున వర్ణించెను.

శ్లో. కల్హారై రనవాప్త చంద్ర కిరణాశ్లేషైర లబ్ధాంబుదైః
....చాతకై రళికులై రప్రాప్త పుష్పాసవైః
సామ్యా పన్నదశా మమూని దధతే నేత్రాణియేషాంపురః
శశ్వన్నావ తరంత్యుదార సుషమానృత్త ప్రయోగక్రమాః॥

(ఏ నేత్రముల ఎదుట తరచుగా నత్యధిక శోభావంతము లగు నృత్య ప్రయోగక్రమములు భాసించవో, అట్టి నేత్రములు చంద్ర కిరణముల చూడని కలువల తోడను, మేఘములను చూడని చాతకములతో, అప్రాప్త పుష్పాసవములగు అళి కులములతో సామ్యమును చెందుచున్నవి.)

ఈ నృత్యమును పంచభూతముల యొక్క వ్యక్తరూపమైన స్పందనమని కవి ఉగ్గడించెను.

శ్లో. క్షితౌ రక్తం ఛాయా ఫలనముదకే సలలితం
శిఖిన్యర్చిః ప్రేంఖా సహజగతి వైచిత్ర్య మనిలే
తటిత్క్రీడా వ్యోమ్నిత్యతుల సుభగః పంచ సుపరః
ప్రవిష్టో భూతేషు ప్రభవతిహి నృత్తస్య మహిమా॥

(సాటిలేని శోభగల నృత్యమహిమ పంచభూతముల యందును ప్రవేశించి యొప్పుచున్నది.)

ఎట్లన?

భూమియందు రక్తచ్ఛాయా ఫలన రూపమునను(?) ఉదకమున లలిత తరంగయుతముగను, అగ్నియందు జ్వాలా ప్రేంఖణ విధముగను, వాయువున సహజగతి వైచిత్ర్యముల తోడను, ఆకాశమున తటిత్క్రీడలతోను నృత్యము భాసించుచున్నది.

శక్రుడు జయంతుని ఐరావతాది గజములపై యధికారిగ నుంచినట్లు, బావయగు శ్రీ గణపతి సార్వభౌముడు జాయ సేనానిని గజసాహిణిగా నియమించెను. జాయ సేనాని ఆకౌమారాది స్వామి భక్తి పరాయణుడు. రాజునకు చిత్త కైరవ కౌముదివలె ప్రకాశించునట్లు నృత్యరత్నావళిని రచించెను.

మునివాక్ నర్తకీ నూనం
వర్ణనాంగైః మనోహరైః
కరోతి శాస్త్రరంగేస్మిన్
పశ్య నృత్తమతిస్ఫుటం॥

(భరతముని వాణియను నర్తకి, మనోహరములగు వర్ణనాంగములతో శాస్త్ర (నృత్య రత్నావళి) రంగస్థలమున స్ఫుటముగ నృత్య మొనర్చుచున్నది. వీక్షింపుము!)

* * * *

* జాయప సేనాని తోబుట్టువులగు నారాంబ, పేరాంబలు గణపతిదేవుని భర్తగా చేకొనిరి.

ఈ నాట్యశాస్త్రము వైవస్వత మన్వంతరమున త్రేతాయుగ కాలమున పురందరాదులు పితామహునొద్దకేగి "దృశ్యం సర్వంచ సర్వేషాం ఇచ్ఛామి క్రీడనీయకం' అని ప్రశ్నింపగా, ఆ నాల్గు మోములుగల విధాత సర్వవేద సారముగ, సార్వవర్ణికమైన నాట్యవేదమును సృజించి, తన మనసిజుడైన భరతునకు నేర్పెను. మానవులకు ఆంగికాదులయందుగల సౌష్ఠవ చాతుర్యములను తెలిసికొని, భరతముని శాండిల్యాది పుత్ర శతమునకు ప్రయోగార్హతను చేకూర్చెను. ఇంద్ర ధ్వజోత్సవ సమయమున రసాశ్రయంచతద్జ్ఞేయం, వాక్యార్థాభి నయార్థకమగు, ఈ కళ ప్రదర్శింపబడెను. అభినయము ప్రయోగ సమయమున అర్థమును సామాజికుల కభిముఖముగా తెచ్చునదియై వర్థిల్లుచున్నది. ప్రథమాధ్యాయమున శాఖా, అంకుర నృత్త, నేపథ్య (పుస్త, భూషణ, అంగరచన, సజీవ పరికల్పిత) సాత్విక లాస్యాంగముల (చిత్రపద భావికములతో చేర్చి) తాండవములను విషయముల లక్షణములు తెల్పబడినవి. అంగ నిరూపణమనునది రెండవ అధ్యాయము. ఇందు అంగములగు శిరస్సు, హస్త (అసంయుత, సంయుత, నృత్త)ములు, వక్షస్థలము పార్శ్వములు, కటి, పాదములును; ప్రత్యంగములగు, గ్రీవము కుక్షి, పృష్ఠ, ఊరువులు, జంఘ, జానువులును; ఉపాంగములగు విలోచన, భ్రూ, నాస, ఓష్ఠ, కపోల, చిబుకముల, వివిధభంగులు వాటి ప్రయోగములు వర్ణింపబడినవి. ఇంకను పాదాంగుళముల, అంగుష్ఠముల గూర్చి నిర్వచింపబడినది.

మూడవ అధ్యాయమున 'చారీ' (భూ, ఆకాశ) స్థానక, మండలములగూర్చి వర్ణనములు గలవు. ఈ అధ్యాయ ప్రారంభమున చెప్పబోవు వస్తు వివరముల సూచించు ముద్రాలంకార శోభితమగు శ్లోకము శ్లాఘనీయమై యున్నది.

శ్లో. లీలోల్ల సచ్చాపగతి ప్రబంధా
మృగీప్లుతో ద్యద్భ్రమరీ మనోజ్ఞాం
సన్యం దితాబ్జాం జనితో రుశోభా
వక్ష్యామి చారీం వనరాజితుల్యాం॥

ఇందు చాషగతి, మృగప్లుత, ఉత్స్యందిత, జనిత మొదలగు భూచారీ ప్రశంస యున్నది. భ్రమరీయను ఆకాశచారీ సూచనయు గలదు.

ఈ 'చారీ' ప్రసంగ కథనము వనరాజితో సమానమని కవి సంకల్పించెను. ఆ చారీవనము పాల పిట్టల (చాషగతి) గతులతోను, మృగీప్లుతములచే చెదరిన తుమ్మెదల మనోహరతతోను, అచ్చటి సెలయేళ్లయందు తామర పుష్ప సంతతులతోను, కల్గి శోభను జనింపచేయుచున్నది.

ఈ చారీ ప్రశంస ముగించునపుడు కవి:—

శ్లో. చరిత మివ సురాజ్ఞాం యుక్త దండాభిరామం
గిరిజ మివభుజంగ త్రాసితా లోకనీయం
జలద మివచ విద్యుద్ భ్రాంత మశ్రాన్తలక్ష్మి
వ్యరచయ దిహ చారీ లక్షణం జాయనార్యః॥

ఇందు ఆకాశచారులగు భుజంగ త్రాసిత, విద్యుద్భ్రాంతములు సూచింపబడినవి.

ఈ చారీ లక్షణ కథనము ధర్మ పరిపాలనముచేయు రాజ చరితములవలె, గిరులపై పుట్టిన తరువుల చెంతనున్న భుజంగములు త్రాసమును గూర్చు రమ్యతను, మేఘములు విద్యుత్ర్భాంతమును గూర్చుచు, అశ్రాన్త లక్ష్మీ శోభాయమానముగ నుండును.

* * * *

జాయ సేనుడు భరతుని నాట్య శాస్త్రమునకు ఆది గురువుగా స్వీకరించెను. నాట్య శాస్త్రమందలి శ్లోకములు, తాను గ్రంథ రచన మొనర్చునప్పుడు చెంత నున్నట్లే విశదమగుచున్నది. భరతుడు చెప్పనివి కొన్ని తాను చెప్పెను. కొన్ని విషయములందు భరతుడట్లు చెప్పుటకును, చెప్పకుండుటకు కారణముల చెప్పెను. భరతుని నాట్య శాస్త్రమేగాక, కీర్తిధరుని కావ్యమునుగూర్చి, అందలి విషయములగూర్చి పలుమారు పేర్కొనెను.

ఈ గజసాహిణి 13 వ శతాబ్ది వాడగుటచే శారఙ్గదేవునికి సమీప కాలమున నుండెను. కాని ఇతని కావ్యము వ్యాఖ్యానములకు గురికాలేదేమో? ఇతని తరువాత వచ్చిన సింగభూపాలుడు, కల్లినాథుడు, సంగీత రత్నాకరమునే వ్యాఖ్యానించిరి. జాయసేనాని కథనము శారఙ్గదేవుని విషయావిష్కరణము సామ్యమును బొందుచున్నవి.

జాయసేనాని సంస్కృతమందు సిద్ధహస్తుడగుటయే గాక, కవిత్వ పోకడలు పాటింపగల విద్వాంసుడు. ఇతని కాలమున నాట్యకళ విరివిగా రాజపోషణ కల్గి యుండుట విదితము. సార్వభౌముని మెప్పించుటకే, ఆనాటి నృత్యకళా ప్రయోగములను, శాస్త్రమున నిబంధించి కావ్యమును రచించెను. పూర్వ గ్రంథములందు పాటించని, వర్ణింపని నూతన విషయములిందు గలవు. ఇతని గ్రంథమునగల నృత్త నృత్య భంగిమలు ఆనాటి శిల్పులకు దోహదమిచ్చి (motif) నర్తకీ బేరముల సృష్టించుటకుపకరించి యుండును. రామప్ప దేవాలయమందలి నృత్యప్రతిమలు ఈ కావ్యమందలి లక్షణ వర్ణములకు సరివచ్చు నను విషయము శోధింపతగిన కార్యా కావ్యా న్వేషణము. రామప్ప దేవళమేకాదు. కాకతీయ కాలమున ప్రతిష్ఠించి, జీర్ణోద్ధరణ గావించిన దేవాయతనములందలి నృత్య ప్రతిమలనన్నిటిని అన్వేషించి, పరిశీలించి సమన్వయ మొనర్పదగును.

నృత్య రత్నావళియందలి వర్ణనములను ఈ క్రింది గ్రంథములతో పోల్చి చూడవలయును.

1. భరత నాట్య శాస్త్రము. 2. సంగీత రత్నాకరము. 3. భరతార్ణవము. 4. నాట్యశాస్త్ర సంగ్రహము. 5. భరతసారము. 6. హస్తముక్తావళి. 7. హస్త రత్నావళి. 8. సంగీత నారాయణము. 9. హస్త అధ్యాయము. (7, 8, 9 అముద్రితములు.)

## చారీస్థానక, మండలములు

నర్తకిగాని, నర్తకుడుగాని కేవలము అంగ ప్రత్యంగ ఉపాంగముల వివిధ భంగులందు ప్రసారించిన మాత్రమున

నృత్తముగాని * నృత్యముగాని పూర్ణముగ ప్రయోగింపబడదు. ఇవి చేయుటకు నర్తకి ఒకేచోటువ యుండిన చాలును. కాని నృత్యమున శరీర చలన మావశ్యకము. ఈ చలనము తాళమాన లయములతో ఏక సూత్ర నిబద్ధ కార్యక్రమమువలె మేళ వింపవలయును. అంగముల విన్యాసములతో కలిసి పాదచలన మును, ముందునకో, వెనుకకో, ప్రక్కలకో, చరించుటచే రంగ స్థలమే స్పందించుచున్నదాయను భ్రాంతి సహృదయుల హృద యములందు కలుగును. ఈ ప్రయోగము చూచువారికి లోచనా నందమేగాక, వాద్య ప్రసారములచే శ్రవణ సుఖమును గూర్చును. మానవుల శరీరావయవ సంపుటీకరణము పూర్వ వాసనల ప్రాతి నిధ్యముచే నిబిడీకృతమై యున్న తత్త్వములు, 'సాధారణీ' కృతయుక్తమైన నృత్య ప్రయోగముచే రేకెత్తి ఆహ్లాద మోద ములనందును. కేవల రూప శబ్దములు ఈ నృత్యమున పరా కాష్ఠ నొందును. అందుచేతనే భరతాచార్యుడు:—

> తత్రోచ్చతే నఖల్వర్థం కంచి నృత్తమపేక్షతే
> కింతు శుభం జనయతిత్యతో నృత్తం ప్రవర్తితుం
> ప్రాయేణ సర్వ లోకస్య నృత్త మిష్టం స్వభావతః
> మాంగల్య మితికృత్వాచ నృత్తమే తత్ప్రకీర్తితమ్.
> భా. నా. శా. IV 269, 270.

ఈ నృత్త, నృత్య ప్రదర్శనము అనిర్వచనీయమగు శోభను మానసికానందమును గూర్చును. మంగళకరములగును.

'చారి' విషయమును గూర్చి చెప్పుచు, భరతాచార్యుని వలెనే దీని లక్షణమును కటినుండి పాదములవరకుగల అంగ ఉపాంగ చేష్టలే, చారి యని జాయసేనాని చెప్పెను. ఇందు పాద జంఘ ఊరువుల విన్యాసములు స—మానముగా చేయవల యును.

పాదములతో భూమి ఎక్కువగా స్పృశించుచు, ప్రయో గించు విన్యాసములు పదియారు (16) భూచారులనియు, భూమికి పైన (తగలక) చేయునవి ఆకాశచారులు పదియారు (16) యని నృత్య రత్నావళియందు వర్ణింపబడినవి. భరతుని నాట్య శాస్త్రమున, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరము నను నిట్లే చారీ లక్షణములు వర్ణింపబడినవి. †

ప్రతి చారీ చలనమునకు పునాది వంటిది "సమపాద' భూచారి. ఇందు పాదములను ఒకటి తరువాత మరొకటిని పార్ష్ణి భాగములచేర్చి నిలచియుండవలెను. ప్రతి 'చారి' ప్రయో గించుటకుముందు ఈ సమపాద భూచారి చేయనగును. ఇట్లు పదియారు భూచారి వర్ణనములు కలవు. ఇతర గ్రంథము లందు చెప్పని విశేషములు కొన్ని జాయసేనాని రచనయందు గలవు. జాయసేనాని ' నిత' యను భూచారికే "మునలఘట్టి కా" యను నామాంతరమున్నట్లు చెప్పెను. ఈ నామమును దేశీ నాట్యవిదులు పెట్టినట్లు తెలిపెను. కొన్ని చారుల పేరు లకు అర్థమును నిర్వచించెను. 'శకటాస్య' మన బండిని ముందు నకు జరుపుటయని శారఙ్గదేవుని నిర్వచనముతో జాయ సేనాని యన్వయముమ సరిపోవుచున్నది. అడ్డితయను భూచారి లక్షణమును చెప్పుచు, నర్తకి ముందు వెనుకలకు పోవలెనని కీర్తి ధరుని వర్ణనమును స్వీకరించినట్లు తెలిపెను. సమోత్సారిత మత్తల్లియను భూచారినిగూర్చి చెప్పుచు జాయసేనాని దానికి మత్తపాదమను నామాంతర మున్నట్లు తెల్పెను. విద్యుద్భ్రాం తమను ఆకాశచారినిగూర్చి వివరించి, ఈ చారీ ప్రయోగము "లక్ష్యేఽతి దుష్కరా' యని వ్రాసెను. ఇందు పాదముయొక్క పృష్ఠమును వెనుకగా పైకెత్తి శిరస్సును స్పృశించి, ఆకాలిని వ్యావర్తము చేయనగును. సుశిక్షితులైన కుశలురే ఈ విద్యు ద్భ్రాంతమును చక్కగా చేయుదురని జాయసేనాని మతము.

ఈ చారీ ప్రయోగములతో హస్తములను సుందర ముగా చాలనము చేయనగును. పాదములు నేలపై స్థిరముగా నుండునపుడు హస్తములను అర్ధచంద్రయుతముగా కటి భాగ మున నుంచవలెను. ఈ రూపమున నర్తకి సుందరముగా నుండును.

## స్థానకములు

చారీ ప్రయోగములు కొన్ని చేర్చి శరీరమును అంగ విన్యాసములతో చేర్చిన స్థానకములగును. ఈ స్థానకములు ‡ ఆరుగా విభజింపబడినవి. ఇవి దేవతాధిష్ఠానములు. ఇవిగాక, స్త్రీ స్థానకములని కొన్ని వర్ణింపబడినవి. భరతాచార్యుడు చెప్పనివి శారఙ్గ దేవుడు ఏడు స్త్రీ స్థానకములనే చెప్పెను. కాని, జాయసేనాని || ప్రోన్నసమను ఎనిమిదవ దాని గూర్చియు వర్ణించెను.

> సమపాదతలాగ్రాభ్యా మంగుళీనాం తలైరపి
> ఆయతీ కృత్యగాత్రం చేన్నిష్ఠే స్యాత్ప్రోన్నసం తదా
> నాసికా ద్వయ సేతోచే దూర్ధ్వతా మంతరిక్షగే
> ప్రాంశు ప్రాప్య ప్రమాణస్య ఫలాదేః గ్రహణాదిషుః."

* నృత్తము, నృత్యము సమానార్థకములుగా నెంచ బడినవి.

† భూచారులు:—(1) సమపాద (2) స్థితావర్త (3) జనిత (4) స్యందిత (5) అపస్యందిత (6) బద్ధా (7) శకటాస్య (8) విచ్యవ (9) ఏలాకాక్రీడిత (10) చాషగతి (11) ఉత్స్యందిత (12) అడ్డితా (13) సమోత్సారిత మత్తల్లి (14) మత్తల్లి (15) అధ్యర్ధికా (16) ఊరూద్వృత్తా.

ఆకాశచారులు:—(1) అతిక్రాన్త (2) అపక్రాన్త (3) పార్శ్వక్రాన్త (4) సూచీ (5) మృగప్లుత (6) భుజంగత్రాసిత (7) అలాత (8) నూపురపాదిక (9) ఆక్షిప్త (10) భ్రమరీ (11) దండపాద (12) విద్యుద్భ్రాంత (13) ఊర్ధ్వజాను (14) ఉద్వృత్త 15) దోలపాద (16) ఆవిద్ధా.

‡ స్థానకములు:—(1) వైష్ణవ (2) సమపాద (3) వైశాఖ (4) మండల (5) ఆలీఢ (6) ప్రత్యాలీఢ.

|| స్త్రీ స్థానకములు:—(1) ఆయత (2) అవహిత్థ (3) అశ్వక్రాన్త (4) గతాగతం (5) వలితం (6) మోటితం (7) వినివర్తితం (8) ప్రోన్నసమ్.

సమపాద తలాగ్రములపై నిలచి శరీరమును పొడవు చేసిన ప్రోన్నత స్త్రీ చారీ లక్షణమగును. ముఖముపై కెత్తి నపుడు నాసికా పుటముల (నాసికాద్వయు) పై నుండు సేతువు (Bridge of the nose) ను పైకెత్తుట. ఇది అంతరిక్షమును చూచుట, వృక్షాగ్రఫలముల కోయుటయందు ప్రయోగార్హము.

## మ ం డ ల ము లు

మండలముల విభాగమును వర్ణించుచు, నృత్య రత్నా వళి రచించిన కవి శేఖరుడు ఈ క్రింది శ్లోకములతో ప్రారం భించెను.

విచిత్ర భూషా లలిత తాంగ యష్టి
పావర్తఫాల భ్రమరాల కా భా
సంక్రాన్తకాంతి ర్విహృతాభిరామ
నిరూప్యతే మండల రాజి రామా.

మండల రాజి యను స్త్రీ వర్ణింపబడుచున్నది. ఆ సుంద రాంగి విచిత్ర భూషణములచే, లలితమగు అంగయష్టి కల్గి, ఫాలమున సంక్రమించిన (వ్రాలిన) వంకరలుగల ముంగురుల కాంతి కల్గి విహారమున మనోహారిణిగా నున్నది. ఇందు 'విహృత' ప్రయోగముచే అభిసారిక సూచితము.

భ్రమర, దండపాద (అంగయష్టి) విహృత, సంక్రాన్తి మొదలగు పదముల లేక వాటి అర్థ సుర్ఫణముతో పై శ్లోక మున ముద్రాలంకారము సంధింపబడినది.

మండలములును * భూమండలములు పదియుగా † ఆకాశ మండలములు పదియుగా విభజింపబడినవి. వీటి ప్రయోగము లలో ఒక్కొక్కదానిలో వివిధ చారులు కలసి యుండును. దక్షిణ వామపాదములు క్రమముగా లక్షణ నిర్ణీతముగా ప్రసా రితము లగును.

మండలముల ప్రయోగ మెల్లప్పుడును వాద్య శబ్దము లతో లయ మొనర్పబడి, మనోహరమగు రూప శబ్దములు ప్రధానేంద్రియములకు, శ్రవణేంద్రియములకు మోదము గూర్చును. ఈ విషయ వర్ణనమునుకవి ఇట్లు పరి సమా ప్తము చేసెను.

ఆవర్త క్రాన్తం లలితం విచిత్రం
ఆస్కందితం క్రాన్త విధిం దధానమ్
ఇత్య బ్రవీన్మండల లక్ష్మ సుశ్రీ
తురంగ తుల్యం గజసైన్యనాథః.

ఇందు శ్లేషయుతమగు ముద్రాలంకారము గలదు. చక్కని సుశ్రీయుతుడగు గజ సైన్యనాథుడు తురంగముల వంటి మండల లక్షణములను ఇట్లు ప్రవచించెను. గుర్ర ములు మంచి శుభ్రపదములగు సుడులుగల్గి, లలితమై విచి త్రముగా ఆస్కందన మొనర్చునవి. ఈ మండల లక్షణములును తురంగ గతులు గలవి.

## దేశీ స్థానకములు

## దేశీకరణములు : అంచిత, అలగ, స్పర్శ,

## లాస్యాంగములు

నృత్య రత్నావళీ కావ్యమందలి షష్ఠోధ్యాయమును అవిష్కరించుచు, జాయసేనాని దైవ ప్రార్థన మిట్లు చేసెను.

వందే శ్రీ కంఠ మందారం
యత్ర గౌరీ స్తనోద్గమః
ధత్తే విశ్వఫల వ్యక్త్యై
ప్రథమ స్తబక శ్రియం.

అర్థ నారీశ్వరుడగు (Concept of Biunity) శ్రీ కంఠుడను కోర్కెల తీర్చు మందార కల్పవృక్షమునకు నమ స్కరించుచున్నాను. (అపుణ్య తరువున) గౌరీ స్తనోద్గమము విశ్వ ఫలాభివ్యక్తికొరకై ప్రథమమైన పూల గుత్తివలె శోభను ధరించును.

కావ్యకర్త తాను, చెప్పబోవు "దేశీనృత్య" వస్తువును ప్రౌఢవారాంగనవలె వర్ణించెను.

భాషావేష విభూషణై రనుగుణైః సైన్నైస్సైర్మనో హారిభిః
నానా దేశ (వ) రుచీన్ విదగ్ధ పురుషా నావర్జయంతీ గుణైః
భూపాలై రుప లాలితా బహుకలైః ప్రౌఢేవ వారాంగనా
దేశీ సంప్రతి దంతి సైన్య పతినా పాంద్రాదరం వర్ణ్యతే.

అను గుణములును, మనోహరములునగు ఆ యా భాషా వేష, భూషణముల చేతను, గుణముల చేతను, వివిధ ప్రాంతము లకు చెందిన విదగ్ధ పురుషుల నాకర్షించుచు, కళా కోవిదు లగు భూపాలురచే లాలింపబడు ప్రౌఢ వారాంగనవలె దేశీ (నృత్యము) ఇపుడు గజసాహిణిచే సత్యాదరముతో వర్ణింపబడు చున్నది.

*　　*　　*　　*

జాయ సేనాని ఇట్లుపక్రమించి కావ్య రచనా కాల మును, కృతిపతినిగూర్చి రమణీయముగా వర్ణించెను.

ఇదానీం భారతే వర్షే
కాలే వైవస్వతాంతరే

---

* భూమండలములు:— (1) భమర, (2) ఆస్కందిత లేక అస్పందిత (3) పిష్టకుట్ట (4) చాషగతి (5) అడ్డిత (6) ఏలకా క్రీడిత (7) అర్ధ్యర్ణ (8)ఆవర్త (9) శకటాస్య (10) సమోత్సారిత.

† ఆకాశమండలములు:— (1) సూచీవిద్ధ (2) అతి క్రాన్త (3) దండపాద (4) అలాతక (5) విచిత్ర (6) విహృత (7),వామవిద్ధ—వామబంధ (8) లలిత సంచార (9) క్రాన్త (10) లలిత.

# "నృత్య రత్నావళి"

కలౌ యాతేషు వర్షేషు
　　* భూత బాణాగ్ని సాగరైః
మితే ష్వానంద సముజ్ఞే ౽బ్దే
　　జగదానందదాయిని
శశ్వత్కువలయోల్లాసి
　　యశః ప్రాలేయరోచిషి *

క్రీ. శ. 1255 జగదానంద దాయకమగు ఆనంద సంవత్సరమున మహారాజాధిరాజగు ఈ గణపతి చక్రవర్తి సముద్రమునే మేఖలగాగల ఈ భూమిని బాహుబలముతో రక్షించుచుండగా

"యాదేశీ వర్తతే లోకే
సాస్మాభిః కథ్యతేస్ఫుటం."

ఏ దేశీ నృత్యము లోకమున వ్యాప్తిగా నున్నదో, అద్దానిని (ఈ కావ్యమున) నాచే స్ఫుటముగా వర్ణింపబడుచున్నది.

కృతిభర్త కాకతి గణపతి చక్రవర్తి. ఆ రాజన్యుడు

ప్రతాప తపన ప్రౌఢి
　　తాపితా రాతి మానసే
శత్రు ప్రాణానిలాహార
　　క్షీబ కౌక్షేయ కోరగే.
విశ్రాణన పయః పూర
　　నిర్ధూత కలి కల్మషే
త్యాగధికృత రాధేయ
　　కామధేను సురద్రుమే.
రూప లావణ్య సౌభాగ్య
　　సప్రథ మకరధ్వజే
శౌర్య త్రితయ విజ్ఞాన
　　మహస్తత్త్వ విశారదే.
మార్గదేశీ విభాగ న్య
　　వివేచన విచక్షణే
మహా రాజాధిరాజేస్మిన్
　　గణపత్య వనీశ్వరే.
సముద్ర మేఖలా మేనాం
　　బహు నా రక్షతి క్షమామ్
యాదేశీ వర్తతే లోకే
　　సాస్మాభిః కథ్యతే స్ఫుటం.

(1) కువలయమునకు (భూమండలమునకు) ఉల్లాసకరమగు కీర్తియను వెన్నెల కలవాడు.

(2) ప్రతాప మనెడి సూర్యుని ప్రౌఢిమచే తపింపచేయబడిన శత్రు మానసము కలవాడు.

(3) శత్రువుల ప్రాణవాయువులను ఆహారము గొనుటచే మదించి ఖడ్గ మనెడి ఉరగము కలవాడు.

(4) దాన జలముచే కడిగి వేయబడిన కలి కల్మషము కలవాడు.

(5) త్యాగముచే ధిక్కరింపబడిన కర్ణ, కామధేను, కల్పవృక్షములు కలవాడు.

(6) రూప లావణ్య సౌభాగ్యములచే మన్మథుని పోలినవాడు.

(7) శౌర్యత్రిక మహత్త్వముల నెరింగిన విశారదుడు.

(8) మార్గదేశీ నృత్య విభాగముల వివేచనమున విచక్షణుడు.

ఈ అష్ట గుణ సంపన్నుడగు కృతి భర్తను జాయసేనాని తన కావ్యమునకు చేకూర్చెను.

ఈ దేశీ నృత్య మనగా లక్షణ మిట్టిదని ఈ క్రింది విధముగ జాయసేనాని తెల్పెను.

భవంతి ధరణీపాలా:
　　ప్రాయేణాభినవ ప్రియాః
అతస్తత్ప్రీతయేద్యాపి
　　యద్య దుత్పాద్యతే నవం
నృత్త తత్త స్మృతం దేశీ
　　తత్త దేశాను సారతః.
భూతమ్ శాస్త్రముఖాత్ జ్ఞేయం
　　భవిష్యం నావగద్యతే
భవన్ని రూపణం (నై) యస్మాత్
　　నృత్యం దేశీతి సంజ్ఞితం.

"ధరణి పాలురు సహజముగా అభినవ ప్రియులు. కావున వారి ప్రీతికై నేటికిని (1255 A—D) వివిధ దేశానుసారముగ యే యే నృత్యము నవ నవముగా నుత్పాదింపబడుచున్నదో అయ్యది దేశీయని పిలువబడుచున్నది.

పూర్వమున వృద్ధి చెందిన నృత్యమును శాస్త్రములందు నిబంధింపబడినందున తద్వారా తెలిసికొనవచ్చును. రాబోవు కాలమునాటి కళను గూర్చి చెప్పుట సంభవింపదు. ఈనాడు (సమకాలిక ప్రపంచమున) దేశమున వ్యాప్తినొందియుండు దేశీ నృత్యమును నిరూపించెదను."

ఈ కృతి విచ్చిన 1255 A—D ఆనంద సంవత్సరము కాకతి వంశ చరిత్రలో శ్రేష్ఠమైనది. చరిత్రకారులు 1254—1256 నాటి శాసనముల పరిశీలించి, గణపతిదేవుడు తన రాజధానిని హనుమకొండనుండి, ఏకశిలా నగరమునకు మార్చినట్లు తెల్పియున్నారు. ఆ శుభ సంవత్సరము 1255 A—D దిగా ఈ కృతి కాలమునుబట్టి దృఢ పరచవచ్చును. ఏకశిలా నగరమును సామ్రాజ్య ముఖ్య స్థానముగా స్థాపించు మంగళ

---

* భూత=5 బాణ=5, అగ్ని=3, సాగరైః=4=5534. ఈ సంఖ్యను విధిదాయకముగా 4355 యని తెలిసికొనవలయును. నేటికి కలియుగము 5063 అనగా 708 సం. పూర్వము 1963—708=1255 A. D. కావ్య రచనా కాలము.

కరమగు సమయమున నృత్య రత్నావళికి రాజభర్తతో కళ్యాణము ప్రాప్తించెను.

*　　*　　*　　*

ఆ నాటికే (1210—1247 A-D) "సంగీత రత్నాకర" గ్రంథమును సోఢలుని తనయుడగు సారఙ్గదేవుడు రచించెనని తెలియుచున్నది. అందు ఏడవ అధ్యాయము నృత్య విషయా విష్కరణము. ఈ కవి దేవగికిరి యాదవుల ప్రభు పోషణ యందుండెను. జాయసేనాని సోఢలుడును, భరతముని కీర్తిధరుల ప్రాచీన గ్రంథముల తరచి చూచినట్లు వారి కావ్య మందలి రచనయే తెల్పుచున్నది. దేశీ నృత్యమును గూర్చి సారఙ్గ దేవుడు విపులముగా వర్ణింపలేదు. స్థాలీపులాకముగనే క్లుప్తముగా స్పృశించినట్లు తెలియుచున్నది. గ్రంథ విస్తీర భీతిచే సంక్షిప్తము చేసితినని వ్రాసికొనెను, కాని సంగీత రత్నాకర మందలి దేశీ నృత్య విభాగమును చదివిన, గ్రంథకర్త తన జీవితమున పెక్కు దేశీ నృత్య ప్రదర్శనముల వీక్షించినట్లు లేదు.

కాని, కాకతి రాజ్య గజసాహిణి దేశీ నృత్య విశేషముల ఆసాంతముగ, విరివిగా, వీక్షించి, ముందు కాలమువారికి ఆదేశీ నృత్య వ్యాసంగముల కైవసము చేయుటకై ఆ కళాఖండముల, శాస్త్రమున నిబంధించినట్లు నృత్య రత్నావళి రచనచే దృఢమగు చున్నది. ఇంతయేగాక, నర్తకీ, నర్తక, సంగీత వాద్య విద్వాంసులకు భూ, గృహ దానము లిచ్చినట్లు శాసన లిఖితములున్నవి.

*　　*　　*　　*

ఈ పంచమాధ్యాయమున (1)* దేశీ స్థానకములు ఇరువదిరెండు. (2) అంచిత కరణములు పదునాలుగు. (3) అలగములు నాలుగు. (4) లోహడీలు ఎనిమిది. (5) దర్ప సరణములు మూడు. (6) కపాలాది స్పర్శములు నాల్గు (7) దేశీ లాస్యాంగములు ముప్పదిమూడు, (8) తాళయుక్తమగు గతుల గూర్చి వివరణోపేతమగు వర్ణనము గలదు.

దేశీ స్థానకముల వివరము రెండు రత్నాకరములందును, నాట్య శాస్త్ర సంగ్రహ గ్రంథమునందును సమానము. జాయసేనాని "వ్రాతప్రతి" యందు ఒకటినుండి పదివరకు లక్షణములు కావరావు.

1 అంచిత కరణములన నటిప్లుత మొనర్చుట. నర్తకి సమముగా నిలచి, ఎగిరి భూమిపై నిలచుట. ఈ ఉప్లుత కరణముల పదునాల్గను జాయసేనాని పూర్తిగా వర్ణించెను. (నేటికి లభ్యమైన తెనుగు లిపి ప్రతియందు (11) అంగుష్ఠబద్ధాంచిత, లక్షణము లుప్తమైనది.) (9) లంకాదాహాంచిత, (12) బలిబద్ధాంచితముల లక్షణములు వ్రాత లోపముచే సవ్యముగు వర్ధము నిచ్చుటలేదు. సోఢలుడు 1 నుండి 4, 6, 8, 10 అంచితములను మాత్రము, నూతనముగ సపాదాంచితమును చేర్చి లక్షణముం పేర్కొనెను.

2 నాల్గు అలగములు.

ఎగురుట, కూర్చొనుట, మొగ్గ వేయుట మొదలగు విన్యాస పూరితములు. ఇరువది సంవత్సరములకు పూర్వము మేజువాణిలో కళావంత కులజులు ఈ నృత్య ప్రయోగముల ప్రదర్శించు చుంచెడివారు.

3 ఎనిమిది లోహడీలు.

ఇందును మొగ్గవాలుట, ఎగిరి నలు దిక్కులకు తిరుగుట మొదలగు విన్యాసము లొనర్చు నృత్యము. ఇందు విభ్రాంత లక్షణము వ్రాతప్రతియందు వ్యగ్యము.

4 దర్ప సరణములు మూడు, 5 స్పర్శములు నాలుగు లక్షణ రహితముగ నామమాత్రముగ సూచింపబడినవి. ఇవి 'సంగీత రత్నాకర'మందు గలవు. సారఙ్గ దేవుడు, అంచితముల, అలగముల, లోహడీల, సరణముల, స్పర్శల, కొన్నింటినే చెప్పి భ్రమరములచేర్చి ముప్పది యారింటిని వర్ణించెను.

---

* (1) సమపాద, (2) సరావృత్త, (3) స్వస్తిక, (4) వృషభాసన, (5) బ్రాహ్మ, (6) వైష్ణవ, (7) శైవ, (8) గారుడ (9) సంహత, (10) స్వామ్యోనతం (లేదు), (11) వర్ధమాన, (12) కూర్మాసన, (13) నంద్యావర్త, (14) చతురశ్ర, (15) పార్ష్ణిపార్శ్వగత, (16) ఏకజానువత, (17) పార్ష్ణివిద్ధ, (18) ఏకపాద, (19) నాగబంధ, (20) సమసూచీ, (21) విషమసూచీ, (22) ఖండసూచీ.

1. అంచితం. (2) కర్తర్యంచితం. (3) భైరవాంచితం. (4) ఏకపాదాంచితం. (5) క్షేత్రాంచితం. (6) స్కంధాంచితం. (7) రోహిణ్యంచితం. (8) దండ ప్రమాణాంచితం. (9) లంకాదాహాంచితం. (10) భ్రాంత పాదాంచితం. (11) అంగుష్ఠ బద్ధాంచితం. (12) బలి బద్ధాంచితం. (13) అలగాంచితం. (14) సమ కర్తర్యంచితం.

2. అలగములు (1) అలగం, (2) కూర్మాలగ, (3) ఊర్ధ్వాలగ, (4) అంతరాలగ.

3. (1) లోహడీ, (2) కర్తరీ లోహడీ, (3) సమ కర్తరీ లోహడీ, (4) బాహుబంధ (బద్ధా), (5) చిత్రాఖ్య, (6) ఏకపాద, (7) చతుర్ముఖ, (8) విభ్రాంత.

4. (1) దర్పసరణ, (2) జలశయన, (3) నాగబంధ.

5. స్పర్శములు:—(1) కపాల స్పర్శన, (2) మాచ్యంతము, (3) మత్స్యకరణము, (4) కరస్పర్శ.

అర్ధరాత్రి చీకటు, మధ్యాహ్నం మణిజ్వలితం
సాయంకాలం నిండా పక్షుల రెక్కలు
హృదయంలో లోతైన మూలల నొక జలపాతం ఉంది,
ఎంతో ఎత్తువిహాంచి హిందూదేశం నెత్తిమీంచి
నీకు నిద్ర వృద్ధాప్యంలా ముంచుకొచ్చినప్పుడు
చలి కణుకుతూ రాంకీర్తనలు గొణుగుతున్నప్పుడు,
నన్ను తల్చుకొని నీ పుస్తకం లోపలో పల చదువుకో.
ప్రేమ పర్వతాల మీద కెట్లా ఎగిరిందీ
పడిపోయి కాళ్లెట్లా విరగ్గొట్టుకుందీ
పెళ్లాం మబ్బుల పరుపులమీద ఎట్లా అడ్డదిడ్డంగ నిద్రోయింది
నక్షత్రాల గుంపులో కళ్లెట్లా దాచుకొందో
ము— ఖా—నికి
సిగ్గన్నా లేకుండా పైగా ఎట్లా నవ్వుతూందో తల్చుకో.
తల్పులు తెర్చుకో
మూసేసిన వెన్నెల మూసిక లేసిన తలుపూ,
నే నెళ్లొస్తా గడేసుకో.
ఆవిరి తలగుడ్డ చుట్టుకొని సముద్రంమీద నక్షత్రాలు పొదిగి
అందులో ఒకటి నా ఉంగరంలో పెట్టుకొని వెళ్తున్నా
ఆకాశంలో ఉంగారాలున్న చెయ్యి ఆశీర్వదిస్తోంది
ఉలిపిరి ఊపిరి కాగితా లోడులూ
జరీ అంచు పట్టు చీరలు దిగొస్తున్నయ్
వెన్నెల పంచెల అంచులు చీకటి మొల్కెక్కుతోన్నవి.
తడిసిపోయిన పొడుగాటి జడల వెడల్పాటి పూలు
మిసుకు మిసుకు మంటోన్న చేతుల్లో పడి నలుగుతోన్నవి
ఉదం ముందు పంపిస్తా కానీ ముందు నువ్వు చీటి రాసంపు.
నువ్వుండక నన్ను పంపు. ఉంటా మరి. ఉంటా. నువ్వుండక.''

# మొల్ల కాల నిర్ణయ సమస్య

'ఆరుద్ర'

మొల్లకవయిత్రి ఏ కాలంనాటిది ? ఇది నేడొక కొత్త సమస్యగా పరిణమించింది. దీనిని పరిష్కరించడానికి ఎన్నెన్నో ఆధారాలు కావాలి. నేను సేకరించిన కొన్ని విషయాలను ఈ చర్చ సాగిస్తున్న పెద్దలముందు నివేదిస్తున్నాను.

తన రామాయణం పీఠికలో తాను కవిత్వమంటే ఎలా ఉండాలనుకొంటుందో వివరిస్తూ, మొల్ల ఒక పద్యాన్ని వ్రాసింది. అది:

వలిపపు సన్నపయ్యెదను
    వాసిగ గందపు బూత తోడుతన్
గొలదిగ గానవచ్చు
    వలి గుబ్బ చనుంగవ శోభ నొప్పగా
దెలుఁగని చెప్పుచోటఁ
    గడు తేటల మాటలఁ గ్రొత్త రీతులం
బొలుపు వహింపకున్న మరి
    పొందగునే పటహాది శబ్దముల్

ఈ పద్యం అల్లసాని పెద్దన్నగారి 'పూత మెరుంగులున్' అనే మాలికను జ్ఞాపకం చేస్తుంది. కనుక మొల్ల పెద్దనగారికి అర్వాచీనురాలని శ్రీ ఖండవల్లి లక్ష్మీ రంజనంగారు వ్రాశారు. అయితే వాస్తవానికి దీనికీ పెద్దనగారి మాలికకూ ఆట్టే పోలికలులేవు. పంచతంత్రాన్ని వ్రాసిన బైచరాజు వేంకటనాథకవి ఇచ్చిన నిర్వచనానికి ఇది దగ్గరలో ఉంది. అతడి పద్యం:

ఘనతర ఘూర్జరీ కుచయుగ క్రియ
    గూఢముగాక ద్రావిడీ
స్తన గతిఁ దేటగాక యరచాటగు
    నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవఁ బోలి గూఢమును
    జాటు దనంబును గాకఁ యుండ జె
ప్పిన యదిపో కవిత్వ మనిపించు
    నగించటుగాక యుండినన్

ఈ రెండు పద్యాలలోనూ కొన్ని పోలికలు ఉండడం వల్ల ఈ ఇద్దరి కావ్యాలలోనూ మరి కొన్ని పోలికలు ఉన్నాయేమో చూడాలి. మొల్ల దశరథుడిని వర్ణిస్తూ, ఈ క్రింది సీస పద్యం చెప్పింది:

తన కీర్తి కర్పూర తతిచేత వాసించెఁ
    బటుతర బ్రహ్మాండ భాండమెల్లఁ
దన శౌర్య దీప్తిచే నినబింబ మనయంబుఁ
    బగలెల్ల మాఁగుడు వడఁగఁజేసెఁ
దన దాన          నను దినంబును నర్థి
    దారిద్ర్యములు వెళ్ళఁబాఱఁ దఱిసెఁ
దననీతి మహిమచే జనలోక మంతయుఁ
    దగిలి సంతతమును బొగడఁ దనరె
భళిర! కొనియాడ బాత్రమై పరఁగినట్టి
వైరి నృపజాల మేఘ సమీరణుండు
దిన కరాన్వయ పాథోధి వనజ వైరి
నిశిత కౌక్షేయక కరుండు దశరథుండు
(1—20)

బైచరాజు వేంకటనాథుడు కూడా ఇటువంటి సీస పద్యాన్నే పంచ తంత్రంలో విరచించాడు. చూడండి:

తన దాన గౌరవంబునఁ బుణ్యజన పరం
    పర చిరస్వాస్థ్య సంపద వహింపఁ
దన మహాహవము పెంపునఁ జక్రవాళాచ
    లోత్తర తిమిరంబు లుద్దు కుడువఁ
దన ఘనావన బలోద్యమమున సతిమిత్ర
    గోత్ర కుంజర జాలి కుతుక మందఁ
దన మరుంగున దురంత ప్రతాప స్ఫూర్తి
    పావకంబు నినుడును నణఁగియుండ
సమధి కాధృతిఁ బూని విశ్వంభరుండు
తప్ప కెన్నడు కన్నులఁ గప్పుకొనఁగ
వాలు మగఁడయి యత్యంత వసు సమృద్ధి
దనరుఁ బ్రియ దర్శనుండు సుదర్శనుండు
(1—70)

ఇలాగే ఇంకో రెండు పద్యాలలో కూడ కొన్ని పోలికలు ఈ ఇద్దరి కావ్యాలలో గోచరిస్తాయి. మొల్ల రామాయణం లోని ఈ పద్యం చూడండి:

విరహాతిశయమున వృద్ధి బొందగఁలేక
    విష ధరుండును ఘోర విషముఁ బూనె
తాపంబు క్రొవ్వేంచి తరియింప నోపక
    పలు మాఱుగడగండ్లఁ బడియెఁ గరులు
కందర్ప శర వృష్టి నందనోపక ఘృష్టి
    వన వాసమునఁ గ్రుస్సి వనరు సూపె
దీపించి వలపోప నోపక కూర్మంబు
    కుక్షి లోపలఁ దలఁ గ్రుక్కి కొనియె
కుంభినీ కాంత తమమీది కూర్మి విడిచి
ప్రకట రాజన్య మస్తకా భరణ ముకుట

చారు మాణిక్య దీపిత చరణుండైన
దశరథాధీశు భుజపీఠిఁ దగిలినంత

(1—23)

ఈ పై పద్యం వేంకటనాథుడి పద్యానికి ఎంత దగ్గ ఉన్నదీ గమనించండి:

అతి శీధు మద వికారత మేను లెరుగని
కరటుల సఖ్యము గ్రాహ్యమనియుఁ
గుత్సిత విసము వాకునఁ దీపుఁ గల పా వ
జాతితో నెయ్యంబు జరుగదనియు
గళము సాటమున ద్రవ్వి కడుపు బోసికొనెడి
పందితోఁ బొందు నిర్బంధమనియు
నఖిల కంటక సహాయతఁ బెచ్చు పెరిగిన
కఠిన మూర్ఖుల చెల్మి కష్టమనియు
ధరణి కరిఫణి కిటిధరేశ్వరుల మోసి
యప్రమత్తు మహా విశుద్ధాంతరంగు
నాది గర్వేశ్వరునిఁ గరుణార్ద్ర హృదయు
సన్మత సన్నిభు సమ్మర్త్య విభునిఁ జేరె

(1—73)

ఈ ఇద్దరూ ఒక ప్రాంతంవాళ్లే. మొల్ల నెల్లూరు మండలంలోని గోపవరం వాస్తవ్యురాలు. బైచరాజు వేంకట నాథుడు నెల్లూరువాడే. తన పంచతంత్రంలో 'విక్రమ సింహ పుర నికటపట కాంతారంబున' అని శ్లేషించాడు. ఇతని కాలం ఇదమిద్ధంగా మనకు తెలుసు. క్రీ. శ. 1500—1570 ప్రాంతాల వాడని చాగంటి శేషయ్యగారు నిర్ణయించారు. వేంకటనాథుడు పంచతంత్రం విరచించిన తరువాత మొల్ల తన రామాయణం వ్రాసిందేమో! అయితే ఆమె పదహారవ శతాబ్ద కవయిత్రి అవుతుంది.

ఇంకే రామాయణంలోనూ కనబడక ఒక్క మొల్ల రామా యణంలోనే ఉన్న ఘట్టంకూడ ఒకటి కాల నిర్ణయానికి పని కొస్తుందేమో. తెలుగు దేశంలో ప్రచారంలోవున్న కొన్ని అవాల్మీకమైన కథలను మన కవులు తమ రామాయణాలలో చొప్పించారు. మొల్ల కూడా అలాగే చేసింది. ఈ క్రింది ఘట్టం చూడండి:

చనుచు రాఘవుండు స్వర్ణది యొడ్డున
గుహునిగాంచి యతనిఁ గుస్తరించి
తడయ కోడఁ బెట్టి దాటింపు మనవుడు
నట్ల చేయఁదలఁచి యాత్మలోన.

సుడిగొని రాము పాదములు
సోకిన ధూళి వహించి రాయి యే
ర్పడ నొక కాంత యయ్యెనట
పన్నగ నీతని పాదరేణు వి
య్యెడ వడి నోడ సోఁకనిది
యేమగునోయని సంశయాత్ముఁడై
కడిగెఁ గుహుండు రామ పద
కంజయుగంబు భయంబు పెంపునన్

(2—31, 32)

ఈ విషయం రంగనాథ రామాయణంలోగాని, భాస్కర రామాయణంలోగాని లేదు. పోనీ కూచిమంచి తిమ్మకవి విర చించిన అచ్చ తెనుగు రామాయణంలో సైతం లేదు. తిమ్మ కవి కాలం క్రీ. శ. 1690—1760 అని చరిత్రకారులు చెప్తున్నారు.

గుహుడు కాళ్లు కడిగి శ్రీరాముడిని పడవ ఎక్కించు కొన్నట్టు మొల్ల కల్పించడానికి కారణం ఏమిటి? ఆమె కాలం నాటికి ఇటువంటి ఊహకి ప్రచారం ఎలా వచ్చింది. వసు చరిత్ర అవతారికలోని మొట్ట మొదటి పద్యంలో కూడా ఇటు వంటి కల్పనే ఉంది.

శ్రీ భూపుత్రి వివాహ వేళ
నిజ మంజీ రాగ్ర రత్న స్ఫురీ
లాభి వ్యక్త వరాంఘ్రి రేణు భవ
కన్యా శీల యంచున్ మదిం
దాభావింప శుభక్రమా కలనచే
దద్రత్నముం గప్పు సీ
తా భామాపతి ప్రోవుతం
దిరుమలేంద్ర శ్రీ మహారాయనిన్.

ప్రతిభా శాలియైన రాజరాజ భూషణుడు ప్రచారం లోనికి తెచ్చిన ఈ భ్రాంతి మదలంకారాన్ని చదివాక మొల్ల ఇంకో మెట్టు పైకి పోయి, గుహుడు కాళ్లు కడిగి రాముణ్ణి పడవ యెక్కించుకొన్నట్టు కల్పన చేసిందా? వసు చరిత్ర "క్రీ. శ. 1569—70 ప్రాంతమున పెనుగొండలో తిరు మల దేవరాయని పట్టాభిషేకానంతరమున రచితమైనది" అని నిడుదవోలు వేంకటరావుగారు నిర్ణయిస్తున్నారు.

మొత్తంమీద మొల్ల పదహారవ శతాబ్ది చివరి రోజుల లోనిది కావచ్చుననిపిస్తోంది.

# 'ఆముక్తమాల్యద' రచనాకాలము పరిశీలన

★

కృష్ణశ్రీ

రాయలు తన తెనుగు కబ్బమును ఏడు విభాగములుచేసినట్లున్నది. ప్రతి ఆశ్వాస ప్రారంభమున తిరుమల దేవుని ప్రార్థన కలదు. ఇయ్యది మంగళకరమగు ప్రారంభము.

కథమధ్య మంగళసూచనలనుకొందము. ఆశ్వాసాంతమున మంగళాంతము కావ్యలక్షణముచే సూచితము. ఇయ్యది అయిదు విధములుగా నుండవచ్చును కదా?

"స్వాభిప్రాయాం కృత్వా, స్వనామాం కృత్వా,
ఇష్టనామాం కృత్వా,
మంగలాం కృత్వా, ఆశంసాం కృత్వా."

వీరవిజయ చిహ్నితమైన చారిత్రాత్మక సూచనలు ఈ క్రింద ఉదాహరింపబడిన ఆశ్వాసాంత పద్య సప్తమందున్నవి.

రాయలు యుద్ధభేరి మ్రోగుకాలమునను, ఈ కావ్యరచన సాహిత్యముగా సాగించి, ప్రతి విభవా పూర్ణమును మంగళాంతముగ చూచి మురుకై ఒక్కొక్క విజయప్రశస్తిని పద్యమునందు పెట్టి ఉంచెను.

ఇటు ఉదాహరించిన ఏడు పద్యములను చరిత్రాంశములతో జోడించిన కావ్యరచనాకాలము, కావ్యపరిమితి, రాయల విభవము బోధియగును.

మ॥ ఇది కర్ణాట ధరాధ్యతి స్థిర భుజాహేవాక లగ్నోర్భరా
డుదయోర్వీధర తత్పితృ వ్యకృత సన్యోపాయ నోర్ధ్మీ పుర
త్న దృగంచత్పద కృష్ణరాయ వసుధా ధ్యక్షోదితా ముక్త మా
ల్యద నాశ్వాసము హృద్య పద్యముల నాద్యంబై మహింబొల్పగున్.
(ఆ. మా. I–89)

శ్రీ కృష్ణదేవరాయలు ఉదయగిరియందు ప్రతాపరుద్ర పుత్రుని ఓడించెను.

ఇది భూమండన కొండవీడు ధరణీ భృద్దుర్గ పూర్వాద్రిభా
స్వదిభేశాత్మజ వీరభద్రజన జీవగ్రాహ రాహూయమా
ణదృఢాంచద్భుజ కృష్ణరాయ మహిభృన్నామాస్మదాముక్త మా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము ద్వితీయంబై మహింబొల్పగున్.
(ఆ. మా. II-101)

రాయలు కొండవీటిలో వీరభద్రపాత్రుని నోడించుట

ఇది పాత్ర ప్రహరేశ్వర ప్రభృతి బంహిష్ఠోత్కలాసీక గు
ప్త దివి స్పృక్పటు యంత్ర కొండపలి హృద్యాహాసిక ।దూజ దీ

ష్య దుదారోద్యమ కృష్ణరాయ నృప సంజ్ఞా స్మత్కృతా ముక్త మా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహింబొల్పగున్.

(ఆ. మా. III-90)

రాయలు కొండపల్లిని జయించెను.

శా॥ ఇది సింహాచలదంభ కేసరి పదాభీష్టార్చనా పుణ్యల
బ్ధ దురుట్టంకణ పొట్టునూరి విజయ స్తంభోప లోట్టంకితాం
క దృఢేష్టాక్షర కృష్ణరాయనృప సంజ్ఞా స్మత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాల్గవది హృద్యంబై మహిం బొల్చుగున్.

(ఆ. మా. IV-289)

రాయలు పొట్నూరికడ కటకమును జయించినట్లు విజయస్తంభమును నాటెను.

మ॥ ఇది యంధ్రోక్తి యథార్థనామ యవనా స్యక్ష్వార్ణ కెంబావి వా
రిద పద్ధత్యవరోధి వప్రవలయ శ్రేణీ విఘూశ్రియా
స్పద సేవాగ్రగ కృష్ణరాయ మహిభృత్సం జ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైన పద్యంబులన్.

(ఆ. మా. V-161)

రాయలు కెంబావిపట్టు తురకం నోడించెను.

మ॥ ఇది నైరామన యావనా వని ధవాహీనా భ్రచుంబి స్ఫుర
ద్విదితా భీలమణీ గృహాళి దళనోద్వేలాగ్ర హస్తి వ్రజో
ద్య దసీకాగ్రగ కృష్ణరాయ మహిభృత్సంజ్ఞా స్మదాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది హృద్యంబైన పద్యంబులన్,

(ఆ. మా. VI-69)

రాయలు నైరామన పట్టణమున తురకల నోడించుట.

మ॥ ఇది సీలాచల సీలచోళక సుభద్రేంద్రవరాభాక్షికో
ణ ద్వగం చద్భుజ వీర్య ధుర్యజయ సన్నాహార్భటీ వాద్యభీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయ మహిజాన్యత్పాదితాముక్తమా
మాల్యద నాశ్వాసము సప్తమంబలరు హృద్యంబైన పద్యంబులన్.

(ఆ. మా. VI-75)

రాయలు కటకమును గెలిచి, గజపతిని వింధ్యారణ్యములకు పాఱద్రోలుట.

## ఉప్రబంధము

### శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ

అండజయాన మా సరసిజాసను రాణికి మ్రొక్కి, ఆంధ్ర భూ
మండలమందు నన్ను నొక మానిసిఁ జేసిన దివ్యమూర్తికిన్
దండనముపెట్టి, పూర్వ కవినాథుల రూప విలాస విభ్రమో
ద్దండ యశః ప్రతాప గుణతత్త్వము లించుక విన్నవించెదన్.

ఇది చాటు కవిత, యుండలి
పెద పెదనుబోలు పెద్దు నూత్న భావము, దీనిం
జదివి విని యంతటనే
కొదుకక తత్త్వము గ్రహించు గోరెద నలితో.

**నన్నయ :**

శబ్దశాసనా ! ఒక్క సంశయము, నీవు
భారతామ్నాయ గుంఫన పండితుడవు,
ఆంధ్ర శబ్ద చింతామణి నటుకమీద
నెన్ని నాళ్లు దాచితివయ్య చెపుము !

**నన్నెచోడుడు :**

నన్నెచోడ కవీ, 'నమోనమః' మున్ను
దేశి కవితను దిగుమతి చేసినావు
సంతసము, కాని, ఫాలాక్షు నంతవాని
కేమయా గంగవెఱ్ఱి లెత్తించినావు !

**తిక్కన**

ఉభయ కవిమిత్ర బిరుదమే విభుడొసంగె
సోమయాజికి ? తన మాట సొంపులెల్ల
నల్లి బిల్లిగా గవితలో నల్లి వాని
దెలిసికొండని మన దుంప తెంచినాడు.

**ఎఱ్ఱన**

తిక్కయజ్వకు నదియేమి తిక్కొ చూచి
వదిలి వైచినాడారణ్య పర్వశేష,
మదిగదా భాగ్యమన్న నెఱ్ఱన్నగారు !
దక్కె నొకచోటు మా కవిత్రయము నడుమ.

**శ్రీనాథుడు :**

ఎవరయా మీరు ! మూర్తీభవించియున్న
యాంధ్ర కవితవా ! పుంభావ మందికొన్న
శారదా మూర్తివా ! కవి సార్వభౌమ
స్వాగతము, ఒక్కమాట కోపమ్ము వలదు.

తెనుగాధీశుల ముత్తెపుంజ వికలన్ దీనార టంకాలలో
మునుకల్ వెట్టి, యశో విలాసముల తా ముల్లోకముల్
నించి, చం
దన కర్పూర హిమాంబు సంకుమద మందం జూచితే !
కానియేన్
దినవెచ్చమ్మున కేని దాచితివిగా దేమందు నీ వైఖరుల్.

ఆంధ్ర విలాసిని యరచాటు పైటలో
రత్నాంగుళీయ విభ్రమము చూపి
ద్రవిడ నితంబినీ స్తన మండలములపై
గ్రొవ్వాడి నఖరేఖ కుదురు కొల్పి
కర్ణాట భామినీ కటక సంధానిత
మణిమేఖలముల నేర్పున సడల్చి
కాంచీపురీ వారకాంతా ధరోష్ఠాల
తిసి ధాతువర్ణమ్ము నిర్వహించి
యేలుకొంటివి శృంగార మేకధాటి
బాల్యసఖుడైన యువతి తిప్పయ్యసెట్టి
యంతవాడుండ జవ్వాది యగరు సెంటు
నడిగితివి సెంటు భూమైన నడుగవైతి.

**పోతన**

ఖర్చు వెచ్చమ్ములకు చేత కాసి లేక
కాకియును వ్రాలదా యింటి గడపమీద,
ఘోర దారిద్ర్య దుఃఖాన కుమిలి కుమిలి,
యేగతి రచించె పోతన్న భాగవతము !

**శ్రీకృష్ణదేవరాయలు :**

రాయవేశ్యా భుజంగ, సంగ్రామపార్థ
తింత్రిణీ పల్లవములపై తీపి వుట్టె,
సరస శృంగార రస సుధాస్వాదకలన
వెగటు గలిగించెనా రాజ విభవమంట !

**పెద్దన**

మనుచరితమున నదియేమి ముచ్చటయ్యె
తాతగారికి ! మను చరిత్రమ్మనందు
వెఱ్ఱిబాపడు ప్రవరుని పేరుచెప్పి
ఎంత ప్రేమకలాప మాడించినాడు !

**తిమ్మన**

తిమ్మన్న గుణము ముక్కుం
దిమ్మన్నకు గేదు సత్య తీఅని యంటకన్
అమ్మదన జనకు తలనే
క్రుమ్మినదట ! యేమి వ్రాత కూడా గుడ్డా !

**రామకృష్ణుడు :**

రామలింగన్నగార ! రారండు, నిగమ
శర్మ అక్కయ్య చూడ ముచ్చటకు వచ్చి
పుట్టు నింటిలో ముక్కర పోయెనంచు
నేడ్చుకొన్నది, దొరకెనా యిప్పుడైన !

**రామరాజభూషణుడు :**

కుట్టన తేలువై గిరికకున్ వసురాజును గూర్చి తేనియల్
ఉట్టిపడంగ జెప్పితివి యొక్క ప్రబంధము, నాస్వదించి తా
లొట్టలు వైచె నాంధ్రకవిలోకము, తేదీ విన్న కుక్కవా
బట్టుకవీ ! యదేమి యది ! బావురుమంచని యేడ్చు
వెందుకో!

**అప్పకవి :**

అప్పకవీ ! నీ వన్నది
తప్పనుమీ ! పాదజాండు తగదాకవితల్

చెప్పంగ, వినకే నూతులం
చెప్పోం బంగారములం నా. సింహ మున్నటుల.

# "రాజావళి" చరిత్ర
# [illegible] కాదు

## శ్రీ శ్రీనివాసపురం నరసింహాచార్యులు

ఈ విశాల భారతమందలి విస్మృత చారిత్రక విషయముల దెలిసికొను కుతూహలము గలవాడ నగుటచే 'రాజావళి' యను నపూర్వ పురాతన చారిత్రక గ్రంథముపలబ్ధ మైన దని నాఫెన్ (NAFEN) వార్తా మూలమున దెలియ వచ్చినట్లు, అక్టోబరు 1963 భారతి సంచిక 'కలగూరగంప' శీర్షికలో ప్రకటింపబడిన విషయము నన్నాకర్షించినది. మరియు నా పత్రికయందే నవంబరు మాసమున 'లేఖల శీర్షిక' క్రింద నున్న శ్రీ హస్నాబాద నాగలింగ శివయోగిగారి వ్రాతలను గూడ దిలకించుట మొన్ననే తటస్థించినది. వానియం దీ 'రాజావళి' ని గూర్చి చెప్పబడినట్టి సంగతి నీ దిగువ సంగ్రహముగ నుదాహరించుట యప్రస్తుతముగా నుండజాల దను కొందును—

"ఢిల్లీ రాజధానిగా పాండవజ్యేష్ఠుడైన యుధిష్ఠిర చక్రవర్తి మొదలు పది వేర్వేరు వంశములలోని రాజులు పలువురు దాదాపు ఐదువేల సంవత్సరముల పర్యంతము పరిపాలన సాగించిన చరిత్ర, వారి పరిపాలన, సంస్కరణాది విషయములను గూర్చిన వివరములీ గ్రంథమున వ్రాయబడి యున్నవనియు, దీనివలన ప్రాచీన భారతదేశ చరిత్రయం దజ్ఞాతములుగా నుండి పోయిన యనేక విషయములు బహిర్గతములు కాగలవనియు, కాంగ్రీ భాషలో నున్న అపురూపమైన ఈ గ్రంథమును, కాంగ్రీ మాజీ రాజుగారైన శ్రీ శ్రీ బలదేవ్‌సింగుగారు సంపాదించిరనియు, విది ఆచార్య శ్రీ యదునందనశాస్త్రి, ఆచార్య గౌరీశంకర్‌గార్లచే పరిష్కరింపబడి పంజాబు ప్రభుత్వపు హిందీ విభాగము వారిచే త్వరలో ప్రకటింపబడనున్నదనియు వ్రాయబడి యున్నది.

ప్రాచీన భారతదేశ చరిత్ర దెలియగోరువారి కిది ఎంతయు సంతసమును గూర్చు వార్త యయ్యెను, ఏ తదుత్కృష్ట గ్రంథ మే కాలమున వ్రాయబడినదో, గ్రంథకర్త యొక్క నామమేం దవిలి ఏ యక్షరములు పావన మైనవో దెలిసికొనుటకు వీలు గానందున ఇంచుక నిరాశాజనకమై గ్రంథము ప్రకటితమౌట ఎప్పుడా ? యనిపించుచున్నది. ఈ గ్రంథమువలన భారతదేశ చరిత్రలో మరుగుపడిపోయిన విషయము లనేకములు ప్రకటితములు గావచ్చునని చరిత్రకారు లాశించుటయు సమంజసము. గ్రంథస్థములైన విషయములలో 'స్థాలీపులాక న్యాయము'గ ప్రదర్శించినవానిలో పాండవ వంశములోని రాజులు ముప్పదిమంది హస్తినాపురము రాజధానిగా పాలనము సాగించిరనిన సంగతి శ్రీమద్భాగవతములోని చంద్రవంశపు రాజుల ఇతిహాసముతో సరిపోలుట చేతను, ఆ నగరము రాజధానిగా పరిపాలించిన చివరి హిందూ వంశము పృథ్వీరాజుతో మొదలైనట్లు తెలుపుటవలనను, తర్వాతివారు ముస్లిములుగా పేర్కొనబడుటచేతను అందలి విషయములు సత్యసమ్మతములైనట్టి చరిత్రలుగా నుండగలవనియు జెప్ప నొప్పును. నే నీ విషయముల నింకను విపులీకరించి వ్రాయుట చర్విత చర్వణ మగును గావున నద్దానిని వదిలి:

ఈ 'రాజావళి' గ్రంథము నితఃపూర్వ మెవ్వరును జూచి యుండలేదా ? ఇది ఇప్పుడే బయలుపడినదా ? యనెడి విషయములు పాఠకలోకమున కెఱింగింపదలచియే ఈ వ్యాసమును వ్రాయదలచుకొంటిని. ఇక ప్రస్తుతాంశమునకు మరలుదము.

శ్రీ అక్షయకుమార్ మజుమ్‌దార్ (ఢక్కా) గారు క్రీ. శ. 1917 లో తాము వ్రాసి ప్రకటించిన హిందూ హిస్టరీ* అను గ్రంథములోని మొదటి అధ్యాయము 20 పుటలో 6 వ విషయముగా దీసికొనిన పునర్నిర్మాణాధారములు (Sources of Reconstruction) అను శీర్షిక క్రింద 1. ఐతిహ్యము, 2. పురాతత్త్వ శాస్త్రములు, 3. సమకాలీన చారిత్రక ప్రకరణములు, 4. పాశ్చాత్య వర్ణనలు, అను వానిని తమ యీ రచనమునకు మూలాధారములుగా గ్రహించి యుండిరి. వీనిలో మొదటిదగు ఐతిహ్య విభాగమును (Tradition) గూర్చి వ్రాయుచు వారు—1. వేద వేదాంగములు, 2. సంహితలు, 3. సంస్కృత కావ్యములు, 4. చారిత్రక గ్రంథములు, అను నాలు గంశముల నద్దాని కాధారములుగ దీసికొనిరి. ఇందులో నాల్గవది యగు చారిత్రక గ్రంథములు అను నంశమునందు :—(అ) కల్హణుని రాజతరంగిణి, (ఆ) హేమచంద్రుని కుమారపాల చరితము, (ఇ) భోమరాయసము, (ఈ) పృథ్వీరాజ రాయసము, (ఉ) రాజావళి (ఊ) దీపవంశ, మహావంశములు, (ఋ) జాతక కథలు, (ౠ) శత్రుంజయ మాహాత్మ్యము, (ౡ) పురాణములు, (ౡా) తంత్రములు, (ఎ) సామాన్య గ్రంథములు, అను వానిని ప్రమాణములుగ గైకొనినట్లు తెల్పియుండిరి.

అంతేకాక వారు తమ గ్రంథమునకు వ్రాసిన భూమికలో ఆ గ్రంథ రచనమునకు తనకు ముప్పది దీర్ఘ సంవత్సరముల కాలము పట్టిన దనియును నుల్లేఖించి యుండిరి. కనుక శ్రీ మజుమ్‌దార్‌గారు మనలో సంచలనము గలిగించిన ఈ 'రాజావళి' యను గ్రంథమును ఇప్పటికి 76 సం. కు పూర్వమే చూచియుండిరని ధ్రువపడుచున్నది కదా ? తాము తమ గ్రంథమం దుదాహరించిన గ్రంథకర్త నామములను, అది వారే భాషలో చూచినదియు, వారును తెలిపియుండలేదు. ఈ కారణమున "రాజావళి' కి కర్త ఏసుకీర్తియో, అత

* ఈ గ్రంథ మిప్పుడు లభించుటలేదు.

డేనాటివాడో యను విషయములను గూర్చి మన కింతకంటెను విశేషముగ దెలిసికొన వీలులేదు.

ఇది నే నెరింగిన విషయము. ఇక ఈవిషయము నొక క్రీస్తు నుంచి "అత్రి మొదలుకొని బ్రహ్మ క్షత్రుని వరకును గల రాజుల సంఖ్య చాల పరిమితముగా నున్నది." అనిన మన నాగలింగ శివయోగిగారి మాటల నొక కొంత పరామర్శించుచు, పాఠక లోకము యొక్క సౌలభ్యమునకై యుధిష్ఠిరుని వరకును గల చంద్రవంశపు రాజుల క్రమము నీ దిగువ నుదాహరించు చుంటిని. అది ఇప్పటికి దాదాపు 4753 సంవత్సరములనాటి సంగతి.

చంద్రవంశపు రాజులకు మూలపురుషు డత్రి యెన్నడును గాడు. అతడే రాజ్యమునో పాలించినట్లు ఏ పురాణమునందును చెప్పబడి యుండలేదు.గనుక అత్రి మహర్షిని మనము రాజుగా పేర్కొనజాలము. చంద్రవంశపు రాజులకు న్యాయ సమ్మత ముగ జెప్పవలసినచో మూలమూర్తి స్త్రీ. ఆమెయే ఇల. ఈ ఇలాదేవి వైవస్వత మనువునకు శ్రద్ధాదేవి యను ధర్మ పత్నియందు జన్మించిన ఏకాదశ సంతానములోని జ్యేష్ఠ పుత్రిక. ఇక్ష్వాకు మహారాజీమెకు తమ్ముడు. మనువు తన మరణాత్పూర్వమే తన యధీనములో నున్న రాజ్యమును, వివాదములకు లోను గాకుండ తన సంతానమునకు వేర్వేర విభాగించి యొసంగి యుండెను. అందు తన వంతునకు వచ్చిన గంగా యమునా నదుల మధ్య గల భూభాగమునకు ప్రతి ష్ఠానపురము (నేటి అలహాబాదు) ను రాజధానిగా జేసుకొని ఈమె క్రీ. పూ. దాదాపు 2790—80 ప్రాంతమునందు సింహాసనము నధిష్ఠించు సమయమున పూరుష వ్యాపార ముల కనువుగా 'సుద్యుమ్న' నామమున ప్రజాపాలనము సేయు చుండెను. ఈమెయే ప్రప్రథమమున రాజ్య పీఠి నధిరో హించిన హైందవ యువతి.

సప్తర్షి సోదరులలో రెండవ వాడగు అత్రి మహర్షి పుత్రుడును ఆ కాలమున మంగోలియా దేశ భూభాగము నేలు చుండిన సోముడు లేక చంద్రుడు అను నతని కుమారుడగు బుధుడనువా డీ ఇలారమణిని పరిణయ మయ్యెను. ఈ ఇరువు రకు నుద్భవించినవాడే పురూరవుడు. అగుట నీతనిని చంద్ర వంశపు రాజులలో మూడవ వానిగా మనము పరిగణింప వచ్చును. కావున ఆయువు నాలవరా జగుచున్నాడు. ఐదవ యాతడు నహుషుడు. 6. యయాతి, 7 పూరుడు, 8. జనమే జయుడు, 9. ప్రాచీశుడు, 10. ప్రవీరుడు, 10. మానాశ్వుడు, 12. చారుపదుడు, 13. సుద్యువు, 14. బహుగతుడు, 15. సంయాతి. 16. అహంయాతి. 17. రౌద్రాశ్వుడు, 18 ఋతే పువు 19. రంతినారుడు, 20. సుమతి. 21 అయితి, 22 దుష్యంతుడు. 23. భరతుడు, (ఇతనివల్లనే భరతఖండమని పిలువ బడినది) 24. వితథుడు, (ఇతడే భరద్వాజుడు) 25. మన్యువు, 26. బృహత్క్షత్రుడు, 27. హస్తి (ఇతని పేరనే హస్తినాపురము నిర్మింపబడినది.) 28. అజమీఢుడు, 29. ఋక్షుడు, 30. సంవ రణుడు, 31. కురుడు (ఇతని వలననే కురుక్షేత్రమని పిలువబడినది) 32. జహ్నువు, 33. సురథుడు, 34. విదూరథుడు, 35. సార్వభౌముడు, 36. జయత్సేనుడు, 37. రధికుడు, 38. అయుతాయువు, 39. అక్రోధనుడు, 40. దేవాతిథి, 41. ఋక్షుడు (2 వ) 42. దిలీపుడు, 43. ప్రతీపుడు, 44. శంత నుడు, 45. విచిత్రవీర్యుడు, 46. భీష్ముడు (రాజ ప్రతినిధి), 47. పాండురాజు, 48. ధృతరాష్ట్రుడు, 49. యుధిష్ఠిరుడు. ఇతని తర్వాతి వారినే పాండవ వంశమని పేర్కొనిరి. వీరిని గురించియే మన 'రాజావళి' వివరించుచున్నది. చంద్ర వంశపు రాజుల పట్టిక ఇంత పెద్దదిగా మనకు గన్పట్టు చుండ 'చాల పరిమితి' అనిన శ్రీ శివయోగిగారి మాటలలోని భావము బోధపడుటలేదు.

రాజ్యమునకును, సింహాసనమునకును అవినాభావ సంబం ధము గలదు. గాన, ఢిల్లీ సింహాసనమును గూర్చి సాంప్ర దాయిక విశ్వాసములైన సంగతులు కొన్నిటిని వివరించెదను: "ఈ ఢిల్లీ సింహాసనము ధర్మరాజాని యనంతరము పరీక్షిత్తు డును, అతని తర్వాత ప్రవీకరాయులు మొదలు సింహారి వరకు గల ఇరువదియైదు మంది రాజు లధిష్ఠించిన తర్వాత కదంబ వంశమువాడైన మయూర శర్మకును, పిమ్మట వృషభ రాయ, దుర్మిత్త్రరాయ, కదంబరాయులకును, తర్వాత ఉజ్జ యినీ పతియైన విక్రమార్కునకును, అటపైన అవంతీ వల్లభుడగు భోజరాజునకును, అతని పిదప శాలివాహన రాజు లకును, వారి తర్వాత కృష్ణుని మనుమడైన అనిరుద్ధుని ప్రపౌత్రుడగు సుబాహుని వంశములోని వారికిని, అటపైన భళ్లాల రాజులకును, వారి యనంతరము హొయసళ చక్ర వర్తులకును, ప్రాప్తమైనది. వీరి తర్వాత కాకతీయవంశ ప్రభువుల మూలమున ఓరుగల్లు ప్రతాపరుద్రరాయలకును, అటు పిమ్మట హొయసళ సోమేశ్వరు డధిష్ఠించిన తర్వాత, జంబు కేశ్వర రాయల మూలమున ఈ సింహాసనము నీకు ప్రాప్త మైనది" అని శ్రీ మాధవ విద్యారణ్యులవారు విజయనగర సామ్రాజ్య స్థాపకుడైన హరిహరరాయల పట్టాభిషేక సంద ర్భమున నుడివినట్లు కొన్ని వ్రాతలు గలవు.

వివాదగ్రస్తములైన ఇటువంటి విషయము లెన్నియో ఈ 'రాజావళి' మూలమున పరిష్కారములు గావచ్చు ననియు, అమూల్యమైన ఈ గ్రంథమును సంధానముచేసిన ఆ మహా మనీషి ఎవ్వడో ? అతడే కాలపువాడో ! తొలుదొల్త నది ఏ భాషలో రచియింపబడినదో? ఎరుంగవలయు ననెడి కోరికచే యప్రస్తుతములైన సంగతులను గూడ గొన్నింటి నిట వివరింపవలసి వచ్చినందులకు పాఠకులు విసుగు గొనకుండురు గావుతమని ప్రార్థించుచు, ఈ 'రాజావళి' ని గూర్చిన విశేష ములు తెలిసినవా రున్నచో పత్రికాముఖమున తా మెరిగిన దానిని ప్రకటించిరేని నావంటి చారిత్రకప్రియులైన వారి కనేకులకు సందేహనివృత్తికి దోడ్పడగలదనియు, అంతియగాక యావ ద్భారతదేశవాసులకును దమ సత్య చరిత్ర మిట్టిదని తెలిసి కొనుట కుపకరింపగలదనియు తలంచుచు ఇంతటితో విర మించుచుంటిని.

# పరిష్కారం

రెండు మూడు సార్లు ఆమెని మాట్లాడించేందుకు ప్రయత్నించాడు మాధవుడు "బాబాయి జల వచ్చి" అంటూ. కాని ఆమె బలవంతాన వాడిమీద కోపం పెంచుకుని "మాట్లాడ కూడదు" అనుకుంది.

మనస్సుమాత్రం మళ్ళీ ఒక్కసారి "అమ్మా" అని పించుకోవాలని తహతహ లాడింది. అయినా నిగ్రహించుకు నేందుకని "వెధవ, దీనికంతటికీ వీడే కారణం" అనుకుంది. కాని, మనస్సు సమాధాన పడలేదు. బలవంతాన ఆలోచనలని మళ్ళించుకోవాలని అదే మాటని పదేపదే అనుకుంటూ, అలాగే మగత నిదరపోయింది. "అమ్మాయి పద్మావతీ, ఒళ్ళు ఇలా కాలి పోతుంటే నిద్రపోతున్నా వేమిటమ్మా! తప్పుకాదూ? ఈ వెధవాయికి నీమీద ఎంత ప్రేమనుకున్నావు—ఎలా కనుక్కు న్నాడో నీకు జ్వరం వచ్చినట్టు. నా దగ్గరకువచ్చి, బిక్కముఖంపెట్టి, "మా అమ్మకి జలం" అన్నాడు. "మీ నాన్న ఏమయాడురా" అనడిగాను. "లేడు" అన్నాడు. సరేనని ఆ పళాన మా వాడిని డాక్టరుగారి దగ్గరకు పంపించి ఇటొ చ్చాను" అంటూ చెప్పింది పక్కింటి పిన్నిగారు.

తలనెప్పి పగిలిపోతోంది పద్మావతికి. కళ్ళని బలవంతాన తెరిచి, "కూర్చోండి పిన్నిగారూ" అందిగాని, ఆమె కళ్ళు మాధ వుడికోసం వెదికాయి.

ఇందాకటి స్థానంలోనే బల్లమీద ఎక్కి, ఆమె ముఖం లోకి చూస్తున్నాడు. వాడి ముఖంలో కొట్టొచ్చినట్లు కన బడుతున్న ఆత్రం, భయం చూస్తే పద్మావతికి జాలేసింది.

ఏంచేస్తాడో చూద్దామని చేతో నుదురు గట్టిగా పట్టు కుని "ఏరా మాధవా, తల నెప్పిగా ఉందిరా నాన్నా!" అంది.

బావురుమని ఏడవడం మొదలెట్టాడు వాడు—అదేమిటో నని ఖంగారు పడిపోయి.

మనస్సుమీద బలవంతాన వేసుకున్న ఆంక్షలన్నీ ఒక్క సారిపోయాయి పద్మావతికి. గభాలున చేతులుచాచి, వాడిని దగ్గరకులాక్కొని గుండెలకి హత్తుకుంది.

పిన్నిగారి కళ్ళు చెమర్చాయి. "బాగానేఉంది తల్లీ కొడుకుల పని. నీకేదో అయిపోయిందని వాడేడవడం! అయినా వెధవాయికి తలనెప్పి అంటే ఏమర్థమయిందో?.........అరుగో డాక్టరు గారు వచ్చారు" అంది ఆవిడ.

*          *          *          *

భయంగా, దిగులుగా లోపలికి వచ్చిన ఆనందరావు హాల్లో ఎవ్వరూ కన బడకపోయేసరికి ఖంగారుపడిపోయాడు. లోపలికి వెళ్ళేందుకు భయపడ్డాడు—ఎటువంటి సన్నివేశాన్ని ఎదుర్కొన వలసి వస్తుందోనని.

అడుగులో అడుగు వేసుకుంటూ పడకగది దగ్గర కొచ్చాడు. గుమ్మంలో నిలబడి లోపలికి చూసిన అతనికి నేత్ర పర్వమయిన దృశ్యం అగపడడంతో ఆశ్చర్యపోయాడు.

పద్మావతి పడుకుంది మంచంమీద. మాధవుడు ఆమె పక్కన మంచంమీద కూర్చునున్నాడు. వాడి చుట్టూ చేయి వేసి, "......బుధవారము, గురువారము, శుక్రవారము, శని వారమూ—ఈ ఏడున్నూ వారముల పేర్లు" అని తను అని, వాడిచేత అనిపిస్తోంది పద్మావతి.

ఆశ్చర్యం పట్టలేక, కలా, యదార్థమా అన్న విషయం రూఢిగా తేల్చుకుందామని "పద్మా!" అన్నాడు ఆనందరావు.

అతన్నిచూసి, గబుక్కున లేవబోయి, మాధవుడు లేనని అనుకుని ఉండటం గమనించి, "లే నాన్నా, నాన్నగారు వచ్చారు" అంది పద్మావతి.

యథార్థమే అని బుజువయింది ఆనందరావుకి. "వాడిని ఇవాళే తీసుకు వెడదామనుకుంటున్నాను" అన్నాడు ఎందు కయినా మంచిదని.

"కావాలంటే మీరే వెళ్ళండి—మేం రాము. ఏరా మాధ వా?" అంది పద్మావతి.

"ఉహుం, రాము. బాబాయి రౌడీ!' అన్నాడు వాడు ఆమెకి వత్తాసిస్తూ.

"ఓరి వెధవ—నేనురా రౌడీని! మరి ఆవిడో?"

"అమ్మ మంచిది!" అన్నాడు మాధవుడు.

ఆనందరావు సంతోషానికి అంతేలేదు "ఇదెప్పటినుంచి?" ఆశ్చర్యంగా అడిగాడు.

"మీరు కొట్టిన దెబ్బలతో డూ హవరిపోయాడు. బాధితులం ఇద్దరం రాజీ పడ్డాం. వెధవాయి నాకు జ్వరం వస్తే నన్ను క్షణం వదలలేదు......పాపం వాడిని గురించి నేను మీతో ఏమన్నానో వాడికేం తెలుసు. అదంతా ఒక పీడ కలను కోండి. క్షమించండి నన్ను!"

"నువ్వే నన్ను క్షమించాలి పద్మా!......అయినా ఇటు వంటి సన్నివేశం చూస్తానని కలలో కూడా అనుకోలేదుసుమీ! మా రాణీగారు మంచిదని నమ్మకంఉన్నా, ఖంగారు పడిపోయాను' అంటూ దగ్గరగావచ్చి, చేతులో ఆమెను చుట్టేయబోయాడు.

అతనినుంచి తప్పించుకుంటూ, "తప్పు, అబ్బాయి!" అంది నవ్వుతూ పద్మావతి.

"ఒరేయ్ వెధవాయ్, పెద్దవాళ్ళున్నప్పుడు పిల్లలు..... ఓ అన్నట్టు పద్మా— వీడు మరీ పిల్లాడుకదా! కొంచెం పెద్ద యాక చెబుతాను ఆ మాట. ప్రస్తుతానికి మరేం ఫరవాలేదు" అంటూ ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

# వాక్య విచారణము

## శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము

### 1

ప్రాచీన భారతీయ భాషావేత్తలయందు రెండుపక్షములు కానవచ్చును. ఒకటి—వాక్యసంస్కార పక్షము. రెండు——పద సంస్కార పక్షము. వాక్య సంస్కార పక్షమువారిట్లందురు : అర్థమునకు సంబంధించినంతవరకు వాక్యమే పరిగణింపదగును. పదము లనునవి లేనేలేవు. 'గామ్' అనుదానిని స్వతంత్రముగాఁ గైకొని 'గో+అమ్' అని ప్రకృతి ప్రత్యయములుగా విభజింపరాదు. 'గామ్ ఆనయ' (గోవును తీసికొని రమ్ము) అనురీతి వాక్యములను బురస్కరించుకొని నప్పుడే యట్టి విభాగము సమంజస మగును. వైయాకరణు లీ సిద్ధాంతమునకుఁ జెందినవారు.

పదసంస్కార పక్షమువారు పదములు స్వతంత్రముగా నేర్పడుచున్నవని భావింతురు. ప్రకృతులకు ప్రత్యయములు చేరుటచే పదములు సిద్ధించును. ఇట్లేర్పడిన పదములు వాక్యమునం దన్వయించి వాక్యార్థమును జేకూర్చుచున్నవని వీరి యభిప్రాయము. పదముయొక్క యర్థమును బాగుగా విచారించియే పండితులు వాక్యమును గ్రహించుచున్నారు. (సువిచార్య పదస్యార్థం వాక్యం గృహ్ణన్తి సూరయః—పరిభాషా. 22 సీరదేవ వాఖ్య) మీమాంసకులు, నైయాయికులు నీ పక్షమునకుఁ జెందినవారు. వైయాకరణులు పద సంస్కారపక్ష వాదమును గౌణ ముఖ్య న్యాయముచే స్వీకరింతురు. వాక్యమే ప్రధానమని, వాక్య గ్రహణానంతరము, అపోద్ధారముచే పదములను, ప్రకృతి ప్రత్యయములను తెలిసికొనవచ్చునని, అఖండ వాక్యస్ఫోట నంగీకరించిన వైయాకరణులే యనుమతించుచున్నారు. ఇట్టి పద్ధతులు శిక్షమాణులగు బాలురకు మరుగుపరచిన మాటలవంటి యుపాయములని వీరి తలంపు. (ఉపాయాః శిక్షమాణానాం బాలానా ముపలాపనాః॥ వాక్యపదీయము II–240) ఈ ఇరుపక్షములయం దేది ప్రాచీనము ? ఏది యుత్తమము ? నిర్ధారించుట కష్టము. ఈ రెండు వాదముల యందును కొన్ని గుణలోపములు కలవు.

పూర్వము వేదము లవిరామముగా పఠింపఁబడుచుండెడివి. దీనినే సంహితాపాఠ మందురు. ప్రాచీన మహర్షులగు శౌనకుఁడు, ఆత్రేయుఁడు మున్నగువారు ఇట్టి సంహితలను పదములుగా విభాగించి, అర్థగ్రహణమునకు, తమ్మూలమున వేదములకు రక్ష చేకూర్చుటకు ప్రయత్నించిరి. ఇట్లు సిద్ధ మొనర్చినవానికే పదపాఠములని వ్యవహారము. ఇదే భాషా విషయకమగు కృషికి ప్రప్రథమ ప్రయత్నము. ఈ కృషి యింతటితో నాగక, పదముల వ్యుత్పత్త్యర్థముల నిరూపణమునకును యాస్కుఁడు తన నిరుక్తమునం దుద్యమించెను. ఋగ్వేద ప్రాతిశాఖ్యనుబట్టి యాస్కుఁడు తన నిరుక్తమునందు "పద ప్రకృతిః సంహితా" యని (I—612) పేర్కొనెను. దీనికి "పదానామ్ ప్రకృతిః" పదములయొక్క ప్రకృతి సంహితయని వాక్య సంస్కారవాదు లర్థము చెప్పిరి. కాని "పదాని ప్రకృతిః యస్యాఃసా" పదములు ప్రకృతిగా గలది సంహిత యని బహువ్రీహ్యర్థమును పదవాదులు పేర్కొనిరి. ఈ రీతిగా నీ యిరు పక్షములవారును తమ తమ వాదముల కనుకూలముగా నర్థము లను కల్పించుచుండిరి. అయినను, పదపాఠముల తరువాత క్రమపాఠము, తరువాత అష్టవికృతులతో కూడిన జటాపాఠము వెలయుటనుబట్టి సంహితా పాఠమే ప్రాచీనతమమనుట నిర్వివాదము.

### 2

వాక్యమును గూర్చి మీమాంసకులలో ద్వివిధములగు వాదభేదము లున్నవి. ఒకటి అభిహితాన్వయ వాదము. ఈ వాద ప్రతిపాదకుఁడు భట్టుఁడు. అందుచే నీ వాదమునకు 'భాట్టుల వాదము' నియు నామాంతరము. "ప్రత్యేకం తత్తత్పదైః అభిహితానామ్ అర్థానామ్ పరస్పరమ్ అన్వయః భవతి ఇతివాదః అభిహితాన్వయవాదః" పదములు తమ తమ ప్రత్యేకార్థములను తెలిపిన పిమ్మట, పరస్పర మన్వయించి, వాక్యార్థమును దెలుపునని యీ వాదముయొక్క సారాంశము. అభిధా, లక్షణా, వ్యంజనాయను త్రివిధములగు శక్తులనే కాక, తాత్పర్యశక్తి యను వేరొక శక్తిని వీ రంగీకరించిరి. అభిధా లక్షణా వ్యంజనాశక్తులు శబ్దశక్తులు, అనఁగా శబ్దముయొక్క యర్థమును బోధించునవి. తాత్పర్యశక్తి వాక్యశక్తి. వారి యాశయ మిది : "శబ్దములు వాని సంకేతితార్థమును మాత్రమే బోధించును. అన్వయమును బోధింపవు. ఎట్లన 'గాం ఆనయ' (గోవును దెమ్ము) అన్నపుడు 'గాం' అను పదము 'గోవును' అనియు, 'ఆనయ' పదము 'తెమ్ము' అనియును అర్థమును దెలుపును. కాని యీ రెండర్థములను గలియుటెట్లు ? అభిధ పదముల యర్థమును మాత్రమే బోధించును. యన్వయమును బోధింపదు. కావున వాక్యమునందున్న పదముల కన్వయమును జేకూర్చి యఖండార్థమును బోధించుటకు వేరొకశక్తి యంగీకరింపవలసి యున్నది. దానికే తాత్పర్యశక్తి యని పేరు. అది లేకున్నచో పదములకు పరస్పరాన్వయ ముండదు. అన్వయము లేనిచో అఖండార్థము కలుగదు. అర్థములు ఖండ ఖండములుగానే యుండిపోవును.

మీమాంసకులలోనే, ప్రభాకరుఁడు, అతని యనుయాయులు పై వాదము నంగీకరింపలేదు. అందు గౌరవమున్నదని వారు తలంచిరి. వీరి వాదమునకే అన్వితాభిధాన వాదమనియు, అనుప్రాభాకరుల వాదమనియు వ్యవహారము. "అన్వితైః పదైః అర్థస్య అభిధానమ్ యస్మిన్ వాదేసః అన్వితాభిధాన వాదః" అని విగ్రహము. వాక్యమునందలి పదములు ఒండొంటితో నన్వయించి, వాక్య తాత్పర్యమును దెలిపిన పిమ్మట తమ తమ ప్రత్యేకార్థములను దెల్పునను నీ వాద సారమునుబట్టి, తాత్పర్యశక్తి యను వేరొక శక్తి గ్రహించు నవసరము తప్పును. వీరి సిద్ధాంత మిట్టిది: "గామానయ" (గోవును దెమ్ము) అని యుత్తమ వృద్ధుఁడు మధ్యమ వృద్ధునితో చెప్పగా, మధ్యమవృద్ధుఁ డద్దానిని తీసికొని వచ్చుటను పరికించుచున్న బాలుఁడు, ఆ వాక్యమునకు సాస్నాలాంగూల కకుద ఖుర విషాణ (గంగడోలు, తోఁక, మూపు, డెక్కలు, కొమ్ములు) వంతమగు ఒకానొక పిండమును గొని తెచ్చుట' యని సాముదాయకముగా గ్రహించును. అంతేకాని ప్రత్యేకముగా ఈ పదమున కీ యర్థమని తెలిసికొనఁ జాలఁడు. పిమ్మట 'గాంబధాన' (గోవును బంధింపుము) 'అశ్వమానయ' (గుర్రమును దెమ్ము) అను వాక్యములను వినును. వెనుకటి 'గోవును దెమ్ము' వాక్యములోని గోవు వంటి వ్యక్తినే కట్టివేయుటను జూచి 'గోవు' అనగా 'ఇది' యని యర్థమును గ్రహించును. 'గుర్రమును దెమ్ము' అను వాక్యమును విని గుర్రమును దెచ్చుటను జూచి, 'ఆనయ' (తెమ్ము) అను పదము,పూర్వము 'గామానయ' అను వాక్యములోని 'ఆనయ' పదము వంటిదే యని తలంచి, దాని యర్థమును గ్రహించును. ఈ తీరుగా వాక్యార్థము వలననే ప్రత్యేక పదముల యర్థము స్పష్టపడును. ఈ మతమున తాత్పర్యశక్తి యక్కరలేదు. ఏలన వాక్యార్థమే ముందు గోచరించును. అభిహితాన్వయ వాదులు "తొలుత పదములవలన అర్థబోధ—పిమ్మట వాక్యార్థబోధ" కల్గునని ప్రతిపాదింపగా, అన్వితాభిధానవాదులు ప్రథమముగా వాక్యార్థబోధయు, తదనంతరము పదార్థబోధయు కల్గునని వాదింతురు. ఈ రీతిగా మీమాంసకులలో నొక వర్గమువారు వాక్యార్థమునకే ప్రాధాన్యము నొసగిరి. పదములకు స్వతంత్రార్థము నంగీకరించుచో, పదమునందలి యే వర్ణమున కెంత యర్థమో నిర్ణయింపవలసి యున్నది. అది దుస్సాధ్యము. కావున వాక్యమే భాషయందలి కనీసపు టంశ మనవలసి యుండును. భాషాగ్రహణమున సహజముగాఁ గనుపట్టుచున్న అన్వితాభిధాన వాదమును బ్రఫ్ దొర సరియైనది కాదని విమర్శించుటకు హేతువు కానరాదు.[1] అన్వితాభిదాన వాదము వాక్యవాదులకు, పదవాదులకు మధ్యే మార్గము ననుసరించుచున్నట్లు కనుపట్టును.

## 3

భర్తృహరి తన కాలమునకు భాషాభిజ్ఞులలో ప్రాబల్యము వహించిన వివిధాభిప్రాయములను సమీక్షించి, వాక్యమునకు నిర్వచనము లనదగు వాని నెనిమిదింటి నీ రీతిగా సంతరించెను :—

(1)ఆఖ్యాత శబ్దః, (2)సంఘాతో,(3) జాతిః సంఘాతవర్తినీ, (4) ఏకోనవయవః శబ్దః,(5) క్రమో,(6) బుద్ధ్యనుసంహృతిః, (7) పదమాద్యం,(8) పృథక్ సర్వపదం సాకాంక్షమిత్యపి వాక్యం ప్రతిమతిర్భిన్నా బహుధా న్యాయవాదినామ్.
(వాక్య—II—1, 2)

ఇందు 3, 4, 6 నిర్వచనములు వాక్య మఖండమను పక్షమువారి వాదమును సమర్థించును. 1, 2, 5, 7, 8 నిర్వచనములు వాక్యము సఖండమను పక్షమువారి వాదమును బలపరచును. అభిహితాన్వయ వాదులు, అన్వితాభిధాన వాదులును నీ సఖండ పక్షమునకే చెందినవారు. ఇందు 2, 5 నిర్వచనములు అభిహితాన్వయ పక్షమునకు, 1, 7, 8 నిర్వచనములు అన్వితాభిధాన పక్షమునకు ననువర్తించును.

(1) ఆఖ్యాత శబ్దము వాక్యము :—అన్వితాభిధాన వాదమున నీ నిర్వచనము బలీయమైనది. వేదవిహితక్రతు నిర్వాహణాదులయందు, మధ్యమ పురుష క్రియారూప ప్రయోగమే విశేషముగా నుపయుక్తము. అంతేకాక సామాన్యభాషా ప్రయోగమునుబట్టి, వ్యాకరణశాస్త్రము ననుసరించి యీ నిర్వచనమునకు ప్రాముఖ్యము కలదు. ఏకపదము, నేకాక్షరము నగు రా, పో, తే, వంటి క్రియా పదములే వాక్యములు నగుచున్నవి. ప్రత్యక్ష సంభాషణమునందు వక్త తనకుఁ గల్గిన భావ వికారములను దెల్పుటకే భాష నుపయోగించును. ఒక చెట్టు పడిపోవుటను గాని, ఒక లత పుష్పించుట గాని మున్నుగా గల చర్యలను దెల్పుటకు కేవలము క్రియాపదము లుపయోగించినను సరిపోవును. క్రియా పదాంతములందలి ఆఖ్యాతములే కర్తను గూర్చియు మనకు కొన్ని సూచనలు చేయును. అంతేకాక, ఆఖ్యాత శబ్దమే కారక పదముల నన్నింటి నాక్షేపించుకొని నిరాకాంక్ష మగును. (వాక్య. II—49—116) కావుననే వ్యాకరణ శాస్త్రమునందు క్రియాపదమే వాక్యమున కీలకస్థాన మగుచున్నది. "ఏక తిఙ్ వాక్యమ్" అను వార్తిక నిర్వచనమును దీనిపైన నభివృద్ధిగా "ఆఖ్యాతం సావ్యయం సకారకమ్ సకారక విశేషణం వాక్య సంజ్ఞం భవతి" అను పతంజలి నిర్వచనమును వ్యాకరణశాస్త్ర సంబంధుల ననుసంధింప నగును.

---

1. "The Prabhakara School, on the other hand, held the more sophisticated theory that the individual words did not express any meaning until they were united together into a sentence."

"Some Indian Theories of Meaning" by John Brough—T. P. S. 1953.

(2) కతిపయపద సంఘాతమే వాక్యమని కొందరి నిర్వచనము. ఇది యభిహితాన్వయ పక్షమునకుఁ జెందినది. కేవల పదమే యర్థమునకు వాచకమో, ఆ పదము వాక్యస్థమైనను ఆ యర్థమునే చెప్పును.[2] పదముల సంఘాతమునకు పరస్పరాన్వయము కలిగిన వెనుక, గోచరించు అధిక్యము, అనఁగా సంసర్గము వాక్యార్థ మగును.[3] ఈ వాక్యార్థమనేక పదములం దున్నను గోత్వాది జాతి, ప్రతి గో వ్యక్తియందును గూడ నుండు రీతిగా ప్రతి పదార్థమునందును నుండునని గొందర మతము. కొందరు సంఖ్యవలె వాక్యార్థము సముదాయమునందే యుండు నందురు.[4] ఈ సంసర్గము అనుమేయము. దీనికొక రూపము లేదు. కావుననే దీని నసత్యభూత మందురు. అనఁగా పదార్థముల కంటె వేరైన సత్యము (ఉనికి) లేనిదని యర్థము.[5] పదములు ఆకాంక్షాదులవలన పదాంతరములతో నియతముగా సంశ్లిష్టములై వాక్య మగునని యీ వాద సారము.[6]

(3) సంఘాతవర్తిని యగు జాతి వాక్యము :

ఇది యఖండ పక్షమువారి నిర్వచనము. భిన్న భిన్న ప్రయత్నములచేత నుదీరితమగు భిన్న ధ్వనులు జాతి స్ఫోటయే కాని వ్యక్తిస్ఫోట కానేరదు. భ్రమణాది కర్మల కావృత్తి యున్నవుడు ప్రతిపత్త (జ్ఞాత) ప్రతి భ్రమణమునందును జాతి యున్నట్లు గ్రహింపఁగల్గుచున్నాఁడు. అట్లే వర్ణపద వాక్యములలో కూడ నభివ్యంజకమగు ధ్వనులు ఏకరూపముగా నున్నట్లు ప్రతీయమాన మగును.[7]

(4) ఏకము, అవయవ రహితమునగు శబ్దము వాక్యము :

ఇదికూడ నఖండ పక్షమునకుఁ జెందిన నిర్వచనమే. అవయవరహితమైన అఖండ శబ్దమే వాక్యమను నీ నిర్వచనము స్ఫోట లక్షణమే వాక్యమను మతమును బలపరచుచున్నది. ఒక శిల్పమును గాని, ఒకానొక చిత్రమును గాని దర్శించుటవలన కల్గు జ్ఞానమఖండము. విభాగ పరిశీలనము, తన్మూలమున గల్గు ఖండ జ్ఞానము కల్పితములు. ఇట్లే వాక్య, వాక్యార్థముల స్వరూపము నఖండ మైనది.[8] ఇట్లే వాక్యమును. ఉచ్చారితమైన శబ్దము స్ఫోట రూపము, క్రమ రహితము. అనయవయము. ఇది వ్యక్తి స్ఫోటకాని జాతిస్ఫోటకాని కావచ్చును.[9] ఇందలి క్రమ ప్రతిభాసము అభివ్యంజకములగు ధ్వనుల క్రమమునుబట్టి వచ్చునదే కాని, స్ఫోటాత్మకమగు శబ్దగతము కాదు. (వాక్య II–57) ఈ నిర్వచనము భర్తృహరి కిష్టమైనది.

(5) క్రమమే వాక్యము : ఇట క్రమ మనఁగా పద క్రమమే గ్రహింపవలయును. ఏలన పదక్రమము వాచకమైనట్లు వర్ణక్రమము వాచకము కానేరదు. పదములకు క్రమమునందు తప్ప, పృథక్కుగా కర్తృత్వ, కర్మత్వములు ప్రతీయమానములు కావు.[10] పదముల క్రమమే వాక్యము.[11] వర్ణముల క్రమము వాక్యము కాదు. (డిటో—53) వర్ణము అర్థవంతములు కావు. పదములే యర్థవత్తులు. వాని క్రమమే వాక్యము. సంసర్గము వాక్యార్థము. (వాక్య II–54) కాలము యొక్క ధర్మమే క్రమము. అది తప్ప వాక్యము వేరులేదు.[12] ఈ నిర్వచన మన్వితాభిధాన వాదమునకుఁ జెందును.

(6) బుద్ధ్యను సంహృతము వాక్యము :—

స్ఫోటయాంతరము. వాక్యమును ఆంతరమే. ఇది యనవయవము. జ్ఞాన స్వభావము కలది. నిర్విభాగమగు శబ్దతత్త్వము, నాదములచేత బయటకుఁ ప్రకాశింపఁజేయబడినదై 'వాక్య' మనుబడును.[13] వాక్యమాంతర మైనచో

---

2. కేవలేన పదేనార్థో యావా నేవాభిధీయతే
వాక్యస్థం తావలోఽర్థస్య తదాహు రభిధాయకమ్."
(వాక్య. II—41)

3. సంబంధే సతి యత్త్వన్య దాధిక్య ముపజాయతే
వాక్యార్థమేవ తం ప్రాహుః రనేక పద సంశ్రయమ్.
(42 శ్లో.)

4. వాక్యార్థస్య జాతివ ప్రత్యేక పరిసమాప్తిః కేషాచిన్మతే
సంఖ్యావ త్సముదాయ పరిసమాప్తిరితి పక్షద్వయం
ప్రదర్శితుమాహ—
సత్యనేక పదస్థోఽపి ప్రతి భేదం సమాప్యతే
జాతివ త్సముదాయేపి, సంఖ్యావత్ కల్ప్యతే పరైః.
(43 శ్లో.)

5. వాక్యపదీయము—II—47.

6. —డిటో—II—48.

7. యథాక్షేప విశేషోఽపి కర్మ భేదో న గృహ్యతే
అవృత్తౌ వ్యజ్యతే జాతిః కర్మభిర్భ్రమణాదిభిః.
(వాక్య II 20)
వర్ణవాక్య పదేష్వేవం తుల్యోవ వ్యంజనాశ్రుతిః
అత్యంత భేదే తత్త్వస్య స్వరూపేవ ప్రతీయతే.
(వాక్య II 21)

8. వాక్య II–7, 8

9. అవ్యక్తః క్రమవాన్ శబ్ద ఉపాంశ్వయ మధీయతే
అక్రమస్తు వితత్యేవ బుద్ధిర్యత్రావతి తిష్ఠతే.
(19 శ్లో.)

10. సన్త ఏవ విశేషాయే పదార్థేషు వ్యవస్థితాః
తే క్రమాదను గమ్యన్తే నవాక్య మభిదాయకమ్.
(50 శ్లో)

11. యేచ సంభ వినో భేదాః పదార్థేష్వ విభావితాః.
తే సన్నిధానో వ్యజ్యన్తే, నతువర్ణే ష్వయం క్రమః.
(—52 శ్లో) వర్ణక్రమః పదముచ్యతాం నామ, వాక్య సంజ్ఞా పదక్రమ ఏవ .... (పుణ్యరాజు)

12. శబ్దానాం క్రమమాత్రేచ నాన్యః శబ్దోఽస్తి వాచకః
క్రమోహి ధర్మః కాలస్యతేన వాక్యం న విద్యతే.
(వాక్య II–51)

13. యదన్తః శబ్ద తత్త్వంతు నాదైరేకం ప్రకాశితమ్
తదాహారపరే శబ్దం తస్యవాక్యే తథైకతా.
(వాక్య II–30)

వాక్యార్థమును ఆంతరమే. అది ప్రతిభారూపము. కావున నాంతర శబ్దార్థము లభిన్నములు. అవి యాంతర తత్త్వమునకు సంబంధించినవి. బాహ్యములుగా భేదములు భాసింపవచ్చును. 14 ఇది యఖండ పక్షమునకుఁ జెందిన నిర్వచనము భర్తృహరి కథిష్టము.

(7) ఆద్యమగు పదము వాక్యము : ఉపక్రమమునందు వివక్షితమైన అర్థమును దెలియఁజేయుటకై సకల విశేషణ సంబంధ విశిష్టమైన పద ముచ్చరింపఁబడును. ఆ పదమునందే వాక్యార్థము పరిసమాప్త మగును. దీనినిబట్టి యా వాక్యమున నితర పదము లుండవని భావింపరాదు. నిజమున కట్లితర పదములు లేనిచో ఆ పదమున కట్టి శక్తి కలుగదు. ఈ ఆద్యపద మితర పదములతో నన్వయించియే యుండును. అనువాదార్థముగాని నియమము కొరకుఁ గాని యితర పదము లవసరములు. 15 ఈ నిర్వచన మన్వితాభిదాన వాదమునకే చెందును.

(8) సాకాంక్షమగు పృథక్సర్వపదము వాక్యము : ఆకాంక్షగల ప్రత్యేకములగు పదములే వాక్య మగునని యీ నిర్వచనార్థము. ప్రత్యేకములగు కొన్ని పదములే సాకాంక్షములుగా నుండునని, అన్ని పదము లిట్లుండజాలవనియు వీరి యభిప్రాయముగాఁ గనుపట్టును. 16 ప్రాచీనమగు శ్రౌతసూత్రములందును 'నిరాకాంక్షమ్' (తే షాం మంత్రాణామ్ వాక్యమ్ నిరాకాంక్షమ్) అను రీతిని గల నిర్వచన మిట్టి నిర్వచనమునకు ఆధారమై యుండును. కాని యీ యాకాంక్ష యనునది కేవలము పదములకు మాత్రమే కాక వాక్యములకును, వాక్యములకును నుండును. అనంతర కాలమున తార్కికులు, ఆకాంక్షతోపాటు, యోగ్యత, ఆసత్తులు కూడఁ జేర్చిరి. మరికొందరు ఈ మూడింటితోపాటు 'తాత్పర్యము' కూడ శాబ్దబోధ కవసరమని భావించిరి. 17 ఇది విషయాంతరము. ఈ నిర్వచన మన్వితాభిధాన వాద పక్షమునకుఁ జెందును.

ఇట్లు వాక్య సంస్కార పక్షమువారు, పద సంస్కార పక్షమువారు వాక్యమును గూర్చి గావించిన నిర్వచనముల వంటి వానిని క్రోడీకరించి, అందు పద సంస్కార పక్షవాదములను ఖండించి, వాక్య మఖండము, అనవయవము, బుద్ధ్యనుసంహృతమనువాదములను స్ఫోటవాదమునకు సబలకముగా భర్తృహరి బలపరచెను. అనిర్వచనీయమగు వాక్యమును తమ తమ దృక్పథముల ననుసరించి నిర్వచించుటకు మన ప్రాచీన భారతీయ భాషావేత్త లేరీతిగా నభినివేశము నగపరచిరో వాక్యపదీయ పఠనముచే గ్రహింపనగును. "ఒక పదమును ప్రకృతి ప్రత్యయములుగా నెట్లు విభాగించుచున్నామో, అట్లే వాక్యమునందు పదముల నపోద్ధారముచే గ్రహించుచున్నాము. 18 ఏ ఔ, ఓ, ఐ వంటి సంధ్యక్షరములు నిరంశముగా వర్ణాంతరముతో తుల్యముగాఁ బరిగణింపఁబడు చున్నట్లే పదమునందలి ప్రత్యయ ప్రకృతి విభాగమును, వాక్యమునందలి పదములను బరిగణింపనగును. 19 నిత్యమునకు పూర్వాపరములు లేవు. కాల భేదము లేదు. హ్రస్వ, దీర్ఘ, ప్లుతాదు లావృత్తినిబట్టి యేర్పడినవి. ఇవి యన్నియు నుపాధి భేదములు. స్ఫోట శబ్దము నిత్య శబ్దము. 20 నిత్యము,నేకమునగు కాలమునకు క్షణ, భూత, భవిష్యదాది భేదములు చెప్పుకొందుము. అంతమాత్రమున నవి కాల లక్షణములని భ్రమింపరాదు. వస్తువుల యుత్పత్తి వినాశాదుల చెప్పుట కిట్లు కాలముతో ననుసంధించుచున్నాము. అంతమాత్రమున కాలమనిత్యమని, ఖండమని యనరాదు. ఇట్లే స్ఫోట శబ్దము. 21

ఇట్లనేకోపపత్తులతో స్ఫోట శబ్దమే వాక్యమని భర్తృహరి యుద్ఘాటించును. అంతేకాక, వాక్యమునందు పద పదార్థములు వేరుగా లేవనుటకు, తత్ప్రతీతియున్న మాత్రమున వాని యునికి యున్నట్లు కాదనుటకును వాఁ డనేక యుక్తులు ప్రదర్శించెను :—

(1) పదములు సత్యములే యగుచో 'రాజ' పదార్థ నియతముగా నొక్క పదము వలననే కలుగవలయును. అట్లు కాక రాజా—రాజానామ్- -రాజ్ఞా—రాజ్ఞే-రాజని యిత్యాద్య నియత స్వరూపమగు రాజపదముచే రాజార్థ

---

14. అర్థభాగైస్తథా తేషాం ఆన్తరోఽర్థః ప్రకాశ్యతే. (వాక్య II-31)

15. విశేష శబ్దాః కేషాంచిత్ సామాన్య ప్రతి రూపకాః శబ్దాంతరాభి సంబంధా ద్వ్యజ్యన్తే ప్రతిపత్తృషు (వాక్య II-18)

ఉపక్రమ ఏవ వివక్షితార్థ ప్రత్యాయనాయ విశిష్టపదోదీరణ మారభత ఇత్యాద్య ఏవ పదే ప్రత్యేకం వా సకలస్య వాక్యార్థస్య సమాప్తి రవగన్తవ్యా (పుణ్యరాజ వ్యాఖ్యా)

16. వాక్య. II—48, 49.

17. ఆకాంక్షా, యోగ్యతాఽసత్తి తాత్పర్య జ్ఞానాని సహకారిణి ఫలం శాబ్దబోధః ! .... తత్తదర్థ ప్రతీతీచ్ఛయోచ్చరితత్వం తాత్పర్యం, తేన భోజన ప్రకరణా 'సైంధ'మానయ' ఇత్యుక్తే అశ్వాన్వయ బోధోన భవతి. తర్కామృతమ్ జగదీశః పుట 46—47 ఆర్యాప్రెస్—1958.

18. యథాపదే విభజ్యన్తే ప్రకృతి ప్రత్యయాదయః అపోద్ధారస్తథా వాక్యే పదానామ్ ఉపవర్ణ్యతే. (వాక్య II-10)

19. వర్ణాంతర సరూపంచ వర్ణభాగేషు దృశ్యతే పదాంతర సరూపాశ్చ పదభాగా అవస్థితాః. (వాక్య II-11)

20. వాక్య II—22 శ్లో.

21. —డిటో— 23, 24 శ్లో.

ప్రతీతి కల్గుచున్నది. ఇది యనుప పన్నము. కావున 'మిథ్యావాని.' 1

(2) 'రాజపురుష' అను సమాసమున 'రాజ' శబ్దము తిజ్జ్నన్త సదృశమునగుటచే 'ఓపురుషుడా! (నీవు) ప్రకాశింపుము' అను నర్థప్రతీతియు చెప్పనగును. అది యనిష్టము కదా! 2

(3) "అశ్వకర్ణః" అనునది యొకానొక యోషధి విశేషము. ఇందలి అశ్వ శబ్దమునకు గుఱ్ఱమను నర్థము చెప్పరాదు కదా! ఇట్టి వనేకములు. (వాక్య II—36)

(4) 'దధ్యానయ' అను వాక్యమునందు 'దధి' పదము యొక్క రూపము సంధి వశమున కొంత నశించుచున్నది. కావున పృథక్ దధి పదార్థ ప్రతీతి యనుపపన్నము. (వాక్య II—91) ఈ సందర్భమున సంస్కృతభాష లేఖన సంప్రదాయము నందును పదవిభాగ ముండక పోవుట, సంహితతోనే వాక్యము విరచిత మగుట గమనింపనగును. 3

(5) 'కృష్ణసర్పః' అనుచో నల్లని పాముని యర్థము. కాక త్రాచుపామని యర్థము. 'గౌర ఖరః' అనఁగా తెల్లని గాడిద యని కాక యొకానొక గాడిద యని యర్థము. 'చిత్రగుహుః' అనుచో కలవాఁడను నర్థమును జెప్పు పదమే యుందు కానరాదు. విశిష్టార్థమే యుట గ్రాహ్యము. (వాక్య II—219—222) ఈ మున్నగునవి పదముల యసత్యతను నిరూపించుచున్నవి. గంధ మొక్కటైనను పుష్పమును చందనమును నాశ్రయించుటచే, అపోద్ధారమువలన పుష్పగంధము, చందన గంధమని వ్యవహృతము. ఇట్లే వాక్య మఖండ మైనను దేవదత్తాది పదకల్పన మేర్పడుచున్నది. (వాక్య II-91) పదముల నెరిగించు ఉపాయములకు, అనగా వ్యాకరణముల కొక నియమితి యుండదు. కొందరు పాణినీయము మూలమున శబ్దజ్ఞానమును బడయుదురు. మరికొందరు ఇతర వ్యాకృతుల మూలమునఁ బడయవచ్చును. 4 "ఉపాయాః శిక్షమాణానాం బాలానాం అపలాపనాః."

1. రాజశబ్దేన రాజార్థో భిన్నరూపేణ గమ్యతే. (వాక్య II—34)
2. వృత్తా ఆఖ్యాత నప్పశం పదమన్యత్ర యుజ్యతే. (వాక్య II—35)
3. "The tendency to deny independence to the word is further stressed by the Sanskrit system of writing (unlike e.g. old Persian) takes no particular account of word division."

మోదకైస్తాదయు, నగా + ఉదకైస్తాదయు
ఏ—తేన లిఖితో లేఖః, నతేన లిఖితో లేఖః.

"Phonetics in Ancient India by W. S. Allen - p. 9.

4. ఉపాయాశ్చ ననియతా ఇత్యాహ—

ఉపాయానాంచ నియమో నావశ్య మవతిష్ఠతే
అర్థం కథంచి త్పురుషః కశ్చిత్ సంప్రతి పద్యతే.

(II —38) కశ్చిదాచార్యః పాణిని విరచితేన లక్షణశాస్త్రేణ శబ్దానధి గచ్ఛతి, కశ్చిదన్యేనేతిన నియమః.

అనహోద్యమము ముమ్మరముగా వ్యాప్తమైన దినములలో నీయబడిన యొక సాహిత్యసమస్యను మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు (కవిగారు) దేశ కాలానుగుణముగా నీ క్రిందిరీతిని పూరించిరి-

"ఇంకం గుంకుమబొట్టు పెట్టకుమ తన్వీ ఫాల భాగంబునన్"

శీ. బింకంబుల్ పలుమార్లుపల్కి నథులం బేరందు పల్కోర్కెని
శ్శంకం తానటుచేయఁ జాలకిటు దేశద్రోహియై ఖైదనన్
జంకెన్నీ పతి పేరు మాపుకొనియెన్ చావన్న వేయున్న దే
యింకం గుంకుమబొట్టు పెట్టకుమతన్వీ! ఫాల భాగంబునన్.

# రుమల బుక్కపట్టణం నరసింహాచార్య కవి

శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు

ఈ కవి 'సంధ్యానట తాండవేశ్వర కోటీర జటాటవీ తట కుటీ స్యందన్నభోవాహినీ ఝరీ ఘుంఘుంరవతుల్య వాక్య రచనా సంరంభము,' తో చంద్రవర్మ చరిత్రంబను మహా ప్రబంధమును గ్రథించె—'పటు భూరిలతాగ్రహ బృంద యాగ బృక్పుందర కామినీ కబరీశోభిత సూన ప్రకృష్ట వాసనా నంద మిళింద బృంద గరుదంచిత పద్మరాగ సాధర్మ్యము, కంద రాజితోత్పతితగాంగ సరిత్తరము, నిట్టి 'రామతీర్థమంటలి, 'హుంకార కనక కస్యప, హుంకార ప్రకృష్ట తిమిర, హరిదశ్వ నకుం, కంకేళిజ పాసూన ని, రంకుశ జాజ్వల్యమాన ప్రతి సింహా నక,ంకిత ధన్యుఁడైనాఁడ్ నిప్పత్కృ విభూషణుఁడు.

## ని వా స ము

ఈ కవి నివాసము కృత్యాదిని బట్టి "అల్లూరను పుణ్య గ్రామం" బని చెప్పుచున్నాడు. ఈ అల్లూరను గ్రామము నెల్లూరు మండలమున నుండునదిగా తోఁచుచున్నది. హేతువు—'రామతీర్థ నృసింహాని యనుగ్రహ లాభమున' తనకు కవిత యబ్బెననియు—ఆ దేవునకే అంకిత మిచ్చుటయును, పైగ ని 'రామతీర్థము', ఈ అల్లూరునకు సమీపమున నుండుట యును. కావున కవి నివాసము నీ యల్లూరనియే నిశ్చయము. కావ్యమునందు వివరము లెవ్వియు లేవు. పరిశోధకులు పరిశోధించి నిర్ణయించునంతవరకు నీ కవిసార్వభౌముడు నెల్లూరు సీమవాసియే.

## కా ల ము

కావ్యాది యందలి కవికృత పీఠికలో—సంస్కృతాంధ్ర కవుల సన్నుతింపుచు—కవిత్రయమును, అల్లసాని పెద్దనను, పోతరాజును, భాస్కరుని, రామకృష్ణ కవిని ప్రస్తావించి యుంటచే నీతఁడు క్రీ. శ. 17 వ శతాబ్దము వాఁడుగా నుండి యుండవలయును. కావ్యమున నింతకుమించి యాధారాంతరము గనుపడదు.

## కు ల గో త్ర ము లు

ఆశ్వాసాంత గద్యనుబట్టి—కవి శ్రీ వైష్ణవుఁడనియు—తండ్రి గోపాలాచార్యుఁ డనియు—'శీతల సద్గుణ నికురంబ'—సీతమాంబ—తల్లి యనియు, శఠమర్షణగోత్రుఁ డనియు, ఇవి మొదలగునవి తెలియుచున్నవి. 'ఇతి శ్రీరామతీర్థ నృసింహ పద నారవిందేందిందిరాయమాన—తిరుమల—బుక్కపట్టణ వంశ పయః పారావార శశాంక శఠమర్షణగోత్ర పవిత్ర—శుభా పస్తంబ సత్సూత్ర—అఖిల ప్రబంధార్థ బోధన సమర్థ—సంస్కృతాంధ్రభాషా కవితా నిర్వాహక—చాతురీ ధురీణ—ఆచార్య గోపాలాచార్య—సీతమాంబాతనయ—వినయ విధేయ—నరసింహాచార్య ప్రణీతంబైన—చంద్రవర్మ చరిత్రంబను మహా ప్రబంధంబునందు— ప్రథమాశ్వాసము'— ఇట్లు, పక్కాగ నాల్గాశ్వాసము లుండి—ఐదవ యాశ్వాసము తుదను— కొలంది తాళపత్రములు మాత్రము చ్యుతములైనవి. చ్యుతమ్ములైనంతవరకు చంద్రవర్మ వివాహపర్యంతము నితివృత్తము గలదు.

## అ న్వ య ము

ఈ గ్రంథమందలి స్వవంశ కథనముఁ జూడ—కవి వంశ మంతయు "నాద మును" ల నుండి. చక్కని పండిత వంశ మని తెలియుటే గాక పూర్వ పురుషు లెల్లరు 'నుభయ వేదాంత రహస్యార్థ సుమహిత వైదుషీభూత మేధావు,' లని యవగతమౌటే గాక, నుభయ భాషల మాధుర్య ముట్టిపడ కావ్య నిర్మాణ చాతురీ ధురీణులని గోచరమగుచున్నది. ఇంకను—పూర్వాచార్య లనుగ్రహించిన—భాష్య భగవద్విషయ రహస్యార్థములను పుక్కిట నింపి—ఆచార్య పురుషులై—చేతనోజ్జీవనార్థము విశిష్టాద్వైత సిద్ధాంతమును నేల నాలుగు చెరగుల ప్రచార మొనర్చుచు—శిష్యులను స్వసాంప్రదాయ మర్మజ్ఞులనుగా చేసినట్లు తెలియుచున్నది. పీఠికలోని కవి తండ్రి గుణముల నారయుడు:

సీ. భవ్యవినీతికి—ప్రతి సురాచార్యుండె, గాంభీర్యమున
గంగాప్రియుండె
సత్కళా మహిమకు—సరస శీతాంశుండె— వైదుషీ
గరిమకు—వనజజుండె
..... గార రాపికి పొం—పొంద విదురుండె, వాక్పవి
త్కృతికి యబ్జవైరి సుతుడె

భగవదారాధన—ప్రౌఢికి నగురుండె—సాహితీ సరణికి—
చక్రవిభుండె.

యంచు జనములు హెచ్చుగ ననుచునుండ
సరస యాచార్ల తిరుమల సహిత బుక్క-
పట్టణము వేంకటాచార్య పండితేంద్రు
కూర్మి పుత్రుండ గోపాల గురువరుండ. (పీఠిక)

ఇట్టి సద సద్విజ్ఞాన విలసితాన్వయ జాతుం డవుట 'మేలగు సత్కళల పద్మ మిత్రుండు'నుగా 'పండితమణియై' వెలసినాడు గోపాలాచార్యుడు. ఈవంశమువా రనేకులు విశిష్టాద్వైత సిద్ధాంత గ్రంథముల నెన్నింటినో వ్రాసియున్నారు. కిరీట వేంకటాచార్యస్వామి మున్నుగా గల పండితు లెందరో ప్రఖ్యాతులు. అటులనె నీ కవియు నాయా సందర్భములలో—సాంప్రదాయ రహస్యార్థముల నెన్నింటినో మృదుల మృదుల తర, మృదుల తమముగ వర్ణించినాడు. ఇంతటి యుత్కృష్ట వంశ సంజాతుం డవుటయు ప్రాచీ నాచారముల ననుసరించి తన కృతిని 'ధనమ్మునకై బజారులో నమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులు గొనుట' కిచ్చగింపక —సమ్మతి శ్రీ నరహరి కిచ్చి ధన్యాతిధన్యుఁ డైనాడు. పోతనాది పరమ భాగవతోత్తముల మార్గ మిదియే కదా!

## క థా వి ధా న ము

''రాజిత శైలరాజమున—రాజసమొప్ప హరుండు కాంతి వి
భ్రాజితమైన హారముల రంజిలుచుం గొలువున్న వేళ
—యుం
భోజభవుండు నింద్రుడును భూరి బలాఢ్యులు దిక్పతుల్
నుతుల్
తేజము మీరఁజేసి రలదీప్త సుగ్రాతుని వహ్నినేత్రునిన్.

ఇదనంతరంబు వారెల్ల కూర్చున్న సమయంబున నందీశ్వర భృంగీశ్వర విఘ్నేశ్వరా ప్రమథ గణంబులును—రంభ మేనక ఊర్వశి, పుంజికస్థల, హరిణాదులైన యప్సరసలును—గరుడ గంధర్వాదియోని భేదంబులు బలసి సేవించి—బహువిధ వినోదంబుల ప్రొద్దుపుచ్చుచు ప్రసంగ వశంబున—మర్త్యలోకంబు నప్పటప్పటికి—ప్రశంసించుచు—చంద్రదవర్మ యను రాజన్యు చరిత్రంబు నుగ్గడించునెడ .... అట్టి సమయంబున కన్నెదుట నున్న శంభుమోమట్టె చూచి—యిట్టి పూర్వచరిత లెట్టి వనుచు, పావన పుణ్యశీలుఁడగు ప్రాప్త చరిత్రుని చంద్రవర్మను కోవిదుండని బల్కితిరి కోరిక నా కగు దెల్పుఁడని శర్వుని—శర్వాణి యడుగగా నీ కథఁ జెప్పినాడుట—ఇందులకు మూలము 'స్కాంద పురాణమఁట—' 'సమర్పితంబుగా నా యొనర్పం బూనిన స్కాంద పురాణంబు నుమామహేశ్వర సంవాదంబునందు చంద్రవర్మ చరిత్రంబను పురాణంబునకు కథా క్రమంబెట్టి దనిన''-ఈకవి పరమత సహనము గల శ్రీవైష్ణవుడని తెలియుచున్నది. ఇందులకు కావ్యాంతర్భాగమున నేకోదాహరణలున్నవి. ఈ కావ్యరచనకై ''యొక్క శుభదినంబున—నాలవయామమున—'సాక్షాత్కారము లోచి దాశరథి ప్రేంచ శ్రీల 'గాన్పింప' నద్దేవుని భయ సంభ్రమాశ్చర్యముం బొందియుం—దాక్షిణ్యముతో పెక్కు మ్రొక్కులిడగా, 'వత్సా! నీవు చేసెడు కృతి, నెసరుగ యా రామతీర్థ నృహరి కొసగు, సాహసమొప్ప సేయబూను కబ్బమ్ము లదిష్టసిద్ధిగ నిటుండున తోడుత, శిష్టతాననం నిమ్ము నృసింహదేవునకు నీవకు కొర్కెతోడనని శ్రీరామదేవుండు తెల్పి యేగిన—ప్రమోదాయత్తుం జెంది యా వృత్తాంతమును ఉషఃకాలంబున లేచి కాల్య కరణీయంబులు తీర్చి పరిశుద్ధంబైన మదీయ్య గ్రామంబగు—అల్వారను పుణ్య గ్రామంబున దేదీప్యమానుండై ప్రకాశించు సర్వావతారుండగు శ్రీ జనార్దనుని సందర్శించి—శిష్టజనంబులు—మత్సహపాఠులును—సుకవులు విని మోదంబుగాఁ బలికిన—వారి యనుగ్రహము వడసి—శ్రీరాముల మనంబున నిల్పుకొని—రామతీర్థస్థ నృహరిం గొనియాడి — చంద్రదవర్మ చరిత్రంబునకుపక్రమించెద' నని శ్రీకారము జుట్టినాఁడట యీ కవిలోక భాస్కరుఁడు. సామాన్యముగ తిక్కన మనీషినుండి ప్రారంభమయిన నీ స్వప్నవృత్తాంతము పంథొమ్మిదవ శతాబ్దపు పూర్వ భాగము వరకు వచ్చినది. తరువాత నేఁలనో ఆ దేవతలు స్వప్నమున కనుపడకుండ 'సమ్మె' చేసినట్లున్నారు. అందుననే నిరువదవ శతాబ్దపు కవులను స్వప్నమున కనుపడి కావ్యములు వ్రాసి యుండితము లిమ్మని కోర్చుటలు మానినారు. ఈ శతాబ్దమున కనుపడు దేవతలు నాయక వ మన్యులైన రాజకీయ నాయకులే కదా! వీరు ప్రత్యక్షముగఁ గనుపడుచుండిరి కదాయని కాఁబోలు నా వృత్తాంతముల పరిత్యజించి యుందురు కవులు. ఈ స్వప్నములు కల్లలని, కపటము లని యనలేము. ఎందరో మహానుభావు లుందురుగదా!

## కావ్య పరిశీలన: రచనా విశేషములు

ఈ ప్రబంధ తొలి యాశ్వాసమున నగవర్ణన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణనలు—పుష్పలావికలు— ఇత్యాదులేగాక ఇంద్రసేన మహీపతి అహోబిల యాత్రకు వెళ్ళుటలో పర్వత వర్ణనలు మున్నగు కావ్య లక్షణములలో కొన్ని చక్కగ సంగ్రహముగ పొంకముగ 'సంస్కృతాంధ్ర కవితా నిర్వాహక' త్వముతో—''చాతురీ ధురీణత''తో దిద్ది తీర్చినాడు. ఈ వర్ణన లన్నియు నూతనత్వముతో గనువడుచున్నవే గాని—పాత వర్ణనలను కొత్త మూసలో పోయలేదు. 'కల్పిత కల్పవల్లి కాహళనా' ము యథార్థముగా గనువడుచున్నది.

# తిరుమల బుక్కపట్టణం శ్రీ నరసింహాచార్యకవి

మరియాశ్వాసమున చంద్రవర్మ జననము, యౌవరాజ్య పట్టాభిషేకము మున్నగు విషయములతో వివాహ యత్నము—కన్యావరణము వరకు వచ్చి వర్ష, శరదృతువుల వర్ణనలతో ప్రబంధ లక్షణములన్నియు సమయానుసారముగ ఔచిత్యం బనుసరించి యథావద్వస్తు వర్ణనతో కావ్యమున కొక వెలుగును, జీవమును, రసస్ఫూర్తియు గలిగించి 'మంగమధ్యాని' యన్న వాక్యము సార్థక పరచినాఁడు.

తృతీయాశ్వాసము చంద్రవర్మ తన, క్షాత్రలేఖ మెల ర్వగా మృగయా వినోదుఁడై పర్వతారణ్య ప్రాంతము లన్నియు పరిభ్రమించి ఖడ్గ వరాహ శార్దూలా ద్యనేక మృగ ముల వధించి యలసి సొలసి శాలిహోత్రుని సందర్శించి యనేక ధర్మముల నెఱిఁగి యాతని యానతి గృహగతుఁ డగుట— మున్నగు వివిధ విశేషములతో నొప్పుచున్నది. ఈ తృతీయాశ్వాసముననే ఆశ్రమమున కళింగరాజ దుహితయగు 'పూర్ణ తిలకను' గాంధర్వముగ వివాహ మాడుటయును.

తురీయాశ్వాసమున అశ్వారూఢుఁడై—పరిమిత పరి వారముతో విహారముగ నొక పర్వతారణ్య ప్రాంతమునకు వెళ్లగా నట నొక రక్కసుఁ డీతని హయము నపహరించుటే గాక వీ రిరువురకు మహారణము సంభవించినది. కడకు నీతనితో పోరలేక విసువుజెందిన రాక్షసుఁడు వాడి యమ్ము రొమ్మున గ్రుచ్చి చంద్రవర్మ యసువులఁ బాపెను. ఈ వృత్తాంతము పరి జనుల మూలమునఁ దెలిసిన—పూర్ణ తిలక—తత్ప్రదేశమున కేగి తన దుర్భర దౌర్భాగ్యమునకు పనవి పనవి సహగమ నాయత్తచిత్తయై యుండు తఱి—ఆకాశవాణి—తత్ప్రయత్న మును విరమింపఁజే—గౌరీ ప్రార్థనము య నీ భర్త పునరుజ్జీవుఁడు కాగలఁడని ఇట్లు బలికెను :

నీవు పతివ్రతామణివి—నీ ప్రియనాథుఁడు—ధర్మవర్తనుం
డెవిధినొ ప్రమాద మిటు యేర్పడకూడెను య్యైన నేమియుం
కోవిదులెన్న భావమున—గొబ్బున గౌరిని వేడుకొన్నసం
భావితమౌను కోరిక, శుభం బ్బొడగూడును వేడ్క భామినీ.

యని చెప్పిన నా తరుణి యట్లు చేయగా 'నాతడు నిద్దురజెంది లేచినటు' లేచినాఁడు. ఇరువు రశ్వారూఢులై వచ్చుచుండఁ మధ్యేమార్గమున నా పొలసు దిండిపోతు వెను దగిలినాడు. అంత నా డాతని చేతి యూర్మిక క్రింద పడవైవ అతడు తీసికొను సమయమున నా రక్కసుని వ్రక్కలించి దేవీయుక్తుఁడై గృహాగతుఁ డైనాడు. ఇటు తల్లిదండ్రు లీ వృత్తాంతముఁ దెలిసి పుత్రుని వృత్తాంతము విని వగలబొగులుచుండిరి. ఆగతులయ్యిరని పరిచారకుఁడు దెల్పగా వివిధ వాద్యములతో, సమంత్రి పౌరజనయుక్తంబుగా హర్షపులకిగాత్రులై తోడ్కొనివచ్చి వివాహము యథాశాస్త్రముగ చేసిరి. ఆతఁడు చతుర్విధ పురుషార్థములను చక్కగ పోషించి—సుఖముండె నంత వరకు మాత్రమే కలదు.—ఈ కావ్యమునకు—జీవము మూఁడు నాల్గాశ్వాసములు. ఆయా సందర్భముల ననుసరించి రస పోషణము, భావపోషణము జేసినాఁడు. శృంగార వీర కరుణాద్భుత హాస్యరసములు హృద్యముగ పరిపోషింపఁబడినవి. రాక్షస యుద్ధ మున భీభత్సమును వర్ణింపఁబడినవి. చంద్రవర్మయందు "మహాసత్వాతి గంభీర కృపావాన్ అవికత్థనః" అన్న మహావీర లక్షణము చక్కగ సమన్వయ పరచాచినాఁడు. కవిలో నొక యుత్కృష్టత గోచరించుచున్నది. నాల్గాశ్వాసముల ప్రబంధ మయ్యును—కథాగమనము మాత్రము కావ్యాంతము వరకు నడిపించుటే గాక—కూలంకషవలె పరువిడును. ఈ లక్షణ మున పింగళికవికి సహాధ్యాయుడే యనవలయును. వర్ణన లును విపరీతము గాఁక 'సీతా సర్వాంగసుందరీ' యన్న వాక్యము వలె రెండు, మూఁడు పద్యములతో నవతలి ఘట్టమునకుఁ జేరును. ఆ విషయమున నీతఁడు సిద్ధహస్తుఁడు. పై సిద్ధాం తము ననుసరించియె కాబోలు నొక చక్కని శపథము దొలి దొల్తనే 'మల్లినాథుని' వలె జేసినాఁడు.

సాహసమొప్ప నే నిపుడు—శబ్ద నిగుంభన విస్ఫురద్రసా
మోహన చాతురీ మృదు ప్ర—మోద సులక్షణ గౌడిభావ సం
దోహ విశుద్ధ పూర్వపద దూర్వహ కల్పిత కల్పవల్లికా
దోహళ నర్థసంపద మృదూక్తులఁ జేసెద కావ్య మెన్నగాన్.

ఈ పద్యమందలి ప్రతి పదమును, కావ్యము నాపాద చూడ ముగ చదివినపుడు సత్యోక్తి యనియే తోచును. ఇంతటి యుత్తమ కవిని కావ్యమును గని ఎవరో సమకాలీనులు, యుబుసుపోక కల్ల కపట లాడినట్లు తోచుచున్నది. అందు లకై 'కుకవిదూషణ' కన్న మిన్నగ చేసిన నీ దూషణమును గాంచుడు:—

మాటలు చెప్పవచ్చు బహు - మాన్యతగా చదు వందవచ్చు—మై
తేటలు జూర నర్థము ప్రతీతిగఁ జెప్పగవచ్చు తప్పు....
....పాప బట్టవచ్చు జిగిబాటల దివ్యసుధా విలాసముల్
మేటిగ జింద సత్కృతులు మెచ్చున జెప్ప ప్రయాస
ధారుణిన్.

అని 'రాల్గరగంగ, నేగతి రచించిరేని సమకాలమువారలు మెచ్చరే గదా !' అని కదా చేమకూరి వేంకటకవి వాపోయినది. ఇది సర్వ కాల రచయితల కెల్లరకు ననుభవైకవేద్యము. అందు నిరువదవ శతాబ్దమున నెల్లరు విమర్శకు 'తగుదుమమ్మా' యని ముందు నకు వచ్చి మందమతులై మందులగుచున్నారు. ఇది కలికాల ప్రభావం. "సత్కవిగా బుట్టుట దోషమని" పెద్ద లెందరో

పలికిరి. ఇక 'సంస్కృతాంధ్ర కవితా నిర్వాహక చాతురీ ధురీణ' యను బిరుద మన్వర్థమే! ఈ లక్షణము కావ్యము మీద చక్కగ సరిపడును. 'సాహిత్య సరసాలంకారముల' కావ్య నిర్మాణ చాతురియు—సాంప్రదాయమందు దభినివేశము కవికి వలసినంత యుండి కావ్యమునకు తుష్టిని పుష్టిని గలిగించుచున్నది.

ఇక పూర్వకవుల నుతించుటలో ద్రావిడామ్నాయోద్ధారకులను, కవి మూలపురుషులను, ద్రావిడ మునీంద్రులను—యామునాచార్యాది, ఆళ్వారాచార్యులను యతి వేమముగ ప్రార్థించినాడు. ఈ యామున స్తోత్రము జదివినవాడుడు:

ఘనుడై యామున దేశికుండు దిశలం గర్వాంధ పాషండ దు
ర్జనులం వాదమునం జయించి ఘనకంసారాతి దుర్దాంత-సూ
చన గంభీ- పటిష్ఠ దీపిత విశిష్టాద్వైత సన్మార్గ—నూ
తన పారస్య మహత్వముం దిశల మోదంబందనిల్పెన్‌రహిన్.

ఈ పద్యమున యామునాచార్యుడు (విష్ణుచిత్తుడు) పాండ్యభూపతి యాస్థానమున—ప్రతిపక్షుల నోడించి—నారాయణ పరత్వమును నిర్ణయించిన వృత్తాంతము గోచరించుచున్నది కదా! పైగ విశిష్టాద్వైత విశిష్టతయు ధ్వనించుచున్నది కదా! ఈ గాథనే రాయలు తన విష్ణుచిత్తీయమున పరగుణ పరమాణువును పర్వతముగా చేసి వర్ణించినది. ఇంక సాంప్రదాయ మర్మములనే కాక నాయా స్థలముల నుండు ఆచారములను సాంఘిక ధర్మములను గూడా చక్కగ చూపించినాడు.

ఇంద్రసేనుడు నీతిమంతుడగు మంత్రి ప్రేరితుడై—అహోబిలపతిని సందర్శించుపొంటె తరలి స్వామిని సేవించుటకుం బూర్వము—

పన్నిద్దర నాళ్వారుల నెన్నికతో గాంచి మ్రొక్కి వెనకంగ, స ఫీ
పోన్నతుడగు హనుమంతుని సన్నుతి గావించి స్వామిసన్నిధికి జనెన్.

ఇందొక యపూర్వాచారముం దెలియుచున్నది. స్వామి దర్శనమునకుం బూర్వము భగవద్భాగవతాచార్యులను దివ్యసూరులను సేవించి 'సిరియ తిరువడి' ని సేవించియే స్వామిని సేవింపవలయునన్న నియమము తెలివిడి యయ్యెడిని. ఈలాటి యాచారములు—ద్రావిడ దేశమందు కలవు. ఘటికాచల, శ్రీ కాంచీ, శ్రీక్షేత్రముల తొలుత తాయార్లను సేవించియే—స్వామిని సందర్శింపవలయును. అటులనే నీ క్షేత్రమున నీ యాచార ముండి యుండును.

ఈతని కావ్యారంభము ఒక నూతనమార్గ మన్వేషించినది. ఈ యన్వేషణకు ఆముక్తమాల్యద కారుడు నాందీ ప్రస్తావన మాచరించినాడు. తదుపరి యే యితర కవియు వర్తించి నట్లు తోచదు. అది విష్ణు పంచాయుధములను, అనంతుని, హనుమంతుని ప్రార్థించుట: ఇతనికి చిత్ర కవిత్వము, గూడా గొట్టిన పిండియే. చక్రబంధ చిత్రకందము:—

అమలాంచిత మునివినుత సమ విలసిత లలితవర్తి చంచద్భూపాలా
కమలార్చిత సత్కృపాలా కమలోజ్జ్వల హస్త వినుత కల్పిత
నిమలా.

ఈ చక్రబంధము—పారిజాతాపహరణ, మనుచరిత్రాద్యుద్యయామములలో శార్దూల, మత్తేభములలో నుండి కవి నామము తెలియుచుండెడిది. కాని యీ కవియుపక్షముతనేలను. కందమునను చక్రబంధమును వ్రాసినాడు. అది నిజా కందమై మధుర భావ సమంచితమై వెలయుచున్నది. ఆయారీతుల నునుమరించి కలము నడుపగల నిపుణత యీతని కున్నది. కాని కావ్యమంతయు చాలవరకు వైదర్భి పాంచాల రీతులలో మొదటి నుండి—తుది వరకు—మాధుర్యము ముడివోని శయ్యా ... మార్యముతో—సరస రమణీయముగ నిర్వహింపగల నేర్పు గలదు. పైగ పండితులనే గాక—పామరులను కూడా ... పోషణాది ఘట్టములలో 'ఆహా' యనిపించగల శక్తి ప్రతి పద్యమునందును గానవించుచుండును.

ఎంత మనస్ఫూర్తిగా సాటిరానిదై నిలచి పత్రేరునొ
చూడుడు:

విజ్మాఖ మధ్య సీమ రవి దీధితిచే జొగవొందెవంబు మా
రుజ్మధు దేశకుండలి విరోధి వరాహ సునాహ విద్విష
ద్రోజ్మఖత్వమ్ము బాపుటకు పాల్పు దలిర్చగవచ్చె మాముగా
ప్రాజ్మఖ మారుతంబు మొగి బల్విడినేగ నడంగ నిత్తరిన్.
(ఆ—3)

'కల్పనా నిపుణః కవిః' యనుచ్ఛక్తికి కల్పనా చమత్కృతి హృద్యా హృద్యము:—

ఇనుడం బొబ్బ మెకంబు వ్యోమ విపినం బీడేరగా వెళ్లి—హ
స్త నగేంద్ర పృథుమాయ వేగని యత్నాసక్తి వెన్నాంది, చ
య్యన నేతెంచె కరీంద్ర బృందముల నం యెంతేనియుంజీకటుల్
ఘనమై దిఙ్ముఖ మండలంబులను నిష్కాసత్వతం బర్వగన్.
(ఆ—3)

చంద్రదూషణ మెంత చిత్రము—సుధర్మనను నాడించెదో కనుడు:

గోహత్య గురుద్రోహము స్త్రీ హత్యయుం జేయం బనదు
—సిద్ధము జగతిం
గోహత్య గురుద్రోహము స్త్రీహత్యయు జేసితీవు—వెలుగుచు
చంద్రా.

## కా వ్య ప్రా చీ న త

ఈ కావ్యమందలి రచనా వైఖరిం గాంచిన షుమారు మున్నూరు నన్నూరు వత్సరముల నాటిదై యుండుననుట

# తిరుమల బుక్కపట్టణ శ్రీ నరసింహాచార్యకవి

కావంతయు సందియములేదు. ఇంతకుఁ బూర్వము నేను జూచిన తాళపత్ర గ్రంథములలో నుండు రచన లన్నియు నిదే క్రియ నుండినవి. శాసనములందు వలె పద్యాదిలో గాని—పదాదిలో గాని—'వు' 'యు' కారము లెన్నియో గలవు. పాదాంత మున 'గనూ' మళియునూ, ప్రుతస్థానము ననుస్వారము, పైగ ''శృంగ్గ'' యను సమయమున 'జడ్డ' నుపయోగించుట, వల పెలగిలక, ఇత్యాదు లసంఖ్యాకములు గలవు. ఇది వచనమందే గాక—పద్యములందు కోకొల్లలు.

> బంగ్గారు గోపురంబ్బులు శృంగ్గారం బొప్పుచుండ—చోద్యము నడి, సొ
> స్త్వంగ్గంబ్బుగ చెండ్లములిడి యుంగ్గసియుం దాను ద్వార మవ్వలికి జనెం.

జాతీయములును సామెతలు లర్థాంతరన్యాసములు పుణికిపుచ్చికొని ఎట్లు పొంకముగ పొందుపరచినాడు.

ఈ కవి వ్యక్తిత్వము—కావ్యమునంగిని, ద్రావిడామ్నాయ సాగరమును మథించిన మంథరాసగ మవుటచే కాబోలు ఆ సాంప్ర దాయ పరిభాష లెన్నిటినో రావ్యాంతమున జొనిపినాడు—

(1) భాష్యకారులు, (2) ఆళ్వారులు, (3) సన్నిధి, (4) నేవరవారు, (5) జయ్యంగార్, (6) ఉత్సవర్, (7) పొంగలి, (8) [illegible] (9) [illegible] (10) [illegible]

[illegible]

ఈ కవి యొకడు—సర్వంకష సాహిత్య సౌ[illegible] ఖు డుగా—వేరొకట—శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత మతా భిమానిగా—మరియొకట శాస్త్ర విద్యారహస్యజ్ఞుడుగా కని పడుటయే గాక, ఆయా విషయములు రసనాంచలము నృత్యము జేయునట్లు లోచును. రచనలో—అంతలో సంస్కృతపుజిగి—దానిలోనే తెలుగుఁ బల్కుల నూత్న నూత్న రుచుల అక్కడి కక్కడనే మహాప్రబంధ ప్రౌఢిమ—అంతలో నవక లాలిత్యము గలిగి సకల రసములతో భక్తిరసమును గలిపికొని—ఆయా తత్త్వములతో ప్రపత్తి మార్గమును జూపుచు లేఖిని గమన గాంభీర్యముతో, తీరుతీయములతో—శ్రావ్య సౌకుమార్యాది గుణముల ప్రోగొనర్చికొనుచు నడపించును. అక్కడక్కడ పూర్వాచార్యకృత పాశురముల భావములు ఛాయామాత్రమ గనుపడుచున్నవి. ఆంధ్రకవి ప్రణీతకృతి సార సుధారస స న్మాధురీ విశేషము లెన్నియో దృగ్గోచర మవుచున్నవి. అట్టి ప్రబంధార్థ బోధనా సమర్థ సంస్కృతాంధ్రభాషా కవి విర్వాహ చాతురీ ధురీణుండైన యీ నరసింహాచార్య రత్నము—భగవద్భక్తి ప్రేరితమైన చంద్రవర్మ చరిత్ర రచించి తన వంశమును, తన భాషను తరింపజేసి కీర్తి గాంచినాడు. ఇంతటి రసవత్తర ప్రబంధము ముద్రణకాక [illegible]

సంపన్నుని యింటి యటకపై పొగచూరుచున్నదన నెంతటి దౌర్భాగ్యమో యాలోచింపుడు. ఇప్పటికైనను ఆంధ్ర సాహిత్య అకాడమీవా రిట్టి తాళపత్ర గ్రంథముల సేకరించి వాటికి కనీసము పుత్రిక తైనను పుష్టింపజేయుట కర్తవ్యమే కాదు, ధర్మమని నా ప్రార్థన. నాకీ గ్రంథ ప్రతిని బహూకాదరముతో నొసంగిన—సరసహృదయులు, సాహిత్యాభి మానులు, రామాయణ శతక కర్తలు, కనిగిరి తాలూకా నాగి రెడ్డిపల్లె వాస్తవ్యులు, బ్రహ్మశ్రీ తూములపల్లి వేంకట సుబ్బయ్యగారికి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచు ఈ కవి యొనర్చిన 'పంచాయుధ స్తోత్రము'తో నీ వ్యాసము నకు భరతవాక్యము బలుకుచున్నాను. విజ్ఞలోకమునకు నా యథా శక్తి పరిశీలించి నాల్గు వాక్యములు వ్రాసి లోకమున కీ గ్రంథ మును కవిని పరిచయ మొనర్చినాడ—గుణములు గ్రహించి దోసములు త్యజింపవలసినదిగా కోరుచు ఇంకను తెలిసిన వివర ములు తెలియజేయ వినయాంజలితో ప్రార్థించుచున్నాడను.

## 'పంచాయుధ స్తోత్రము'

1. పటుబ్ధ్వాన నిశాచర ప్రవరభా—స్వత్కామినీ గర్భని ర్భటలబ్జోస్యద మృభ విభ్రమణ దీ—ప్తాపాదియంబోధ రా ర్భటి దిక్కారి రమేశ దివ్య ముఖశుంభ ద్వానసానంద వి స్ఫుట గౌరద్యుతి మీరు 'శంఖపతి' సంపూర్ణార్ద్రదృతిం బ్రోవుతం.

2. హరి దైతేయుల సంహరింప రవిదా—యంబోయివారెల్ల భీ కరులై గాత్రము చించిపోవ, నలువంగాదంచు భీతిల్ల—పెం పరయన్ శౌరిపదాబ్జయుగ్మమున నొయ్యం వ్రాలమోదంబునన్ కరముంద్రుం చెనంగ చెన్నలరు 'చక్రస్వామి' ప్రార్థించెదన్.

3. కొప్పులు రెండు, కానొకటి కోమలసద్గుణ మొప్పియుండు—యు ల్లప్పుడు మార్గణాళికడురంజిలి, చిత్ర మటంచు బల్కి నం చొప్పున—శౌరి మూపునప్రసూనల తాకృతి బోలె వేడ్క చె ల్వు ప్రతిలంగసారె కడు నొప్పెడు 'శార్ఙ్గము' మమ్ము బ్రోవుతన్.

4. కమలినరీతి కంకణ వికాసము గల్గియు స్వప్పురంబుచె న్నమరుట, పెక్కురీతి సుమనాధిక పంక్తులఁ బొల్చి సుందరీ క్రమముగ నూపురంబుల ప్రకాశము జెంది ప్రసిద్ధిగాంచు న త్యమల కడిందిశౌరి 'గద' నర్మిలి నన్ను గృతార్థు జేయుతన్

5. నరలింపై పయుగ్రమ్ము రాక్షసచమూ సంహోద్భటా నల్ప స్ఫుర బాణార్చి, నభంబు బ్రాకుటయు సంపూర్ణ దృతిం వారి, ద న్తర శౌర్యంబు లడంచి మించి గత కృత్యాయత్తసోత్కర్ష, భ సురతం బెన్నగు 'నందకం' బలఘుతాన్నార్తిచ్ఛిరంజేయుతం

# వే శకలము



శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

చెన్ను దరిగెను ప్రజాస్వామ్య శతపత్ర సుందరీ వదన
కమలము, పశ్చిమాద్రి నెత్తమ్మున పడిపోయిన నాల్గు
పదుల వసంతాల ధర్మ భాస్కరుని జూచి——

చీకటికి రెక్క లమరెను, శాంతిదేవత గుండె పగిలెను; మహా
మమతా సమతా నవతా మానవతా మయ మహా మూర్తి
మనకు మిగులకుండుట జూచి, యెహోవా నిశ్వసించెను,
సైతానుకే బలము మిగిలెను——

విభేదాల అంకురాలు ఛేదించి, కార్పణ్యాల అగ్ని తొలగించి,
వైతరణికి వంతెన మంచితనం స్తంభాలపై వేసి, మనిషికి
రేపటి రోజుకు మార్గం సుకరం చేసిన దేవుని పంపిన మహాత్మ
బిడ్డ పుడమికై తన రక్తమిచ్చెను; ఇల తన పుణ్యాన్ని నశింప
వదలి వేసెను——

అపురూపమగు ఫోనిక్స్ పక్షి అలబామా రంగుల రాజ్యంలో
తన సమ్మోహన రాగసుధను వర్షింపదు; కర్కశా జనతా
హృది దాగిన బడబానల ముప్పొంగదు; మనుషుల గుండెలపై
మంటలు రేగిన ఘడియలోన చతురంబోధి పరీత భూ
వలయ రక్షా దక్షతా సత్వస్వాంతము కనుపింపదు, సజ్జనుల
నిక రక్షింపదు——

ఎల్ల లెరుగని ఎడారి తనమిది; పతనానికి మరొకపేరు, పాశవి
కతకు మారుపేరు; స్వార్థాల కౌగిళ్ళమధ్య, భయాల సంశయాల
చిక్కువడి, ఆదర్శాల శిఖరాలపై నుండి అనుభవాల అగాధా
ల్లోపడి చనిపోయే సామాన్యునికి పతనం, నీ పవిత్ర రక్తదానం
తెలిసిరాదు——దయగల మరో క్రీస్తు ధరణినేలు మంచికాల
మింతలోన కానరాదు !

# సమానత్వ సిద్ధాంతాలు

చట్ట సమానత్వమనేది పశ్చిమ దేశాల సంప్రదాయాల ఉత్తమ లక్షణంగా వుంది: సుదీర్ఘంగా, పట్టుదలగా పోరాటాన్ని సాగించినతర్వాత మన పూర్వీకులు దీనిని సాధించారు. మనతరంలో నిరంకుశ ప్రభుత్వాలు ఏర్పడిన కారణాన, చట్ట సమానత్వాన్ని గురించి మనం నిర్లక్ష్యంగా వుండరాదని స్పష్టమవుతున్నది. అవకాశ సమానత్వమనేదికూడా ఉదారమైనది. విశాలమైనది: సృజనాత్మక శక్తులను పెంచేది దీనికోసమని, మిగిలినవన్నీ త్యాగం చేయడానికి, కుంచింప జేయడానికి మనం సిద్ధంగా లేకున్నంతమాత్రాన, ఈ ఆశయానికి మనం విలువ ఇవ్వడం లేదనో, దాని సాధనకు సరళమైన మార్గంలో కృషి చేయడానికి మన సిద్ధపడడంలేదనో అర్థం చెప్పుకొనరాదు. ఇక ఆదాయం–సంపదలకు సంబంధించినంతవరకు, కేవలం కత్తిరించాలన్న ధోరణిలో ఆదాయాలు, సంపదలు తగ్గింపజేయడాన్ని మనం వ్యతిరేకిస్తాము: ఈర్ష్యవల్ల, ద్వేషంవల్ల మన మిలా చేయడం లేదనికూడా చెప్పుకొనడం న్యాయం కాగలదు: అసమానత్వానికి జతపడివున్న తప్పుడు విలువలను గురించి విజ్ఞుడైనవ్యక్తి విచారించక మానడు: సౌజన్యధోరణి కలవ్యక్తి తనతో సమానమైన లేదా తనకంటె మెరుగైనవారితో కూడిన సమాజంలో హెచ్చు సంతృప్తిని పొందగలడు. తనను అందరికంటె ఘనునిగా చూడాలని ఆయన కోరడు. కాగా కృత్రిమమైన వర్గ విషచక్రాన్ని సృష్టించే పరిస్థితులకు సహజంగానే వైముఖ్యం చూపుతాడు. దీనిని అందరూ సానుభూతితోను, సుహృద్భావంతోను అర్థం చేసుకొనడం అవసరం.

ఈ కారణాలవల్ల వామపక్షీయుల పరిష్కారమార్గాలను సమర్థించే వారికి, వ్యతిరేకించేవారికి మధ్యవున్న తేడా–తప్పుడు విలువలపట్ల వారికిగల వైముఖ్యం వీటిలోనూ లేకపోవడంకాక, మరొక మార్గంద్వారా ఆతప్పుడు విలువలను సవరించవచ్చునని సూచించడంలో వుంది: నిర్దిష్టమైన లోపాలను, వాటిని సవరించగల నిర్దిష్టమైన చర్యల ద్వారా పరిష్కరించాలికాని, సదుద్దేశ్యాలతోకూడిన స్థూలమైన పరిష్కారమార్గాలను అనుసరించడంవల్ల, ఏ ఉత్తమ శక్తులను ప్రోత్సహించాలని మనం అభిలషిస్తున్నామో, ఆ ఉత్తమశక్తుల అభివృద్ధికి ఏమాత్రం అవకాశమివ్వని విధంగా సామాజికవ్యవస్థను మూసపోయడం ప్రమాదకరమని హెచ్చరించడంలో వుందని గమనించకోరుతున్నాను. [లండన్‌లో "బవ్ గ్రూపు"వారు సమానత్వాన్ని గురించి జరిపిన విద్వద్గోష్టిలో శ్రీ రాబిన్స్ చేసిన ప్రసంగభాగాలు ఈ వ్యాసం]

# కవిత్వము - ఛందము

## శ్రీ కె. వి. రాఘవాచార్య

గత ఫిబ్రవరి నెల 'భారతి' లోని 'కవిత్వము—ఛందము'— అను నా వ్యాసమందలి కొన్ని దృక్పథములను మిత్రులు శ్రీ వి. రాజగోపాలరావు ఎం.ఏ. గారు మార్చి నెల, 'భారతి' లో పరిశీలించిరి. అందులకు వారికి కృతజ్ఞత చెప్పుకొంటూ, ఆ పరిశీలన లోని కొన్ని అభిప్రాయములను పరామర్శించుచున్నాను.

నన్నయ వసంత ఋతువర్ణన లయగ్రాహిలో గాకుండా, మరొక ఛందములో (వృత్తము?) యుండి యుండిన రస గ్రహణమునకు అంతరాయము కల్గియుండునా యను విషయమును యోచింపవలయుననిరి కాని యోచించి, ఒక నిశ్చితాభిప్రాయమునకు రాజాలరైరి! మరియు, వారు ఎఱ్ఱన, నన్నయల వసంత ఋతు వర్ణనల నుదాహరించి, పరిశీలించి "ఇరువురొనరించినది వసంతఋతు వర్ణనయే యైనను శబ్ద చిత్రము లందలి భేదములవలన పాఠకుల మనో నయనముల యెదుట గోచరించు వసంత కాల దృశ్యము వేర్వేరుగనే కన్పట్టును" అనిరి. ఆ వసంత వర్ణనల ఉనికి, ప్రయోజనముల గమనించిన నాకు తోచిన భావము లివి :-

### ఎఱ్ఱన - వసంత వర్ణన

వ: ఇట్లా దంపతులు (సావిత్రీసత్యవంతులు) మంద గమనంబున నరిగి పరిసరారణ్యంబు దఱియంజొచ్చి రప్పుడు.

సీ: కమనీయ కమలినీ కల్లోల వీథుల
గదలు రాయంచల గతుల యొప్పు
బహు పుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరులతా తతుల సొంపు
మకరంద రసపాన మద విలోలంబులై
క్రాలెడి యెలదేటి గముల యులివు
బరి పక్వమంజుల ఫల రసోద్ధత ములై
పలుకు రాచిలుకల పటు రవంబు
ప్రియుడు వేఱువేఱ ప్రీతిమై జూపుచు
చెప్పుచును జనంగ చిగురుఁ బోడి
గనుచు వినుచు నిర్వికార సల్లాపమిం
పారనతని తెఱఁగు నరయు చుండె.

వ: తదనంతరంబయా రాజర్షి నందనుండు మధురంబు లగు ఫలంబులు గోయుచు .....

—భారతము. ఆరణ్య. 7 ఆ 212—214.

ఇందలి ప్రకృతి సౌందర్యము యువ దంపతులగు సావిత్రీ సత్యవంతుల హృదయముల పై నెట్టి ప్రభావమును నెఱప లేక పోయినది! ప్రకృతి సౌందర్యమును దర్శించిన స్త్రీ పురుషు లందు వికారమంకురించుట సహజము. ఇకనూత్న దంపతుల మాట చెప్పనేల? ఈ సహజ ధర్మ మనివార్యమనుటకు లోకజ్ఞుడైన కాళిదాసు శకుంతలచే పలికించిన "కిం నుఖలు ఇమం ప్రేక్ష్య తపోవన విరోధినో వికారస్య గమనీయాస్మి సంవృత్తా" (1 అం) (ఇతనిని చూచి తపోవన విరుద్ధమైన వికారమునకు పాలయితినేమి?) అను వాక్యము ప్రమాణము. సావిత్రి నిర్వికారియై యుండుటకు తగిన కారణమున్నది! యువకుడగు సత్యవంతుడట్టి మనోహర సన్నివేశములో పత్నీయుతుడయ్యు చలింపకుండుటకు హేతువేమి? వికారము నొందకుండుటస్వాభావికమా? వసంతఋతువైనా, ఆ ప్రకృతియందు ప్రేరేపక శక్తి లేదు. అది నిర్జీవము. ఈ వర్ణన లేక పోయినను కథకు లోపము గలుగదు! అది సాధించు ప్రయోజనము లేదు!! ఈ వర్ణన సంప్రదాయ రక్షణకై చేసినది కాబోలు!

### నన్నయ - వసంత వర్ణన

వ: .....వసంత సమయంబు నఖిల జీవలోకానంద జననంబై చనుదెంచు చున్న

లయగ్రాహి:— కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు మధు
పమ్ముల సుగీత నినదమ్ము లెసగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి ముకు
ళమ్ముల ను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము మధు
రమ్మగుచు విన్చె ననిశమ్ము సుమనోభా

రమ్ముల నశోక నికరమ్ములును జంపక చ
యమ్ములును గింశుక వనమ్ములును నొప్పెన్.
లయగ్రాహి:— చందన తమాల తరులందు నగరు ద్రుమము
లందు గదళీవనములందు నవలీమా
కంద తరు షండములయందు నని మీాల దర
వింద సరసీ వనములందు వనరాజే
కందళిత పుష్ప మకరంద రసముం దగులు
చుందనువు సౌర భమునొంది జనచిత్తా
నందముగ బ్రోషితుల డెందముల లందురుగ
మందమలయా నిల మమంద గతి వీచెన్.

వ: ఇట్లు సర్వభూత సమ్మోహనంబయిన వసంత సమయంబునం బాండురాజు మదన సమ్మోహన మార్గణ బందీకృత మానసుండై మద్ర రాజపుత్రిదైన మనోహరాకృతి యందు మనంబునిలిపి యున్నంత......

—భారతము. ఆది. 5 ఆ. 137—140.

ఎత్తిన వసంత వర్ణన వలె ఇదియు వచనములమధ్య అమరి యున్నది. పద్యమున కిరు ప్రక్కలనున్న వచనములు వాని స్థితిని పోషించుచున్నవి. ఈ వర్ణనయందు లోకజ్ఞుడగు నన్నయ చూపిన విదగ్ధత అపురూపము. రసోత్కంఠ స్థితికి మొదటి వచనము ఆరోహణముగ, రెండవ వచనము అవరోహణముగ నున్నవి. ఇక ఇందలి వ్యంగ్య వైభవమును దర్శింతము.

(1) లతాంత—మన్మథుడు లతాంతాయుధుడు.
మధుపములు—మన్మథుని వింటి అల్లెత్రాడు.
సుగీత నినదమ్ము— వింటినారి మ్రోత.

మన్మథుని వింటి నారిగా తుమ్మెదల జెప్పుట కవిసమయము. వాటి మ్రోత కామోద్దీపకము. ఇందులకు

శ్లో. ధనుః పౌష్పం మౌర్వీ మధుకర మయీ చంచల
దృశాంకోణో బాణః సుహృదపి జడాత్మా హిమకరః
స్వయం చైకోఽనంగః సకల భువనం వ్యాకులయతి
క్రియా సిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే॥

అను శ్లోకము ప్రమాణము. ధ్వని బాణ ప్రయోగమ్మునకు పూర్వము నారిని మ్రోయించుట సహజము. తుమ్మెదల ఝుంకారము, నారిటంకారము యొకటిగా నుండుట విశ్రుతము. కావున మొదటి వాక్యమున వసంత కాలము అఖిలజీవ లోకానంద దాయకమై యుండగా భావజుడు బాణ ప్రయోగమునకు సిద్ధపడి, నారిని మ్రోగించుట స్ఫురించుచున్నది.

(2) కిసలయమును స్త్రీల అధరముతో పోల్చుట కవి సమయము. పల్లవాధరి— మొ. వి ప్రసిద్ధములు. కోకిల— పుంలింగ శబ్ద మగుటచే చుంబనము ఊహింపదగినది.

(3) సుమనస్. (స్త్రీ. లిం.) పూవు. స్త్రీలు పూబోడులు, పుష్పవతులగుట ప్రసిద్ధము. అశోకము (పు. లిం) శోకము లేని వాడు. చంపక కింశుకములు పుంలింగ శబ్దములు. కావున మూడవ వాక్యమున పురుషాయిత భోగ మూహ్యము. ఇదియే రతికి పరమావధి. ఇందే స్త్రీల భారముచే పురుషుడు శోభించుట సంభవించును. ఇందులకే భర్తృహరి శ్లోకము ప్రమాణము.

శ్లో. ఉరసి నిపతితానాం స్రస్త ధమ్మిల్ల కానాం
ముకుళిత నయనానాం కించి దున్మీలితానాం
ఉపరి సురత ఖేద స్విన్న గండస్థలానాం
అధర మధు వధూనాం భాగ్యవంతః పిబంతి॥

—శృంగార శతకము. 25 శ్లో.

ప్రకృతి మధుపమ్ముల సుగీత నినదమ్ములతో, కోకిలల మధుర రవమ్ములతో, సుమనో భారమ్ములగు అశోకమ్ములతో నుజ్జ్వలమై యుండగా, మలయా నిలము శైత్య, సౌరభ, మాంద్య గుణములు గల్గి మంద గతిని వీచు చుండగా పాండు రాజు కిందముని శాపమును గూడ తలంపకు ప్రకృతి ప్రేరణకు పరవశించి, మాద్రి శాప భయముచే వారించుచున్నను, బలిమిం దత్సంభోగ సుఖ సమీహితుఁడయ్యెను.

నన్నయ వసంత వర్ణన ప్రేరేపక శక్తి గల్గినట్టిది. సొగసైన బహిరాకారము, సత్వ గరిష్ఠమైన జీవకళ గలది. ఈ ప్రకృతి పాండు రాజునకేగాక పాఠకులకు గూడ సమ్మోహమును గల్గించుచున్నది. కథకు మిక్కిలి ప్రయోజన కారియైనది. పాండురాజ మరణమునకు వసంత ఋతు సౌందర్యము హేతువగుచున్నది. ప్రయోజన కరమగు ప్రకృతి వర్ణనలను చేయుటలోను నన్నయ ఆద్యుడే ! ఇట్టిది కదా మహాకవుల ప్రతిభ! ఇందు కోమలాను వరణనము గల ప్రసన్న పద సంఘటన వలన గలుగు మనోజ్ఞమగు నాదము, వర్ణముల యావృత్తి వలన గలుగు శబ్ద సంగీతము వీనులకు విందొనర్చు చున్నవి. పద్యము లందలి శయ్యా సౌభాగ్యము, ఛందోగుణములగు లయ, తాళములు విషయ వైశద్యమునకు, అర్థ స్పష్టతకు తోడ్పడుచున్నవి. ఇట్లు సాహిత్య, సంగీత, నృత్యతత్త్వములు సంయోగించి యుండుట ఇంకెడ గానము. ఇందు శబ్దార్థ సిద్ధులను నన్నయ సాధించెను.

ఈ వసంత వర్ణన 'కావ్యాత్మ' యగు వ్యంగ్యార్థముచే నుప జీవములైన, రసానంద దాయకములైన భావములచే నాద సౌభాగ్యముచే సంపన్నయై, ఉత్తమ కవిత్వమున కుదాహరణముగ నున్నది. ఛందోతత్త్వ వేత్తయగు నన్నయ, రసవ్యంజనకు ఉచితమైన ఛందము గల 'లయ గ్రాహి' యను ఉద్ధురమాలా వృత్తమును పరిగ్రహించి, "అక్షర రమ్యత" సాధించెను. ఇందలి నాద మాధుర్యము అనుభవైక వేద్యము, గనుక అనిర్వచనీయము.

కావ్యమందలి భావ సంచరణమునకు మంద్ర మధ్యమ తార స్థాయులను మూడు స్థాయులు గలవు. కేవల కథా నిర్వహణమున భావ సంచారము మంద్రస్థానయిులో నుండును. ఇందు వచనమే యుపయోగింప దగినది. పద్యములకు ప్రసక్తి లేదు. మధ్యమ స్థాయిలో భావము ద్రవీ భూతమగు చుండును. ఇందు కథా నిర్వహణకు కంటే, రస సంచారమే ప్రధానము. ఈ స్థాయిలో పద్యములుండుట సహజము. ఇక తారస్థాయిలో భావము మాటల కందదు. ఇది రసమునకు పరిపక్వ దశ. కనుక ఇందు సాహిత్యము, సంగీత, నృత్య గుణాన్వితమై యుండవలెను. ఈ రసోత్కంఠ దశలో ఛందో తత్త్వ వేత్తలైన మహాకవులు రస వ్యంజనకుచితము లగు, వృత్త విశేషములనే స్వీకరించిరి. కాళిదాసు కుమార సంభవమున రతీ విలాపమును— వియోగినీ వృత్తమున, సందేశమును, మందాక్రాంత వృత్తమున, నన్నెచోడుడు దక్ష కృత శివస్తుతిని లయ గ్రాహి, లయ హారిణులందు, పెద్దన మనుచరిత్రలో పుష్పాపచయమును ద్విరదగతి రగడ యందు, వేమన తన భావములను ఆట వెలదులందు రచించిరి. ఆయా భావ ప్రకటన యందు ఆయా వృత్తములు ఒప్పునని వారి నిశ్చితాభిప్రాయము. ఇందును గూర్చి మన 'ఊహాలు అసంగతములే యగును.

రవీంద్రుని గీతాంజలి (Song offerings) ఛందో గుణసంపన్నమని "These lyrics—which are in the original, my Indians tell me, full of subtlety of rhythm of untramslatable delicacies of Colour of metrical invention - display in their thought a world I have dreamed of all my life long" - అని Y. B. Yeats కవి ఉపోద్ఘాతములో నుద్ఘోషించియున్నారు. అందువలన రవీంద్రుని 'గీతములు' తత్త్వములో నవ్యాధునికుల 'వచన పద్యాల' వంటివి కావు. ఆంగ్ల గీతాంజలి మౌలికం గాదు. అది వంగ 'గీతాంజలి'కి అనువాదము. ఆంగ్ల గీతాంజలి మాత్రమే Free verse (స్వేచ్ఛా గీతిక)లో నుంది. మూల గ్రంథమగు వంగ గీతాంజలి శబ్దాలంకార సమాలంకృతము, లయతాళ సమన్వితము అగు గీతముల (Lyrics)లో నున్నది. అందువలననే అది 'గీతాంజలి' యైనది !

*   *   *   *

మానవులందు తమ ఆనందానుభవమును దెలుపవలెనను కోరిక యుండును. కవి యందిది బలీయముగ నుండును. భావోద్రేకము గలిగినపుడు ఆయా వికారములకు తగిన వాక్యములు నోట వెలువడుట మానవులందరికి సహజమైనను, కవినోట వెలువడు వాక్యములు ఏవో కొన్ని నిర్మాణ సూత్రములకు, సంప్రదాయమునకు అనుగుణముగ రూపొందించుచుండును. లక్షణములు ప్రతిభావంతులైన కవుల రచనల—భావ ప్రకటనా పద్ధతి—సమ్యక్ పరిశీలనవలన తేలిన సామాన్య ధర్మములనుట మరువరాదు. కవి హృదయము భావపూర్ణమై, తొణికిసలాడుచున్నపుడు పద్యమువెలువడినంత సులభముగా గద్యము వెలువడదు ! రసోత్కంఠ దశలో కాళిదాసాది మహాకవులు వచనమును గాక ఛందోబద్ధమైన వృత్త విశేషములనే గ్రహించిరి. అసామాన్య వ్యక్తిత్వ ఆట్టి సందర్భములలో పాడి మాటలతో, శుష్క వచనములతో రసస్ఫూర్తి జేయ లేదు. "విషయము ప్రధానమైనది గద్యము, రస ప్రధానమైనది పద్యము" అను కవిత్వ తత్త్వ విచార కారుని అభిప్రాయము గ్రహణీయము. భావోద్రేకమును ప్రకటించుటకు గద్యము కంటె పద్యము ఉత్తమ ప్రకటనా విధానమని నా తలంపు.

ప్రతి సాహిత్యము శ్రుతి తాళలయాత్మకమైన గేయముతో నుద్భవిల్లినది. తెలుగున అట్టి పదకవిత్వమే పద్యకవిత్వమునకు మూలమైనది. లిపిలేని భాషలలో గేయములు, పద్యములు మొదలగు ఛందోబద్ధ కవిత్వమేగాని కేవల వచన కవిత్వముండుటకు వీలులేదు ! ప్రాబలుకులు వేదములు గేయములే ! వానిని ఉదాత్తానుదాత్తాది స్వరములతో పఠింపవలెను. సామవేదము సామగానమని ప్రసిద్ధి పొందినది. సంస్కృతభాషలో ఆది కావ్యమగు రామాయణము గేయ కావ్యమే ! దానిని కుశలవులు గానము చేసిరి. తెలుగున ఆదికావ్యమగు భారతము చంపూ పద్ధతిలో గద్య పద్య మిశ్రితముగ — రచింపబడినది. ఇందలి వచనము ఛందోగుణ సంపన్నమై పద్య వాతావరణముతో శోభిల్లుచున్నది. భట్ట బాణ, దండి ప్రభృతుల సంస్కృత గద్య కావ్యమందలి గద్యము వృత్తగంధి, చూర్ణము, ఉత్కళికా ప్రాయమని మూడు విధములుగ నున్నది. పద్యభాగము గలది వృత్తగంధి. అనావిద్ధ లలిత పదములు గలది చూర్ణము. పతద్విపరతము ఉత్కళికా

ప్రాయము ( " గద్యం — వృత్తగంధి, చూర్ణ ముత్కలికా ప్రాయంచ, పద్యభాగవత్ వృత్తగంధి. అనా విద్ధ లలిత పదం చూర్ణమ్; విపరీత ముత్కలికా ప్రాయంచ " — కావ్యాలంకార సూత్ర వృత్తి) ప్రాచీన కాలమున గద్య, వచన పదములు తాళలయానుగుణ్యమైన, పాడుటకనువుగ నున్న రచనలకే చెల్లు చుండెను. వెంకటేశ్వర వచనములు, బిరుదు గద్యలు, శతకోపవిన్నపములు — ఇట్టివి. ఈ రచనలు మాత్రాఛందము ననుసరించి ప్రవర్తించుచు, పాడుటకు తగి యుండెను. పాదనియ మము లేకుండుటయే వీనికి పద్యములకు గల భేదము !

సర్వ ఉద్రిక్త భావములు, భవ్యావేశములు లయ్యాన్వితమగు ఛందోబద్ధమైన భాషలో వెలువడుట సహజము. అది పద్యమా? గేయమా ? వచనమా ? అనునది కవి యొక్క ప్రతిభ, ప్రక టనా సామర్థ్యము, అలవాటు మొదలగు వానిపై ఆధారపడి యుండును. ఈ క్రింది ' శ్రీపాద ' వారి వాక్యములను పరిశీ లించండి.

" ' ఫిడేలు రాగమ్, ఫిడేలు రాగమ్ ' అన్నారు. ఏదో నడక స్ఫురించింది. ' ఫిడేలు రాగంబులు ' అని విరిచారు. ' వినూత్న పద్రేమికులు మహాకాముకులు ' అనగానే మళ్లీ నడక స్ఫురిం చింది. ' అన్యోన్యమగు దంపతులు గూడ ' అని మళ్లీ విరిచారు."

—— ' భారతి ' డిసెంబరు 1963. 6 పుట.

దీన ఆవేశముచే లేక ఆలోచనచే నేర్పడిన శబ్దస్వరూపమును పదసంఘటనచే సహజముగా స్ఫురించుచున్న నడకను, లయను ' అహంభావ కవులు ' నవ్యత కొరకు చెరచుచున్నారని తెలుచున్నది గదా ? పదముల కూర్పుచే సహజముగా నేర్పడుచున్న లయ, తాళములను చెరచుటకు కవుల మనుకొనువారే కావలెనా ? అందులకు ఎవడు తగడు ?

" కవిత్వము రసాత్మకమైనది. కనుక సరసభావము యే రూప మున నున్నను రసికుని భావోద్విగ్న మానసునొనరించియే తీరు ననుట " సరికాదు.

> అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
> రనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదిత రసమ్
> అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూప మనఘం
> నజానేభోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః॥
>
> — శాకుంతలము. 2 అం. 10 శ్లో.

ఈ సరస భావమునే వచనములో అనువదింతుము. " శకుంతల సౌందర్యము వాసన చూడబడని పూవు. గోటితో గిల్లబడని లేజిగురు. తొలువబడని రత్నం. రుచిచూడబడని క్రొత్త మధువు, పూర్వ పుణ్యముల సమగ్ర ఫలము వలె నున్నది. ఇట్టి రూపము ననుభవించుటకు బ్రహ్మ ఎవనిని కూర్చునో నేనెరుంగను" శ్లోక మందలి, వచన మందలి భావము యొకటేయైనను 'శబ్ద సంఘటనాశక్తి ' వలన శ్లోకము వలె వచనము పాఠకుల మనమ. నాకట్టుకొనజాలదనుటకు రసికుల హృదయముపై వానికి గల ప్రభావము హస్తి మశకాంతరమనుటకు సహృదయుల ఆనందాను భవమే ప్రమాణము !

హృదయము భావశబలితమై యుద్రిక్తమైనపుడు భావములు తమంతట తాము ఉచితమైన భాష వెదికి కొని తాళలయాన్వితముగ ప్రవహించును. కీచకుని పలుకులకు కోపించిన ద్రౌపది వాడు నీచుడు గావున జంకించిన గాని మెత్తబడి పోడని దలంచి ఇట్లనుచున్నది.

> శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
> ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యా పారగుల్ మత్పతుల్
> గీర్వాణాకృతులేవు రిప్పడు విను దోర్లీలన్ వెసంగిట్టిగం
> ధర్వుల్ మానము బ్రాణముం గొనుట తథ్యంబెమ్మెయిం
> గీచకా !
>
> —భారతము. విరాట. 2 ఆ. 55ప.

అందులకు ప్రత్యుత్తరము బలగర్వితుడైన కీచకుడు నిర్వికారముతో ఇట్లనుచున్నాడు.

> అనుడు నతడిట్టు లనియె నాయతుల బాహు
> బలము జెనయంగ భవదీయ పతుల కారు
> మూడు లోకంబులందు నెవ్వాడు లేమి
> నిక్కువం బింత నమ్మము నీరజాక్షి.
>
> —భారతము. విరాట—2 ఆ. 56

ఇట్లు భావతీవ్రత ననుసరించి రచన మారుచుండును. రసవ్యంజనకుచితమైన పద సంఘటనతో మహాకవులు భావ ప్రకటన గావింతురు.

వచన కావ్య కర్తలు రస సంచారమున్న చోట వచన మును శ్రుతి, లయ, తాళాది, ఛందో గుణములచే శక్తి వంత మొనర్చి యున్నారు. ఇందులకు బాణ, దండి, నన్నయ, చిన్న యల వచన కావ్యములుదాహరణములు. ప్రాచీన కవులు— నన్నయాదులు— రసస్ఫూర్తి లేనిచోట వచనము వంటి పద్యములనే రచించిరి. ఇట్లు రససంచారము ననుసరించి వచనమును, పద్యాలనుపయోగించుటయే గాక తిక్కనాది కవులు శ్రవ్యకావ్యములందలి రసవద్ఘట్టములను దృశ్య కావ్య గుణ సంపన్న మొనర్చిరి. విరాటోద్యోగ పర్వములు, మను చరిత్ర ద్వితీయాశ్వాసము ప్రభావతీ ప్రద్యుమ్నము లుదాహ రింప దగినవి. సమ్యక్ పరిశీలన వలన రసాత్మకమైన భావము

గల వచనము నైతము కవిత్వ మగుననుట ఔపచారికమే యగును! గద్య కావ్యముల కంటె పద్యకావ్యములు వానికంటె దృశ్య కావ్యములు శ్రేష్ఠమైనవి గదా! "కావ్యేషు నాటకం రమ్యమ్' అను ఆర్యోక్తి ప్రమాణికమైనదే!

*  *  *  *

'సద్యః పరనిర్వృతి' కావ్యము యొక్క పరమ ప్రయోజనము. ఈ కావ్యానందమును అనుభవించునది పాఠకుని హృదయము. అందులకు తోడ్పడునది శ్రవణము. కవిత్వము యొక్క సౌందర్యమును నిర్ధారణ జేసి, కావ్యానందమును గల్గించునది. కవిత్వము శ్రవ్యకళ కావున భావములు లయతాళ సమన్వితమై శ్రవణానంద సంధాయకము లైననే గాని, సహృదయుని అనుభవములకు ఉత్తేజకములై, హృదయముచే కావ్యానందమును ననుభవింప జేయలేవు. భావములు శ్రుతిరంజకత్వము గీతి మాధుర్యము గల్గి యుండుటవసరము. ఈ గుణము శ్రుతి లయ తాళముల గల్గి యుండుటచే జనించును. శ్రుతి, తాళ, లయ గుణములు ఛందో మూలములు. శబ్ద సంఘటన ఛందో మూలముననే శ్రుతి, లయ, తాళ బద్ధమగును. ఈ ఛందస్సు వలననే పద్య పఠన వేళ మధురమైన, హృదయా వర్జకమైన గీతి విశేషము, వచన పఠనము కంటె భిన్నమైనది వ్యక్త మగుచుండును. "There is no doubt that rhythmical words exert an enchanting influence on the mind. we restored to music even we fail to seize the sense:" అని సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల అభిప్రాయము.

కవిత్వమునకు వలయు సామగ్రి అంతయు గద్య పద్యములకు సమానమైనను, ఛందము పద్యమునకు విశేషము. అందువలన గద్య పద్యములకు గల భేదము ఛందో గుణముల ననుసరించి యుండును. అనుభవములకు ప్రరేపకములైన, వీనులకు విందొనర్చు స్వరములను ఛందము వెలయించును. కావున గద్యము, పద్యముతో అన్ని విధముల సరిపోవుచున్నను ఛందోలోపము వలన రూప, నాద సౌందర్యముల లేమి గలదగుచున్నది! వచన కవిత్వమునందు కేవల సాహిత్యము, పద్య కవిత్వమునందు సాహిత్యముతో బాటు సంగీత నాట్య గుణ సంపన్నత గలదు. "కావ్యమునకు శ్రుతి, లయ, తాళములవలన గలుగు నిశ్చితత్వము (certainity) శక్తిమత్వము (Force) నియతత్వము (Regularity) అను గుణత్రయము పద్యకావ్యములందు స్పష్టీకృతమై, హృదయ స్పందకవలైనట్లు వచన, కావ్యములలో కుదరదు"— ఎం. అర్నాల్డ్.

హృదయాను భావములకు ఉత్తేజకమైన, గీతి మాధుర్యము గల గద్యరచన పద్యరచన కంటె కష్టతర మగుటచే "గద్యం కవీనాం నికషం వదన్తి" అను నానుడి యేర్పడినది. కాదంబరి మొ. గు గద్య కావ్యములందు రసస్ఫూర్తి గల్గుచున్నది. సంస్కృత లాక్షిణికులు గద్య కావ్యములను గూడ పరిగ్రహించిరి. నన్నయ భట్టాది కవీంద్రులు శ్రుతి లయ, తాళ సమన్వితమైన వచనములో రసప్రచురమైన రచన చేసిరి! అతి విస్తృతమైన సంస్కృత సాహిత్యములో గద్య కావ్యము లెన్ని? గద్య కవులెందరు? ఒక హస్తమును దాటవు! దాటరు! బాణ, దండి ప్రభృతుల వచన కావ్యములకు, కాళిదాసాది మహా కవుల కావ్యములకుగల ప్రాచుర్యమే ఛందో బద్ధరచనా విశిష్టతకు ప్రమాణము.

"క్రాస్వర్డు పజిల్సు లాగున్న
నీ కన్నులను సాల్వు చేసే మహా భాగ్యం
ఏ మా నవునిదో కదా!
ఓ బోగం చానా! నీవు
సంఘానికి వేస్టు పేపరు బాస్కెట్టువా ?"

రసాత్మకమైన భావము కవిత్వము గదా! ఇందు అసూయ, శంక, మోహము, విషాదము, వితర్కము మొ.గు వ్యభిచారి భావములే గలవు. రసమేది? చిత్త విభ్రమము గలదేగాని ధ్వని యేది? "విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" (విభావములు, అనుభావములు, సాత్విక భావములు, వ్యభిచారి భావములు అనువాని సంయోగమున రస్యమాన మగు స్థాయి భావము రసము) అని భరతుని రస సూత్రము. ఇందు పాఠకులను 'ఆహా!' అనిపించే మాటల గమ్మత్తు గలదు. చెవి కింపగు లయా ఖండములు గలవు. శైలి మణి ప్రవాళము. భాష ఆంగ్లాంధ్ర సంకరమగుటచే పరిమితమైన పాఠకులు గల దగుచున్నది. 'టెక్నిక్' ప్రధానంగా గల ఈ సాము గరిడీల కవిత్వము ప్రాచీన బంధకవిత్వాదుల వలె Intellectual gymnastics కు ఉదాహరణము కాదగియున్నది.

వ్యక్తి యొక్క ప్రతి ప్రైవేటు ఉద్రేకము కవిత్వమనిపించు కొంటుందా? వాఙ్మయమును సృజించు వారనేకులుందురు. వారందరిని కవులను కొనుట ఆత్మవంచనయే యగును.

[illegible]

# శ్రీ బాలగంగాధర తిలక్

(అధి వ్యాధి పీడితుడైన రోజులలో కవి చెప్పిన పద్యాలివి. ఆమె కరుణా మధురమూర్తి. అతన్ని 'శశి' అని ఆమె పి
మానస ప్రియా' అన్నది ఆమెకు సంబోధన.)

అడుగిడలేను నిన్వడచి ఆప్తుల దీన విలోచనాలలో
సుడిగొను వేడి కోల్మరచి, సుందర తాలవమేని లేని యీ
ఉడుకుడుకెత్తు జీవితము నోర్చుటికెన్ని దినాలు, స్రుక్కి యీ
బడుగు శరీరమే మడియ పాల్పడునో శశిమానస ప్రియా !

జీవితమన్న మాయతెర చీకి నశింపక మున్నె శాశ్వత
శ్రీ విలసిల్లు చిత్రము రచింపగ బూనిన నా ప్రయత్నమి
ట్లీ విధి మొక్కపోవునటె తీయని భావనలెల్ల ధూళియై
పోవున, నా కనుంగవల పున్నమి వెన్నెల వెల్గులారునా.

దేవత లెవ్వరే మునుపు తీయని ప్రేముడి నా కనుంగవన్
రే వెలుగుల్ వెలార్ప మృదురీతుల నంగుళులొత్తినారొ ! ఏ
దేవుడు ఖండచంద్ర పరిదీపిత జూటుడు నన్మహోర్థమై
ప్రోవినవాడు నన్మరచి పోయెనో, రాడొకొ రక్షణార్థమై.

వీడొకనాడు స్వప్నముల వెంబడి పోయి దివౌక సాంగణ
క్రోడము కొల్లగొట్టి ఒక కొంచెము కొంచెముగా అశాంత శు
క్ప్రీడితులైన మానవుల కిచ్చెను సౌఖ్య రసామృతమ్మ నా
నాడొక యింత తాను రసనన్ చవి జూడడ ప్రత్యయాత్మడై.

గుండియ పోటుతో బ్రతుకు కోసలు వంకరలయ్యె వేదనల్
చెందిన కత్తులీ తనువు ఛిన్నమొనర్చెను మౌన బాష్పముల్
నిండిన సంద్రముల్ కనుల నిర్వొరపోయె నికేమి పల్కు నీ
కొంతొక షట్పదమ్మ మణి కోమల వీణయు పుంస్కికమ్మయున్.

ముహురాశా మృదువృంత నిర్గళిత మీ పుష్పమ్మునేలా పున
ర్వహ సామర్థ్యములైన మాధవ కథా వ్యామోహముల్ చూపి ని
స్పృహ చాపన్ దొరకొందురీ విధమున క్షీణోగ్ర మార్తాండ రుక్
దహనమ్ము చనెలెమ్ము లోని సుధలున్ కల్యాణ సౌరభ్యముల్.

నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు 4

# గోపీచంద్

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

'అసమర్థుని జీవయాత్ర' తర్వాత గోపీచంద్ దృష్టి సామాజిక మానవుడి నుంచి వ్యక్తిత్వమైన మానవుడిమీదికీ, ఆదర్శంనుంచి యదార్థ్యంమీదికీ మరలినందుకు తార్కాణ 'సెక్స్' పట్ల ఆయన ఏర్పరచుకున్న క్రొత్త వైఖరి. సీతారామరావు తనలోని మానవత్వపు లోతుల్ని స్పృశించిన 'పిచ్చి' లో అనుభవించిన మొదటి సహానుభూతి ఒక భోగవనిత కష్ట సుఖాలతో; తర్వాత శ్మశాన ఘట్టంలో చివరి క్షణాల్లోనూ ఒక పతిత జీవిత గాథను విని ఆమెలోని మానవత్వాన్ని గౌరవించటం ద్వారానే 'జీవితం జీవించటం కోసమే' అనే మహత్తర సత్యాన్ని ఆకళించుకుంటాడు. నవలలో ఇది యాదృచ్ఛికంగా ప్రవేశపెట్టబడిన విషయంకాదు. హేతువాదిగా సంఘ చాలకుడుగా కాల్పనిక కవుల మధుర సంవేదననూ, చలం కథల లైంగిక ప్రవృత్తి తీవ్రతనూ, సంఘ పురోగతికి పనికి రానివిగా త్రోసివుచ్చిన గోపీచంద్ వ్యక్తిలోని వ్యక్తిత్వానికీ, 'సెక్స్'కూగల గంభీరమైన ధార్మిక సంబంధాన్ని క్రమంగా అవగాహన చేసుకోవటం జరిగింది. వ్యక్తియైన మానవుణ్ణి అతని ద్వారా జీవిత పరమార్థాన్నీ అన్వేషిస్తూ గోపీచంద్ మెట్టిన ప్రథమపాదం— స్త్రీని అర్థం చేసుకోవటం.

ఈ విషయాన్ని నిరూపిస్తున్న నవలలు 'పిల్లతెమ్మెర', 'గడియపడని తలుపులు', 'మెరపుల మరకలు'. ఈ మూడు నవలలూ ఇంచుమించు ఒక కాలంలోనే, ఒక సమస్యనుగూర్చి మననం చేస్తూనే వ్రాయబడినవి. ఒక విషయాన్ని పూర్తిగా ఆలోచించి దానిలోని వైవిధ్యాన్ని సమన్వయించేస్తూ సమ్యక్ రూపం తీర్చిదిద్దే ప్రతిభ ఉత్తమమైంది. గోపీచంద్ ఒక ఊహ రాగానే దానికి వెంటనే రూపు కల్పించే ఉద్వేగ ప్రకృతి— ఆయన కథల్లో వ్యక్తమౌతున్న సత్యమే యిది— ఒక విషయాన్ని గూర్చిన భిన్నములైన ఊహల సంకీర్ణతను వివిధ లక్షణ సమన్వితమైన కావ్య స్వరూపంలో ఏకత్వంగా ప్రతిష్ఠించేందుకు కావలసిన ధారణ, ఓర్పు గోపీచంద్‌లో కనిపించదు. ఇది ఆయన ప్రతిభకు పరిధి. లేడికి లేచిందే పరుగు అన్నట్లు ఊహ రావటమే కథ లేక చిన్న నవల వ్రాయటం. ఫలితం: మూడు నవలల్లోని వస్తువు ఒకటే కావటం, ఒకే సమస్య ముగ్గురు కథా నాయికలుగా రూపొందటం జరిగింది. శమంతకమణి, కోటీశ్వరమ్మ, ఉషారాణి ఒకే స్త్రీ మూర్తి యొక్క మూడు ప్రతిబింబాలు అనటంలో సందేహంలేదు.

స్త్రీలోని స్త్రీత్వం 'సెక్స్' ఆకర్షణ; అంటే పురుషులమీద స్త్రీయొక్క ప్రభావం; ఇది స్త్రీలలో వ్యక్తిత్వ వికాసంయొక్క మూలసత్యం. స్త్రీ వ్యక్తిత్వ వికాసాన్ని గూర్చి సంఘంలో ఎన్నో అభిప్రాయాలున్నాయి. కాని ఆ అభిప్రాయాలన్నింటినీ అధిగమించిన మూల సత్యం స్త్రీత్వం. (వ్యక్తి వికాసం అనే భావమే అధునాతనమైంది) "ఒక స్త్రీ ఇంట్లోనుంచి బయటకు అడుగుపెట్టి, దానివల్ల వచ్చే కష్టాలను ఎదుర్కొని సాంఘిక జీవితంలో ప్రవేశించాలనుకోవటం ఉన్నత భావం. అటువంటి స్త్రీకి ఆసరాగా నిలవాలనుకోవటం అంతకన్న ఉన్నతమైన భావం....." శమంతకమణి అనాథ బాలిక. రామనాథం ఆమెను ఉద్ధరించటానికి వివాహం చేసుకొంటాడు. అంతేకదు, ఆమె మనఃప్రవృత్తిని అర్థం చేసుకొని తనకు తోచినట్లు ఆమె వ్యక్తిత్వ వికాసానికి దోహదం చెయ్యటానికి ప్రయత్నిస్తాడు. "శమంతకమణి దృష్టి భగవంతుని పరం చెయ్యటానికి ప్రయత్నిస్తాడు. ఇంతలో శచీంద్రుడు అనే ఆదర్శవాది, సంఘ సంస్కర్త ఆమెలోని నృత్య నాట్య కళా కౌశలాన్ని ప్రోది చెయ్యటమే ఆమెలో వ్యక్తి వికాసానికి మార్గమని ఆమెను ఒక స్నేహితుడు నడుపుతున్న డ్రామా క్లబ్బులో చేర్పిస్తాడు. శమంతకమణి వ్యక్తిత్వానికి రామనాథం చూపిన భగవద్భక్తి, శచీంద్రుడు చూపిన కళాసేవా రెండూ

వచ్చినట్లే కనిపిస్తాయి; కాని చివరకు తేలిన సత్యం రామనాథం, శచీంద్రుడు యిద్దరూ ఆమె స్త్రీత్వానికి (సెక్స్ ఆకర్షణకు) లోబడటమే! డ్యాన్సు మాష్టరు దగ్గర డ్యాన్సు నేర్చుకోవటంలో వ్యక్తమైన శమంతకమణి శ్రద్ధాసక్తులు కూడా ఆ డ్యాన్సు మాష్టరుని తన ప్రభావంలోకి లాక్కోవాలనే ఆమె స్త్రీత్వమే తప్ప వేరు కాదు! వివాహ వ్యవస్థ నతిక్రమించి కళాసేవ నెపంతో పట్టణం చేరుకున్న శమంతకమణి స్వేచ్ఛా ప్రవర్తన కూడా ఆ స్త్రీత్వ విన్యాసమే! ఈ స్త్రీత్వము రామనాథం, శచీంద్రుడు వంటి వారి అభిప్రాయాలకు ఆదర్శాలకు అతీతమైనది; డ్యాన్సు మాష్టర్ ఆమె శ్రేయస్సును గూర్చి పడే భయాన్ని ఆదుర్దాని లెక్కచెయ్యనిది! ఈ స్త్రీత్వము 'పిల్ల తెమ్మెర' లాంటిది. "ఆమె .... బ్రతికి నన్నాళ్లూ పిల్లతెమ్మెరలాగు బ్రతుకుతుంది. అది తప్పో ఒప్పో ఆమెకు తెలియదు. ఆమె స్వభావం అది..." ఈ స్త్రీత్వము లైంగిక ప్రవృత్తితో తాదాత్మ్యము చెందినట్లు కనిపించినా, కాముకత్వం కాదు. కాముకత్వంలో లేని అమాయకత్వం, హోరము, మంచితనం ఇందులో భాసిస్తూ, కేవలం లైంగిక ప్రవృత్తి అనటానికి వీల్లేని అనిర్వచనీయమైన అతీతమైన వ్యక్తి ధర్మంగా యిది కనిపిస్తుంది. స్త్రీ జీవిత గమ్యం వ్యక్తి వికాసమేనని వాదించే శచీంద్రుని వంటి సాంఘిక, ఆదర్శ వాదులు స్త్రీత్వం గూర్చిన తమ సొంత అభిప్రాయాలు విచ్ఛిన్నమై స్త్రీత్వంయొక్క మూలసత్యాన్ని దర్శించినప్పుడు దానికి లోబడినప్పుడు ఆ అనుభవాన్ని అంగీకరించి భరించగలరా? వాళ్లు ఎలా ప్రవర్తిస్తారు?

"ప్రపంచంలోని విచిత్ర వస్తువులలో కెల్లా విచిత్రమైన వస్తువు ఈ మనిషి అనే వ్యక్తి. ఈ వ్యక్తి ఎప్పటికప్పుడు తనే రైటని తప్పు యితరులదేనని కారణాలను పోగు చేసుకోగలడు. ఒక్క కారణాలను పోగుజేసుకోవటమే కాదు; బహు చక్కగా తన్ను తాను మోసం చేసుకోగలడు. శచీంద్రుని వరుసలో కూడా ఇందుకు భిన్నమైంది ఏమీలేదు. శచీంద్రుడు చాలమంది మనుష్యులకంటె తెలివైనవాడు. వివేకవంతుడు. ఒకరకంగా మంచివాడు కూడాను. అతనే మామూలు ఆలోచనలు అల్లే వలయం నుంచి తప్పించుకోలేకపోతే ఇక ఇతరుల మాట చెప్పుకొని ఏం ప్రయోజనం? అతను పెండ్లి అయిన శమంతకమణిని భర్త అనుమతి లేకుండా మద్రాసు తీసుకు వచ్చాడు. ప్రమాదవశాత్తే అవుగాక, ఆమెతో కాపురం చేశాడు. అప్పుడు భర్త పడే బాధ అతనికి గమనంలో లేదు. ఇప్పుడు ఆమె ఇతరులతో చనువుగా ఉంటూ ఉందని క్షోభిస్తున్నాడు. తనతో చనువుగా ఉన్నప్పుడూ ఇతరులతో ఉండటమే గదా. ఇప్పుడు తను పడుతున్నంత బాధా ఒకప్పుడు ఆమె భర్త పడిఉండాలిగదా! భర్త అదుపులోనుంచి తీసుకు వచ్చిన తనకు, తన అదుపులో ఆమె ఉండాలనే భావం ఎందుకు కలగాలో! ఆ అధికారం తనకు ఎవ్వరిచ్చారో! ఇవన్నీ ఆలోచనకే రావు. ఇప్పటికీ తనే రైటని ఆమె తప్పని అతని విశ్వాసం...." శచీంద్రుడు శమంతకమణిని హత్య చేస్తాడు!

పై నుల్లేఖించిన భాగంలోని శచీంద్రుని గూర్చిన విమర్శ అతి నిశితమైనది. సాంఘికవాదులు, హేతువాదులు, ఇంత దూరం వెళ్లనే వెళ్లరు; వాళ్ల విమర్శ ఎప్పుడూ పర పరామర్శే తప్ప ఆత్మవిమర్శగా రూపొందదు. కాని విమర్శ ఇంత దూరం వెళ్లితే తప్ప అహం, స్వార్థం అనే కళ్ల గంతలు మనిషికి విడిపోవు. అవి విడితేగాని స్త్రీ జనాభ్యుదయాన్ని గూర్చి స్త్రీ వ్యక్తిత్వ వికాసాన్ని గూర్చి సత్యం బోధపడదు. స్త్రీత్వం ఒక సమ్మోహనశక్తి; దాన్ని అర్థంచేసుకునేందుకు మనిషి దానికి లొంగకుండానైనా ఉండాలి, లేక తన స్వార్థమైనా త్యజించాలి.

శమంతకమణి ఆకర్షణకు లొంగని వ్యక్తి డ్యాన్సు మాష్టరు. కారణం: అతనికి "స్త్రీలో గానీ, పురుషునిలో గానీ విచిత్రమైన ప్రవృత్తి కనుపించితే, ఆ భావంమీదా ఆ ప్రవృత్తిమీదా కలిగిన మమకారం, వాటికి స్థావరమైన వ్యక్తులను ఆశ్రయిస్తుంది; ఆ వ్యక్తుల భౌతిక సౌందర్యంతో గానీ, మిగిలిన గుణగణాలతోగానీ నిమిత్తం ఉండదు." అందుకే అతనికి మృణాళిని, హైందవ సంప్రదాయం మూర్తీభవించిన మృణాళినిమీద ప్రేమ. డ్యాన్సు మాష్టరు శమంతకమణి వ్యక్తిత్వ ప్రభావానికి అతీతుడు కావటంవల్లే అతను ఆమెలోని స్త్రీత్వ జిగీషకు అందని ఆదర్శంగా, చివరకు ఆమె ఆరాధనకు పాత్రుడౌతాడు! ఆ ఆరాధన స్వరూపం— ఆమె తన బిడ్డలో అతని పోలికలు చూడటం! ఇది మాతృత్వానికి ఎంత చక్కని వ్యాఖ్యానం!! గోపీచంద్ అభినందనీయుడు!

"పిల్ల తెమ్మెర" నవలలో శమంతకమణి 'స్త్రీత్వా' నికి — అంటే సాంఘిక నిర్వచనాలకు అతీతమైన వ్యక్తి మానవత్వానికే— ప్రతీక. డ్యాన్సు మాష్టరు సహృదయుడు, కరుణాశీలి, మనస్వి అయిన సంప్రదాయజ్ఞుడు. రామనాథం ప్రేమికుడు, ఆస్తికుడు. శచీంద్రుడు సంఘ సంస్కర్త, ఆదర్శవాదీ అయిన ఆధునికుడు. మానవత్వానికి సంప్రదాయమూ ఆస్తికతా కలుగజేస్తున్న విపత్తుకంటె సాంఘిక వాదివల్ల కలిగే విపత్తే అధికతరమేమో అన్న ధ్వని! గోపీచంద్ యీ నవలలో డ్యాన్సు మాష్టరుగాను అతని ప్రాత స్నేహితు

ఢ్మైన సాంఘికవాదిగాను దర్శన మిస్తాడు. సాంఘికవాది చేసిన స్త్రీ హత్యకు అతనికి ఆజన్మ కారాగారవాసము శిక్ష పడుతుంది. గోపీచంద్ తనలోని 'ప్రాత స్నేహితుని' కిచ్చిన చివరి వీడ్కోలు యిది! అంతేకాదు; ఈ నవలలో సంప్రదాయాన్నీ (మృణాళిని) వ్యక్తివికాసాన్నీ (శమంతకమణిని) ఏది ? ఏది ? అనే సందిగ్ధంలో ఉండి పోయాడు రచయిత.

సంప్రదాయబద్ధమైన జీవితాన్నీ, భర్తనూ వదలి వ్యక్తి వికాసం ఆకాంక్షిస్తూ పట్టణం చేరిన ఆధునిక యువతి కోటేశ్వరమ్మ 'గడియపడని తలుపులు' నవలలో కథానాయిక. స్త్రీత్వం 'సెక్స్ ఆకర్షణ; అది లోకాన్ని జయిస్తుంది; వ్యవహారాలు నడుపుతుంది; విజయపరంపర సాధిస్తుంది; కాని తర్వాత ఏమిటి ? "ఆమె డ్రెస్ చేసుకోవడం చాలా బాగా డ్రెస్ చేసుకుంది. అందులో సందేహంలేదు. అక్కడికి వచ్చినవారి చూపులన్నీ ఆమెమీదే ఉండేటంత అందంగా ఉంది. అందులో సందేహంలేదు. ఆమె అవయవాలన్నీ తీర్చి దిద్దినట్లుగా ఉండి పోతపోసిన విగ్రహంలాగుంది. అందులో సందేహంలేదు. ఆ దరహాసం నాతో విరిలో నూట్లాడుతూనే ఉంది. నవ్వింది నవ్వినట్లే ఉంది. కాని ఆమె చూపుల్లో విపరీతమైన దైన్యం గోచరించింది నాకు ..... ఆమె కళ్లు దూరంగా ఉన్న ఎవ్వరినో వెదుకుతున్నట్లు ఉన్నాయి ..... అవి వెదుకుతున్నాయి. అంతే, ఎవ్వరినీ కాదు. "శమంతకమణి ముగ్ధ; ఆమె లోకాన్ని జయించలేకపోయింది. కోటేశ్వరమ్మ ప్రౌఢ, ఆమె లోకాన్ని జయించింది. శమంతకమణిలో వ్యక్తి వికాసం సాంఘిక పరిస్థితులవల్ల పరిణతి చెందకుండా అంతం అయింది; కాని, కోటేశ్వరమ్మలో విజయవంతమైన ఆ పరిణామం ద్వారా ఆమెకు మిగిలినది ఏమిటి ? దైన్యం, అన్వేషణా మాత్రమే ! ఆ పరిస్థితిలో ఆమెకు శ్రీనివాసరావు తారసిల్లుతాడు. అతను "పసిపిల్లవానికి మల్లే ఉండి పసిపాప నవ్వంత నిర్మలంగా ఉండి కొంతమందిని యిట్టే 'ఆకర్షిస్తాడు." అతనిలోని అనాయకత్వం, నైర్మల్యం ఆమె ప్రేమిస్తుంది. కాని ఆ ప్రేమకూడా లైంగిక ప్రవృత్తిద్వారావే వ్యక్తమౌతుంది. లైంగిక ప్రవృత్తితో విసిగి వేసారిన కోటేశ్వరమ్మ ఆ రెండింటిని విడదీయటానికి ప్రయత్నిస్తుంది. ఆ ప్రయత్నానికి మార్గం, సాధన ఏమిటో బ్రహ్మానందస్వాములవారి సాన్నిధ్యంలో ఆమెకు గోచరిస్తుంది. "స్వాముల వారి చూపుల్లో ఉన్న కాంతికి నేను మోహపడ్డాను. వారు ఆ చూపులను నామైకి ప్రసరించినప్పుడల్లా మధురస్రవంతిలో ముంచెత్తుతున్నట్లు అనిపించింది. నా మనస్సుకే యిన్నాళ్ళూ ఎక్కడా దొరకని శాంతి వారిముందు లభ్యమైనట్లు అనిపించింది.' ఇలా ధ్యేయం గోచరించినా కోటేశ్వరమ్మ ఆ సాధనలో నిలువలేక పోతుంది. అందువల్ల శేష జీవితం సంప్రదాయాన్ని మననం చేసుకోవటంలో, వైరాగ్యాన్ని అవలంబించటంలో, స్నేహంలోని పవిత్రతను భావించటంలో గడిపి కన్నుమూస్తుంది. "తన బాధ్యతలను ఇతరులకు వదలి నిర్విచారంగా ఉండగలిగిన అనాయకత్వం ఆమెలో ఉంది..... జీవితంలో ఎన్నో అనుభవాల ఛాయలు ఆమెమీద పడినా ఈ అనాయకత్వం కాస్త కూడా చెదరకపోవటం నాకు ఆశ్చర్యం కలిగించింది" అంటాడు కథకుడు.

ఈ నవలలో గోపీచంద్ కోటేశ్వరమ్మ శ్రీనివాసరావులో, యిద్దరిలోనూ ప్రత్యక్షమౌతాడు. బ్రహ్మానంద స్వాములవారి దగ్గర కోటేశ్వరమ్మకు కలిగిన అనుభూతి గోపీచంద్ అరవిందుల ఎదుట పొందినదే. అయితే ఆ ధ్యేయములో యింకా ప్రగాఢమైన విశ్వాసం, ఏకాగ్రత కలగలేదనటానికి సూచనలూ కారణాలూ నవలలోనే ఉన్నాయి. "ఏవో సిద్ధాంతాలూ సమస్యలు అనుకొని వెంటపడతాం కాని, ఈ చిన్న చిన్న విషయాలలో వున్న ఆనందం (ఉదా॥ మంచి కాఫీ త్రాగటంలో) యింకెందులోనూ ఉండదు. వీటిని ఒదులుకొని వాటి వెంట పడటం ఎదురుగా కనబడే మంచినీటికొలను ఒదులుకొని మృగతృష్ణ వెంటపడటం వంటిదే" .... అంతేకాదు. శ్రీనివాసరావు గార్హస్త్యపు బాధ్యతలను వదలిపెట్టి ఆధ్యాత్మిక సాధనకోసం సన్యాసం స్వీకరిస్తే అతని భార్యాపిల్లల శ్రేయస్సు మాటేమిటి ? నాలుగైదు సంవత్సరాల ఆధ్యాత్మిక చింతన తర్వాతగాని, ముందు వెనుకలు ఆలోచించిగాని అందులో దిగకూడదని గోపీచంద్ మరొక అభిప్రాయం.. పోతే, వ్యక్తిత్వ వికాసానికి గమ్యం నిర్మలమూ నిస్వార్థమూ అయిన స్నేహం కాకూడదా ? జీవితంలో అన్నింటికన్న ముఖ్యమైన సాధన 'ఎన్ని అనుభవాల ఛాయలు మీదపడినా అనాయకత్వం చెక్కుచెదరకుండా నిలుపుకోవటం' కాకూడదా ? అన్న ఊహ కూడా ఆధ్యాత్మిక సాధనకు ప్రత్యామ్నాయంగా యీ నవల ద్వారా వ్యక్తమౌతున్నది. అది అప్పటి గోపీచంద్ మనస్థితి.

సంప్రదాయ నిబద్ధమైన జీవితం, వ్యక్తి వికాసానికి వలసిన స్వేచ్ఛ ఈ రెండింటి మధ్యా సమన్వయం కుదుర్చుకోలేక సాగుతున్న గోపీచంద్ ఆలోచనధార వ్యక్తం చేస్తోంది "గడియపడని తలుపులు" నవల. సంప్రదాయం అవరోధమన్న అభిప్రాయంతో దాన్ని కాదని వ్యక్తి వికాసాన్నీ స్వేచ్ఛనూ కోరుకున్న ఆధునిక యువతి దుర్భరమైన ఏకాంతంలో

ద్వైస్యంలో సతమతమైన వ్యక్తి సంప్రదాయంపైన మొగ్గ టాన్ని చిత్రించినప్పటికీ రచయిత ఆగమ్యం ఎటువంటిదో స్పష్టంగా సూచించలేకపోవటం, సంప్రదాయానికీ వ్యక్తి వికాసానికి సమన్వయం సాధ్యమా కాదో తేల్చుకోలేక పోవటం, యిది ప్రయోగాత్మకమైన రచన అని నిరూపిస్తున్నది.

ఇలా 'పిల్ల తెమ్మెర', 'గడియపడని తలుపులు' రెండూ ప్రయోగాత్మకమైన రచనలే అయినా మొదటి నవలలో ఉన్న పరిపూర్ణత, ధ్వనీ రెండవదానిలో వ్యంగ్యం. గోపీచంద్ తలపు లకు గడియపడకపోవటాన్నే రెండు నవలలూ ముఖ్యంగా వ్యక్తం చేస్తున్నవి.

'మెరుపుల మరకలు' నవలలోని విశిష్టత ఉషారాణి పాత్ర చిత్రణలో గోపీచంద్ చూపిన శ్రద్ధ, నేర్పు. శమంతక మణి, కోటీశ్వరమ్మ రేఖాచిత్రాలైతే ఉషారాణి తైలవర్ణ చిత్రం. శమంతకమణికీ ఉషారాణికీ భేదంలేదు పరిస్థితుల్లో అదృష్టంలో తప్ప. శమంతకమణి అనాథబాలిక, ఆమె శచీం ద్రుని చేతిలో పడటం ఆమె దురదృష్టం. ఉషారాణి రామా నుజం భార్య కావటం, చక్రవర్తి శ్రీ కాంత్, కమలాకరం వంటి వారితో స్నేహం చెయ్యటం ఆమె అదృష్టం. ఉషారాణి చదువుకున్న అధునాతన యువతి కావటంతో ఆమె వ్యక్తి త్వంలో జాగరణం, శమంతకమణిలో కనిపించనట్టిది, విశే షంగా కనిపిస్తుంది. పోతే, యిద్దరిలోనూ వారి లైంగిక ప్రవృత్తినీ స్వేచ్ఛా ప్రవృత్తినీ కాముకత్వం స్థాయికి దిగజార కుండా రక్షించే గుణాలు హార్దము, స్నేహము, సత్యాన్వేషణ, పసిపిల్లల అమాయకత్వం దీపించే నవ్వు. ఉషారాణి వ్యక్తిత్వం మనస్వియైన చక్రవర్తిమీద చూపిన ప్రభావం యిలా ఉంది : ''నేను నిన్ను మామూలు స్త్రీని ప్రేమించినట్లు ప్రేమించటం లేదు. స్త్రీలలో ఉండే అందాల నన్నిటినీ, సుగుణాల నన్నిటినీ నీలో చూస్తున్నాను. నీవు నాకు ప్రియురాలివికాదు. ఆరాధ్య దేవతవు. నిన్ను చూసిన తర్వాత ఈ ప్రపంచంలో మరి దేనినీ నాకు చూడ బుద్ధి అవటం లేదు. నీపట్ల నాకున్న ప్రేమను అతి పవిత్రమైన దానినిగా భావిస్తున్నాను....'' అంటాడు చక్రవర్తి. ఈ భావనకు అస్తిత్వం ఎక్కడ ? కేవలం చక్ర వర్తి మనస్సులో; ఏమంటే దాని విశిష్టతను అతను నిరూ పించలేడు ! అతని మాటలు విని ఉషారాణి అంటుంది : ''బాగానే ఉంది చక్రీ, కాని శ్రీకాంత్ కూడా నన్ను నీకు మల్లేనే ప్రేమిస్తున్నాడని ఎందుకనుకోవు ?'' ''అసంభవం'' అన్నాడు చక్రవర్తి .... ''ఎందుకనీ ? .... నువ్వు ప్రవర్తించి నట్లే అతనూ ప్రవర్తిస్తాడు. ఇప్పుడు నువ్వు వెలిబుచ్చిన అభిప్రాయాలే అతనూ వెలిబుచ్చుతాడు'' అంటుందామె. ''అభిప్రాయాలు వెలిబుచ్చటానికేం, ఎన్నయినా వెలిబుచ్చ వచ్చు.'' ''మరింకేమిటంటావు ?'' ఈ ప్రశ్నకు ఎలా సమా ధానం చెప్పాలో చక్రవర్తికి బోధపడలేదు. ''నన్ను అడగటం ఎందుకు ? నీ మనసుకి తెలియదా, మా యిద్దరికీ ఉన్న తార తమ్యం ?'' అన్నాడు. ''నాకు తెలియటంలేదు'' అన్నది ఉషా రాణి. చక్రవర్తి తలమీద పిడుగు పడినట్లయింది .... ఈ సన్ని వేశంలో ద్యోతకమౌతున్న ముఖ్య విషయం : చక్రవర్తి భావ నకు బాహ్యప్రపంచంలో, సంఘంలో అస్తిత్వం లేదు. అంటే కేవలం బహిరుపాధుల ద్వారా నిరూపించబడి నిర్ణయించబడే సత్యం స్థూలంగానే ఉంటుందనీ, బహిరుపాధుల కందని వైవిధ్యం దానిలో ఒక్కొక్క వ్యక్తి మనస్సునుబట్టి ఎంతో మేర ఉంటూ ఆ సూక్ష్మ్యం గ్రహించేదీ, దానికి సాక్షి వ్యక్తి ఆంతర్యం మాత్రమేననీ తెలుస్తోంది. హేతువాదులు ఈ ఆంత రంగికమైన సత్యాన్ని, దాని విశిష్టతను అంగీకరించరు. కాని మానవునిలో వ్యక్తిత్వానికి మూలమైన సత్యం అదే. నీ దాన్ని గుర్తించి గౌరవించి అంగీకరించేదాకా మానవుని సమస్యలక్కు పరిష్కారమార్గం లేదనీ గోపీచంద్ యిక్కడ సూచించారు. గోపీచంద్ చేసిన హేతువాద నిరాసము యిలా నిశితంగా సూక్ష్మంగా ప్రారంభమై చివరకు కథానాయిక పాత్రలో ఆమె వ్యక్తిత్వ విశిష్టత ద్వారా ప్రకాశం కావటమే ఈ నవల గొప్పదనం.

హేతువాదులే కాదు, సంప్రదాయానువర్తులైన ఆధ్యా త్మికవాదులు కూడా కొన్ని ప్రసిద్ధ సిద్ధాంతాలనూ, నైతిక సూత్రాలనూ తప్ప వాటికి భిన్నమైన, వైవిధ్యం కలిగిన ఆంతరంగిక అనుభూతుల సత్యాన్ని, విశిష్టతను అంగీక రించరు. ''ఒక సందర్భంలో నిజమైన ప్రేమ ఒకసారి వస్తుం దనీ, ఒకే ఒకరిమీద ఉంటుందనీ నేను ఒప్పుకోను అన్నది ఉషారాణి. అందుకు ఆమెను దూషించాడు. కాని తనకూ అప్పుడప్పుడూ అలాగే అనిపిస్తూ ఉంటుంది. ఈ సిద్ధాంతం సంఘాన్ని ముందుకు నడవకుండా కట్టి పడవెయ్యాలను కున్నవారు సృష్టించారని తనకూ అప్పుడప్పుడూ అనిపిస్తూ ఉంటుంది కాని తనకు యిబ్బంది కలిగినప్పుడు ఆ సిద్ధాంతం చాటున దాక్కున్నాడు.'' నిజమైన ప్రేమ యిలాంటిది అని సిద్ధాంతం చెయ్యటంలోనే దాన్ని సర్వజనీనమూ, సామాజి కమూ చేసి దానికి భిన్నమైన వ్యక్తిగతమైన అనుభూతులను నికృష్టమైనవిగా త్రోసిపుచ్చటంలో ఎంతో మేర మానవ సత్యాన్ని, వాస్తవిక జీవితాన్నీ నిరాకరించటం జరుగుతోంది. ఈ ధోరణి సంఘ క్షేమం దృష్ట్యా ఎలా ఉన్నా వ్యక్తి వికాసం దృష్ట్యానూ, సాహిత్యంలోనూ అభిలషణీయం కాదు. ''అది

జుగుప్స అనుకోండి, ఏమన్నా అనుకోండి. అది మనం అనుభవించే జీవితం. ఈనాటి రచయితలు వాస్తవిక జీవితాన్ని కప్పివేస్తున్నారు. వారివల్ల సాహిత్యం వాస్తవిక జీవితాన్ని కప్పివేసే ముసుగుగా ఉపయోగపడుతూ ఉంది. దీనివల్ల మానవునికి కృత్రిమదృష్టి ఏర్పడటం, జీవితంపట్ల అనేక దురభిప్రాయాలు కలగటం జరుగుతుంది. ఈ కృత్రిమ దృష్టికీ, దురభిప్రాయాలకూ అనుకూలంగా జీవితానికి అర్థం చెప్పుకుంటూ ఉంటాం. అందువల్ల సత్యం మనకు ఎప్పుడూ దూరంగానే ఉంటుంది. ఎప్పుడయితే మనం ఒక సిద్ధాంతాన్ని అల్లడానికి ప్రయత్నిస్తామో అప్పుడు జీవితాన్నుంచి వైదొలగుతున్నాం అన్నమాట. ఈ జీవితంలో అస్తిత్వం తప్ప ఏదీ నిజం కాదు. ఆ అస్తిత్వం, మన అనుభవంలోకి వచ్చేవి మాత్రమే నిజం. వాటిని ఏదో ఒకవంకతో త్రోసిపుచ్చటం జీవితాన్నుంచి పారిపోవటమే అవుతుంది. మనం జీవితాన్ని ముఖాముఖిని చూడాలి. చూచినదాన్ని చదువరులకు చెప్పాలి. ఇదే సాహిత్యం'' అంటూ జీన్‌పాల్‌సాత్రే మాటలుగా గోపీచంద్ ఈ నవలలో గ్రంథస్థంచేసిన వాక్యాలు గమనించదగ్గవి. ఈ అస్తిత్వవాద ( Existentialism ) దృక్పథం ఆధారంగా గోపీచంద్ తన మనస్సుని విశాలపరచుకొని, మానవతావాదం ( Humanism ) నుంచి కూడా తాత్త్వికంగా పురోగమించాడు. ఈ నవలలో గోపీచంద్‌కు ప్రతినిధి చక్రవర్తి పాత్ర.

పై నుదాహరించిన దృక్పథం రీత్యా చూస్తే శమంతకమణి, కోటేశ్వరమ్మ, ఉషారాణి పాత్రలలోని వ్యక్తిత్వ వైశిష్ట్య మెటువంటిదో బోధపడుతుంది. వ్యవస్థ ఆమోదిస్తున్న నైతిక సూత్రాల దృష్ట్యా వీరికీ సాధారణంగా మనం గర్హించే 'వ్యభిచారిణులకూ' భేదమేమీ లేదు. లైంగిక ప్రవర్తనలో ( Sexual Behaviour ) స్వేచ్ఛ అన్న దొక కొండగుర్తు; చాల స్థూలమైన బహిరుపాధి. ఈ బహిరుపాధికి అంతుచిక్కని వైవిధ్యం వ్యక్తిగతమైన అనుభూతుల్లో ఎంతో ఉంటుంది; అంతే దానికి విలువ కట్టేది ఆ వ్యక్తి అంతరంగం మాత్రమే; తరతమభేదాల్ని ఉచ్చ నీచ అంతస్థుల్ని, ఉత్కృష్టము పతితము అనే నిర్ణయాల్ని అంతరంగంలో వ్యక్తి తనకు తను మాత్రమే చేసుకోగలడు. లేకపోతే సహానుభూతి, భావనాశక్తి ద్వారా తత్త్వదర్శి లేక సాహిత్యకారుడు దాన్ని అంచనా వేయగలడు. ఇక్కడ ముఖ్యమైనవి సహానుభూతి, భావనాశక్తి వాటికి ప్రాతిపదికయైనది క్షమాగుణము; అంటే సిద్ధాంతాలూ సూత్రాలూ కట్టి పడవెయ్యని మనస్సు! మనస్సుకు కట్టివేసిన బంధాన్ని విప్పుకోవడం ఎవరికి వారే చేసుకోవాలి; తోటి మానవులమీద ప్రేమ పెరగటానికి అదే మార్గం! (అంతరంగిక సత్యాన్ని కాదనే హేతువాద ధోరణి మానవుణ్ణి మానవుణ్ణి వేరుచేస్తుం దంటారు గోపీచంద్.) అందుకే నవలలో ఉషారాణిని క్షమించగలిగి, తనలో ఆమె వ్యక్తిత్వం కలిగించిన ఉదాత్తభావనను చెరిగిపోకుండా నిలుపుకోగలిగిన చక్రవర్తికి ఒక క్రొత్త అనుభూతి లభిస్తుంది.—"ఆమె పట్ల ఇదివరకున్న వ్యామోహం యిప్పుడతనికి లేదు. అతని హృదయంలో స్వార్థచింతన లేదు. నిర్మలాకాశం, గంభీర సముద్రం, ఒరపి వెన్నెల ఆకర్షించినట్లే ఆకర్షిస్తున్న దామె. అటువంటి ఆకర్షణలో ఉన్న ఆనందం అతని కొక నూతన అనుభూతి... శరీరం నిర్మించిన అవధులు కరిగిపోయినయ్. ఆవేశాలు మరిగిపోయినయ్. కోర్కెలు నశించినయ్. ఉషారాణి తనలోనే ఉన్నట్లనిపించిందతని కా క్షణం ....'' చక్రవర్తికంటె దిగువమెట్టులో ఉన్న వ్యక్తి శ్రీకాంత్. చక్రవర్తిని ఎదుర్కొన్న పరిస్థితులే, ఉషారాణిని గూర్చిన స్వప్నభంగం వంటిదే అతనికి కలిగింది. కాని, అతని ప్రవర్తన, అతను పొందిన అనుభూతి ఏ స్థాయిలో ఉన్నాయి ? పోతే, చంద్రవదనుల 'అణగిన శృంగారం' తాలూకు ఉపాఖ్యానం అతని వ్యక్తిత్వం ఎంత మరీ దిగువమెట్టులో ఉందో తెలుపుతుంది ! బహిరుపాధులను, నైతిక సూత్రాలను మాత్రమే ఆశ్రయిస్తే చంద్రవదనుల కెన్ని ఎక్కువ మార్కులు వేస్తే చక్రవర్తికి అన్ని తక్కువ మార్కులు వెయ్యాలి. కాని, వ్యక్తిగతమైన అనుభూతినిబట్టి ఆంతరంగికమైన సత్యాన్నిబట్టి వాళ్ల విలువలు నిర్ణయిస్తే చక్రవర్తి ఎంత ఉత్తముడో చంద్రవదనులు అంత అధములు ! అస్తిత్వవాదం సాహిత్యంలో ప్రతిపాదిస్తున్న క్రొత్త దృష్టి యిదే !

ఉషారాణి వ్యక్తిత్వంలోని వైశిష్ట్యాన్ని ఉత్తమ సాహిత్య శిల్పంతో అనుభూతం చేసి, గోపీచంద్ ఆ వైశిష్ట్యాన్ని గూర్చి యింకా ప్రశ్నలు వెయ్యటం మానలేదు. ఉషారాణి బాల్యాన్నిగూర్చి, ఆమెకు వచ్చిన కలల్ని గూర్చి ప్రస్తావించటంలో అతని ఉద్దేశ్య మదే. చివరకు కమలాకరాన్ని ప్రవేశపెట్టి, అతని ద్వారా మనస్తత్వ పరిశోధకుల పేర్లు వల్లె వేయించి—"అలా చెప్పుకుపోయాడు కమలాకరం. ఎన్నో వివరాలిచ్చాడు. ఎన్నో నిదర్శనాలను చూపాడు. శరీరంలో ఉన్న మూల యంత్రాలను ఎన్నిటినో వర్ణించాడు. మర్మావయవాల విషయం కూడా కొంతవరకు చెప్పాడు...'' అంటూ చివరకు 'లోపల జరుగుతున్న హార్మోన్ల చలనమే దానికి (లైంగిక ప్రవృత్తికి) కారణ'మని తేల్చాడు అంటూ 'ఎన్నో ఎన్నో' అనటంలోనే రచనలోని బలహీనత బయటపడుతోంది. శారీరక విజ్ఞానాన్ని, మనస్తత్వశాస్త్ర పరిశోధనల్ని, సాంఘికశాస్త్రాన్ని

( Socialogy ) కలగాపులగం చేసిన కమలాకరం విసరణ గ్రంథంలో అసంతృప్తికరమైన రచన. అందులో 'జంగ్' (యూంగ్— Jung) పేరు బొత్తిగా అప్రస్తుతం. గోపీచంద్ యీ నవలలో ప్రవేశపెట్టిన కలలు కూడా సినిమా కలల్లాగా ఉన్నాయి కాని, మనస్తత్వాన్ని వివరించేందుకు ఉపయోగపడేవిగా అంటే సహజమైనవిగా లేవు! ఇది గోపీచంద్‌కు బాగా పరిచయంలేని రంగంగా కనిపిస్తుంది. పోతే, కమలాకరం శాస్త్రీయంగా ఉపన్యసించటం ద్వారా ఉషారాణికి తన లైంగిక ప్రవృత్తియొక్క వైశిష్ట్యాన్ని గూర్చి ఏమి తెలిసింది? ఏమీ తెలీలేదు! ఉషారాణిలో కలిగిన ప్రాపంచిక జీవన వైరాగ్యం అది ఎలాగూ సహజపరిణామంగానే ఉంది—కోటేశ్వరమ్మలో లాగ. పోతే శమంతకమణి చరిత్రలో ద్యోతకం చేసిన భావ స్త్రీత్వాన్ని గూర్చిన భావాన్ని, యిక్కడ వాచ్యం చెయ్యటం జరిగింది: ''జీవితాన్ని స్త్రీ అర్థంచేసుకున్నంత సవ్యంగా పురుషుడు చెసుకోలేడు..... ఆమె ఎప్పుడూ జీవిత ముఖద్వారం దగ్గరే ఉంటుంది .... పురుషుడో స్వహంధర్మాలతో సింగలుపడి ఎప్పుడో జీవితాన్ని విడిచిపెట్టాడు. తాను సృష్టించుకొన్న భ్రాంతులే అతనికి నిజం. వాటికోసమే అతను బ్రతుకుతున్నాడు. అందుకనే భావాలను గానీ, సిద్ధాంతాలనుగానీ పురుషుడు పట్టుకున్నంత తేలికగా స్త్రీ పట్టుకోలేదు. వాటికి చచ్చినా దాసురాలుకాదు. ఆమె జీవిస్తుంది అంతే.'' ఈ విషయము యింత చక్కగా గ్రహించిన గోపీచంద్ ఉషారాణి వ్యక్తిత్వాన్ని శాస్త్రీయ సిద్ధాంతాలతో కొలవబూనటం, దాని ద్వారా ఆమె పరిణామాన్ని వివరించదలచుకోవటం ఆశ్చర్యమే! అంటే గోపీచంద్‌లో ప్రాతవాసనలింకా వదలలేదన్నమాట!

ఉషారాణి కరుణానందస్వాములవారి సన్నిధి చేరుకోవడంతో ఆమె వ్యక్తిత్వం పొందిన వికాసంలో చివరిఘట్టం ప్రారంభమౌతుంది.

ప్రాచ్య పాశ్చాత్య నాగరకతల్లో, సంస్కృతుల్లో భేదాన్ని క్లుప్తంగా ఒక్క మాటలో చెప్పాలంటే— తత్త్వదర్శనము, మోక్షము మనకూ, వ్యక్తి వికాసము, సఫలత వారికి, జీవిత పరమావధీ, ధ్యేయం కావటం అవాలి. అందువల్లే వ్యక్తిగతమైన సాధనమీద మనమూ, సామాజిక పురోగతి ద్వారా వ్యక్తివికాసానికి అవకాశాలు యితోధికంగా వృద్ధిచేయటంమీద వారూ విశ్వాసాన్ని నిలుపుకోవటం జరిగింది. ఆధునిక యుగంలో ఈ రెండు దృక్పథాల కలయికా, వీటి సంఘర్షణా, సమన్వయమూ, జరుగుతున్న చరిత్రకు కీలకమైన విషయంగా భావించవచ్చు. ఈ దృష్టితో చూస్తే, గోపీచంద్ 'గడియ పడని తలుపులు' నవలలో ప్రశ్నించి పరిష్కరించక విడిచిన సమస్య— సంప్రదాయానికి వ్యక్తి వికాసానికి సంబంధం; మూడవ నవల అయిన 'మెరుపుల మరకలు' లోనూ అదే ఎదురైంది. సంప్రదాయము అంటే ఏమిటి? సంప్రదాయము సాంఘికమైన వ్యవస్థాధర్మము (వివాహము మొ.), వ్యక్తిగతమైన యోగసాధన (భక్తి, జ్ఞాన, కర్మయోగాదులు) అని రెండువిధాలుగా ఉంది. ప్రస్తుత పరిస్థితుల్లో సాంఘిక వ్యవస్థల్లో సంప్రదాయము వ్యక్తి వికాసానికి ప్రతిబంధకంగా భావింపబడుతూవుంది; రెండవరకం సంప్రదాయము సమాజంలోని సామాన్యునికి అందుబాటులో లేని, నిత్య జీవితానికి అతడు అన్వయించుకోలేని, గహనమైన విషయంగా కనిపిస్తోంది. అందువల్ల సంప్రదాయాన్ని సమర్థించేవారు కాని దాన్ని వ్యతిరేకించేవారు కానీ వ్యవస్థలను గూర్చి ఎక్కువగా వాద ప్రతివాదాలు చేస్తున్నారు. వ్యవస్థ కాలానుగతంగా మారక తప్పదు; అది మారకపోతే వ్యక్తి వికాసము నిరోధింపబడటమే కాదు, వ్యక్తి జీవితమే దుర్భరమౌతుంది అన్న విషయం చాలవరకు యిప్పటికి గ్రాహ్యమే అయింది. కాని, ఆ మార్పు ఎంతవరకు అవసరము? అనే విషయంలో ఏకాభిప్రాయం కుదరటంలేదు. వ్యవస్థను సంస్కరించే విషయంలో వ్యక్తి వికాసమే ధ్యేయంగా పెట్టుకున్న పాశ్చాత్య జీవిత విధానాలూ, భావాలు పుష్కలంగా మనల్ని ఈ యుగంలో ప్రభావితం చేస్తున్నాయి. గోపీచంద్ ఈ నవలలో ఫ్రెంచివారి జీవిత విధానం దృష్ట్యా వివాహ వ్యవస్థను గూర్చి దాని భవితవ్యాన్ని గూర్చి యిలా ఊహించారు :—''వివాహమే పూర్తిగా రద్దవుతుందో, వివాహం ఉంటూనే అందులో తీవ్రమైన మార్పులు వస్తాయో ఇప్పుడు చెప్పటం కష్టం. క్రమక్రమేణా వివాహంలో మార్పులు వచ్చి వచ్చి చివరికి వివాహం అవసరంలేని స్థితికి సంఘం రావచ్చు..... అది మృగదశే గదా ? .... ఈ స్థితి ఒక్క మృగదశకు చెందిందే కాదు. దేవతల దశకు చెందింది కూడా. దేవతలు మానవులకంటె ఉత్తములే కదా విజ్ఞుల అభిప్రాయం. ఆ దశలో కూడా వివాహంలేదు. వివాహ నియమాలను అధిగమించిన వ్యక్తి రాక్షసుడే అవుతాడో దేవతే అవుతాడో ఎవ్వరం ముందుగా నిర్ణయించలేం. అది అతని ప్రయత్నం మీద ఆధారపడిఉన్న విషయం. అదేవిధంగా వివాహం లేని సంఘం నరకం అవుతుందో స్వర్గం అవుతుందో ముందుగా చెప్పలేం. వెనుకకు దేకవచ్చు. ముందుకు జరుగవచ్చు'' చింత చచ్చినా పులుపు చావలేదన్నట్లు, గోపీచంద్ తను సాంఘిక పరిణామ దృష్టిని ఎంత వదలుకున్నా, ఆ దృష్ట్యా యింకా

ఊహించరాపటం, ఆలోచన మళ్లటం మానలేదు అనటానికి యిది తార్కాణ. గోపీచంద్ ఈ నవల నిర్మాణంలో అనుసరించిన తాత్త్విక, సాహిత్య దృక్పథాలరీత్యా పై నుల్లేఖించిన ఆలోచనలూ (వాటికోసం ప్రవేశపెట్టబడిన కమలాకరం పాత్ర) అప్రస్తుతం కావటమే కాదు, క్రొత్త దృక్పథం ఇంకా ఆయనలో పరిణతికిరాని స్థితికూడామనకు గోచరిస్తున్నది. ఉషారాణి ఒకవిశిష్టవ్యక్తి. ఆమెవ్యక్తిత్వం వికసించటంద్వారావ్యవస్థా ధర్మాన్ని అధిగమించింది. కాని వ్యవస్థా ధర్మాన్ని వ్యతిక్రమణంచేసే అందరిలోనూ అవైశిష్ట్యం ఉంటుందని సిద్ధాంతీకరించి చెప్పటానికి వీలులేదు. అలాగే, భవిష్యత్తులో అందరూ అలా చేస్తారనికాని, చెయ్యటం మంచిదనికాని, చేసేవాళ్లు విశిష్టతను నిరూపించుకుని దేవతలు అవుతారనికాని ఆలోచించటం క్రొత్త దృక్పథానికి పూర్తిగా వ్యతిరేకం; ఏమంటే అది 'సమూహం' మీద ఆలోచించటం. గోపీచంద్ ఈ నవలలో నిరూపించదలచుకొన్నదీ నిరూపించినదీ ఉషారాణి అనే వ్యక్తి విశిష్టత; దాని ద్వారా పాఠకులకు లభించేది ఒక క్రొత్త దృష్టి. అంతే కాని ఆ క్రొత్త దృష్టి భవిష్యత్తులో వివాహం ఉండదు అనే నిర్ణయంతో భావంతో లేక సిద్ధాంతంతో ఏ విధంగానూ ముడిపడినదికాదు. క్రొత్త దృష్టికీ వివాహ భవితవ్యానికి ఏదో సంబంధం ఉన్నదన్న అభిప్రాయం పాఠకులకు సూచనగా కూడా రచయిత కలిగించి ఉండవలసింది కాదు. ఈ విషయంలో గోపీచంద్ ఆలోచనా క్రమమే నిర్దుష్టంగా అంటే పరిపక్వంగా లేదు అనుకోవల్సి వస్తున్నది. కాని ఈ దోషంవల్ల ఉషారాణి పాత్ర చిత్రణలో ఏ విధంగానూ లోపం జరుగలేదు. వ్యక్తి వికాసం అనే ధ్యేయం లక్ష్యశుద్ధితో, నిర్భయత్వంతో, కొంత నిస్సంగత్వంతో సాధించవచ్చు; అది సాధించబడిన తర్వాత ఎదురయ్యే దైన్యం, శూన్యం, ఏకాంతం, ఎలా తీరుతుంది? ఈ స్థాయికి చేరుకున్న వ్యక్తికి ప్రాచ్య సంప్రదాయంలోని రెండవ భాగం—వ్యక్తిగతమైన యోగసాధన—ఒక్కటే మార్గం. గోపీచంద్ ఈ సత్యం గుర్తించటంవల్లే ఉషారాణి యోగినిగా పర్యవసించినట్లు చిత్రించాడు. అంటే సాంప్రదాయంలో వ్యవస్థధర్మాన్ని అధిగమించిన ఉషారాణి సంప్రదాయంలో వ్యక్తి సాధనను అవలంభించిందన్న విషయం ఆమె చరిత్ర ద్వారా మనకు అవగతమవుతున్న సత్యం. ఇందులో వింతా విడ్డూరమూ ఏమీ లేదు, కొంత నింపాదిగా ఆలోచించి చూస్తే. వ్యవస్థ ఒక స్థాయి మనుష్యులకు ఆలంబనముగా, పట్టుగొమ్మగా పనికి వస్తుంది; మరొక స్థాయివారికి ప్రతిబంధకంగా గోచరిస్తుంది; అంతకంటే పైస్థాయివారికి అది ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే; దానితో 'తామరాకు మీది నీటిబొట్టు' లాగా వ్యవహరించగల స్థాయి వారిది. ఇందులో ఎవరు ఏ స్థాయికి చెందినవారో నిర్ణయించగల హక్కు ఏ వ్యక్తి విషయంలో ఆ వ్యక్తి అంతరంగానిది మాత్రమే. ఆ అంతరంగాన్ని సాహిత్యం ప్రతిబింబించిన దర్పణంలో ఆ వ్యక్తి స్థాయినీ, విశిష్టతనూ గ్రహించి తద్వారా లోకాన్ని క్రొత్త దృష్టితో దర్శించే అనుభూతి పాఠకునిది! ఈ దృష్టి ప్రసాదిస్తున్నందువల్లనే 'మెరుపుల మరకలు' ఒక కావ్యం అవుతోంది. గోపీచంద్ ప్రాచ్య పాశ్చాత్య జీవిత విధానాలకు సమన్వయం ఉషారాణి పాత్రద్వారా సాధించాడు.— వ్యక్తి వికాసము, వ్యక్తిగతమైన ధర్మసాధన రెండూ వేర్వేరుకావు; రెండూ వ్యక్తికి సంబంధించినవే; రెండింటిలో ప్రధానము వ్యక్తి వైశిష్ట్య నిరూపణమే; రెండింటి మధ్యా ఉన్న భేదం పూవుకీ పండుకీ గల భేదం మాత్రమే!

(సశేషం)



# తెలుగు నవల: 50 నుండి 65 వరకు

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత సమాజం ఎంతో మారింది. పరిస్థితులు తారుమారయ్యాయి. తదనుగుణంగా రచయితల్లో కలిగిన సంచలనమూ, వాళ్ల కొత్తరీతుల్లో ఆలోచించటమూ వారి రచనలు ప్రతిబింబిస్తూ వున్నాయి. ఈ పదిహేనేళ్లలో, అంటే 1950 నుంచీ నేటిదాకా బాగా అభివృద్ధిచెంది అందరి దృష్టినీ ఆకర్షించిన సాహిత్య ప్రక్రియ నవల. సమకాలిక జీవితంతో అతి సన్నిహితమైన సంబంధం కలిగి వుండటంతో, మనల్ని మనం అర్థం చేసుకోవటానికి, విమర్శ చేసుకోవటానికీ, కర్తవ్యాన్ని గూర్చి ఆలోచించు కోవటానికి నవలను మించిన సాధనం సాహిత్యంలో లేదంటే అతిశయోక్తి కాదు. వీరేశలింగం పంతులు గారి నుంచీ చలంగారి దాకా నవల సంఘ సంస్కరణకూ, ప్రబోధానికి ఉపకరణం అయింది. కాల్పనికోద్యమం, భావకవిత్వం తెచ్చిపెట్టిన భావనాత్మక ప్రేమ(Romantic Love)కు నవలద్వారానే ప్రజానీకంలో ప్రచారమూ ప్రతిష్ఠా ఏర్పడ్డాయి. సాంప్రదాయికమైన వివాహ వ్యవస్థ భావనాత్మక ప్రేమ అనే ఆదర్శంతో సర్దుబాటు కావాలి అనే భావం యించుమించు సర్వ జనాంగీకారాన్ని పొందింది. నవలకూ, కథకూ, సినిమాకూ, ఈభావమే పట్టుగొమ్మ అవుతూ వచ్చినది. సంప్రదాయాన్ని మార్చరాదు అనే దృక్పథంతో, ప్రాచ్య ప్రతీచీ సంస్కృతుల సంఘర్షణని చిత్రించిన విశ్వనాథవారు కూడా ఈ ప్రేమను ఆధ్యాత్మిక దృక్పథం నుంచీ సమరించారు. (ఉదా: వేయిపడగల్లో కిరీటి ఉదంతము.) సంప్రదాయం ఎన్ని విధాల నశించినా, ప్రేమా, వివాహమూ, ఈరెండింటిద్వారా జాతి పునరుజ్జీవనం పొందుతుంది అనే విశ్వాసాన్ని ఆయన వ్యక్తం చేశారు. సెక్స్ విషయంలో స్వేచ్ఛ అనే విప్లవ నినాదాన్ని తన రచన లన్నింటికి ప్రాతిపదిక చేసికొన్న చలంగారు కూడా ప్రేమ మీద ప్రగాఢ విశ్వాసంతోటే దిగంతాలకు దృష్టి సారించారు. అలాగే ముందుతరం నవలలో ఆర్థిక రాజకీయ వ్యవస్థలే అన్ని అనర్థాలకు మూల కారణమనీ వాటిని సంస్కరిస్తే అన్నీ చక్కబడతాయనే విశ్వాసం ఒక వర్గం వారిలో ప్రకటితమైంది. ఈవిధంగా సంఘ సంస్కరణము, భావనాత్మక ప్రేమ, ఆర్థికరాజకీయ వ్యవస్థల్లో మార్పు అనే మూడింటి మీదా ముందు తరం తెలుగు నవల గాఢమైన విశ్వాసాన్ని ప్రకటించింది. 1950 తర్వాత తెలుగు నవల ఎన్నో విధాల ఈమూడింటి మీదా గట్టిగా అవిశ్వాసాన్ని ప్రకటిస్తోంది. ఇదీ మనం ముఖ్యంగా గమనించ వలసిన మార్పు— ఆదర్శాలు తలక్రిందులు కావటం! దీనికి కారణం ఈ కొత్తతరం వారిలో విశ్వసించే శక్తి ఉన్నట్లుండి అదృశ్యమైపోయిందా? అవును, అదృశ్యమైపోయింది అనే వాళ్లు చాల మందే వున్నారు. నా అభిప్రాయం: కారణం అది సరి కాదేమో అని.. ముందు తరం వారికి దూరపు కొండలుగా, గమ్యస్థానంగా వుండిన ఆదర్శశిఖరాలు ఈతరం వారికి చేరువకావటం, అవి ఆశించినంత నునుపుగా, సుఖప్రదంగా, శాంతి దాయకంగా అనుభవంలో లేకపోవటమే కారణమని తోస్తుంది. ఏది గమ్యస్థానమని ఒకప్పుడు తోచిందో, అది చివరకు ఒక మజిలీగా కూడా తృప్తి నివ్వలేకపోవటమే, నేటి అవిశ్వాసానికీ, జీవితాన్ని గూర్చిన పునరాలోచనకూ, అన్వేషణకూ కారణమైందని తోస్తుంది.

వస్తువు దృష్ట్యా నేటి తెనుగు నవల ప్రధానంగా చిత్రిస్తున్న విషయం—ప్రేమ శైథిల్యమూ, వివాహ వ్యవస్థ విచ్ఛిత్తీ. ప్రేమ అంటే తల్లిదండ్రుల అంగీకారంతో నిమిత్తంలేకుండా తనకు నచ్చిన వ్యక్తిని

పెళ్లి చేసుకోవడమా? అంత మాత్రంతో ఆ పెళ్లి జీవితాంతమూ సుఖప్రద మౌతుందా? ప్రేమ అంటే ఒక వ్యక్తి మరొక వ్యక్తికోసం చేయవలసిన త్యాగమా? తను ప్రేమించిన వ్యక్తి తన్ను దగా చేస్తే, లేక మళ్లీ ప్రేమించకపోతే ఏం చెయ్యాలి? ఈ ప్రశ్న లన్నింటికీ ముందు తరం నవల యిచ్చిన సమాధానాలు ఒకే తీరుగా ఉండేవి—ఆ సమాధానాలన్నీ యూరప్ ఖండం నుంచీ దిగుమతిఅయిన కాల్పనిక వాదంతో, ఈ దేశంలో సాంప్రదాయికమైన భార్యాభర్తల ఆదర్శ ప్రవర్తనాలూకు భావాల్ని రంగరిస్తే ఏర్పడే ఒక భావ సముచ్చయం. ఆ భావాల్ని వ్యక్తం చెయ్యటమే ముందు తరం నవల సాధించిన ప్రయోజనం. ప్రేమను గూర్చిన పై ప్రశ్నలకు అనుభవం రీత్యా, పరిశీలన రీత్యా, ఈ తరంవా రిచ్చే సమాధానాలు వేరుగా ఉంటున్నాయి. వేరుగా ఉండటమే కాదు, తలకొక తీరుగా ఉంటున్నాయి. అంటే ఒక్కొక్క మనిషి అనుభవాన్నిబట్టీ, వ్యక్తిత్వాన్నిబట్టీ సమాధానాలు భేదిస్తున్నాయి. ఈ వైవిధ్యాన్ని చూచిన పాఠకుల కొక్కటే అనిపిస్తుంది: ఏమిటీ అవ్యవస్థ? ఏమిటీ అయోమయత్వం?

ప్రేమ శైథిల్యాన్ని వ్యక్తిగతమైన అన్వేషణ రూపంలో అర్థస్ఫూర్తితో చిత్రించిన క్రొత్త నవల 1950 లో వెలువడి 1957లో బహుళ ప్రచారాన్ని పొందిన "చివరకు మిగిలేది!" ప్రేమను గూర్చి అందులో కథానాయకుడు చివరకు అనే మాట లివీ— "నాకు ప్రేమంటే ఏమిటో యింతవరకు తెలిసింది కాదు. అందరిలాగా శరీరవాంఛనే ప్రేమనుకుని, నన్ను నేను దగా చేసుకోలేను. ఇతరులు ఎవరితోనూ, ఏ ఒక్కరితోనూ పంచుకోలేనిది నా ప్రేమ. అదొక దృష్టి—జీవితం అంతటినీ తుదీ మొదలూ, ముందూ వెనకా, అన్నింటినీ దూరంగా చూసి అర్థంచేసుకునే, ప్రపంచంపై ఒక చూపు...." ఇలా ప్రేమను వేదాంత దృక్పథం స్థాయికి విస్తృత పరచటమే కాదు—తను ప్రేమించిన యువతితోనే "నీతో స్నేహంవల్ల ఆ దృష్టి పోతుంది" అని కూడా అంటాడు. ప్రేయసిని దేవతను చేసిన భావనాత్మక ప్రేమకూ, ఈ స్వానుభవానికీ ఎంత దవ్వో ఆలోచించండి !

ప్రేమ శైథిల్యంతోబాటే వివాహ వ్యవస్థ విచ్ఛిత్తి! "ప్రేమ, పెండ్లి,ఈ రెండింటికీ ముడిపెట్టడమే మానవజాతి చేస్తున్న ఘోరాపరాధం. ప్రేమ మన చేతిలో లేని వెన్నెల. పెండ్లి స్విచ్ వేస్తే వెలిగే విద్యుద్దీపం. వెన్నెలనీ విద్యుద్దీపాన్నీ ఒక్కతడనే అనుభవిద్దామని మానవుడు ఆశిస్తాడు. కాని ఆ రెండింటిలో అతనికి ఏదో ఒకటే మిగులుతుంది....." ఈ భావాన్ని వ్యక్తంచేసిన "ఎడారి పువ్వులు" అనే నవలలో "ప్రేమించి పెండ్లి చేసుకున్నా ననుకున్న రాజా సక్సెన్ కాలేకపోయినాడు. ప్రేమించి వర్ణాంతర వివాహము చేసుకున్న శివరావూ తప్పిపోయినాడు. ప్రేమించి మతాంతర వివాహం చేసుకున్న లిల్లీ సుఖపడటం లేదు. ఇదంతా చూస్తుంటే ప్రేమించటం అంత బుద్ధి తక్కువపని సృష్టిలో మరొకటి లేదనిపిస్తూంది.." అంటూ వ్యాఖ్యానిస్తారు కథానాయికా నాయకులు. పోనీ పెళ్లి చేసుకోకుండా ఉండి సుఖించటానికి వీలవుతుందేమోనని వాళ్ళు చేసే ప్రయత్నమూ ఫలించదు. వివాహం ఎడారి. స్త్రీ, పురుషులు ఎడారి పువ్వులు. ఎడారిలో [illegible]యిన ఒంటి సుఖం. ఎప్పుడైనా అది ఆపూలని అందుకుంటే కద్దు. లేకపోతే లేదు. ఇదీ ఈనాటి రచయితా, లేక రచయిత్రీ తేల్చి చెబుతున్న విషయం.

సంఘ సంస్కరణం దృష్ట్యా వర్ణాంతర వివాహము గొప్ప ఆదర్శం—ఆ ఆదర్శాన్ని సమర్థిస్తూ నవల కృషిచెయ్యటంలేదే అని 1959 లో శ్రీ తిరుమల రామచంద్రగారు 'భారతి' లో వ్రాస్తూ తమ అసంతృప్తిని వెలిబుచ్చారు. రచయితలు ఆమాత్రము సాహసింపలేక పోతున్నారా అంటూ కవ్వించారు కూడా. అందుకు సమాధానమా అన్నట్టు వ్రాయబడిన నవల శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారి "బలిపీఠం"— వర్ణాంతర వివాహాన్ని వైయక్తిక దృక్పథంతో చర్చించి ఆలోచన రేకెత్తించిన నవల. ప్రేమా, పెళ్లి సుఖప్రదంగా లేవని తేల్చి చెప్పిన నవలా రచయితలు పురుషులకంటే స్త్రీలే ఎక్కువగా ఉన్నారని తోస్తుంది— వారపత్రికల్లో ప్రచురింపబడుతున్న నవలల్ని చూస్తే. ప్రేమా, వివాహమూ—యీ రెండూ కాకపోతే స్త్రీ ఏం చెయ్యాలి? వ్యక్తిగా స్వాతంత్ర్యాన్ని, సమాజంలో పురుషునితో సమాన ప్రతిపత్తినీ ఉపలక్షించి ఉవ్విళ్ళూరిన స్త్రీ ఏవిధంగా తన జీవితాన్ని వ్యవస్థీకరించుకోగలదు? ఈ ప్రశ్నకు సరియైన సమాధానం రచయిత్రుల నుంచీ ఇంతదాకా రాలేదు. సరియైన సమాధానం అంటే అందరూ అంగీకరించి, ఆమోదించే సమాధానం, అసలు రావడానికి [illegible]దేమో అని అనుమానం.

# తెలుగు నవల : 50 నుండి 65 వరకు

ప్రేమ, వివాహము యీ రెండింటి నేటి నవలలలో ప్రాధాన్యం ఆర్థిక రాజకీయ పరిస్థితులకు ఉంది. ముఖ్యంగా మధ్య వర్గమువారి సమస్యలనూ, జీవితవిధానాన్నీ యధాతథంగా చిత్రించటంగాని, విమర్శించటం గావి, పరిష్కారమార్గాల్ని సూచించటంగాని, ఎన్నో నవలలు చేశాయి, చేస్తున్నాయి. అలాగే గ్రామీణ జీవితాన్ని, రాజకీయ పార్టీలతో కలుషితమైన వాతావరణాన్ని నవల చిత్రిస్తోంది. ఈ ధోరణిలో ఎన్నదగిన నవలలు శ్రీ జి. వి. కృష్ణారావుగారి "కీలుబొమ్మలు", వట్టికోట ఆళ్వారుస్వామిగారి "ప్రజల మనిషి", హిత శ్రీ గారి "అంతర్వాహిని" మొదలైనవి. గ్రామం నుంచి జీవనోపాధి కోసం పట్టణం చేరుకొనే అమాయకుల చరిత్రను చక్కగా చిత్రించిన నవలలు శ్రీ బలివాడ కాంతారావుగారి "దగాపడిన తమ్ముడు", శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారి "వెలుగు, వెన్నెల, గోదారి". మధ్యవర్గంవారి జీవితాన్ని యథాతథంగా చిత్రించిన నవలలు శారదగారి "మంచి—చెడు", "అపస్వరాలు" శ్రీ వాసమూర్తిగారి "అబల", "అల్పజీవులు", శ్రీ పోతుకూచి సాంబశివరావుగారి "ఉదయకిరణాలు", "అన్వేషణ". ఈ నవల లన్నింటిలోనూ గమనింపదగిన సామాన్య లక్షణం—అది ముందు తరం నవలకూ నేటి నవలకూ ప్రధానమైన భేదం కూడా ఒక్కటున్నది. ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా ఏ సిద్ధాంతాలూ, ఆదర్శాలూ పూర్వ సమాజంలో ఆశాభావానికి కారణమయ్యాయో అవేవీ స్వాతంత్ర్యం తర్వాత సంతృప్తిని కలిగించటం లేదన్న విషయాన్ని నేటి నవల నొక్కి చెబుతున్నది.

ఏవిధంగా చూచినా ఈ పదిహేను సంవత్సరాల్లో తెలుగు నవల తెలుగు దేశంలో సమకాలీన జీవితాన్ని వైవిధ్యంతో చిత్రిస్తూ—చర్చిస్తూ పరిస్థితులపట్ల తీవ్రమైన అసంతృప్తినీ, ప్రాతవడిన ఆదర్శాలపట్ల అవిశ్వాసాన్నీ వ్యక్తం చేసిన దనడంలో సందేహంలేదు. సాహిత్య సమాజంలో సాధించవలసిన ప్రయోజనం ఏమిటి ? అనే ప్రశ్న మొదటినుంచీ ఉన్నదే ! తెలుగు నవలకు అది పుట్టినప్పటినుంచీ, నీతి ప్రబోధమూ, సంఘ సంస్కరణ, సమాజంలో విజ్ఞానాభివృద్ధివంటి లక్ష్యాలు అంటిపెట్టుకునే ఉన్నాయి. నవల తప్పకుండా ఔపదేశికంగా, ఉదాత్తమైన ఆదర్శాలకు ప్రోదిగా ఉండాలనే సంప్రదాయం తెలుగులో ఏర్పడిపోయింది. చలంగారు కూడా నవలను తన సిద్ధాంతాల ప్రచారం కోసమే ఉపయోగించుకున్నారు. కాని, 1950 తరువాత నవల యీ సంప్రదాయాన్ని, కట్టుబాటును మించింది. ఇది గొప్ప మార్పు. ఏ ప్రబోధము, ప్రచారముకంటె పరిశీలనము, జిజ్ఞాస లేక, యథార్థాన్ని అన్వేషించడమూ నేటి నవల ఉద్దేశించే ముఖ్య ప్రయోజనంగా ఉంటోంది. ఇందులో నిస్పష్టంగా మూడు మార్గాలు కన్పిస్తున్నాయి. ఒకటి—ఏ ప్రశ్నలూ సమాధానాలూ లేకుండా సమాజాన్ని లేక సమాజ జీవితంలో ఒక భాగాన్ని యధాతథంగా చిత్రించడం. అంటే రచయిత ఏవిధమైన దృక్పథాన్నీ సూచించకుండా ఫోటోగ్రాఫర్‌లా తటస్థుడుగా ఉండటం. ఉదాహరణ—శారద, శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ వాసమూర్తి వ్రాసిన నవలలు. రెండవ మార్గం—ప్రశ్నలు వెయ్యటమే కాని, సమాధానాల్ని సూచించకపోవటం. సమాధానాల్ని పాఠకునికే వదిలిపెట్టడం. ఉదాహరణ—శ్రీ జి. వి. కృష్ణ గారి "కీలుబొమ్మలు" చూడండి. ఒకానొక వ్యక్తి నిజంచెప్పే ధైర్యం లేకపోవడంవల్ల కదా యిన్ని అనరాలూ, అన్న ప్రశ్నతో ఆరంభమయిన ఆ నవల—ఈ రాచకీయా లిట్లా ఉన్నాయేం ? ఈ మనుష్యులిట్లా ఉన్నారేం? అనే ప్రశ్నతో ముగింపుకు వస్తుంది. ఈ ప్రశ్నల్లో సూచింపబడిన సమాధానాల్ని పరిశీలిస్తే—ఆ వ్యక్తి నిజం చెపితే యిదంతా తప్పేదేమో ! రాజకీయాలు వేరుగా ఉంటే మనుష్యులు వేరుగా ఉండేవారు కాబోలు ! లేక మనుష్యుల తత్వం వేరుగా ఉంటే రాజకీయాలు బాగుండేవి కాబోలు ! ఈ వూహల్ని నవలకు అన్వయించి చూస్తే అందులో ఏ వూహ పరియైన సమాధానంగా మనకు తృప్తి నివ్వదు. అందుకే యీ మార్గాన్ని ప్రశ్నలు వెయ్యడం, సమాధానా లివ్వకపోడంగా పేర్కొనడమైంది. శ్రీమతి లతగారి నవలలు కూడా ఈ మార్గానికే ఉదాహరణ. పోతే మూడో మార్గం—సమాజాన్ని గూర్చి వేసే ప్రశ్న లన్నింటికీ వ్యక్తిద్వారా సమాధానా లన్వేషిస్తూ పోడం—చివరకు దాన్ని ఆత్మగతమైన అన్వేషణగా తేల్చడం. అంటే వేసిన ప్రశ్నలకు సమాధానం వ్యక్తికీ, సమాజానికీ గల సంబంధాన్ని ఎవరికి వారు నిర్వచించుకోవడంలోనే ఉందన్న నిర్ణయానికి రావడం. ఉదాహరణలు—బుచ్చిబాబు "చివరకు మిగిలేది", గోపీచంద్ "మెరుపులు—మరకలు". బుచ్చిబాబు తను నవల వ్రాసిన ఉద్దేశాన్ని గూర్చి యిలా చెప్పుకున్నారు. "ఆర్థిక, సాంఘిక, చారిత్రక, వ్యత్యాసాల కతీతమై, మనిషినీ,

మనిషినీ స్నేహపాశంలో బంధించివేసే మానవత్వం యొక్క శక్తుల్ని తరచి చూచినప్పుడు, ఆ దృశ్యాన్ని తన్మయతతో అనుభవించగలం. కాని, ఆ అనుభవాన్ని మాటల్లో చెప్పలేం. ఈ జీవిత రహస్యం—దాన్ని తెలుసుకోడానికి మానవుడు చేసే యత్నం—ఈ నవలకి పునాది. నేటి నవలా రచయితల మార్గాలను యిలా మూడు రకాలుగా విభజించడంలో సాహిత్యపరంగా ఈ మూడింటిలో తరతమ భేదాల్ని సూచించటంలేదని మనవి. మార్గం ఏదైనా సరే, ఉత్తమ సాహిత్యసృష్టి కేవలం రచయిత ప్రతిభమీదనే ఆధారపడి ఉంటుందని నా నమ్మకం. ఏమంటే ఈ మూడు మార్గాలలోనూ నవలలు ప్రతిభావంతమైనవి వచ్చాయి, పనికిమాలినవి వచ్చాయి.

ఇంతవరకు ఈ పదిహేనేళ్లలో నవల పొందిన విస్తృతినీ, మార్పునీ వస్తువు దృష్ట్యా, నవలారచయిత అనుసరిస్తున్న మార్గాల దృష్ట్యాను, పరామర్శించటం జరిగింది. ఇప్పుడు శిల్పం దృష్ట్యా కొన్ని మాటలు చెప్పాలి. నవలకు అందరూ అంగీకరించిన లక్షణాలు —కథ—కల్పనా—పాత్రోన్మీలనమూ, మనస్తత్త్వ విశ్లేషణమూ, జీవిత యదార్థ చిత్రణమూ. నవల అన్ని రకాల పాఠకులకూ —అక్షరాస్యులనుంచీ ఆలోచనాపరుల దాకా—అందరికీ అందుబాటులో ఉండే రచన. అభిరుచుల దృష్ట్యా చూస్తే చాలామందికి పరిగెత్తే కథా, ఉద్వేగమో, ఉల్లాసమో కలిగించే కల్పనా ఉంటే చాలు. వారిలో కొంతమందే కల్పన వాస్తవిక దృష్ట్యా సంభావ్యమా, కాదా అనే విషయానికి ప్రాధాన్యం యిస్తారు. వారికంటే మరీ తక్కువమంది పాత్రోన్మీలనమూ, మనస్తత్త్వ విశ్లేషణమూ విలువలుగా గుర్తించగలుగుతారు. పోతే కావ్యంలో ధ్వని వంటి గుణాలు కేవలం సాహిత్యవేత్తలకే అందుబాటులో ఉంటాయి. అందువల్ల అన్ని తరగతుల పాఠకుల్నీ రంజింపజేయగల నవల అనేది అపురూపంగానే వస్తుంది. పాత్రోన్మీలనమూ, మనస్తత్త్వ విశ్లేషణమూ, లేక తాత్త్వికమైన దృక్పథమూ ప్రధానమైన విలువలుగా పెట్టుకొన్న రచనలో, కథలో విశేషణంగాని కల్పనలో పాఠకుల్ని సంతృప్తిపరచే గుణం కాని లేకపోవచ్చు. ఈ పరిస్థితి దృష్ట్యా ప్రచారమూ, ధనరూపేణ ప్రతిఫలమూ ఒకే రచనయొక్క సాహిత్యపు విలువని ఎప్పుడూ నిర్ణయింపజాలవని మనవి.

నవల ఈ పదిహేనేళ్లలో పొందిన పరిణామం సమాజ పురోగతికి, వ్యక్తి వికాసానికీ దోహదం చేస్తున్నదా ? అనే ప్రశ్నకు సమాజంలో అవ్యవసను అతిగా చిత్రిస్తూ మరింత అవ్యవస్థకు కారణ మౌతున్నది. నేటి నవల అనే అభియోగం ఒకవైపు లేకపోలేదు. "Life imitates Arts" అని "ఆస్కార్ వైల్డ్" చమత్కరించినట్లు, సాహిత్యం చిత్రిస్తున్న జీవితాన్ని అనుకరించేందుకు ప్రయత్నించే పాఠకులూ సంఘంలో ఉంటారు. ఏది ఏమైనా ఇలాంటి విషయాల్లో ఏకాభిప్రాయం ఎప్పుడూ కుదరదు. నా అభిప్రాయం ఏమిటో సూచించి ఈ వ్యాసం ముగిస్తాను.

కేవలం యాంత్రికమైన ధోరణిలో ఆలోచనారహితంగా, మూగగా, సామాజికశక్తులకు లోబడి బతకటంకంటె వ్యక్తి స్వధర్మాన్ని చేపట్టి ఆచరణద్వారా, అనుభూతి ద్వారా తన గమ్యం ఏదో అన్వేషించడం మేలు. ఏమంటే,

"శ్రేయాన్ స్వధర్మో విగుణః
పర ధర్మాత్ స్వనుష్ఠితాత్,
స్వభావ నియతమ్ కర్మ
కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్."

ఇక్కడ స్వధర్మం అంటే హిందూ మతాచారాలు కావు. సాంఘికధర్మం కాదు. వ్యవస్థా ధర్మానుష్ఠానము లేక సాంఘిక దృష్టిని ప్రోత్సహించటమే సాహిత్య ప్రయోజనం అనే అభిప్రాయం నేడు చాలామందిలో ఉన్నది. నీతి—అవినీతి అనే ప్రశ్న అక్కడనుంచే పుట్టుకొని వస్తోంది. దానికి గీత సమాధానం—"స్వభావ నియతమ్ కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్" అని. అంటే చిత్తశుద్ధిని గూర్చి గీత చెబుతున్నది: "శ్రేయాన్ స్వధర్మో విగుణః" అనటంలో, వ్యక్తి ధర్మానికీ, వ్యవస్థా ధర్మానికీ వైరుధ్యం ఏర్పడినపుడు వ్యక్తి ధర్మమే ఆచరణీయం అని అర్థం. మారుతున్న నేటి సమాజంలో వ్యవస్థాధర్మం అనిశ్చితంగా అనేక ముఖాల దిగ్భ్రమ కల్పిస్తున్నప్పుడు, ఆ పరిస్థితిని చిత్రిస్తూ "శ్రేయాన్ స్వధర్మో విగుణః" అని చెబుతూ, వ్యక్తిగతమైన అన్వేషణకు ప్రాధాన్యం యిచ్చే నేటి నవల, వ్యక్తి వికాసానికీ తద్ద్వారా సమాజ పురోగతికీ తప్పక దోహదం చేస్తుందనే నా విశ్వాసం.

(అఖిలభారత తృతీయ తెలుగు రచయితల మహాసభలో చదివిన వ్యాసం.)

# కానాల నరసింహకవి

తరిగొండ వెంగమాంబకు పుట్టింటి పేరును, మెట్టి నింటి పేరును గలవు, కాని యామె మహాయోగినియై, యీ వాదోపవాదములను దాటి తరిగొండ వెంగమాంబగా శాశ్వతముగా సారస్వతమున వ్యవహృతమైనది—పుట్టింటివారు కానాలవారు. అత్తవారింటి పేరు ముంజేటివారు. ఈ విషయము స్పష్ట పరచుటకు వెంగమాంబ [2]'ద్విపద భాగవతావతారిక యందలి విశేషముల నిచ్చుచున్నాను.

"ద్వి. ధరపైని వెలయు నం దవరాన్వ యుండు
గురుతర మువసిష్ఠ గోత్ర సంభవుడు
కానాల వంశ సాగర హిమాంశుండు
నైన కృష్ణార్యున కతి భక్తితోడ
నంగన యగు మంగమాంబ గర్భమున
నంగతి కృష్ణయ్యండు సైదోడుగాగ
వెంగమాంబిక ప్రభవించి లింగాంగ
భంగంబు కొఱకు సుబ్రహ్మణ్య గురుని
చరణాబ్జ యుగళి హృజ్జలజ మందుంచి
యరసి పూజించి త దనుమతి వడసి
వరుసగా ముంజేటి వంశ భూషణుడు
గురుతర శ్రీవత్స గోత్ర సంభవుడు
ఘనుడైన తిమ్మయార్యాగ్రణి పుత్రు డనఁగ
జనులెన్న వెంకటాచలపతి పాద
వనజ యుగ్మంబు భావంబునందుంచి."

పై భాగము ననుసరించి వెంగమాంబ తండ్రి కానాల కృష్ణార్యుడని స్పష్టము.

నరసింహకవి తన వంశ క్రమము నిట్లు చెప్పియున్నాడు.

ఆహోబిల మంత్రి వంశమున—

వెంగామాత్యుడు
|
కృష్ణయామాత్యుడు
|
వేంకటేశామాత్యుడు
|
నరసింహకవి.

ఇచట నరసింహకవి తాత—కృష్ణయామాత్యుడు—తరి గొండ వెంగమ తండ్రి కృష్ణయామాత్యుడు—ఇతడే నరసింహ కవి తాత యైనచో, నతడు నవీను డగును. ఏలననగా తరి గొండ వెంగమాంబ [3] క్రీ. శ. 1794—1877 వఱకును జీవించినది. కావున నామె తండ్రి క్రీ. శ. 1750—60 ప్రాంతమువాడు. అప్పుడు నరసింహ కవి యాతని మనుమడే యైన వెంగమాంబను, నెఱిగి యుండక తప్పదు. కాని గ్రంథమున నట్టి సూచనలు లేవు. వెంగమాంబయు తన తాత పేరు చెప్పలేదు. ఈ సందర్భము ననుసరించి చూచిన నీతడు క్రీ. శ. 1800 ప్రాంతమువా డగుచున్నాడు. వ్యాస కర్త శ్రీ గ్రంథ మెప్పుడు వ్రాయబడినది మొదలగు వివరము లిచ్చినచో, నింతకన్న నీ కవి కాల నిర్ణయము సూక్ష్మముగ చేయుటకు వీలు కలుగును. అంతవఱకును నిది నిశ్చా యకము కాదు.

ఇక వీరేశలింగముగారు కవుల చరిత్రయం దిచ్చిన పద్యము లిందు ప్రకటించుచున్నాను. వ్యాసకర్త శ్రీ పద్యములు తమవద్ద నున్న ప్రతిలో నున్నవో లేవో తెలుపగోరుచున్నాను.

చ. పటుతర మేఘమండల విభాసిత సౌధ చయో పరిస్థితో
త్కట వరహేమ కుంభ సముదాయ ధగద్ధగి తోరు కాంతి వి
స్ఫుట చపలాకృతి న్మెఱయఁ జూడగ వచ్చిన వారలెల్ల ని
చ్చట గల చంచలల్ గడున చంచల లంచు భ్రమింతురం గనల్—(1 ఆ)

చ. ఘన విషజంతు పూరిత మగాధమురూపము దీనిఁ జూడు నీ
వొనరఁగఁ గూఁతు నీయవు తిలోదక మీయవు గాన దానవా
తనువులు జీర్ణతం బొరసె దారుణ రూప సమేత కూపమం
దును బడియున్నవార మతి దుఃఖ సమాకులతన్ మహా త్మకా (2 ఆ)

శా. దారాపత్యయుతుం డకించనుడు విద్వాంసుండు వేదాం తమా
ర్గా రూఢుండును వృత్తిహీనుఁడును నిత్యానందుడున్ శ్రోత్రియుం

---

2. వెంగమాంబ మహాభాగవతము నంతను ద్విపద కావ్య ముగా వ్రాసినది. ఇందలి విశేష మేమనగా, పోతన భాగవతము నందలి పద్యములకు ద్విపద లున్నను—గ్రంథము ముద్రి తము కాలేదు. మొదటి యాఱు స్కందములు మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోను (తిరుపతి), కొన్ని స్కందములు వేంకటేశ్వర విశ్వవిద్యాలయములో నున్నవి. పై వంక్తులు మద్రాసు పుస్తక భాండాగారమున డి. సంఖ్య 1013 నుండి గ్రహింపబడినది.

3. Literary and philosophical works of Tarigonda Vengamamba A woman Saint- article in English by N. Venkata Rao M. A. Journal of the Madras University. Section A. Vol. XXX January 1958 PP 17-29.

డై రాజిల్లిన బ్రాహ్మణోత్తముని కళ్యానందులై జీవనం
బీరే దాతలు పొందరే సుగతు లుర్వీశా ధరామండలిన్(3ఆ)

ఉ. నీసము లెందఱో శమనునిం గనఁ బోయిరి నీకుఁ జావు రా
దాసకుఁబుట్టినిల్లయి మహా కలుషంబు లొనర్చి సభ్యులన్
మోసముచేసినే డిటులు మూర్ఛిన బోవునె తత్ఫలంబునిన్
బాసినఁ గల్గు మా కఖిల భాగ్యము లేగుము కాలు ప్రోలుకిన్
(14. ఆ)

మ. అనుచున్ దూతి మహీధరానుత కళత్రార్థంబుగాఁ బాపచిం
తనలర్థార్జనఁ జేసి వారి నిరవొందం బ్రోతురంతంబునన్
దనఁ వెంటన్ జనుదెంతురే కడపటన్ దానొక్కడే పోవుటల్
గనియున్ మోహలతాని బద్ధులగుచున్ గానంగ లేరింత యున్. (5 ఆ)

మ. నతియుందాను సుపుత్రపౌత్రయుతుఁడై సంప్రాప్త సర్వేష్టుడై
యతి సంతోషము మీఱఁగా మెలగి దేహాంతంబునన్ లోకపా
లతతుల్ పూజలొనర్ప సర్వసుఖ సంప్రాప్తుడునై క్రమ్మఱన్
క్షితిపైఁ బుట్టిను జక్రవర్తి యగుచున్ చేతోముదం బొప్పగన్ (6—ఆ)

చ. పొలుపగు కాంచనంబు తిలపుష్పము నచ్చెలినాసి కోపమం
బలరఁగ వచ్చి దాని నమవౌటకు జాలక యూర్ధ్వ దృష్టిఁ గొ
మ్మల దలక్రిందుగాఁ దపము మానఁగఁ జేసి ఫలించు వేళ, మే
నులు విడిచెన్ నలంగడె ఘనుండయినన్ బలవద్వి రోధియై (7 ఆ

ఉ. నీవును దీపదానముల నెమ్మిగఁ జేయుము దానమోక్షమున్
శ్రీ వరుఁ డిచ్చు జ్ఞానమును జేకురు జ్ఞానమునుచేత మోక్షమున్
భూవర నీకు గల్గు హరిపూజ లొనర్పుము కార్తికంబు నం
దీ విమలేతిహాసము మహిన్ వినువారికిఁ గల్గు సౌఖ్యముల్
(ఆ. 8.)

"అక్కడక్కడ కొన్ని విలక్షణ ప్రయోగములున్నను కవిత్వము మొత్తముమీద మృదువై నిరర్గళ ధారగా నున్నది" యని వీరేశలింగముగారి యభిప్రాయము.

ఈ కృతిలో షష్ఠ్యంతములు శార్దూల వృత్తములో నుండుట విశేషము.

## తెలుగుభాషః శేషధర్మములు

పద్య కావ్యములు —

1. తామరపల్లి తిమ్మయ—ఎనిమిదాశ్వాసములు—గ్రంథము ముద్రితము. ఈ కృతిని క్రీ. శ. 1656లో అప్పకవి పేర్కొనుటచే నది యంతకు ముందు రచితమైనది.

2. వెణుతురుపల్లి విశ్వనాథకవి—వత్సవాయి తిమ్మరాజు గారికి కృతి— ఈతడు తిమ్మరాయసమకాలికుడు. గ్రంథము ముద్రణ కాలము 1915.

3. కానాల నరసింహకవి—ముందు వివరింప బడినది.

4. బచ్చుసిద్ధ కవి—ఈ రచనకు సిద్ధిశేష ధర్మములని పేరు. ఇందుండి— పరవస్తు చిన్నయ్యసూరి ప్రయోగము లను గ్రహించియున్నాడు కావున నిది క్రీ. శ. 1850కి పూర్వ రచన. గ్రంథము అముద్రితము. ఆంధ్ర సాహిత్య పరిషత్తులో తాళపత్రప్రతి గలదు.

5. తురిమెళ్ల రామకవి—అముద్రిత కృతి సమగ్రము. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార ప్రతి.

6. అల్లమరాజు రంగశాయి కవి— గ్రంథము ముద్రితము 1883.

7. శ్రీనివాసకవి— కొడిచెర్ల— శేషధర్మసారము— అముద్రితము.

వచనములు —

1. యస్. శఠగోపాచారి— వచనము— ముద్రితము 1884.

2. చదలువాడ సుందరరామశాస్త్రి— టీకా తాత్పర్యము— 1904.

3. నోరిగురు లింగశాస్త్రి— వచనము— 1909.

"పై ముద్రిత గ్రంథ వివరణములన్నియు— ఆంధ్ర గ్రంథమాలవారు ప్రకటించిన, "ఆంధ్ర వాఙ్మయ సూచిక" నుండి గ్రహింపబడినవి.

# నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు : 2

# వేయిపడగలు

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

'వేయి పడగలు' నవల చదవటం ఒక అపూర్వమైన అనుభవం. మరపురానిది. అందులో ఎంత సంతృప్తి ఉన్నదో అంత అసంతృప్తి కూడా ఉన్నది. ఆ అనుభవ స్వరూపం ఎలాంటిది? అందంగా విశాలంగా కనిపించే దేవాలయం. అందులో ప్రవేశించగానే దాని నిర్మాణ పథకం మనల్ని ఆకట్టు తోంది. నాలుగడుగులు ముందుకువేసి నడుస్తూవుంటే రెండు వైపులా వైవిధ్యంతో బహు ఆకర్షణీయంగా కనిపించే శిల్పాలు. ఒక్కొక్కటి దగ్గరగా నిదానించి చూస్తే ఆశాభంగానికి కారణమౌతున్నాయి. మందిర వైశాల్యము మనస్సుకు కలిగించ వలసిన నైర్మల్య భావమూ, ప్రశాంతి మాధుర్యమూ కలు గకపోగా ఏమిటో ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది. నడచినంత మేర ఒక వ్యక్తి మనల్ని వెంబడిస్తూ ఉండటం గుర్తిస్తాము. "ఈ ఆలయంలో పూజారిని నేను. ఇది నాది. ఇది నా పూర్వి కుల ఆస్తి. దీన్ని ఎవరూ పంచుకోటానికి వీల్లేదు. శిధిల మౌతోందా? కాలమహిమ! పునర్నిర్మించటానికి బాగు చెయ్య టానికి ఎవరికీ అర్హతలేదు. హక్కులేదు. ఆ అర్హతగల వాళ్లె ప్పుడో మరణించారు." అంటూ గొణుగుతున్నా డా వ్యక్తి. కుపితుడూ, అనాశ్వాసిత దుఃఖపూరితుడూ అయిన ఆ బ్రాహ్మ ణునితో దైవ దర్శనార్థం గర్భ గుడి దాకా వెళ్లితే అక్కడ దీపంలేదు. పూజ లేదు. "అదిగో స్వామి! కనిపించటం లేదా మీకు? విశ్వాసంలేని మీ కెలా కనిపిస్తాడులే! ఎందుకు వచ్చి నట్లు? వెళ్లండి. వెళ్లండి" అంటూ తరుముతాడు ఆ వ్యక్తి. మనం వచ్చేస్తూంటే "అంతా నశించింది. ఏమి మిగిలింది?" అంటూ వాపోతాడు. ఆలయం వెలుపలికివచ్చి చివరిసారిగా వెనక్కి తిరిగిచూస్తే అంతపెద్ద ఆలయమూ, అందులో ఆ విచిత్రవ్యక్తి అతవిప్రక్కన ఒక చిన్న అమ్మాయీ పొడగట్టుతారు!......ఈ అను భవం మనస్సుకు నిండు దనాన్నీ హాయినీ యివ్వకపోయినా మనం దాన్ని ఎప్పుడూ మరచిపోలేము. మళ్లీ మళ్లీ జ్ఞాపకం వస్తూనే ఉంటుంది. దానితోపాటు ఎన్నో ఊహలు. ఆ ఆలయం పున రుద్ధరించి ఉంటే! ఆ విచిత్ర వ్యక్తి శాంతుడూ, గంభీ రుడూ, మృదు వచస్కుడూ అయి మనతో హృదయం విప్పి మాట్లాడిఉంటే, ఆ గర్భ గుడిలో దీపం వెలిగించి హారతి యిచ్చిఉంటే......పఠనానుభవంలో లోపించిన వాటిని గూర్చి యిలా ఎన్నో ఆకాంక్షలు! అవీ ఆ అనుభవంయొక్క వైశిష్ట్యాన్నే నిరూపిస్తాయి.

"......వాఙ్మయ మనగా నేమి? మతమును, సంఘ మును, నాచారమును, మనోహరముగా జెప్పునదియే వాఙ్మ యము. సంఘమతాచారములు తజ్జాతియొక్క యాంతర జీవితమును, దద్భావములును నాచరణకు వచ్చిన స్వరూపము. ఈ సంఘమతాచారములను నీవు కాదనుటకుముందా మహర్షుల సిద్ధాంతములను దర్క రీతిగా నిరాకరించవలయును. ఆ సంగతి యట్లుంచి యిప్పుడు వాఙ్మయ మనగా నేమి? సంఘ మతాచార ముల మనోహరమైన శబ్ద మయ ప్రకటనము. ఇంతియేకాక, శీల పోషణము, ఒకా నొక ప్రత్యేక వ్యక్తియొక్క ప్రత్యేక మాన సిక పరిణామము, కావ్యము పాఠకునికి హృదయ రంజకముగా నుండుటకు గవి చేయు కొన్ని చమత్కారములు నివియు వాఙ్మయమునందు స్థితి కలవియే......కావ్యాత్మయే కాక కావ్య శరీరము కూడ కావ్య స్వరూపము గూడ నీజాతి సిద్ధాంతముల మీద నాధారపడియుండును.........." (వే. ప. 17 ఆ.) 'వేయి పడగలు' వ్రాయుటలో విశ్వనాథ వారి ఆదర్శమేదో పై వాక్యములు స్పష్టం చేస్తున్నాయి. ఆ నవల చదవటంలో కలిగే అనుభూతి స్వరూపాన్ని పై ఆదర్శం దృష్ట్యా వివ క్షించటమే సహృదయుడైన పాఠకుడు చేయదగింది.

విశ్వనాథ 'మనోహరముగా జెప్ప బూనుకొన్నది' హిందూ సంఘ మతాచారములు, తజ్జాతియొక్క ఆంతర జీవితమూ

తద్భావముల ఆచరణము' అనేది నిర్వివాదాంశము. పోతే కావ్య శరీరము, కావ్యాత్మ, 'వేయి పడగలు'లో ఏవిధంగా అనుసంధింపబడినవో పరిశీలించవలసిన విషయం—మొదట కావ్యాత్మను గూర్చి జిజ్ఞాస.

నవలలో హిందూ వ్యవస్థా ధర్మమునకు ప్రతీక వేయి పడగల పాము! సుబ్రహ్మణ్యేశ్వరుడు. కాని వ్యవస్థా ధర్మమునకు అతీతమైనదీ, మౌలికమైనదీ—సనాతన ధర్మము. దానికి ప్రతీక శివలింగము. రచయిత ఈ రెండింటి విభేదాన్ని కథా ప్రారంభంలో మరచి పోలేదు. "జమీందారు కట్టించిన ఆలయము సుబ్రహ్మణ్యేశ్వరునిదా? నాగేశ్వరస్వామిదా? బ్రాహ్మణుడు సుబ్రహ్మణ్యేశ్వరునకు జిన్న ఆలయము కట్టించెను. కాశినుండి గొప్ప మహత్తుకల శివలింగము తెచ్చి నాగేశ్వర స్వామి యన్న పేరుతో దానికి బ్రతిష్ఠ చేసెను. ఈ దేవాలయములో నొక మూల నీ సుబ్రహ్మణ్యస్వామి ఆలయమున్నది. ...." కాని అటు తర్వాత పుటలో యిలా ఉంది. "ఈ మూడు వందల ఏండ్లలో వేయి పడగలతో భాసించిన నాగేశ్వరస్వామి సుబ్బన్నపేటమీద తన సహస్ర ఫణామండలి ఛత్రముగా జాచి యా చల్లని నీడలో నా యూరి ప్రజల జో కొట్టెను". ఇది మొదలు కథలో వ్యవస్థా ధర్మానికీ, సనాతన ధర్మానికీ అభేదమే పాటింపబడింది. ఇది కేవలం జన సామాన్యం దృష్ట్యా జరిగిందని రచయిత అక్కడక్కడ చెప్పటంకాదు. ఈ రెండింటికీ అభేదమే అన్న ధీమాతో దృక్పథంతో రచయితే వ్యవహరించారు. 'ఏకవీర' లో గల తాత్త్వికమైన స్పష్టతకూ 'వేయి పడగల'లోని అస్పష్టతకూ ఎంత దవ్వు! అనిపిస్తుంది.

ధర్మానికి ప్రతినిధి ధర్మారావు. ఏ ధర్మానికి? వ్యక్తి ధర్మానికా? వ్యవస్థా ధర్మానికా? సనాతన ధర్మానికా? ధర్మారావు ఏక వీర వలె సాధకుడుగా కనిపించడు. అతనికి సందేహాలూ, సంఘర్షణలూ రావు. కాని సనాతన ధర్మాన్ని (పూర్వ జన్మ సుకృతం వల్ల కాబోలు) దర్శించిన జ్ఞాని అని రచయిత అభిప్రాయం. అతను వ్యవస్థా ధర్మానికి సాధికార వ్యాఖ్యాత, లోక వ్యవహారానికి సాక్షీభూతుడు, అని రచయిత ఉద్దేశం. అతనిది ఆ జన్మ సిద్ధమైన జ్ఞాన మార్గం. భక్తిమార్గంలో గిరికకూ, కర్మమార్గంలో హరప్పకూ గురువట. కాని రచయిత ఉద్దేశాలు నవలలో ఎంతవరకు నెరవేరాయో పరీక్షిస్తే తెలుస్తుంది. లోక వ్యవహారానికి కేవలం సాక్షీభూతుడు అయేందుకు నిర్లిప్తత ధర్మారావు మనస్తత్వంలో లేదు. దాన్ని సాధించే పరిస్థితులూ అతని జీవితంలో లేవు. అతనిలో వ్యక్తమయ్యేది లోక విమర్శ తప్ప ఆత్మ విమర్శకాదు. పైగా స్వోత్కర్ష కావలసినంత. నవలలో చిత్రింపబడిన అతని ఇరవై ఏళ్ల జీవిత చరిత్రలో వ్యక్తిగతంగా 'జ్ఞాన మార్గం'లో అతను పొందిన పరిణామం ఏమిటో అదేమీ చెప్పబడలేదు. హిందూ వ్యవస్థా ధర్మానికి వ్యాఖ్యాతా, సొంతదారూ అనుకోవటంతో దానితో తాదాత్మ్యత చెందిన అతని అహంకారము గోరంతలు కొండంతలుగా ప్రస్ఫుటమైంది.

సనాతన ధర్మము, వ్యవస్థా ధర్మము, వ్యక్తిధర్మము ఒకటికావు, వేర్వేరు. ఈ విభేదాన్ని స్పష్టంగా లక్షిస్తూ, ఆ మూడింటి మధ్యా గల సంబంధాన్ని నిరూపించే తాత్త్వికదృష్టిని వస్తు విన్యాసంలో రచయిత పాటించక పోవడం వల్ల నవల కావ్యాత్మ సనాతన ధర్మ నిరూపణముకాదు అని తెలుస్తున్నది.

అయితే 'వేయి పడగలు' నవల కావ్యాత్మ వ్యవస్థా ధర్మ నిరూపణమా? నవలలో ఆ వ్యవస్థ స్వరూపం ఎలా వ్యక్తమైంది? "భూమ్యాకాశముల మధ్య, స్వర్గ మర్త్య లోకముల మధ్య, బ్రత్యక్ష ప్రత్యక్షముల మధ్య నొక స్థిరమైన సంబంధ మేర్పడెను..........పైని భగవంతుడు, క్రింద రాజును బ్రాహ్మణుడును, ఈ రెండు మహా సంస్థలకు మధ్య గణాచారి క్రొంచరాని లంకె". భగవంతుడు కూడ ఒక 'సంస్థ' గానే పేర్కొనబడుట గమనింపదగినది......" "ఇది నాల్గు స్తంభముల ధర్మ మంటపము: స్వామి, జమీందారు, బ్రాహ్మణుడు, గణాచారి—వీరు నల్గురు స్తంభములు." (వే. ప. 1 ఆ) "ఒక ధర్మముమీద వేయి సంస్థలు వెలసినట్లు స్వామి ఏక శరీరముపై సహస్ర శిరస్సులు ప్రకాశించెను.........ధర్మము తదాచరణ ప్రచారములు మూడును నొక్కటిగా నైయభేద తాదాత్మ్యము పొందునటులు స్వామియు, ప్రభువును, ధర్మారావును, నేక దేశగతులై ప్రకాశించిరి......" (వే. ప. 2 ఆ.) రాజు ధర్మాచరణకూ, బ్రాహ్మణుడు ధర్మ ప్రచారమునకూ ఉద్దేశింపబడినట్లు చెప్పుట గమనింపదగినది. ధర్మారావు తండ్రి రామేశ్వరశాస్త్రి. "......వర్ణాశ్రమ ధర్మము లన్నియు ముద్ద కట్టిన మూర్తి. ఆయన భారతదేశము యొక్క యాత్మ. ఆయన త్రయీ విద్య కొక వ్యాఖ్యానము." (వే. ప. 3 ఆ.) పసరిక పైరుపచ్చ. దేవదాసి. శృంగార యుతమైన భక్తి మార్గము. హరప్ప వైదిక కర్మానుష్ఠానము. గోపన్న సేవా వృత్తి. ఇట్లు వ్యవస్థయొక్క అవయవ విభాగము. ఈ వ్యవస్థకు కేంద్రంలో ధర్మారావు పాత్ర. ఇదీ పథకం.

వ్యవస్థ అంటే ఏమిటి? సంఘ మతా చారములు' వ్యవస్థా ధర్మము వాని నిర్దిష్టమైన ఆదర్శ స్వరూపము....

# వేయి పడగలు

''వేయి పడగల పాము విప్పారుకొనివచ్చి కాటందు కొన్నది కలలోన రాజును'' అంటూ గణాచారి (కాలము) సూచిస్తూం డగా ప్రారంభవౌతుంది నవల. రాజు అనగా ధర్మాచరణ. ధర్మా చరణలో జరిగిన లోపం ఏమిటి? అన్ని ప్రశ్నిస్తే నవ లలో ఆసందర్భంలో అందుకు ఉదాహృతమైన విషయం—కృష్ణమ నాయుడు రామేశ్వరశాస్త్రి మాసికముపట్ల నిర్ల క్ష్యము వహించుట, ధర్మారావు వెళ్లి అడగ్గా చివరకు ఆరు రూపాయలు ఇవ్వబడుట, ధర్మారావు ఋణగ్రస్థుడైన సంగతి గోపన్న చెప్పగా విన్న తర్వాతకాని రాజు సాహాయ్యము చేయక పోవుట. తర్వాత ధర్మారావును జమీందారు ఆదరించినా తప్పు తప్పే! ఈవిధంగా ధర్మాచరణలో లోపము జరిగినది. రాజును పాము కాటందుకొన్నది. అని ధ్వని. ఇందులో ధర్మాచరణ యొక్క సమ్యక్ స్వరూపము మనకు ఏమి తెలిసినట్లు! అలాగే రామేశ్వరశాస్త్రి 'వర్ణాశ్రమ ధర్మములు ముద్దకట్టిన మూర్తి, భారతదేశముయొక్క ఆత్మ. త్రయీ ధర్మ విద్య కొక వ్యాఖ్యానము' అను మాటలకు సమర్థన ఎటువంటిది? రామేశ్వరశాస్త్రి అందగాడు. రసికుడు, దేశము నాలుగు మూల లా తిరిగి వచ్చినవాడు. నాలుగు వర్ణాల ఆడబడుచుల్నీ పెండ్లాడి ఒక భోగాంగనను చేరదీసిన ఆయన భోగి కాని యోగి కాడు. ఆయన వితరణ బుద్ధి హద్దులేనిది. ఆయన జమీం దారు తర్వాత జమీందారు. ఆయన పాటించిన నాలుగు ఆశ్రమ ధర్మములు ఏమిటి? గృహస్థుగానే మరణించాడే! ఏవిధంగా చూచినా రామేశ్వరశాస్త్రి ఒక విశిష్ట వ్యక్తియేకాని 'బ్రాహ్మ ణుడు' అన్న ఆదర్శానికి పూర్తి నిరూపణకాదు. ఆయన చేసుకున్న వర్ణాంతర వివాహాలు, వర్ణ ధర్మాన్ని సమర్థించేవి కావు. అందుకు భిన్నమే! వర్ణాంతర వివాహాలు నేటి వర్ణ విభేద సమస్యకు పరిష్కారం సూచిస్తున్నాయంటారా మన ధర్మశాస్త్రం ఆధారంగా? ఆ పరిష్కారం ఎంతమందికి నచ్చుతుంది. దాని యొక్క యధార్థ స్వరూప మెటువంటిది? అని ప్రశ్న రావటమేకాదు, వ్యవస్థ నిరూపణ 'ఆదర్శం' నుంచీ 'యాథార్థ్యం'లోకి దిగి వస్తుంది. పోతే ధర్మారావు కూడా 'బ్రాహ్మణత్వం' అన్న ఆదర్శానికి ఎటువంటి సమర్థన? బ్రాహ్మణత్వం అంటే కేవలం 'ధర్మ ప్రచారమే'నా? ఈ విధంగా తర్కిస్తే నవలలో వ్యవస్థా ధర్మ నిరూపణము అసంతృప్తినే కలిగిస్తోంది. అంటే 'ఆకృతి' (Form) కి తగిన 'పుష్టి' (Substance) జరుగలేదు అనిపిస్తుంది.

నవలలో రచయిత సమర్థించబూనుకున్న వ్యవస్థకు ఉనికిలేదు. రామేశ్వరశాస్త్రి వర్ణాశ్రమ ధర్మములు ముద్ద కట్టిన మూర్తి కాకపోయినా ఉత్తముడైన మానవుడే. ధర్మా రావు ఇంగ్లీషు చదువుకున్నా సంప్రదాయ మెరిగినవాడు. కాని వీరెంతవరకు సమకాలీన బ్రాహ్మణ్యమునకు ప్రతినిధులు? బ్రాహ్మణ్యము సామాన్యముగా సంఘంలో ఏ స్థితిలో ఉన్నది? అందుకు సమాధానం అరుంధతి పుట్టింటివారి సంస్కారమూ ప్రవర్తనా! ''దేశములో బ్రాహ్మణేతరోద్యమమునకు నీ బ్రాహ్మణుల దుర్వృత్తియే సగము హేతువు. ధర్మశాస్త్రము పోవునది యొక మార్గమున, ఈ బ్రాహ్మణులు పోవునది మరి యొక మార్గమున. వీరియందు దయాతితిక్షాదులు లేనేలేవు. బైబిలులో చెప్పినట్లు వీరు 'మేమను'—అనగా ధనాధిదేవత—వానిని బూజింతురు......... పెట్టినచో పెండ్లి పెట్టకున్న శ్రాద్ధము. ఇది ఈ బ్రాహ్మణ బ్రువుల నడత. ఏబది యేండ్లు వచ్చి పెండ్లి చేసుకొనువారు, స్త్రీలయందును దమయందును గల దుర్నీతి గోప్యముగా దాచుకొనువారు—తమయందు బ్రాహ్మణ గుణములేదు.........బ్రాహ్మణజాతి యంతయు నశించి పోయినది'' (వే. ప. 17 ఆ.) అని ధర్మారావు వారి స్థితిని గూర్చి అంటాడు. ఇక్కడ వేయవలసిన ప్రశ్న రామేశ్వరశాస్త్రి, ధర్మారావు దేనికి ప్రతినిధులు? అని. వారి లోని మానవత్వానికీ దాని విశిష్టతకూ ప్రతినిధులే తప్ప సమాజంలో బ్రాహ్మణ వర్గానికి వారు ఏ విధంగానూ ప్రతి నిధులు కారు. అలాగే దేవదాసి వ్యవస్థకూ ఆ వర్గం మను ష్యులకూ రత్నగిరి, గిరికా ఏ విధంగానూ ప్రతినిధులు కారు.1 వారిలో ప్రకాశితవౌతున్నది వ్యక్తిగతమైన విశిష్టతే! ఇటు వంటి వ్యక్తుల ద్వారా సమకాలీన సమాజంలోని వర్ణ విభే దాలను, వర్గీకరణను సమంజసమని సమర్థించటం ఎట్లా? నవలలో ధర్మారావు ద్వారా జరిగే వ్యాఖ్యానానికి, సమర్థనకూ ఈ దోషం సర్వత్ర ఉంది. అందువల్ల నవలలో వాచ్యముగా జరిగినంతమేర వ్యవస్థ నిరూపణము యాథార్థ్యం దృష్ట్యా జరుగలేదు అని చెప్పాలి.

సామాన్యంగా ఒక కాలంలో ఆచరణ లోపించినంత మాత్రాన ఆదర్శం అనేది శాశ్వతంగా విస్మృతింపబడదు.

1. ''భోగమువాండ్రు వేఱు, వారాంగనలు వేఱు. భోగము వాండ్రు భగవంతుని సన్నిధానమున నృత్యగానములు చేయుట కేర్పడినవారు. వారాంగనలు వారిలో కులము చెడినవారు ..... ప్రపంచమున కామక్రోధాదులు బలిసి దేవునికై ప్రత్యేకింప బడిన యీ స్త్రీలు దుర్వృత్తిలోనికి దిగిరి. ధనవంతులు వారిని దించిరి.'' (వే. ప. 6 ఆ) ఇది ధర్మారావు వ్యాఖ్యానము. ఈ వాఖ్యానము దృష్ట్యా రత్నగిరిని రామేశ్వరశాస్త్రి చేర దీయుటను గూర్చి ఏమనుకోవలెను? రత్నగిరి కులము చెడినదా? రామేశ్వరశాస్త్రి కాపాడిన వర్ణాశ్రమ ధర్మ మిదేనా? వీరు వ్యవస్థకు ఎటువంటి ప్రతినిధులు?

కాలంతో పరిస్థితులతో ప్రమేయం లేకుండా మళ్ళీ మళ్ళీ ఏ వ్యక్తిలోనో ఎక్కడో ప్రత్యక్షం కావచ్చు. జమీందారు రంగారావులోని విశ్వాసం అతని కొడుకు హరప్పలో కనిపించింది కాదా! దీనికి కాలనిర్ణయమేమీ లేదు. కాని 'వేయి పడగలు' నవల నడచిన తీరు ఈ నమ్మకాన్ని అర్థాన్ని స్ఫురింప జేయటం లేదు. 'గత కాలము మేలు వచ్చు కాలముకంటెన్, అన్నట్లుగా ఆచరణ పోవటంతో ఆదర్శం శాశ్వతంగా పోయింది' మళ్ళీ రాదు అనే గాఢమైన స్ఫూర్తినే కలిగిస్తోంది. పడగలు నశించినవి. స్వామి వెళ్ళి పోయినాడు. 'ఇంకనేమి మిగిలినది?' ఇది ప్రళయం అంటున్నది.

ఏతావాతా తేలేదేమిటంటే: హిందూ వ్యవస్థయొక్క ఆదర్శాన్నీ దాని పటుత్వాన్ని నిరూపించే ఉద్దేశమే 'వేయి పడగల' కావ్యాత్మ అనటానికి, పాత్ర చిత్రణమూ, కథాగమనమూ దాని స్ఫూర్తి అందుకు భిన్నంగా ఉన్నాయి. మారుతున్న పరిస్థితుల్లోకూడా హిందూ ధర్మం సృజనాత్మకమైన శక్తే అని నిరూపణ చేసే ఉద్దేశమే నవలకు ఉన్నట్లయితే ధర్మారావు సృష్టి మరొక విధంగా జరిగి ఉండును—అతను పాత కొత్తలకు మేలు కలయికగా, సంగమస్థానంగాఉండియుండును. (ఉదాహరణకు 'మాలపల్లి' నవలలో సంగదాసు లేక రామదాసు పాత్రలను చూడవచ్చును.) కాదు ధర్మారావు కర్మయోగి కాడు, జ్ఞాన యోగి అంటేనూ ధర్మారావులో కొత్త పద్ధతులమీదా కొత్త జీవిత విధానాలమీదా అంత ద్వేషభావం దేనికి? అది జిజ్ఞాసువు లక్షణం కాదు. ధర్మారావు సిద్ధాంతరీత్యా ప్రతిపాదించిన కొత్త మార్గంతో సమన్వయ పథం ఏమీ లేదు. అతనికి కొత్త ఒక రోత, పాత ఒక నీతి !

'వేయి పడగలు' నవల ధర్మారావు జీవిత చరిత్ర. అది అతనిమనస్థితికీ, ఆ మన స్థితికి కారణములైన సాంఘిక పరిస్థితులుకూ దర్పణం. నవల కావ్యాత్మ ధర్మారావు వ్యక్తిత్వమే ! ఈ దృష్టిలో నవలను ఉపలక్షిస్తే తప్ప మనకు నవల స్వరూపం అవగాహన కాదు, దానిలోని గుణం అందదు. సనాతన ధర్మం గాని, హిందూ వ్యవస్థా ధర్మంగాని 'వేయి పడగల' కావ్యాత్మ అనుకోవటం వల్లనే పై విమర్శ బయలుదేరుతున్నది, నిజానికి కావ్యంలో ఆ రెండు గౌణమే అని చెప్పాలి. ధర్మారావు వ్యక్తిత్వమే కావ్యాత్మ అని మిగతా విషయాలన్ని దానికి సంబంధించినవేనని అంగీకరింపక తప్పదు. (అతని అభిప్రాయాలు మనకు నచ్చటం నచ్చక పోవటం అనేది వేరువిషయం) ఇలా దృష్టి మార్చుకుని చూస్తే చప్పున బోధపడుతుంది హిందూ వ్యవస్థ, సనాతన ధర్మం—వీటి నిరూపణముకలిగిస్తున్న అసంతృప్తికి ముఖ్య కారణం ఏమిటో? అవి ధర్మారావు అనే వ్యక్తి మనస్తత్వం ద్వారా మనకు దృశ్యమౌతున్నాయి. ఆ మనస్తత్వంలోని వక్రత, సంకుచితత్వము, వాటిలోనూ దృశ్యమాన మౌతున్నాయి. కావ్యం ధర్మారావు అదే వ్యక్తిత్వాన్ని మనస్తత్వాన్ని ప్రతిపాదిస్తున్నది. ఇందులో విప్రతిపత్తి ఏమీ లేదు.

''వేయి పడగలు'' గొప్పదనం అది ఏక పాత్ర చిత్రణం కావటం. ఆ చిత్రణం వేయి పుటలదాకా విస్తరించినా, వేయి పుటలూ తప్పక చదివిస్తాయి. అందులో ధర్మారావు వ్యక్తిత్వం స్పృశించని, వ్యాఖ్యానించని అంశంలేదు. ధర్మారావు గురుత్వం వహించని, సలహా యివ్వని, అతనితో సంబంధంలేని పాత్రలేదు. ఏ విధంగానైనా ధర్మారావుకు సమఉజ్జీయో, అధికుడో అయ్యే పాత్ర కనిపిస్తే, అతనికి నవలలో చరిత్రేలేదు. ఉదాహరణ రామచంద్రరాజు, కేశవరావు, శివరావు పాత్రలు. ధర్మారావు వాదంలో వోడించని ప్రతి ద్వంద్వి లేనేలేడు! (తన గొప్పదనం గుర్తించని వారిమీద 2రౌడీలను పురికొల్పేందుకైనా వెనుదీయడు. తెలుగుల జీవితాన్ని కూలంకషంగా స్పృశిస్తూ, దాన్ని ఒక ప్రత్యేక దృక్పథంనుంచీ వ్యాఖ్యానిస్తూ వచ్చే ధర్మారావు నిస్సందేహంగా మేధావి, కవి. అతని తాదాత్మ్యం ఆదర్శంతోకాదు. వర్తమానంతోకాదు, భూతకాలంతో. దాని ప్రభావం అస్తమిత సూర్యబింబంలా అతనిలో కోపారుణ కాంతుల్ని విరజిమ్ముతూ, చివరకు దుఃఖంలో చీకట్లో అంతరిస్తుంది. వెంటనే చంద్రోదయం, ఆ చంద్రుణ్ణి దర్శించటంతో కథ ముగుస్తుంది. వ్యక్తిగా ధర్మారావును మనం ప్రేమించలేకపోవచ్చు. అతని అభిప్రాయాలను అంగీకరించకపోవచ్చు. అతని అహంభావము మనకు ఎబ్బెట్టుగా వుండవచ్చు. అతనియుక్తులూ, సమయానుకూల ప్రవర్తనా, దాపరికాలు ఆదర్శప్రాయం కాకపోవచ్చు. కాని ధర్మారావు రాగ ద్వేషాలూ, రక్తమాంసాలూ. కష్ట సుఖాలూ కలిగిన మనిషి. అచ్చమైన తెలుగువాడు. వ్యవస్థా ధర్మానికీ, యోగ మార్గానికీ ప్రతినిధిగా తృప్తి కలిగించకపోయినా, తెలుగుదనం ముద్ద కట్టిన మూర్తి ధర్మారావు. అతని మనస్సు

---

2. వే. ప. 19 వ అధ్యాయంలో ధర్మారావు సారంగధర నాటకము జూడబోవును. పెద్దగా నాటకమును విమర్శించుచుండగా ప్రక్కనున్న మనిషి ఒకరు అభ్యంతరము తెలుపుతాడు : 'గోల ఏమిటని''. ధర్మారావు వెంకటేశం అనే రౌడీని, అతనిమీదికి పురికొల్పుతాడు. ఈ సంఘటన గమనించదగింది ధర్మారావు ధర్మదృష్టి ఎటువంటిదో తెలుసుకోవటానికి. ధర్మదృష్టి ఎలా ఉన్నా, ధర్మారావు 'తెలుగుదనం' నిరూపణ అవుతున్నది.

ద్వారా మారుతూ వచ్చిన తెలుగు దేశాన్ని, గతించిన వ్యవస్థనూ దర్శించే అవకాశం 'వేయి పడగలు' కల్పిస్తోంది.

నవలలో తెలుగుదేశమంటే సుబ్బన్నపేట: సుబ్బన్న పేట అంటే ధర్మారావు. ఇది కావ్య శరీరం. ధర్మారావు, పాత్ర సమర్థించినది క్రమంగా అదృశ్యమౌతున్న గ్రామీణమైన తెలుగుదనాన్ని. ఆంగ్ల భాషా, పాశ్చాత్య నాగరకతా సోకని తెలుగుదనం నిలబడలేదనే అతని ఆవేదన. అందులో లోటుపాట్లు అతనికి కనిపించవు. అదంతా హిందూ ధర్మ స్వరూపమేనన్న భ్రమా దాని సమర్థనకోసం తను అహంభావం పెంచుకున్నా ఫరవాలేదనుకోవటం తరచు భావానికంటే అహంభావమే అతనిలో ముందుకు వచ్చే పరిస్థితి కల్పిస్తోంది.3 అయినప్పటికీ పాశ్చాత్య నాగరకతా ప్రభావం ముప్పై ఏళ్లలో ఏ విధంగా తెలుగువారి జీవన విధానంలో ఒడిదుడుకులకు, అవక తవకలకు, హేతువైందో విపులంగా విమర్శనా దృష్టితో వర్ణింపబడటం కావ్యాన్ని అపురూపమైనదిగా చేస్తోంది. అలా చేస్తే 'వేయిపడగలు' ఒక చిన్న సైజు 'విజ్ఞాన సర్వస్వం' అనిపిస్తుంది. నాగరకతా చిహ్నాలు:—రైలు మార్గం ఏర్పాటు కావడం, మునిసిపాలిటీ, జాతీయ కళాశాల, క్రైస్తవుల కాలేజి, సినిమా, తాలూకాబోర్డు, నాటక సమాజాలు, నిర్బంధ ప్రాథమిక విద్య, కొళాయిలు, ఎలెక్ట్రిసిటీ, మహిళా సమాజం, పత్రికలు. కొత్త మతాలు, కేషబ్జీమతం, దివ్యజ్ఞాన సమాజం, విడి ప్రేమ, ఆర్థిక వ్యవస్థలో మార్పులు:—మెరక పొలాలు మాగాణి కావటం, పొగాకు ఫ్యాక్టరీ ఏర్పడటం, డబ్బు చలామణీ, వీటి అన్నింటిమీద ధర్మారావు వ్యాఖ్యానం వినవచ్చు. అన్నింటికీ ధర్మారావు ప్రతికూలుడే. దివ్య జ్ఞాన సమాజం అతణ్ణి ఆకర్షిస్తుంది. కాని దానికి పాశ్చాత్యులైన లెడ్‌బీటరు, బెసెంటు అధినేతలు కావటం, శివరావు తను కృష్ణావతారం అని చెప్పుకోవటం, ధర్మారావుకు నచ్చని విషయాలు. ధర్మారావు శారదా చట్టానికీ, వితంతు వివాహాలకూ, హరిజనుల ఆలయ ప్రవేశానికీ కూడా వ్యతిరేకి. ఆంగ్ల సారస్వతం చదువుకున్నా, దానిపై అతనికి ద్వేషమేనట. ఇంగ్లీషు నవలలు చదివి "తెలుగు వాని కన్న నవి చాల బాగున్నవని యతడూహించెను. స్కాటు, డికెన్సు, థాకరీ.......చదివి వారే పరమోత్తములని యూహించుచుండెను........షెల్లీ, కీట్సు, కవిత్వము, చదువును. కాని వారి శయ్యా పాకాదులెట్టివో బుద్ధి కందుటలేదు". కాని యిది తనలో అనుకోవటమే! వాదించటంలో సంకోచము లేకుండా షేక్స్‌పియర్ మొదలు అందరి కవులమీదా తీర్పు లిస్తాడు. ధర్మారావు శ్రీనాథుని సీస పద్యాలమీద వెలిబుచ్చిన అభిప్రాయాన్ని వివరించటానికి నిరాకరిస్తాడు. తెలుగు కావ్యాలమీదా, హిందూస్థానీ సంగీతంమీదా, నృత్య నాట్యాలమీదా ధర్మారావుకు అభిప్రాయాలున్నాయి.

ఇక్కడ గుర్తించవలసిన ముఖ్య విషయం ఏమిటంటే వ్యక్తి వ్యాఖ్యానాలూ, అభిప్రాయాలూ ఒక ఎత్తు, అతని ప్రవర్తన మరొక ఎత్తు అని4. కీలకమైన పరిస్థితుల్లో వ్యక్తి ప్రవర్తన ఆ వ్యక్తి ఎటువంటివాడో తెలిపినట్లు, మిగతా విషయా లేవీ తెలియజెయ్యవు. ధర్మారావు జమీందారీ వ్యవస్థపై మమకారం వదిలించుకోలేని వ్యక్తి. ఇది సహజమే అతని పరిస్థితుల్నిబట్టి. కాని అతని మనో వైఖరి ఎటువంటిదో చూడండి : జమీందారు కృష్ణమనాయుడు ధర్మారావు తండ్రి కర్మకు డబ్బు యిచ్చినా, మాసికం విషయం మాట్లాడడు. ఎదురుచూచి చివరకు విధిలేక ధర్మారావు కోటలోనికి వెళ్తాడు. అతణ్ణి చూచి నాయుడు "పనియేమిటి?" అని యడిగెను. ధర్మారావు "రేపు నాయనగారి మాసికము" అనెను. నాయుడు డబ్బిప్పించెను.......దీనినిగూర్చి ధర్మారావు తర్వాత ఊహించునది : "ఆయనయే యిచ్చెను. నేను యాచించలేదు. మాసికమునకు యాచించితినా? లేదు. పోయి యూరకే చెప్పితిని. ఆయనయే యిచ్చెను." భంగపడిన అహంభావానికి సమర్థన చెప్పుకో చూస్తాడు ధర్మారావు. అతనిలో స్వాభిమానము మెండు. దానికి బాధాకరమైన సత్యాన్ని దర్శించే ధైర్యం, సాహసం అతనిలోలేదు. ఆ పరిస్థితిలో యుక్తులతో, ఆలోచనతో సత్య స్వరూపాన్ని భిన్నంగా తనకనుకూలంగా దర్శించే ప్రయత్నం చేస్తాడు. అందువల్లే అతని ప్రవర్తన కూడా సమయానుకూలంగా ఉంటుంది. కార్యమునాడు నవరసు భార్య కొంగున కట్టలేదు. అత్తవారు, బంధువులు ప్రశ్నించగా 'నిజమే కట్టితి'నని బుకాయిస్తాడు. అత డబద్ధమాడడని అందరి నమ్మకమట! ఆ నమ్మకాన్ని అలా ఉపయోగించుకుంటాడు. ధర్మము, భగవంతుడు ధర్మా

---

3. Those who love their sects more than truth end by loving themselves more than their sects.

—S. Radhakrishnan : The Hindu View of life.

4. After all, what counts is not creed but conduct.... Religion is not correct belief but righteous living.

—S. Radhakrishnan : The Hindu View of life.

రావు నాశ్రయించినవారేగాని, ధర్మారావు వాని నాశ్రయించి నట్లు తోచదు. "ఆ ప్రభువు దీన దయాపరుడు. ఒక కాలు విరిగి కూడ నింకను నన్నే పట్టుకు వ్రేలాడుచున్నాడు..... ఎప్పుడు నా కిదివరకు గనిపించలేదు. ఇదే మొదటిసారి. ఆయన నా మనసులోనే యుండెను. వేరే కనిపించుట ఎందులకు?" అంటాడు భార్యతో. ఆమె ప్రశ్నిస్తుంది : "మా వాన్నయు, నమ్మయు, మామగారి నప్పు డప్పుడేమైన నను చుందురు. వారి కెప్పుడును (పాము) కనబడలేదేమి?" దీనికి వ్యవస్థా ధర్మ వ్యాఖ్యాతయైన ధర్మారావు సమాధానము : "మన పిల్లవాండ్రు తప్పు చేసినచో మనము కోపపడుదుము. కొట్టి బుద్ధి చెప్పెదము. ఎదుటివారి పిల్లలు తప్పు చేసినచో మనము కొట్టుదుమా? కొట్టినచో వారి తలి దండ్రులతో తగాదాకాదా?" ఈ పాము హిందూ వ్యవస్థ స్వరూపము కాదు, కేవలం ధర్మారావు కుటుంబానికి చెందినది, ప్రత్యేకము (Private) అని తెలియటంలేదా? అరుంధతి నవ్వు వల్ల భంగపడిన వంశ గౌరవాన్నీ, స్వాభిమానాన్నీ పాము ద్వారా ధర్మారావు నిలబెట్టుకోగలిగాడు! ఈవిధంగా పాము ఉపయోగం కథలో ధర్మారావుకు ఎంతోఉంది!

ధర్మారావు యింగ్లీషును ద్వేషించినా, దాన్ని నేర్చుకోవటం, బి. ఏ చదవటం మానలేదు. అతను చదివే కళాశాలలో రెండు సందర్భాలలో సమ్మె జరుగుతుంది. మొదటిసారి ఉపాధ్యాయుడు తిట్టినందుకు. ఇక్కడ ఉపాధ్యాయునికి ప్రిన్సిపాలు మద్దతులేదు. ధర్మారావు సమ్మెలో చేరుతాడు. విద్యార్థులు గెలుస్తారు. రెండోసారి హిందూ మతాన్ని అవమానిస్తూ క్రైస్తవ విద్యార్థులు ప్రవర్తించినందుకు, హిందువులైన విద్యార్థులు సమ్మె చేస్తారు. ప్రిన్సిపాలు జరిమానా వేస్తాడు. సమ్మె కొనసాగించాలా? వద్దా? అనే ప్రశ్న వస్తుంది. ధర్మారావు సమ్మెలో చేరడు. "జరిమానాలిచ్చి కళాశాలలకు నడువుడు........ఎదిరించి నీవేమైన జేయగలవా?" అంటూ కర్తవ్యం ఉపదేశిస్తాడు. ఇక్కడ ధర్మరక్షణకంటె ఆత్మ రక్షణ ప్రధానమైనది! ధర్మారావునకు హిందూధర్మముతో తాదాత్మ్యము అది తనకుపయోగపడు నంతవరకే. దానికి తను ఉపయోగపడవలసి వచ్చినప్పుడు వాగ్వాదము, వ్యాఖ్యానము కావలసినంత! ఇక్కడ అసలు విషయం, జమీ లేకపోయినా ధర్మారావు జమీందారుబిడ్డ. కష్టముల నెదుర్కోవటంకంటె వాటిని తప్పించుకోవటమే అతని స్వభావం!

ధర్మారావు కవి, భావుకుడు. అతని పద్యాలేమీ ఉదాహరింప బడకపోయినా అతని భావనా శక్తి, ఆలోచనా శక్తి వ్యాఖ్యానములో సమర్థనలో వ్యక్తమవుతూనే ఉంటుంది ఆ భావనా శక్తివల్లే అతనికి తను జ్ఞానయోగిననే భ్రమ. ధర్మావతార మెత్తిన భగవచ్ఛక్తిననే గర్వము. అతను గిరికతో అంటాడు : "నాదారి (జ్ఞానం) తేలిక, నీదారి (భక్తి) కష్టము. నిజానికి యోగమార్గంలో ఏ దారి కష్టం దానిదే. వ్యక్తి స్వభావాన్నిబట్టి దారి. ధర్మారావుకు తను కష్టపడి సాధించదగిన దేమీ మిగిలినట్లే తోచదు! ధర్మార్థ కామమోక్షములను పురుషార్థాలలో ధర్మారావు యిటు అర్థంకోసం కాని అటు మోక్షం కోసంకాని ప్రయత్నం చెయ్యడు. తను ధర్మావతారము. పెళ్ళి చిన్నతనంలోనే జరగటంవల్ల కామానికి యిబ్బంది లేదు. ఇక సాధించవలసినదేమి? లోకానికి గురువు కావటం. అందువల్లే నవలలో చాల భాగం ధర్మారావు సుబ్బన్నపేట వీథిలో నడుస్తూ, వెంట హరప్ప, గిరిక, గణాచారి, కుమార స్వామి, కిరీటి, ఎవరితోనో ఒకరితో కనిపిస్తూ దేవాలయానికి వెళ్ళి వస్తూ ఉంటాడు. స్వామికి ఉత్సవాలు జరిపించటం తప్ప అతను చేసిందేమీలేదు. కుమారస్వామికి వివాహం కావటానికి చేసిన సాహాయ్యము లది సగము ప్రత్యర్థులపై సము రోత్సాహమే. పోతే ధనికురాలైన 'సతిరి' మంగమ్మను గూర్చి కుతూహలం కూడా ఒక కారణం.

ధర్మారావు చరిత్రలో అర్థంకాని విషయం అతను భార్య ఆరోగ్యంపట్ల చూపిన అశ్రద్ధ. పదేళ్ళ ముందుగా ఈ 'జ్ఞానికి' గణాచారి 'హెచ్చరిక' యిచ్చినా ఆ విషయాన్ని ధర్మారావు పట్టించుకోడు. ఇది నవలలో 'కర్మ' సిద్ధాంతానికి వ్యాఖ్యానముకాదు గదా! ధర్మారావు దారిద్ర్యము అతని అశ్రద్ధకు కారణం అనుకోవచ్చు. కాని కొన్ని సందర్భాల్లో ధర్మారావు చూపిన నిర్లక్ష్యము సమర్థనీయంగా తోచదు. భార్యకు స్వస్థత చెడిన కాలంలోనే ధర్మారావు యింటికి ఆలస్యంగా రావటం జరుగుతూ ఉంటుంది....ధర్మారావు మంగమ్మతో నలుగురి ఎదుట మాట్లాడడు. కాని మంగమ్మ చివరకు కుమారస్వామితో 'రహస్యము' చెబుతుంది : "ప్రతి దిన మర్థ రాత్రమున నేను ధర్మారావుగారి శిష్యురాలను. మూడవ కంటికి దెలియదు." (వే. ప. 24 అ.) ధర్మారావు ప్రవర్తనలో ఈ భాగము ఎలా అర్థం చేసుకోవాలి?

పై పరామర్శ ధర్మారావు వ్యక్తిత్వంయొక్క స్వరూపం ఏమిటో క్లుప్తంగా ప్రవర్తననుబట్టి తెలుపుతోంది. ధర్మారావు ఆదర్శ మానవుడు కాకపోవచ్చు. కాని అతని వ్యక్తిత్వమూ అస్తిత్వమూ, సిద్ధాంతాలనూ, అభిప్రాయాలనూ అధిగమించిన సత్యం అని నవలలో ఋజువౌతున్నది. ధర్మారావు ధర్మ దృష్టికి స్పష్టత లేకపోతేనేం? అతని మూర్తి మన కన్నుల యెదుట స్పష్టంగానే ఉంది. కావ్యాని కిది చాలు.

ధర్మారావుతోబాటు విశ్వనాథ సృష్టించిన పాత్రలు చాలవరకు సజీవమైనవి. హరప్ప, గిరిక పాత్రలకంటె అరుంధతి, రామేశ్వరం, మంగమ్మ, కుమారస్వామి ఎక్కువ నిండు దనం గలిగిన పాత్రలు. హరప్ప గిరికలు సిద్ధాంతాల దృష్ట్యా తీర్చి దిద్దబడటంవల్లే బొమ్మల్లా ఉన్నారు. పసరిక విశ్వనాథవారి ప్రత్యేక సృష్టి. మెచ్చుకోదగింది. షేక్స్‌పియర్ 'టెంపెస్ట్' నాటకంలో చేసిన ప్రత్యేక సృష్టి 'కాలిబన్'ను జ్ఞాపకం తెస్తుంది. 'ఏకవీర' లో గుర్రపు వాళ్లపిల్ల అమృతాన్ని ప్రవేశ పెట్టినట్లు మంగమ్మతో 'వాలి'ని ప్రవేశ పెట్టడం, దాని ద్వారా మంగమ్మ 'మనస్సు'ను అభివ్యక్తం చేస్తూ ధ్వని పూర్వకంగా కవి చేసిన రచన నవలలో ఉత్తమమైనది. చెంగల్రావు పాత్రలోని విశిష్టతా, అతణ్ణి తృతీయా ప్రకృతి అంటూ ధనికురాలైన స్త్రీవ్యవహార దక్షత సంపాదించటంతో ఆమెలో తోచే పురుషత్వాన్ని గూర్చి వ్యాఖ్యానించిన తీరూ, అందుకు తగినట్లే చెంగల్రావు చేతిలో మంగమ్మ మరణం, విశ్వనాథవారి ప్రతిభకూ, ఔచిత్య పోషణకూ తార్కాణం. నవలలో ఋతువులూ, వెన్నెలా, ఎండా, రాత్రీ, పగలూ వర్ణింపబడిన తీరును గూర్చి ప్రత్యేకంగా చెప్పవలసిన పని లేదు. మనిషికీ ప్రకృతికీ రాను రాను నాగరకతవల్ల ఎంతటి దూరం ఏర్పడుతోందో పసరిక మరణం వల్లేకాదు, వర్ణనల వల్ల కూడా నాగరకతా వ్యామోహితమైన పాఠకుని మనస్సుకు తట్టుతున్నది.

''వేయి పడగలు' కాల్పనికోద్యమ కాలంలో వెలువడిన ఆత్మాశ్రయ కవిత్వ (Subjective Poetry) శాఖలో ఒక అపురూపమైన కావ్యం. దాని వైశిష్ట్యం అది వేయి పుటల నవలగా రూపొందటమే. తెలుగు దేశంలో శిథిలమై అదృశ్యమౌతున్న పూర్వ నాగరకత చివరి మెరుగుల్ని చూచిన విశ్వనాథ హృదయం సంక్షోభించి వెలువడిన సుదీర్ఘ నిశ్శ్వాసమే 'వేయి పడగలు'. ఆ నిశ్శ్వాసంలో తోక త్రొక్కిన త్రాచు కస్సు మనటమూ, ఆశ వదలుకొన్న ప్రేమికుడి నిర్వేదమూ అనుభూతమౌతున్నవి. కావ్యంలో ఎంత నిస్పృహ ఉన్నా, కావ్యాంతంలో 'ఒక మహానంద రేఖ' కాదుగాని ఒక ఆశా రేఖ ఉండనే ఉన్నది. కాని అది సమాజానికి సంబంధించినది కాదు. వైయక్తికమైన దన్న విషయం గుర్తించాలి. 'వేయి పడగలు' నవలకు ఆలంబనము ఒక తాత్త్విక దృక్పథముకాదు. ఒక వైయక్తిక హృదయోద్వేగము. కాని ఎటువంటి హృదయోద్వేగము! దాని లయ, సంగీతము మహా సముద్రానివి. మృత్యు ఝుంఝుం ప్రసరిస్తున్న మహా సముద్రానివి! రామేశ్వరశాస్త్రి, కృష్ణమనాయుడు, రంగాజమ్మ, రుక్మిణమ్మారావు, సరోజినీదేవి పూర్వ యుగపువారు : వారి మృతి తర్వాత గుండేరు వరద—దేవదాసి, గోపన్న, అరుంధతి, హరప్ప, పసరిక, గణాచారి కొత్త యుగములో పాత యుగపు చివరి మెరుపులు : వారి మృతి తర్వాత గుండేరు వరద—మిగిలినది ధర్మారావు, చిన్న అరుంధతి. మొదటి వరద నాటికి రంగారావు పాశ్చాత్య యువతిని భార్యగా దెచ్చుటతో వచ్చిన కొత్త పోకడలు క్రమంగా ప్రబలమై రెండవ వరద నాటికి క్షీణించి తగ్గుముఖము పట్టినవి. రెండు గుండేరు వరదలూ విభజన బిందువులుగా ఆది మధ్యాంతాలు విస్పష్టమౌతున్న కథలో ఆదిలో పెద్ద అరుంధతి కార్యము, అంతములో చిన్న అరుంధతి కార్యము. కాలము మొదలూతుదా అలా ధర్మారావులో సమీకరించినవి. ధర్మారావు ఆదిమధ్యాంతాలలో మార్పు లేని 'పురుషుడు. అరుంధతి 'ప్రకృతి'. మార్పు ప్రకృతి లక్షణము.5 పెద్ద అరుంధతి పునరావృత్తి చిన్న అరుంధతి. ఇది 'వేయి పడగలు' గా వెలువడ్డ విశ్వనాథవారి హృదయోద్వేగ తరంగరేఖ.6 ఇదే కావ్య స్వరూపం.

తులనాత్మక విమర్శ దృష్ట్యా ధర్మారావు పాత్రకు సాటి రవీంద్రుని గోరా. ''అయ్యా! ఒక్క వ్యక్తికి మర్యాదోల్లం

---

5. ''నేను మంచమున మృత్యు దేవతకు సన్నిహితురాలనై యున్నాను. అనార్తవమైన పుష్పమువలె నిత్య వికాసము చెడని మీ రిచట నున్నారు. ఎన్నటి కైన ప్రకృతి చెడునుగాని, పురుషుడు చెడడుకదా!'' (వే. ప. 32 అ) అరుంధతి మరణశయ్యపై ధర్మారావుతో అను మాటలు.

6. "Rhythm, for the Hindu, is the essence of life itself. There is the rhythm of the seasons, so markedly overpovering in most of India. There is the rhythm of reincarnation with recurring birth and death. And then there is the cosmic rhythm of creation and dissolution. Human life is Completely dominated by this pulsating rhythm in micro-and macrocosmos. It is a pulsating movement, continually repeating itself, and propelling itself along a circular route that brings one always back to the point of departure...Human life and love seen from this rhythmic stand-point can be pathetic and poignent, but never really tragic." (Joseph Jordens: Shakuntala-Rhythm, fluidity, Harmony, pub. in QUEST, July-Sept 1964.)

ఘనము జరిగినదని మీ రింత కష్టపడుచున్నారే! మీ భావముల వలన, మీ ప్రవర్తనలవలన నొక మహా దివ్య సంఘమునకు నాపత్తు కలుగుచున్నది. మీరు సంఘ మర్యాదోల్లంఘనము చేయుట తప్పులేదుకాని, నేను వ్యక్తి మర్యాదోల్లంఘనము చేసితినని మీకు గోపము......" అను ధర్మారావు మాటలు బ్రాహ్మసమాజమువారిపై కాలు దువ్వు గోరా మాటలవలెనే ఉన్నాయి. కాని యిద్దరి వ్యక్తిత్వాలూ భిన్నము. ధర్మారా వెంత తెలుగువాడో గోరా అంత వంగీయుడు. గోరా చేరుకున్న గమ్యస్థానము : "సర్వ ధర్మాన్ పరిత్యజ్య......". ధర్మారావునకు సర్వ ధర్మములు తనే నన్న భావము. ధర్మారావు పయనించనేలేదు. ఇక గమ్యస్థానము చేరుకోవడ మెక్కడ? "సర్వథాచ్యుతమైన మొగిలు కొండ కొమ్మునుండి జారి జారి ఝరిణీరూపమున గాలు నిలువ ద్రొక్కుకొన లేకుండ నూరకే ప్రవహించుటకే ప్రవహించినట్లు" స్రవించి పోవుట ధర్మారావు స్వభావము. ఈ భేదమే రవీంద్రుని విశ్వకవిని చేసినది: ఆయనకంటె ప్రతిభావంతుడైన విశ్వనాథను తెలుగు కవి సామ్రాట్‌గానే నిలిపినది. 'నౌకాభంగము" నుండి 'గోరా' వరకు రవీంద్రు డెన్ని మెట్లు పైకెక్కెనో, 'ఏకవీర' నుండి 'వేయి పడగల' వరకు విశ్వనాథ అన్ని మెట్లు క్రిందికి దిగెను.

నవ్యాంగ్ల నవలా రచయితలలో ప్రముఖుడైన డి. హెచ్. లారెన్స్ వ్రాసిన "The Rainbow" (ఇంద్ర ధనుస్సు) నవల కూడా ఈ సందర్భంలో జ్ఞాపకం వస్తుంది. స్వర్గ మర్త్యలమధ్యా, ప్రకృతి మానవుల మధ్యా ఏర్పడి ఉండిన మహైక్యము మూడు తరములలో ఎట్లా పారిశ్రామికమూ, మేధా ప్రధానమూ అయిన నాగరకతా ప్రభావంవల్ల విచ్ఛిత్తి చెందిందో చిత్రించే కావ్యం "ది రెయిన్ బో". అందులో మొదటి అధ్యాయంలోని వాక్యాలు: "They knew the intercourse between heaven and earth, sunshine drawn into the breast and bowels, the rain sucked up in the day time, nakedness that comes under the wind in autumn....Their life and interrelations were such..." "వేయి పడగల'లో మొదటి అధ్యాయములోని వాక్యాలు : "ఈ రీతిగా భూమ్యాకాశముల మధ్య స్వర్గ మర్త్యలోకముల మధ్య ప్రత్యక్ష ప్రత్యక్షముల మధ్య నొక స్థిరమైన సంబంధ మేర్పడెను. "లారెన్స్ వ్రాసిన నవలలో కేంద్రస్థమైన ప్రతీక కేథీడ్రల్ (చర్చి). విశ్వనాథవారి నవలలో కేంద్రస్థమైనది దేవాలయము. ఇంగ్లీషు నవలలోనూ 'లయ' ఉన్నది. ఆ నవల ముగింపూ ఆశారేఖ (ఇంద్రధనుస్సు) దృశ్యం కావటంతోనే. రెండు నవలల చివరి వాక్యాలూ ఆశాభావాన్ని వ్యక్తం చేసేవే: "She saw in the rainbow the earths new architecture, the old, brittle corruption of houses and factories swept away, the world built up in a living fabric of Truth, fitting to the over-reaching heaven." (The Rainbow). "అరుంధతి యతని కన్నులలో గన్నులుంచి 'నేను మిగిలితిని' అనెను. ధర్మారావు—అవును నీవు మిగిలితివి. ఇది నా జాతి శక్తి. నా యదృష్టము. నీవు మిగిలితివి.' రెండు నవలల తుది విశ్వాసమూ, వివాహ వ్యవస్థయే. 1915 లో ప్రకటింపబడిన 'ది రెయిన్‌బో' మొన్నటి (1955) దాకా సరియైన విమర్శకోసం వేచియుండవలసి వచ్చింది. నవలకు కవిత్వ గుణమబ్బుట 20 శతాబ్ది సాహిత్యములో ఒక మహత్పరిణామము. తెలుగు సాహిత్యములో స్వతంత్రముగ ఈ పరిణామం తెచ్చిన ఖ్యాతి విశ్వనాథవారిది.

[స శే ష ం]



## కుపితోక్తి

సించిన హృద్గతరాగ రేఖ దీ
పితమయి యంతలో మలిన
పిష్టము వోలిక నైన యట్లు చే
సితి విధియేమి సృష్టి; విర
చించితి వెట్టి జగమ్ము నిక్కుడన్.

నీవున్నావని నిన్ను నమ్ముకొని
యుంటిన్ తండ్రి! ఒక్కప్పుడ
న్నా! వున్నట్టిడు నీవు లేవనుచు
నంతర్ఘోర ప్రారబ్ధ బా
ధా విస్ఫూర్తిని యెంచియేడ్తు
పరిమూఢంబైన చిత్తంబునన్
నీవై రాగ్యము చేత మోహమున
వంచింతే ననున్ దీనునిన్.
నిన్నెన్ గాక మరేరినందును
వ్యథానిర్నిద్రమైనట్టి యే
తెన్నుల్ లేని జగంబునందున
మరిన్; తీర్పారి తామే ధరా
సన్నస్వాములు గాగ నైన బృవులన్
సంధానమున్ చేతునో
ఉన్నిద్రంబగు కోపతాప
విధురాత్మవ్యక్తిన్ ధృఢవ్యక్తతన్.

అక్కటా! యేమి జీవితము
నచ్చులు పోసితి; వేమిచేసినా
విక్కడ; నిన్ను నన్నుఫల
మేమి ప్రభూ! చిరునవ్వు రేఖలన్
నిక్కిన నీ సుఖం పడెదు
నిశ్చల చిత్తములోన సుఖ క్రియా
భాక్కుపితోక్తు లింతపడి
వచ్చిన నీదుమహాత్మ్య దీప్తికిన్.

## నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు 3:

# విశ్వనాథవారి మూడు నవలలు

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

### చెలియలి కట్ట

'వేయి పడగలు' తర్వాత విశ్వనాథ వ్రాసిన నవలల్లో గమనింప దగినవి 'చెలియలి కట్ట', 'స్వర్గానికి నిచ్చెనలు', 'తెఱచిరాజు'.* వీటికి బీజనిక్షేపము 'వేయిపడగల'లోనే జరిగిందని చెప్పవచ్చు. మంగమ్మ ఉదంతము, శివరావు దివ్యజ్ఞాన సమాజపు ధోరణి, కుమారప్ప నాట్యకౌశలము మూడూ మూడు నవలలుగా విస్తృతమైనట్లు అనుకోవచ్చు. కాని ఈ నవలల స్థాయి వేరు. కవితా లక్షణం కాని, నిర్మాణ వైశిష్ట్యం కాని ఈ నవలల్లో కానరాదు. 'చెలియలి కట్ట'లో సముద్రాన్ని బైరాగిని ప్రవేశ పెట్టడం కవిత్వం యొక్క చివరి మెరుపు. మిగిలిన రెండు నవలల్లో అదీ లేదు. హిందూ ధర్మమనే మేలిముసుగుతో 'వేయి పడగల'లో రొమాంటిక్‌గా కనిపించిన జమీందారీ వ్యవస్థ నగ్న స్వరూపమేమిటో 'తెఱచిరాజు' నవలలో చూడవచ్చు. మతవ్యవస్థను అపహాస్యం పాలు చేసే నవల 'స్వర్గానికి నిచ్చెనలు'. ఈ నవలల్లో రచన కేవలం మేధా స్పష్టం కావటమే కాదు. విశ్వనాథ మనస్సులో నున్న 'కలవరము'ను వ్యక్తం చేస్తోంది. ఇవి విశ్వనాథ వ్యక్తిగతమైన అన్వేషణను ప్రతిబింబించే నవలలు.

'మనసులో కలవరమున్నది
కడలిలో కలవరమున్నది
మనసులోకపు హద్దులో విరుగున్
కడలి చెలియలి కట్టలో విరుగున్'

వ్యక్తికీ వ్యవస్థకూ గల విభేదం గుర్తించలేక పోవటం 'వేయి పడగల'లో ఉన్న భ్రాంతి అయినట్లే, ఆధ్యాత్మికమైన అంతర్నియమానికీ లోకపు హద్దుకూ గల భేదం గుర్తించలేని భ్రాంతి ఈ నవలల్లో ఉంది. మనసు లోకపు హద్దుల్లో విరగటానికి హేతువు భయం! ఆ భయం ద్వారా ఆధ్యాత్మిక సాధన జరగదు! 'ఏకవీర'లోని దర్శనము, 'వేయి పడగల'లో అభినివేశముగా దీపించి, తర్వాతి నవలల్లో కలవరముగా అన్వేషణగా మారి పోయింది. ఇది విశ్వనాథలో దృక్పథ శైథిల్య క్రమము.

మిల్టన్ తన 'పారడైజ్ లాస్ట్' (Paradise Lost)లో సృష్టించిన సైతాన్ పాత్ర (Satan) కవి ఉద్దేశానికి భిన్నంగా, అంటే వీరోచితంగా ఆకర్షణీయంగా, రూపొందటం వల్ల "He was of the Devils party without knowing it" అన్న విమర్శ వచ్చింది. కొంత వరకు ఆ విమర్శ విశ్వనాథ వారి ఈ మూడు నవలలకూ వర్తిస్తుంది.

'చెలియలి కట్ట'లో వస్తువు వివాహ వ్యవస్థ, ప్రేమ వివాహ వ్యవస్థకు పారమార్థికమైన ప్రయోజనం ఉందనీ, స్త్రీ పురుష సంయోగము ప్రకృతి పురుషుల సంయోగము వంటిదనీ 'వేయి పడగల'లో ఒక చోట తన విశ్వాసాన్ని ప్రకటిస్తూనే, అయితే అది అందరికీ అందుబాటులో లేని ఆదర్శమనీ వెంటనే సవరణ కూడా ప్రవేశ పెట్టారు విశ్వనాథ. "ప్రతి నీచ సంయోగమున నీ తత్త్వమున్నదని మిథ్యాయోగులు వాదించవచ్చును. అట్లు వాదించుట చెరువునకు

---

* ఈ నవలల్లో ఏది ముందు ఏది వెనుక వ్రాయబడిందో తెలుసుకోవటానికి ప్రకాశకులు తర్వాతి ముద్రణల్లో మొదటి ముద్రణ సంవత్సరం వెయ్యక పోవటం వల్ల ఇబ్బంది కలుగుతోంది. ప్రకాశకులు ఈ విషయం గమనిస్తారని ఆశిస్తున్నాను.

సముద్రమునకు భేదము లేదని వాదించుట. అనంత గ్రీష్మ ముల కెండనిది, నానా మహాజంతు నివాసభూమి యైనది, నానా ద్రవ్యగుణ మయమైనది, యనంత జలమూర్తికే సాగరత్వ సిద్ధి. కించి దూనములకును గావచ్చును. అందు కనియే అరుంధతీ ధర్మారావుల సంయోగము బ్రహ్మానంద సబ్రహ్మచారి యయ్యెను.'' (వే. ప. 7 అధ్యా) ఇక్కడ అరుం ధతీ ధర్మారావులు ఏ విధంగా అనంత జలమూర్తులో, సాగరత్వ సిద్ధికి 'కించిత్' అంటే ఎంతలో తప్పినవారో ఏమీ నిరూపణ కాలేదు. చెరువుకూ సముద్రానికీ గల భేదం కేవలం పరిమాణ భేదమా ? లేక తత్త్వ భేదమా ? అయితే ఉదేటు వంటిది ? ఇటువంటి వివేచనకు జిజ్ఞాసకు 'వేయిపడగల'లో అవకాశం లేక పోయిందనుకున్నా, 'చెలియలి కట్ట'లో కథా వస్తువు దృష్ట్యా, ఎంతో అవకాశం ఉంది. కాని అదేమీ జరగలేదు. కారణం విశ్వనాథలో ధర్మమునకూ విశ్వాసానికీ గల అంతరం, తర్వాత విశ్వాసానికీ దాని నిరూపణకూ గల అంతరం. దర్శించిన తత్త్వాన్ని సంపూర్ణంగా విశ్వసించలేక పోవటం, విశ్వసించిన దాన్ని లక్ష్యశుద్ధితో నిరూపించలేక పోటం— ఇది విశ్వనాథ రచనల్లో వ్యక్త మవుతూ వచ్చే శైథిల్యం.

అందువల్లే, స్త్రీ పురుష సంయోగము బ్రహ్మానంద సబ్రహ్మచారి కావటంలోనే వివాహం యొక్క పరమార్థం ఇమిడి ఉంది అనే భావాన్ని నిరూపణ చెయ్యటానికి విశ్వనాథ అసలు పూనుకోలేదు. వివాహ వ్యవస్థను, పవిత్రతా ధర్మాన్ని విశ్వనాథ సమర్థించిన విధానం చూడండి : భర్తమాట భార్య వినాలి లేపోతే తంతాడు, ఒక వేళ తన్నలేకపోతే కనీసం అతనంటే గౌరవం కలిగి ఉండి అందువల్లనైనా భార్య అతని మాట వినాలి. వివాహం అనేది నుదుటి వ్రాత. . . సౌందర్యము నకు సార్థకత లేదంటావా ? అది ధనవంతులకు గాని పేద వారికి కాదు ! సౌందర్యమనఁనేమి ? అది దేశ కాలములను బట్టి మారు నవన్, అశాశ్వతమైనవి. . . సౌందర్యమును తలదన్నినవి విద్య, అధికారము కాగూడదా ? ఊహలు అందరకూ సహజము. ఎవరికేది ప్రాప్తియో వారికది లభిస్తుంది. . . ఒకవేళ మనస్సు నకు నచ్చిన వాడే దొరికినా, వానికి ఏ పక్షవాతమో, సూచి కమో వస్తే ఏమవుతుంది ? అందువల్ల జరిగేదే వివాహ మనీ, తాళి కట్టిన వాడే భర్త అనీ, దైవమనీ భయభక్తులతో మెలగాలి. . . ఇదంతా నవలలో సరస్వతి పాత్రకు ఉచితమైన వాదంగా ఆమె ద్వారా రచయిత ప్రవేశ పెట్టడమే కాదు, ఇంతకు పై స్థాయిలో వివాహాన్ని గూర్చి రచయిత చేసిన వాదం నవలలో ఎక్కడా లేదు !

ఈ భావాలను క్రమంగా విస్తృత పరచటమే కథ. వివాహానికీ లైంగిక వాంఛా ప్రవృత్తికీ గల సంబంధాన్ని గూర్చిన వివరణ ఇలా ఉంది. ''వాంఛ మనస్సులో కలుగును. మనస్సు క్రొత్త దానికి రసించును. ప్రాతదానికి రసింపదు. పరిచితమైన వస్తువునందు మనస్సు పరిచితము కాని వస్తువు నందువలె వ్యగ్రత బొందదు. పరిచితమైన వస్తువునందు వ్యగ్రత పొందుటకు మనస్సుకు నిత్య దోహదము కావలయును. ఆ దోహదమే భార్యా భర్తలకు సమ సుఖ దుఃఖమైన జీవితము గలిగి యుండుట. తామిరువురు భార్యా భర్తలమని, తమకు గలిగిన సంతతి వలన తమకు, పుణ్యలోకములు ప్రాప్తించునని మొదలయిన విషయముల నిశ్చలమైన భావన. నిజముగా పుణ్య లోకములున్నవో లేవో అనుమాట నట్లుంచి, వారి లింగ మయమైన వాంఛా విషయమును నిరంతరముగ బోషించు దోహద విశేషము. . . . . .'' (7 అధ్యా) పుణ్యలోకముల మీద విశ్వాసము లైంగిక వాంఛకు నిత్యము దోహదము చేయునట ! ఇది ఏ పాటి సత్యమో అందరికీ తెలుసు ! అది అలా ఉంచి, ఆధ్యాత్మిక వాదం తలక్రిందులైన వైనం చూడండి : శారీరక మైన వాంఛా ప్రవృత్తిని నియమించి అధిగమించే సాధనము కాదు గాని, పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయనే నెపంతో పదేపదే సంతాన వృద్ధి చెయ్యమని కల్పించిన వ్యవస్థట వివాహం ! కాబోలు ! ! అందుకే నిగ్రహం లేక మూడో పెళ్లి చేసుకున్న సీతారామయ్యా, ధర్మం తెలియక పోయినా సంప్రదాయంలో ఉండి యాంత్రికంగా పిల్లల్ని కనే రాజ్యలక్ష్మి, జ్ఞానసము పార్జనం చేసి వైరాగ్యాన్ని పొందిన రత్నావళి కంటె అధికు లైనట్లూ, పుణ్య లోకాలనేవి వాళ్లు రత్నావళికి పెట్టవలసిన శిక్ష 'అయినట్లూ కథ ముగింపులో చిత్రించటం ! ఇదేనా విశ్వనాథవారి ఆధ్యాత్మిక వాదం ?

''స్త్రీ పురుష వాంఛయు సర్వత్ర యొక్కటియే. కాని దాంపత్యమునందు విశేషము. తల్లిదండ్రులు కూర్చిన దని, ఒక కులము వారని, అది సంఘమర్యాద యని, అది మన పూర్వులు పుణ్యలోక హేతువని చెప్పిరని, ఈ కారణములచేత దంపతుల మధ్య వాంఛ యెడబాయ రానిది'' (7వ అధ్యా.) ఇది వివాహ వ్యవస్థను కేవలము ఒక 'లోకపు హద్దు'గా వాంఛకు లైసెన్స్‌గా నిరూపించటం. దీనికి వ్యక్తి యొక్క ఆధ్యాత్మిక సాధన పని లేదు ! వివాహ వ్యవస్థను గూర్చి మరియొక సమ ర్థన చూడండి : ''లోకములో నున్న స్త్రీ లందరును తమకు వయసులోని వాండ్రే కావలెను, విద్యావంతులే కావలెను, అందగాండ్రే కావలెను అన్నచో తక్కిన పురుషులందరు నేమగు దురు ? వివాహమను సంస్థ స్త్రీ పురుష సుఖ వ్యవహారము

అందు రాజ్యాంగ విషయములలో ప్రజాస్వామిక మెట్టిదో యట్టిది. అందరు ప్రజలకు వోటునందు హక్కున్నట్లే అందరు పురుషులకును స్త్రీ సుఖమునందు హక్కున్నది. ఒక పలుకుబడి కలవాని చేతిలో వంద వోట్లుండును. వాని కార్యములు తేలికగా నగును. అట్లే ఒక భాగ్యవంతునకు సౌందర్య వతియు విద్యావతియునైన స్త్రీ వచ్చును. ఒకని వోటు నందలి హక్కు నీవు హరింప లేనట్లే నీ వొకని స్త్రీని హరింప రాదు." (15వ అధ్యా.) ప్రజా స్వామికముతో ఆగిపోవటం దేనికీ ? సామ్యవాదం దాకా వెళ్లవచ్చునే ! రంగడు : "నీ వెవరినో పెండ్లి చేసికొని వానితో మాత్రమే యనుభవించవలెను." రత్నా : "అందరున్న సమానులే. ఒకరితో ననుభవించుట ఏల ?" (8వ అధ్యా) వాదానికి పై వాదం ఉంటుంది ! తేలిందేమిటంటే వాద ప్రతి వాదాల ద్వారా వివాహ వ్యవస్థ యొక్క అలౌకిక ప్రయోజనాన్ని, పరమార్థాన్ని విశ్వనాథ ఈ నవలలో నిరూపించలేక పోయారన్న సంగతి.

అందుకు కారణం విశ్వనాథ తన నవలను సమకాలీన 'ప్రేమ' వాదాన్ని పరాస్తం చెయ్యాలనే ఉద్వేగంతో, ఆదృష్టితో వ్రాయటమేనని తోస్తుంది. ఉద్వేగ రహితమైన మనస్సుతో చూస్తే ఆయన 'ప్రేమ'ను పరాస్తం చెయ్యటానికి వాడిన యుక్తులన్నీ 'వివాహా'న్ని, విమర్శించటానికీ వాడవచ్చు. (1) "రత్నావళికి రంగని తోడికాపురములోని క్రొత్త దనపు మోజు తగ్గినది. ఆహా ! ఈ శరీరము చెడ్డది కదా !. . . . ఈ యుత్సాహము ధన మూలమైనది కాబోలు ! ధనముబట్టి యుత్సాహము !. . . ." ఈ పరిస్థితి వివాహితులకు గూడ సమానమే. (2) కారణము లేకుండ ప్రేమ పుట్టదు. "ఒకడు చదువుకొన్నాడని, యొకడందకాడని, యొకడు మంచి వాడని కదా ప్రేమ పుట్టును ? కారణము లేకుండ ఎట్లు పుట్టును ? ఒక దండకాడని ప్రేమింతును. వాడబద్ధములు చెప్పును. మోసగించును. వాడు నీచుడు. వాని మీద ప్రేమ నిలుచునా ? ఈ ప్రేమ కారణము లేకుండ పుట్టునని నేను నమ్మను." నిజమే. వివాహము భర్త మోసగాడైన నీచుడైనా ప్రేమించ మనేకదా చెబుతోంది. ఈ విషయంలో ప్రేమదే పై చేయి కదా ! (3) ప్రేమ బహిరు పాధుల నాశ్రయించి యుండును.. "సర్వ పురుషుడు సర్వస్త్రీని ప్రేమించుచుండెను. అనగా బురుషుడు స్త్రీని ప్రేమించు చుండెననుట— ఈ మూల తత్త్వమునకనేక ప్రకృతి సంధానము లేర్పడి భిన్నకాలికత్వము, భిన్నదేశము, భిన్న వ్యక్తిత్వము పట్టుచున్నది. . . ." "ఓహో! ప్రేమ దేవతా ! ధనము, కులము, మర్యాద, గౌరవము, తెలివి తేటలు మొదలైనవి సృష్టిలో భేదములు కల్పించి మనుష్య లోకమునకు దెచ్చు కష్టముతో బాటు నీవును కొన్ని కష్టములు తెచ్చుచున్నావు. . . ఒకనికి వాడు కోరిన కోర్కి సిద్ధించును. వాడు దానిని నదృష్టమనును. ఒకనికి దాను గోరిన స్త్రీ దొరుకును. వాడు దానిని ప్రేమ యనును. . . ఈ మనుష్య జాతి తన మనోభావములకు పెద్దపెద్ద పేర్లు పెట్టి, భావము లను దివ్యములుగా భాసింపజేసి యనర్థ చయంబులందు దుశ్చింత నర్థ కల్పనము చేసెడిది" (10వ అధ్యా) ప్రేమ దివ్యము కాదను ఈ ఆక్షేపణము, విశ్వనాథ పైన నిరూపించిన వివాహ వ్యవస్థకు కూడ అన్వయింప వచ్చును గదా ! (4) "అన్ని భావములు నొక యుద్రేకము యొక్క వికారములే. . . కామోద్రేకమే ఇరుపక్షముల నున్నప్పుడు ప్రేమగా, అన్యోన్యాను కూల్యముగాఁ బ్రకాశించును. స్త్రీ పురుషుల కిర్వురకును సంతానము కలుగ వలెనని యేక భావము కలిగి కలసి మెలసి యుండినపుడది ప్రేమ యనియు, నట్టిది దాంపత్య మనియు జెప్పుదురు. . . ఒక్కటి యే మనోవికారము భిన్నస్థలమందు భిన్న నామముతో వ్యవహరింప బడును. ఒక నీచభావము పురుషుడు కాని స్త్రీ గాని స్వార్థము కొరకుపయోగించు కొన్నచో, స్వవిషయమున ఫలవంతము జేసికొనగా బ్రయత్నించినచో వాని వధము డందురు. అది పరోపకారార్థము వినియోగించినపుడు— వినియోగింప నక్కరలేదు దాని కట్టి వినియోగము కలిగినచో— వాని నుదారభావ మందురు. . . . జంతు ధర్మమును దాటి మనుష్యుడు కావలెను. కామేచ్ఛ మరియు జంతు ధర్మము. దాని యందు మనుష్యుడు మనుష్యుడగుటకు సంసారము పని చేయును. ధర్మమైన దాంపత్యమే చేయును. . . ." (12వ అధ్యా) ప్రేమ వాదుల లక్ష్యము కూడ ఇదే కదా ! (5) "ప్రేమ యన్నచో బ్రహ్మ పదార్థము కాదు. . . ప్రేమ యనగా సంతోషించుట, తృప్తి కనుట, ఇష్ట పడుట, ప్రకాశించుట యని యర్థము. . కామ విషయకమైన తృప్తి యొకరి యందొకరికి గలుగును గనుక అట్టి తృప్తి మోక్షము కాదు. అది వైరాగ్యము కాదు. జీవితములో నొక సుఖసాధనము." (12వ అధ్యా) విశ్వనాథ నవలలో నిరూపించిన వివాహము కూడ ఇంతే కదా !

ఏతా వాతా, నవలలో తర్కించినవి రెండు భిన్న విషయాలు కావనీ రెండు పేర్లతో ఒక విషయమే చర్చింప బడిందనీ తేలింది. రంగడు 'ప్రేమించుటే పెండ్లి' అన్నందుకు కోపించిన విశ్వనాథ జిజ్ఞాసచేసి చివరకు తేల్చినది 'పెండ్లియే ప్రేమ' అని. పెండ్లి సంప్రదాయము, ప్రేమ సంస్కారము. "ఈ సంప్రదాయమునకును, సంస్కారమునకును నేమి భేదము ? సంప్రదాయము పూర్వులైన వారు కొందరేర్పరచి

నది. సంస్కారము క్రొత్తవారు కొందరు చేసినది. అది కొందరకు నచ్చును. ఇది కొందరకు నచ్చును. ఈ భేదము లన్నియు గొందరు వ్యక్తుల సుఖదుఃఖములకు హేతువు లగుట గాక మరి యొక్కడేమియు లేదు. సంస్కారము వలన క్రొత్తలోఁ గొంత సుఖము కన్పించవచ్చును. సంస్కారములో సంప్రదాయములో నున్న భద్రత లేదు" (10వ అధ్యా) ఇట్లు తాత్త్వికమూ— పెండ్లి ప్రేమకంటె ఉత్కృష్టమైనదని కానీ, అది ఆధ్యాత్మిక సాధనలో భాగమని కానీ నిరూపించలేక పోయిన రచయిత, నవల ముగింపులో రత్నావళినీ రంగణ్ణీ రాజ్యలక్ష్మి సీతారామయ్యల కంటె నికృష్టులుగా విలువ కట్టడం, వాళ్లని మృత్యు ముఖానికి పంపించటం, నవలలో గొప్ప లోపమే కాదు. రచయిత ఆధ్యాత్మిక వాదాన్నే వదలి పెట్టినంత పనైంది.

నవలకున్న మంచి లక్షణం అంతా పాత్ర చిత్రణంలో ఉంది. రత్నావళి, రంగడు, సరస్వతి, సీతారామయ్య అందరూ సజీవమైన పాత్రలు. వివాహ వ్యవస్థను ఉల్లంఘించటం వల్లే రత్నావళి మోక్ష మార్గం పట్టింది. ఆమె జ్ఞానం అభివృద్ధి కావటమే కాదు, ఆమెలో వైరాగ్యం పొడసూపింది. తనుపాపం చేశానన్న భావం ద్వారా, లోకం పోకడను మనుష్యుల ప్రవృత్తులనూ చక్కగా అర్థం చేసుకుని విలువ కట్టడం ద్వారా, ఆమెలో పారలౌకికమైన, ఇంద్రియాతీతమైన ఆర్తి కలిగింది. ఈ పరిణామం ఆమె సీతారామయ్యతో కాపురం చేస్తూ ఉండి ఉంటే వచ్చేదేనా ? ఆబ్దికాలు పెట్టమని ఆమె అర్థించటంలో ఆబ్దికాల పారమార్థిక విలువ ఆమె గుర్తించింది, సీతారామయ్యకు వాటి విలువ ఏం తెలుసు ? రత్నావళినీ రంగణ్ణీ మృత్యు ముఖానికి సముద్రంలోకి పంపించటం కేవలం విశ్వనాథ విప్రహను కలవరాన్ని తెలుపుతుంది. వైరాగ్యం పొందిన రత్నావళి కాని రంగడు కాని నిష్కామ కర్మ చేస్తూ లోకంలో ఉండదగిన వారు కారా ? రత్నావళీ రంగారావులు ప్రాణ శక్తికీ, చైతన్యానికీ,— ఆధ్యాత్మిక వాదానికే ప్రతీకలు. కాని విశ్వనాథ ఉద్దేశంలో వాళ్లు పతితులు, మృత్యువును ఆహ్వానించ దగిన వారు ! ఇంత కంటె నాస్తికత ఏం ఉంటుంది ?

సముద్రమును, బైరాగిని నవలలో ప్రవేశ పెట్టుటలో విశ్వనాథ ఉద్దేశించిన దొకటీ, రత్నావళిలో కలిగిన పరిణామం దృష్ట్యా వాటికి ఏర్పడిన వ్యంగ్యార్థం మరొకటి. విశ్వనాథ అభిప్రాయంలో— సముద్రము కలవరము జెందిన వాంఛా ప్రవృత్తి. చెలియలి కట్ట 'లోకపు హద్దు' అనగా వ్యవస్థ. వాంఛా ప్రవృత్తి వ్యవస్థను అతిక్రమించినప్పుడు ఉప్పెన, ప్రళయము ; అదే మృత్యువు. ఇది భయావహమైన అవస్థ. బైరాగి మొదటి ప్రకరణంలో ఈ భయాన్ని గూర్చి హెచ్చరించే అంతరాత్మ :

> "అంబుధీ ! నీకు వేయి జోహారులయ్యా !
> పొంగి యూరక కోపానఁ బొరలి రాకు !"

అని ప్రార్థించటమే కాదు,

> "మనసు గుఱ్ఱము రోరి మనిసీ !. .
> కళ్లెమును వదలితే కంచెలో పడద్రోయు,
> కళ్లు తేలేస్తావు జనుడా !"

అని ప్రబోధిస్తాడుకూడా.

ఈ అంతరాత్మ నవల మధ్యలో కూడా ఒకటి రెండుసార్లు ప్రబోధిస్తుంది. చివర రత్నావళి రంగడూ సముద్రంలో లీనమైనప్పుడు ఈ బైరాగి కూడా ఉంటాడు. ఆ స్థితి : "అది జాగ్రదవస్థ కాదు. కాకను పోలేదు. మృత్యువు రాలేదు, వచ్చినంత పని యయినది. ఆ స్థితి యెట్టిదో వేదాంతములును జెప్పవు. అది రత్నావళీ రంగడూ పాపపంకిలాలైన శరీరాలను పోగొట్టుకొన్నా పొందిన పశ్చాత్తాపం దృష్ట్యా ఆత్మలుగా నిత్యులై ఉండే స్థితి అని రచయిత అన్వయం. వ్యంగ్యార్థము : సముద్రము అవ్యక్తమానసమూ (Unconscious)కలవరంఅందులో లోకం హర్షించని వాంఛా ప్రవృత్తి. చెలియలికట్ట వ్యక్తం (Conscious)లో ఉండే వ్యవస్థా ధర్మం. అవ్యక్తం వ్యక్తంతో ఘర్షణపడి, సమసించి ఏకమైతే తప్ప తత్త్వాను భూతి లభ్యంకాదు. అదే సముద్రుడు చెలియలి కట్టను దాటటం. బైరాగి ఈ ఘర్షణను తప్పించాలని గోచరించే నివృత్తి మార్గం. నవలలో వ్యక్తి ధర్మానికి (వాంఛా ప్రవృత్తికీ) వ్యవస్థా ధర్మానికీ ఘర్షణ తప్పలేదు. ఏకవీరలో అదే ఆంతరంగికమైన తపస్సు అయింది. రత్నావళిలో అదే వ్యవస్థకు వెలియైన పశ్చాత్తాప తప్తమైన జీవిత మైనది. అందువల్ల రత్నావళి రంగనితో (సంకల్పముతో) బైరాగితో (వైరాగ్యంతో) సముద్రములో గలియుట సమాధ్యవస్థను సూచించుటే ! "అది జాగ్రదవస్థ కాదు. కాకను పోలేదు. . . ." అను వాక్యాలు సమాధ్యవస్థా ప్రతిపాదకములే !

'సముద్రుడు చెలియలి కట్టను దాటడం' సమాధ్యవస్థను కలిగిస్తుందని రచయిత అవ్యక్తంలో ఊహా ఆకాంక్షా ఉన్నా, రచయిత వ్యక్తంలో దాన్ని ప్రళయంగా, మృత్యువుగా భ్రాంతిపడి నిరోధిస్తున్నారనీ, ఆ నిరోధం ఆయన వ్యవస్థను పట్టుకుని వ్రేలాడటంలో కనిపిస్తోందనీ, 'చెలియలికట్ట' నవల, రచయిత-ద్వైధీ కృతమైన మనస్సును గూర్చి మనక్కు

తేల్చి చెప్పే సత్యం. ఫలితం : ఉద్దేశించిన అర్థం ఒకటి, గ్రంథం యొక్క వ్యంగార్థం మరొకటీ అయింది. ఇది మిస్టన్‌కే తప్పలేదు ! అవ్యక్తం వ్యక్తం కంటె బలవత్తరమైంది ! తర్కంలో రచయిత చూపిన ప్రతిభ అంతా పెండ్లి, ప్రేమ అను విషయాల మీదే ప్రసరించింది : తీరా చూస్తే రెండింటికీ పెద్దగా భేదమే లేదు ! అసలు సంగతి నిగ్రహం, సాధన : కాని వాచ్యమైన భాగాల్లో వీటిని గూర్చి జిజ్ఞాస లేక పోవటం, రత్నావళి పాత్ర క్రమ పరిణామం ద్వారా మాత్రమే వైరాగ్యం వ్యక్తం కావటం, ఆ వైరాగ్యానికి కథ ముగింపులో ఇవ్వవలసిన విలువ రచయిత ఇవ్వలేక పోవటం గమనింప దగిన విషయాలు!

రత్నావళి వ్యక్తిత్వము ఆమె ప్రవర్తన ద్వారా, జీవితము ద్వారా రూపు కట్టింది. ఆమె ప్రవర్తన గురించి ధర్మా ధర్మ నిర్ణయం ఎలా జరగాలి ? ఒకసారి సీతారామయ్య ఆలోచనను రచయిత చిత్రించిన తీరు ఇలా ఉంది : "కుంతిపతివ్రత యని చెప్పి వినిపింప వలయునా ? ద్రౌపది పతివ్రత యని చెప్పి వినిపింప వలయునా ?. . . కుంతీ ద్రౌపదులు పతివ్రత లగుదురు, కారు తన కెందుకు ? తన భార్య తన ఇంట పని పాటలు చేయవలయును గదా ! ఆమెను గూర్చుండబెట్టి పరిచారికల చేత బనిచేయించుటకు దాను ధనవంతుడు కాడు. ఆమె ధనవంతుల ఇంటి బిడ్డ కాదు. . . పేదవాండ్రకు మధ్యరకపు సంసారులకు నీరాజనము లెట్లు సాగును ?. . ." ధర్మ నిర్ణయము ధనవంతుల కొక విధంగా, పేదవారి కొకవిధంగా ఉంటుందా ? ఇక్కడ రత్నావళి అన్నదమ్ములైన సీతారామయ్య రంగారావులనే భర్తలుగా పొందటంతో ఆమె వ్యక్తిత్వాన్ని ద్రౌపది వ్యక్తిత్వంతో పోల్చి సమర్థించ కూడదా ? అనే ఊహ రచయిత అవ్యక్తంలో ఉన్నట్లుగా సూచన. ఆ ప్రశ్నకు సమాధానంగా ద్రౌపది రాజకన్య, ఆమెకు సాగింది మిగతావాళ్లకు సాగుతుందా ? అనటం కంటె రచయితకు వేరు సమాధానం లభించలేదు. అందువల్లే రత్నావళి వ్యక్తిత్వానికీ, జీవితానికి ధర్మం దృష్ట్యా ఇవ్వవలసిన విలువ రచయిత ఇవ్వలేక పోయినట్లు తెలుస్తోంది ! వ్యక్తి ధర్మానికి అనుగుణమైన సాధనమూ మార్గాన్నీ సమర్థిస్తున్న హిందూ సంప్రదాయాన్నీ, పురాణేతిహాసాలనూ తడివితే కుంతి, ద్రౌపది వంటి వారు గోచరిస్తారు. అప్పుడు వ్యక్తి విలువ జడమైన వ్యవస్థ విలువ కంటె ఎక్కువ అని అంగీకరింప వలసి వస్తుంది. విశ్వనాథకు అలా అంగీకరించటానికి మనస్కరించలేదు ! ఎందువల్ల ?

ధర్మారావు పాత్రలో ఇదివరకే గుర్తించిన సంగతి ఇక్కడ మళ్లీ గుర్తు తేవలసి ఉంది. ధర్మారావునకు తను జ్ఞానయోగి నని భ్రాంతి. కాని అద్ది వట్టి భ్రాంతి యని అతనికి . అందుకే అంత అహంభావము ! 'చెలియలి కట్ట'లో విశ్వనాథ ఈ సత్యం గ్రహించినట్లు ఋజువున్నది. "బహిరుపాధులకన్న ననుభూతి సాంద్రత్వమున విశిష్టత యున్నది. అనుభూతి లోకములే వేరు. వానికి భాష పట్టదు. ఉపాధులు పట్టవు. కాని యనుభూతి లేనప్పుడు ఉన్నట్లుగా భాసించును. ఆ భ్రాంతి చెడ్డది. మనస్సు చేత దెలిసికొని, మనసుచేత ననుభవింపలేని యవస్థితి యందుండును. వాడు కర్మాచరణమునకు గాక మహానుభూతికిం గాక చెడిపోవును." (15. అధ్యా.) ఈ వాక్యాలు అక్షరాలా ధర్మారావునకు అన్వర్తించేవి !

'బహిరుపాధులకన్న అనుభూతి సాంద్రత్వమున విశిష్టత యున్నది' అన్న విషయము తెలిసిన విశ్వనాథ బహిరుపాధియైన వ్యవస్థకు ప్రాధాన్యమిచ్చి, జీవలక్షణమైన సత్యతనూ, స్వతంత్రమైన అన్వేషణనూ, సాంద్రమైన అనుభూతిని ఆకాక్షించే వ్యక్తి ప్రవృత్తినీ కాదనటం ఎందువల్ల ? ఈ ప్రశ్నకు ఒక్కటే సమాధానం : అన్వేషణలో, క్రొత్త మార్గంలో భద్రత లేదు అనే భయం ! 'అనుభూతి లేనప్పుడు ఉన్నట్లుగా భాసించవచ్చు, ఆ భ్రాంతి చెడ్డది', అప్పుడు తప్పు చెయ్యవచ్చు, పాపం చెయ్యవచ్చు అనే భీతి ! అందువల్ల వ్యవస్థను అంటి పెట్టుకుంటే ధర్మ వ్యతిక్రమం జరగదు అనే ఆశ కాని అందువల్ల మరొక విధమైన ఇబ్బంది ఉంది : ". . . ఆత్మ వత్సర్వ భూతాని యన్న వాక్యమున్నది. ఆ వాక్యమునే మాటి మాటికిని చెప్పుట, వ్యవహారములో ప్రసంగములు ప్రయోగించుట యా యనుభవము మనస్సునకు వచ్చినట్లు కాదు. వేను బ్రహ్మచర్య మవలంబించు చుంటినని యనుకొనుచో నది యవలంబించుట కాదు." (15వ అధ్యా) కేవలము వ్యవస్థను అంటి పెట్టుకోవటంతో ధర్మాన్ని సాధిస్తున్నట్లు అనుకోవడం మరియొక విధమైన భ్రాంతి !

విశ్వనాథ మనస్సు ద్వైధీకృతమై పై రెండు విధములైన భ్రాంతిని గూర్చి 'కలవరము' చెందింది. చివరకు రెండింటిలో అనుభూతి మార్గాన్ని వదలిపెట్టి వ్యవస్థను అనుసరించడమే శ్రేయమనే నిర్ణయానికి వచ్చింది. అదే 'చెలియలి కట్ట' నిరూపిస్తున్న విషయం. తప్పుచేస్తేనేం ? భ్రాంతి తొలగి పోవడానికి జ్ఞానోదయం కావడానికీ అనుభూతి తప్ప అన్యథా మార్గం లేదన్న సత్యాన్ని ఈ నవలలో విస్మరించారు విశ్వనాథ. కారణం భయం. తప్పు చేస్తే, పాపం చేస్తే, మృత్యువూ, తర్వాత పుణ్యలోకాలు దక్కవు అనే భయం ! అదే 'చెలియలి కట్ట' ముగింపు.

మనస్సు చాల విచిత్రమైన వేషాలు వెయ్యగలదు, సాధనలో అన్వేషణలో గల కష్టాల్ని దాట వెయ్యటానికి మనస్సు

పన్నె పన్నాగం : పాపం చెయ్యవచ్చునేమో అనే భీతి! విశ్వనాథ ఈ పన్నాగానికి లొంగి పోయినా, అందులో నుంచి విముక్తి కోసం ప్రయత్నం చెయ్యక మానలేదు. మృత్యువును గూర్చి పుణ్యలోకాల్ని గూర్చి పరిశోధన ప్రారంభించి, వాటి తత్త్వం తేల్చుకోవటంతో భయాన్ని జయించి, అనుభూతి పథం పట్టటానికి సిద్ధమయ్యారు. ఆ పరిశోధన ఫలితమే 'స్వర్గానికి నిచ్చెనలు' నవల.

## 'స్వర్గానికి నిచ్చెనలు'

కథానాయిక వసుంధరకు చనిపోయిన మొదటి భర్త ప్రేతముతో సంసర్గ మేర్పడటంతో కథ ప్రారంభం. ఈ సంసర్గాన్ని గురించి విశ్వనాథ చేసిన రచన చాలవరకు లండనులో పారలౌకిక విషయములను గూర్చి పరిశోధన చేసిన సమాజము వారి ప్రచురణలను (Proceedings of the Society for Psycical Research ఆధారము చేసికొన్నట్లు తోస్తున్నది. వీటికి తోడు యోగ శాస్త్రము చెప్పుచున్న బుద్ధి మనస్సు, ఇంద్రియములు వీటికి గల పరస్పర సంబంధమును గూర్చిన సూత్రములు వివరణకు ఉపయోగించాయి. వసుంధర భర్త ప్రేతము 'దేవతాయతనము'నకు వేసిన పునాది మీద నిర్మాణము సాగించి భోగము ననుభవించిన వాడు 'వామదేవుడు.' వాడు ఆ పేరుతో, ఇంద్రజాలిక విద్యలను నేర్చుకుని తిరిగి వచ్చిన వసుంధర పెద్ద తండ్రి కొడుకు నరహరే! చివరకు నరహరి కామవ్యాపార ధనాశాపరత్వం హత్యలతో కథ ముగుస్తుంది. వామదేవు గురించి చేసిన రచన దివ్యజ్ఞాన సమాజము (Theosophical Society) వారి సిద్ధాంతములు కొన్నింటి నాధారము చేసుకొన్నది. "మేము ఆల్ప్స్ పర్వతములమీద నున్నాము. తపశ్శక్తి చేత పరిణత యోగులమై యాకాశ మహా మార్గమున తేజోవిలీనాణువుల మధ్య ప్రకాశించుచు ఇచ్ఛ వచ్చిన చోటికేగుదుము.." (12వ అధ్యా) "నరహరియు నేనును సహాధ్యాయులము. . . . నేను హిమాలయ పర్వతములమీద గూర్చుంటిని. అతడాల్ప్స్ పర్వతముల మీద గూర్చుండెను. నే నిక్కడ నతడక్కడ కూర్చుండియు ప్రతిదిన మర్ధరాత్రి సమయముల నొకరితో నొకరు మాటాడుకొందుము. . . నెలకొకసారి, ఋతువున కొకసారి, పర్వ దినముల యందును తద్గుహాంతర్భాగముల నివసించు మహర్షులందరును తత్పర్వతో పరిభాగమున సమావిష్టులై సృష్టి కార్యక్రమమును గూర్చి విచారణలు చేయుచుందురు. . ." ఈ 'మహర్షు'లే దివ్యజ్ఞాన సమాజము వారు 'మాస్టర్స్' (Masters) అంటారు.

ప్రేతము వసుంధర మీదనే కాక మిగతా వారి మనస్సుల మీద చూపిన ప్రభావమూ, నిర్వహించిన కార్యమూ సామాన్యంగా ప్రేతాల శక్తిని గూర్చిన శాస్త్ర పరిజ్ఞానపు పరిధిని దాటి రచయిత ఊహ యథేచ్ఛగా విహరించిందన్న అభిప్రాయం కలిగిస్తోంది. అలాగే ఎంత ఇంద్రజాల విద్య నేర్చినా, ఎన్ని సిద్ధులు సంపాదించినా వామదేవుడు చూపిన మహిమలు కూడా మింగే మోతాదుకు మించినట్లే ఉన్నాయి.... ఈ విషయాల్లో ఇదమిత్థమని అంచనా వెయ్యటం అసాధ్యమే! అందువల్ల సైన్స్ ఫిక్షన్ (Science Fiction) లాగే, రామాపురంలో వసుంధర ఆధారంగా ప్రేతమూ వాసుదేవుడూ కట్టిన "స్వర్గానికి నిచ్చెనలు" అద్భుత రసంతో కూడిన కల్పన అనాలి. పోతే, ప్రేతము యొక్క స్వార్థపరత, వాసుదేవుని కాముకత్వమూ, ధన ప్రలోభమూ చివర నిరసింప బడినా, సాగినంత వరకూ చాల ఆకర్షణీయంగా ఉన్నాయి. నవల ప్రధానోద్దేశము— లోకవంచన చేసే మహిమలను, మత విషయికమైన పటాటోపాన్ని బహిరంగం చెయ్యటము, కాని ఆ వంచనపట్ల రచయిత ఆసక్తి రేకెత్తించిన తీరూ, వామదేవుని చిత్రణంలో రచయిత చూపిన అభినివేశమూ! నవల ప్రధానోద్దేశానికే భంగపాటు కలిగించేవిగా ఉన్నాయి! శశి నిజమైన యోగిని, కాని నిజమైన యోగినీత్వ మెటువంటిదో వివరణ, మిగతా విషయాలను గూర్చి ఉన్నట్టిది లేక పోవటం మరొక లోపం. "శశి మహాయోగిని. పది యేండ్లు మాట పలుకు లేదు. నిద్రాహారములు లేవు. మలమూత్ర విసర్జన లేదు. కట్టిన చీర మాయలేదు. తల చెరగలేదు. ఒడలికి వయసు రాలేదు. ఆమె పరమహంస." ఈ మాటలే నవల మొదటి నుంచీ చివరిదాకా పునశ్చరణ చేయబడ్డవి, ఇంతకు మించిన వివరణ లేదు. చెప్పినదానిలోనూ 'కట్టిన చీర మాయలేదు' అనటం వివాదాంశమే! యోగికి శరీరములో మార్పుండక పోవచ్చును గాని, యోగి ధరించిన వస్త్రానికి కూడా ఆ గుణమే అబ్బుతుం దంటే, ధూళి కణాలు ఆ వస్త్రాన్ని తాకవు అంటే ఇది ఏ యోగ శాస్త్రంలో చెప్పబడిందో తెలీదు! ఏ వామదేవుడో శరీరం మీద ఆసక్తి వల్ల తన వస్త్రాన్ని తపోశక్తితో చాకలి అవసరం లేకుండా శుభ్రంగా ఉంచుతాడు అంటే అర్థం ఉండవచ్చు గాని, శరీరానికి అతీతమైన తత్త్వంలో ప్రాణాలను సమీకరించి శరీరం ధ్యాసే పట్టించుకోని యోగిని శశి తన దేహంమీది వస్త్రం పట్ల శ్రద్ధ వహిస్తుందా?

వసుంధర మిథ్యాయోగినీత్వమ్ము, వామదేవుని దుశ్చరితము మతాన్ని ఆధ్యాత్మిక వాదాన్ని, అపహాస్యం పాలు చెయ్యటమే కాదు నాస్తికులకు బలం చేకూర్చుతవి. నవల ముగింపులో ఆస్తికులనూ, నాస్తికులనూ ఒక్క త్రాసులో తూచటం

జరిగింది. "లోకమును మోసముచేసి ప్రతారించువారు నాస్తికులలోనే పుట్టుదురనుటకు వీలులేదు. ఆస్తికులలో నెక్కువ మంది పుట్టుదురు. ఆస్తికముగాని నాస్తికము గాని వాని జీవిక కాధార మయినప్పుడు వాడు కిలవుడుగాక తప్పదు. ఒక యధికార వాంఛయో, కాముకత్వమో యధికముగా నున్న పురుషుడు వానికీ రెంటిలో నేది సీలో యా తొడుగు తొడిగికొనును. . . ." "ఆస్తికత్త్వములో నొక చమత్కార మున్నది' ఎంత దుర్మార్గము చేసినను వానిలో వయోధికులే చేయగల్గుదురు. నాస్తికత్వమట్లు గాదు. ఇందులో దుర్మార్గము చేసెడి వారు వయోల్పులు. ఇది యొక విచిత్రమయిన భేదము. వయస్సుచేతఁ బెద్దవాండ్రు చెడిపోయినచో దాని దుంప తెగిరిలే ! బ్రతికి బట్టకట్టఁ దగినవారు బాలురున్నారు. వారి తరములో బాగుపడవచ్చును. ఈ నాస్తికత్వము బాలురనే పాడు చేయును. ఆస్తికులు పెద్దవారు పాడయిపోయినను బాలురకు మంచి మాటలు చెప్పుదురు. నాస్తికులు విపరీతము. . . ." "ఒక పురుషుడు శాంతుడని సత్పురుషుడని గౌరవించువారు నిజముగాఁ నాస్తికులా ? యని యొక ప్రశ్న. వారు నాస్తికులు నిజముగాు గారు. వారు హృదయములయం దాస్తికులే. . ." "శాంతము, క్షమ, ధర్మము, వినయము మొదలైన సద్గుణమ్ములుండవలయునని బోధించు ఆస్తికమతము లోననే క్రూరత్వము, లోక విద్రోహకరమైన కామవాంఛ, సంఘమును కలుషితము చేయు దుర్వ్యవసాయము ప్రబలియుండగాఁ నాస్తిక మతములో నేల యుండరాదు ? ఈ —లెక్కనుజూచినచో నే దేశమునందు దీవ్రరూపముగాఁ గన్పించినను సగటున నాస్తికుల మీఁదే శాంతాది గుణములు కన్పించునేమో. కాని యా నాస్తికుల యందేక దేశము నందున్న యధర్మము ఘోరముగా నుండును." 29వ అధ్యా . . . "ఆస్తిక సంఘము తాను ధర్మము కొరకు నీతి కొరకుఁ బాటుపడుచున్నట్లు నటించు చుండెను. అందులో దుష్టులను శిక్షించుట కూడ ధర్మములో భాగము. భగవంతుఁ డవతరించినది దేనికి ? ధర్మగ్లాని జరుగునప్పుడు దుష్టులను శిక్షించుటయు శిష్టులను రక్షించుటయు జేయనే కదా ? భగవంతుని యవతారముల గూడ సర్వమున సంపూర్ణముగాఁ నుండవు. కొన్ని యంశావతారములు, కొన్ని యావేశావతారములు, కొన్ని యవతారములు ప్రతారణములు. నాస్తికులు ప్రతారణ పరాయణులైన భగవదవతారములేమో !. . . ." "నాస్తికత్వము నాస్తికత్వముగా నుండక రాజకీయముగా, వర్ణభేదముగా, శాఖాభేదముగా, వ్యక్తిగత విరోధముగా వట్టి కామావేశముగా బరిణమించెను. ఇది శిక్ష కారంభము." (35వ అధ్యా) ప్రాణములన్ని యిలా పూగిసలాడి చివరకూ మొగ్గ చూపేది వైసం—

'ఏ మతములో నైనను ప్రధాన సూత్రములయందే దోసముండదు. ఉన్నను లోకమును చెడుత్రోవకు త్రిప్పదు... మనము విచారించవలసినది వారిని గూర్చి (సాధువులైన వారిని) కాదు. కామక్రోధాది దూషితులైన ఇతరుల మీద వారి వారి సిద్ధాంతము లెట్లు పనిచేయునని చూడవలయును.... స్వర్గాదులున్నవో లేవో ? దేవుడున్నాడో లేడో ? ఇవి యన్నియు లేవనుటకంటె నున్నవనుకొని ప్రవర్తించుట లోకములోని కామక్రోధాదుల యొక్క విజృంభణను చాలవరకు నరికట్టును. లేనిచో లోకములో నొకని నొకడు బ్రదుకనీయ నక్కఱలేదు.." (41వ అధ్యా)

ఏతా వాతా తేలిందేమిటి ? ఆస్తికమైనా నాస్తికమైనా, పేరులో భేదమేకాని మానవుల ప్రవృత్తి మార్చటంలో, కామక్రోధాదుల విజృంభణ నరికట్టటంలో ఈ వాదాలు, సూత్రభేదాలు ఏమీ పని చెయ్యవు అని ! అంటే అసలు సంగతి వ్యక్తిగతమైన సాధన. నిగ్రహం, వైరాగ్యం వంటివి ఆస్తికత్వమూ నాస్తికత్వమూ అని చర్చించటం వల్లా, మృత్యువును గూర్చీ స్వర్గాన్ని గూర్చీ పరిశోధించడం వల్లా మనిషిలో ఏర్పడవని తేలింది ! 'స్వర్గానికి నిచ్చెనలు' నవలలో శిథిలమైనది విశ్వనాథలో మతవ్యవస్థను గూర్చిన విశ్వాసం. ఏ వ్యవస్థ అయినా కామక్రోధాదుల విజృంభణకు మార్గంగా వ్యక్తులు ఉపయోగించుకో గలుగుతారు అనే సత్యం స్ఫురించింది. కాని దాన్ని పూర్తిగా అంగీకరించలేని సందేహం ఇంకా ఎంతో కొంత మిగిలే ఉంది : అందుకే స్వర్గాదులను గూర్చిన విశ్వాసం సమాజంలో కొంతవరకైనా నిగ్రహానికి దోహదం చెయ్యదా ? అనే ఆశాభావం, కాదు సందేహం !

దీనికి మూలం ఇదివరకే చెప్పబడిన భ్రాంతి : ఆధ్యాత్మికమైన అంతర్నియమానికీ లోకపు హద్దుకూ గల విభేదం గుర్తించలేని భ్రాంతి. లోకపు హదు . అంటే వ్యవస్థ, ప్రధానం కాదు; అంతర్నియమమే ప్రధానం; దానివల్లనే ఆధ్యాత్మిక సాధన జరుగుతుంది అని 'చెలియలికట్ట', 'స్వర్గానికి నిచ్చెనలు' ఎంత తేల్చి చెప్పినా, విశ్వనాథలో భ్రాంతి పూర్తిగా విడలేదు. ఆ భ్రాంతికి సంబంధించిన సందేహమే ఈ క్రింది విధంగా కూడా వ్యక్తమవుతున్నది : వసుంధర అంటుంది : ".. దేహినోస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా తథా దేహాంతర ప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి ! అని భగవంతుడు చెప్పెను. దేహాంతర ప్రాప్తికి కౌమార యౌవన జరలకు సంబంధ మెట్లో నాకు దెలియుటలేదు. . . నాకు బాల్యము పోయినది. కౌమారము పోయినది. యౌవనావస్థ జరుగుచున్నది. గడచిన సంగతులతో నా ఇప్పటి యవస్థకు లోకము మాడిపెట్టునా మడే

పెట్టదా ? నా భవిష్యజ్జీవనమును తత్పూర్వావస్థాగత విషయము ముల చేత లోకము విమర్శించునా విమర్శించదా ? నా పూర్వ జన్మలో చేసిన పనులతో నా ప్రస్తుత జన్మను జతపరచి లోకము నన్ను నిందించదు. నన్ను విమర్శించదు. . . దృశ్యమాన మగు చున్న ఇంతటి భేదము చేత కౌమార యౌవనజర లెటువంటి యవస్థలో దేహాంతర ప్రాప్తి యటువంటి యవస్థ కాదు. ఆ యవస్థల దేహములే వేరు. అచట జీవుడొకడుగా వచ్చును. లోకమచ్చట సాక్షిగాదు. ఈ కౌమారాద్యవస్థల యందు దేహ మొకటియే యయి లోకము సాక్షియగుచున్నది. లోకమును దప్పించుకొని పోవుటకు వీలులేదు.'' లోకము విమర్శించునా విమర్శించదా ? లోకము సాక్షి యగుచున్నది, లోకమును దప్పించుకొని పోవుటకు వీలులేదు, అనుట లోకమునకు, బహిర్విషయమున కెంత ప్రాధాన్య మివ్వబడినదో గమనించ వచ్చు. దేహము వివిధావస్థల యం 'దొకటియే' అనుటే భ్రాంతి. శాస్త్రరీత్యా కూడా శరీరము మార్పు చెందుతూనే ఉంటుందనేదే సత్యము, అంతే కాదు. పై చెప్పిన అవస్థలలో మనః ప్రవృత్తులే మారుతూ ఉంటాయి ! ఇక్కడ ప్రధాన మైనది జీవుడు, ఆ జీవుని గురించిన జ్ఞానము, శరీరము 'ఒక టియే అనీ, లోకము ఇచ్చే విలువా చేసే విమర్శా ప్రధానమనీ, భ్రాంతిలో ఉంటే ఆ జ్ఞానోప లబ్ధి ఎలా అవుతుంది ?

శరీరము ఒకటే అనీ, లోకముతన్ను గూర్చి విమర్శిస్తూనే ఉంటుందనీ వాటితో తాదాత్మ్యం పెట్టుకుని బాధపడి గత జీవితములోని స్మృతులు చెరపి వేయరానివిగా వాటిని వ్యక్తి అధిగమించ లేనంత కాలమూ జీవునికి శాంతి, విముక్తి ఎక్కడ? ''వసుంధర జీవితము నడచుచుండెను. ఆమె జీవితములో శాంతి కనిపించలేదు. గత జీవితములోని లక్షస్మృతు లామెను బాధించుచుండెను. తాను భర్తృరాలా ? సంసారిణియా ? ధర్మ మైన ప్రవర్తన గలదా ?. . . లోకమును తాను చేసిన ప్రతా రణమును గూర్చి తనకేమియు పట్టదా ? తనకు దానితో సం బంధము లేదా ? ఒకవేళ పరలోకములున్నచో దానేమి కావల యును ? తానెవరో గుర్తించుటే విముక్తి. లోకమునకు తనకు తాత్త్వికముగ నేమి సంబంధమో తెలిసికొనుటే విముక్తి. అప్పుడే శాంతి. దానికి మార్గము వ్యవస్థలో విశ్వాసము కాదు. ఆ విశ్వాసము శిథిలమైనది. ఆస్తికత, దానికి సంబం ధించిన సూత్రములలో విశ్వాసము కూడ దానికి మార్గము కాదని తెలిసినది. మిగిలిన దేమిటి ? రస మార్గము.

సంగీతము, సాహిత్యము, నాట్యము రసమార్గము. వసుంధర చివరకు వైణికుడు, సంగీత విద్వాంసుడు పశుపతి శాస్త్రిని గురువుగా స్వీకరించింది. ''పశుపతి శాస్త్రి వెన్నెలలో చాప వేసికొని వీణ వాయించుచుండెను. హిందూస్తాని తోడి రాగమును వాయించు చుండెను. . . హా ! ఏమి రాగము ! ఆ సాధారణ గాంధారము నుండి షడ్జమమునకు జేరిన ధ్వనితో శ్రీ రామచంద్రుడు సీతను వనవాసమునకు బంపినట్లు నలుడు దమయంతి చీర చించుకొని పోయినట్లు, ద్రౌపదీ వస్త్రాప హరణము జరిగినట్లు, పుత్ర వియోగార్త యయిన తల్లి దుఃఖించినట్లు, పరమేశ్వరానుగ్రహములేక జీవితమంతయు శిథిలమైనట్లు హృదయములో దిగులు పుట్టుచుండెను. అంత దుఃఖమయమైన యా శ్రుతులలో వెనుక నొక మాధు ర్యము నందు బర్యవసించినట్లు సర్వదుఃఖము నసూహితమైన యొక శాంత భావము నందు పర్యవసించు చుండెను. ఆ ! ఆ ! ఆ శాంతిని పట్టుకొన వలయును.'' ఇది నవల ముగింపు. అప్పటి విశ్వనాథ మనఃస్థితికి చక్కని దర్పణము.

'చెలియలికట్ట ముగింపూ 'స్వర్గానికి నిచ్చెనల' ముగింపూ పోల్చి చూస్తే తెలుస్తుంది విశ్వనాథ దృక్పథంలో వచ్చిన పరిణామం. వ్యవస్థలో విశ్వాసం సాధన మార్గం కాదని తెలుసుకుని అనుభూతి పథం స్వీకరించారు. అది రసాను భూతి ద్వారా సాధన. ఆ సాధన ఎటువంటిదో దాని ఫలితమేమిటో తెలియజేసే నవల 'తెఱచిరాజు'.

## 'తెఱచిరాజు'

ఈ నవలలో కథానాయకుడు సారథి నటుడు. సారథి ఏ వ్యవస్థకూ సంబంధించని వ్యక్తి: వివాహితుడు కాడు; మతవ తో అతనికి ప్రసక్తి లేదు; చివరకు జమీందారుతో గూడ (రాజ కీయ వ్యవస్థతో) అతనికి సంబంధము లేదు. 'వేయి పడగలు' నవలలో 'ఒక మహా సంస్థ'ను సమర్థించ బూనుకొన్న విశ్వ నాథ దానికి ముఖ్యాంగములైన జమీందారు, మతము, వివా హము అను వ్యవస్థల ధర్మ నిరూపణం కోసం ప్రయత్నిస్తూ వ్యక్తికీ వ్యవస్థకూ గల భేదం విస్మరించి ఆ రెండూ ఒకటే అనే భ్రాంతికి లోనయ్యారు. కాని వ్యవస్థ ద్వారా వ్యక్తి ఎంత వరకు ఆధ్యాత్మికంగా ఉద్ధరింప బడుతాడు ? తత్త్వ దర్శన మున కనువైన సాధనకు కేవలం సామాజిక వ్యవస్థ ప్రయో జనం ఎంత ? అనే విషయం తర్వాతి నవలల్లో తేట తెల్లమైంది: 'చెలియలి కట్ట' నవల వివాహ వ్యవస్థ విజస్వరూపాన్ని, 'స్వర్గా నికి నిచ్చెనలు' మత వ్యవస్థ నిర్మాణ తంత్రాన్నీ, 'తెఱచిరాజు' జమీందారీ వ్యవస్థ శుష్క గాంభీర్యాన్నీ నిరూపిస్తూ, ఈ మూడింటిలోనూ కాంతాకనకముల ప్రభావమే కీలకమనీ, ఈ వ్యవస్థల మీద ఆధారపడటం ద్వారా వ్యక్తికి విముక్తి లేదనే సత్యాన్ని స్ఫురింప జేయటంతో చివరకు విశ్వనాథ

ఏ వ్యవస్థకూ సంబంధించని వ్యక్తిని కథానాయకుడుగా స్వీకరించారు. నటుడైన సారథి మార్గము రసమార్గము.

"సారథి ప్రౌఢుడు. అవివాహితుడు. అతని శీలమును గూర్చి యెవ్వరికిని మంచి యభిప్రాయము లేదు. ఉండవలసిన యవసరము లేదని యతఁడే చెప్పుచుండును. లోకమునందు శీలము ద్విధాభూతము. ఈ రెంటిని రెండుగా చూచుట లోకము నేర్చుకొనవలయును. . ." (2వ అధ్యా) అని సారథిని గూర్చి వర్ణన మారంభించుటలోనే, వ్యక్తికి లోక విమర్శనము ప్రమాణము కాదా ? అని రచయిత పూర్వము వెలిబుచ్చిన సందేహమూ, దాని తాలూకు భ్రాంతీ ఈ నవలలో విడిపోయిందని గ్రహించాలి. సారథిలో నీతి ప్రమాణము వ్యవస్థాగతము కాదు, వ్యక్తిగతము. "తన యధిక కామభావమును వ్యక్తి సంఘ విద్రోహకరము కాకుండ కులటాకులమునందు నెరవేర్చుకొనుచుండును. సారథి యట్టి వాడు. . . ." "ఒక కుల స్త్రీని తాను కోరి ఆమెను ధనాదుల చేత మోహపరచి యామెను వశపరచుకొనుటకు దానెప్పుడు ప్రయత్నించడు. . మిత్ర గృహముల యందతడు పరమ సాధువు. . ఆతడందరిని చెల్లెండ్రవలె గూతుండ్రవలె జూచును. . ." (2వ అధ్యా) ఇట్టి సారథి అంతర్యములో ఒక సంఘర్షణ వచ్చింది. దానితోనే కథా ప్రారంభం. వాసంతి, సారథికి సమవయస్కుడూ మిత్రుడూ అయిన శిరీషుని కొమార్తె. "నేను వాసంతి కెట్టి వాడనో నీవు నట్టి వాడవే. ఈ నాటి నుండి వాసంతి యొక్క యాత్మ రక్షణము చేయువాడను నేను కాదు నీవు. ఆమెలో స్వర్జ్యోతి వెలిగించవలసిన వాడవు నీవు. ఆమె యాత్మను దీప్తిదిద్ద వలసిన వాడవు నీవు. . ." (5వ అధ్యా) అనుమాట తో శిరీషుడు వాసంతిని సారథికి అప్పజెప్పినాడు. వాసంతికి సంగీతములో అభినివేశము, సారథి వలన నాట్యములో గూడ ప్రవేశము కలిగినది. ఆమె ఒక విశిష్ట ప్రకృతి. వయసు వచ్చినను ఆమెకు లైంగిక ప్రవృత్తిని గూర్చిన పరిజ్ఞానములేదు. దానిని గూర్చిన స్పృహ, సారథిని స్పృశించుటలో గల సుఖము ద్వారా అతనితో మోహినీ రుక్మాంగద నాటకములో నటించిన సందర్భములో, ఆమెలో మేల్కొన్నది. ఆ సందర్భము మొదలు సారథిలో గూడ ఆమె మీద క్రొత్త అనురక్తి, వాంఛ, మొలకెత్తినవి. ఈ వాంఛయూ అతనిలో గల వ్యక్తిగత మైన నీతికీ సంఘర్షణ ఏర్పడింది.

సారథి తనలోని వాంఛను జయించటానికి ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నము సౌందర్యాన్ని గూర్చి జిజ్ఞాసతో ప్రారంభము. ఎదురుకంటే వాసంతి సౌందర్యము ఆ వాంఛకు హేతువు. "సౌందర్యోపాసన యనగా వస్తుతత్త్వ విచారణ చేయకుండ బాగుగా నున్నదని సంతోషించుటయా ? ఆ సంతోషమునకు లోతు లేదు. క్రిందఁ గాలు తగులు చుండును. ఆ సంతోష మింద్రియములలోతు. ఉపాసన వలన గలిగెడు నానందపు లోతింద్రియముల నంటరాదు. ఏ సౌందర్యోపాసన ఇంద్రియముల కంటకుండ లోతైన యానందమునిచ్చును ? ఉమాపతి ఇచ్చునన్నాడు. . ." (5వ అధ్యా) ఉమాపతి నాట్య విమర్శకుడు. సారథికి ఒక విధముగా గురువు. ఆ గురువు విమర్శిస్తాడు. "మనస్సున్నది. బుద్ధి యున్నది. అంతఃకరణమున్నది. వెనుక శుద్ధ సత్త్వమున్నది. ప్రస్తుత మీ నాల్గు పొరలు తీసికొందుము. ఈ నాలుగింటిలో ఒకదానికంటె నొకటి లోతైనవి, యధికమైనవి. మనమన్ని వస్తువులను మనస్సుతో స్పృశింతుము. అది సత్తో యసత్తో యంతఃకరణము నిర్ణయించును. ఆ నిర్ణయము శుద్ధ సత్త్వము యొక్క సామీప్యము చేత జరుగును. . . అంతఃకరణమునందు జాగ్రత స్థితి యందున్నవాడు మహా బుద్ధులతోఁ గూడియే యుండును. మనసు లేనిచో నింద్రియములు లేవు. ఏ యుపాసన చేసినను నావరణ విశిష్టమైన ఈ మనస్సును దాటిపోయినచో నుపాసన ఫలోన్ముఖమైనట్లే సౌందర్యము భ్రాంతియే యగును. భ్రాంతి యందుపాసన యెట్లని ప్రశ్నలేదు. ఉపాసన యనగా భ్రాంతి విషయమును నాశ్రయించి భ్రాంత్య తీతమైన స్థితిని బొందుటయే." ఇది సిద్ధాంతము. మార్గమును గూర్చిన వివరణ. ఉమాపతి సొంతముగా కని (9 అధ్యా) పెట్టినది కాదు. పాతంజలిని చదివి చెప్పినది. సారథి దీనిని మననము చేస్తూ ఉంటాడు. "సముద్రపు టొడ్డున గూర్చుండి దాని నభ్యాసము చేయుచుండెను. అతని కొకడు తోచెను. ఇది నాట్య వేళ ననుభవములోనికి రావలయునని" (10వ అధ్యా) దాని కనువైన ఇతివృత్తము 'కామ దహనము' అని నిర్ణయించి, ఆ నాటకము కిరీటి అనే యువకవి చేత వ్రాయిస్తాడు సారథి.

సారథి తనలోని కామవాంఛ నంతయు వాసంతి యందు పుంజీభవింప జేసి 'జ్ఞాన ఖడ్గము'తో ఒక్కసారి నరుకవలెనని సంకల్పిస్తాడు. వాసంతిలో సర్వ సౌందర్య భావము ఆరోపించటానికి ఆమెకు ఎన్నో 'సుందరములైన భంగిమములు' నేర్పుతాడు. అభ్యాస సమయములోనూ, నాటకములో కామదహనము జరిగే రంగానికి ముందూ, వాసంతి శరీర స్పర్శ ద్వారా తనలో ఆ వాంఛకు ప్రోద్బలము కల్పిస్తాడు. చివరకు రంగము మీద అభినయము : "వాసంతి పోయి శివుని వద్ద మోకరించి కూర్చుండెను. శివుడు కనులు దెరచెను. ఆమె పూవుల బుట్ట శివుని కందించెను. అప్పుడు బాణము పడెను. అట్లు నిశ్చలముగా గూర్చున్న సారథి యొడలి యెర్రతనము

సర్వము మారి పోయెను. జడలు తెల్లబడెను. అతని శరీరము నందున్న ప్రత్యంగుళ సహస్రాంశము మేలు శరీరము పులకరించెను . . సారథి కనులు పెద్దవిగాఁ దెరచి పార్వతివంకఁ జూచెను. వాసంతి భయపడెను. ఆమె వెనుక వెనుకకు బోయెను. శివుడు కదలలేదు. కదలెను. ప్రక్క చూపు చూడలేదు. చూచెను. నవ్వలేదు. నవ్వెను. . . శివుడు నాల్గువైపులు బరికించి చూచెను. ప్రక్కతెరలోఁ బ్రత్యాలీఢ పాదుడైన మన్మథుడు కనిపించెను. శివుని నోటి వెంట హుంకారము బయలు దేరెను. సారథి తన ఫాలమునందు నొక్కెను. ఫాలనేత్రము యొక్క కనురెప్పలు తెరచికొని లోనుండి మన్మథుడున్న తావున కెర్రని ఒక లీగ వ్యాపించెను. సభికులందరు దీనిని చూచుచుండిరి. కన్ను తెరవైపునకు మరలు సరికి నచ్చట యెర్రని మహాగ్ని మండుచుండెను. తెరలో నుండి హా హా యని కేకలు వినిపించెను. వెంటనే తెరపడెను. . . లోన సారథి తన కంటి నుండి మంట వెలికి వచ్చినట్లు నటించిన సమయమునందే కూర్చున్న పీట మీద నుండి క్రిందఁ బడెను. వేషధారులందరు చుట్టు మూగిరి. వాసంతి వచ్చి యాదుర్దా పడుచుండెను. . . సభికుని తెరవెనుకకుఁ దీసికొని పోయిరి. . ఉమాపతి తలుపువేసి సారథి చెవిలో నేదియో చెప్ప నారంభించెను. రెండు నిముసములు గడచిన తర్వాత సారథికి స్మృతి వచ్చెను. . . '' (12 అధ్యా) ఇది సారథికి కలిగిన రససిద్ధి, కాదు యోగసిద్ధి అట. ఏకవీరల ఏకవీరకు కలిగిన యోగసిద్ధిని గూర్చిన రచనతో పై రచన పోల్చి చూస్తే అంతరమేమిటో తెలుస్తుంది. అది రచయిత దర్శనము, ఇది రచయిత ఊహ. దానికున్న శక్తి దీనికి లేదు. దానిని నమ్మినట్లు దీనిని మనం నమ్మలేము !

నిజానికి సారథిలో వాంఛకూ నియమానికీ కలిగిన సంఘర్షణ తీవ్రరూపం దాల్చనే లేదు అనిపిస్తుంది ! వాసంతితో సంసర్గం ఉన్నంత కాలమూ, స్పర్శాదుల వల్లా ఆ వాంఛ తీవ్రరూపం చెందటమే కాదు, నెరవేరుతూ ఉంది కూడా ! లైంగిక సంయోగం ఒక్కటే ఆ వాంఛకు స్వరూపం, లక్ష్యం అనుకోవటం ఆత్మవంచన. నియమం పటిష్ఠమూ తీవ్రమూ అయితే తప్ప సంఘర్షణ ఫలితం అంతఃకరణము సందలి జాగృతిగా పర్యవసించి, శుద్ధసత్త్వమును స్పృశించిన అనుభూతి కాదు. సారథి పడిపోవుట కేవలము మనసంవల్ల కలిగేఆత్మ సమ్మోహనము (Self – Hypnotism) కావచ్చు ననటానికి వీలున్నది ? సారథికి కలిగిన అనుభూతివల్ల అతని "జీవగత స్త్రీ వాంఛ నశించి పోయినదా ? పోయినచో వాసంతిని గురించి ఇంత విచారణ తన కెందుకు ? ఓరి పిచ్చిసారథి ! ఒక్క స్త్రీవాంఛయేనా నీయందున్నది ?. . . నీది మాయను గెలువ వలయునన్న ప్రయత్న బాహుళ్యము గల జన్మకాని గెలిచెడు జన్మకాదు. . . ' (12వ అధ్యా) సారథిలోని ఈ అవిశ్వాసమునకు వాసంతి ద్వారా రచయిత చెప్పు సమాధానమూ, ఊరడింపూ : "శివుడు మన్మథ దహనము చేసినపుడు పార్వతి మన్మథుని బ్రదికించెను. నీవా నాటకమును దూరము పోనీయలేదు. నీ మేలే నీవు చూచికొంటివి, నా మేలు నీవు చూడలేదు. నీవు స్వార్థ పరుడవు. తరువాత శివుడు పార్వతిని పెండ్లి యాడెను. కామజేత యగుట మానివేసెనా ? ఇప్పుడును గామజేత యనిపించుకొనుచునే యున్నాడు. . . యోగు లందరును బ్రతికి యున్న ప్రతి నిముసము నిర్వికల్ప సమాధిలోననే యుండరు. ఉండుట సంభవము కాదు. సమాధిలోనికి బోదురు. మరల లోకములో నుందురు. లోకముతో వ్యవహరింతురు. లోకముతో వ్యవహరించినంత మాత్రమున వార్లు యోగులు కాకపోరు. యోగి యనగా లోకవృత్తమునందుండి ఇది యంతయు మిథ్య యను జ్ఞానము కలవాడు. నీ శివుడైన నంతియే. మన్మథ దహనము చేసినాడు. మరల నమ్మవారిని పెండ్లియాడినాడు. పెండ్లియాడియు బ్రహ్మచారియే, బిడ్డలను గని కూడ బ్రహ్మచారియే. ఏమి, కుమారస్వామిని గనలేదా ?. . . .'' ఇది వరూథిని ప్రవరునితో తర్కించిన విధము ! కాని సారథి చిత్తశుద్ధి మెచ్చుకో దగినది. "తనకు నీచస్త్రీ గతమైన వాంఛ యున్నట్లుత్తమ స్త్రీ యందు వాంఛ యుండదు. తన నీచబుద్ధి యటు వంటిది. తాను స్త్రీ వాంఛను గెలువలేదు. ఒక దురదృష్ట వశమున నొక పూర్వ జన్మకృత దుష్ట సంస్కార ఫలితముగఁ దనమనస్సు నీచ స్త్రీల నభిసరించు చున్నది. తాను స్త్రీవాంఛను గెలువలేదు. తనకు వాసంతి యందు ప్రేమలేదా ? ఇంత సులభముగా బ్రాప్య కాఁదగిన యామె నంగీకరించక పోవుట చేతఁ దనకామె యందు ప్రేమలేదనియే చెప్పవలయును. ఆమెను దాను స్వీకరించక పోవుట ప్రేమలేక పోవుట చేతనా, ఇతర కారణముల వలననా ?. . ఆమె పసికసరుపిందె. తాను వడలి పోయిన కాయ. ఆమె జీవితమును దాను భస్మ పాత్రముమును జేయడు. విచారించగా సారథికి నామె యందు దనకున్న ఈ ప్రేమయే. యామెను నిరాకరింపఁ జేయుచున్నది. ఇది ప్రేమ కాదనునా ?. . తనలో స్త్రీ వాంఛ చచ్చినదో లేదో యది వేరే విషయము. . '' (16వ అధ్యా) అసలు కామవాంఛ చావలేదు, తనకు వాసంతి మీద ప్రేమయున్నది కాని వాంఛ లేదు. అయితే గజం మిథ్య, పలాయనం మిథ్య అన్నట్లు సారథి వాసంతి మీద వాంఛ నూహించుకొని దాన్ని నియమించటం ద్వారా నాట్యములో పొందిన యోగసిద్ధి, చేసిన కామదహ

నమూ మిథ్యేనా ? అదీ ఒక నాటకమేనా ? సారథి సాధించిన దేమిటి ?

దీనికి రచయిత సమాధానం : అది కామదహనం కాక పోవచ్చు, జితేంద్రియత్వం అబ్బలేదు. కాని అది యోగసిద్ధి తప్పకుండా అవును. "సారథి యోగికాడు. కాడనుటకు వీలు లేదు. కూర్చుండి హఠయోగాదు లభ్యసించి కొందరు యోగు లగుదురు. ఇది పాతంజల మార్గము. మనోద్రఢిమ చేత, నేక విషయమును నిరంతర భావన చేయుట చేతఁ గొందరు యోగులగుదురు. ఇది శాంకర మతము. ఈ శాంకర మత సంబంధమైన యోగ మార్గమున లేశ భావము సారథియందు లేక పోలేదు. . . అతడు యోగి యగుననుటకో కాదనుటకో కామక్రోధ దూషితమైన లోకమున కేమి తెలియును ?. . . ఇట్టి యోగము ప్రయత్నము లేకుండ సంకల్ప మాత్రము చేత ఫలవంత మగును. తనలోని శక్తి కిరీటి యందు వ్యాపించ వలెనని యతడు ప్రొద్దుటి నుండి యనుకొనుచున్నాడు. ఇపుడు కిరీటి మాటాడిన మాటలతోఁ గిరీటి యందనవధికమైన ప్రేమ కలిగెను. ఆ ప్రేమలోఁ గౌగలించుకొనెను. ఆ కౌగిలిం నతడనుకొనకుండ నతని సంకల్పము వ్యాపారవంత మయ్యెను. అతనిలోని శక్తి కిరీటిలోనికిఁ బ్రవహింప జొచ్చెను. (17వ అధ్యా) సారథి తన తనూలక్షణములను కిరీటిలోనికి ప్రవ హింప జేస్తాడు. ఫలితం వాసంతికి కిరీటి స్పర్శ సుఖప్రద మవుతుందట ! సారథి వారిద్దరినీ దంపతుల్ని చేస్తాడు. రచ యిత ఇంతటితో ఆగలేదు. సారథి స్పర్శ వాసంతికి సుఖప్రదం కావటం ఆగిపోతుంది ! 'ఒక కొయ్యను ముట్టుకొనునట్లున్న ది'ట ! అంతే కాదు. వాసంతి సారథి శరీర స్పర్శ నావరించి యున్న స్త్రీ సంబంధి కామభావము. "ఆ కామభావన యం తయు నిట్లు కిరీటిలోని కొడ్చుకొన్నది. ఇట్లొడ్చి కొనుట నా సంకల్పము. . . నేనే క్షుద్ర విద్యలు నేర్చిన వాడనుగాను. ఇది పరమేశ్వర సంకల్పము. . ." పరమేశ్వర సంకల్పము కాదు, రచయిత సంకల్పము అంటే బాగుంటుంది ! సారథి జితేంద్రి యత్వానికి ఎంత సులువైన మార్గం సంకల్పించారు రచయిత! ఇది కామాన్ని వదల్చుకోటానికి కష్టంలేని అడ్డదారి మాత్రమే కాదు, వాసంతిని కిరీటి కివ్వడంలో సారథి అహంకారానికి ఏ మాత్రమూ నొప్పి తగులని అడ్డదారి ! ఒక స్త్రీ మీద వాంఛ ఉండటం కామం, కామంతోబాటు ఆ స్త్రీ మీద అధికారమూ హక్కూ ఉందనుకోవటం కామంతో ముడివడ్డ అహంకారము, స్వార్థము. కామంలేక పోయినా కేవలం అధికారం ఉండాలి అనుకోవడము దురహంకారము ! మొదటి రెండూ క్షంతవ్యమైనా మూడవది కాదు ! సారథికి వాసంతితో గల సంబంధాన్ని మొదటి నుంచీ పరామర్శించి చూస్తే గోచరించేది సారథిలో అహంకారము, అది పోయిన వింత పోకడలు : సారథికి వాసంతి మీద వాంఛలేదు : కాని ఉందనుకోవడం, దాన్ని జయించడం, మళ్లీ లేదనుకోవడం, కిరీటికి ఆమెకూ పెళ్లి సిద్ధం చేసి మళ్లీ ఉందనుకోవడం ('ఓహో ! నాకు దెలియ కుండ వాసంతి మీద నా కెంత కోరిక యున్నది ? ఏమి జీవన లక్షణము ! మనస్సునకు లోనిపొరలు పైని పొరలు నెన్నికలవు' (—17 అధ్యా), దాన్ని యోగం ద్వారా కిరీటికి బదిలీ చేశాననుకోవడం, చేస్తేనేం చివరకు ఆమె ఆత్మ తనదే ననుకోవడం— అందుకే ఊరువిడిచిన నాలుగైదు ఏళ్లకు సారథి తిరిగి వచ్చి నట్లూ, మోహినీ రుక్మాంగద వేయుచుండగా వాసంతి వెళ్లి కౌగలించుకొన్నట్లు, ఆ కౌగలింతలో ఇదరూ మరణించినట్లూ కథ ముగింపు !— ఈ దురహంకారానికి ఎక్కడ స్వస్తి ? ఎప్పుడు విముక్తి ? సారథి వంటి 'ప్రౌఢుని'కి సాధన మార్గం కామాన్ని జయించటం కాదు, అహంకారాన్ని జయించడం : సారథిలో శరీరగతమైన కామవాంఛ సగము చచ్చినది, లౌకిక మైన తదితర వాంఛల పట్ల నివృత్తి ఉన్నది, కాని అహం కారము పెట్టని కోటగా ఉంది. రసమార్గము ద్వారా అహంకార నిర్మూలనం చేసేందుకు వీలున్నది : కాని సారథి ఊహ అటువైపే ప్రసరించదు. ప్రసరించినా వెంటనే అది ప్రధా నం కాదని వదలి పెట్టుతుంది. "తాను బాణాసురుడు, శ్రీ కృష్ణదేవుని చేత బాణుని యహంకారము నిర్మూలింప బడి నది. అహంకారము చచ్చిన గాని జీవుడు ముక్తుడు కాడు. తన లింగ సంబంధమైన వాంఛ చావవలయును గాని తన యహం కారము నమసి పోయినంతట నేమి ప్రయోజనము ?" పిచ్చి కుదిరితే గాని పెళ్లవదు, పెళ్లయితే గాని పిచ్చి కుదరదు. అన్నట్లు కామమూ, అహంకారమూ ఒక దాని మారువేషం మరొకటి ! వాసంతి మీద వాంఛ ఉందో, లేదో, ఆమెతో సంబంధం త్రెంచుకోవాలో లేదో నిర్ణయం కాకపోవడం అహం కారము ఆడించిన నాటకమే !

సారథి వ్యక్తిగతంగా, రంగనాథము, అవధాని, జమీం దారు, అర్జునరావు, శిరీషుడు మొదలైన నాగరక వ్యక్తుల కంటె అధికు డనటంలో సందేహం లేదు. రంగనాథము యొక్క కుత్సితము నిర్వహించిన కథ నవలలో చాల సమర్థంగా చిత్రింపబడిన, ఆకర్షణీయమైన లోకవృత్తము. వాసంతి పాత్ర ఒక విశిష్టమైన సృష్టి. అసంభావ్యమేమీ కాదు. పాతివ్రత్యము శరీర లక్షణమో ఆత్మలక్షణమో నిష్కర్షగా తేల్చలేదు గాని అది వ్యక్తి లక్షణమే, వ్యవస్థా ధర్మము కాదని విశ్వనాథ ఈ నవలలో స్త్రీ పాత్రల ద్వారా చేసిన నిరూపణము

విప్లవాత్మక మైనది ! కాని కథానాయకుడైన సారథిని చిత్రించుటలో రచయిత యొక్క అన్వేషణ పూర్తిగ అస్తవ్యస్తమై పోయింది. రసానుభూతి ద్వారా సాధన అహంకారము ఘనీభవించని లేత ప్రాయము వారికి, మేధా ప్రవృత్తికంటె హృదయానుభూతి ప్రధానమైన వారికీ గాని, సిద్ధాంతాలతో యుక్తి ప్రత్యుక్తులతో తర్కించే వారికి, దేనిలోనూ ప్రగాఢమైన విశ్వాసాన్ని నిలుపుకోలేని వారికీ కాదు. వారు 'నేతి, నేతి' అనుకుంటూ ముందుకు వెళ్లవలసిందే ! నటుడైన సారథిలో రచయిత చూపిన తర్కించే గుణము అతనికి వాసంతి పట్ల గల భావమేమిటో నిశ్చయించి చూపేందుకు బదులు అతణ్ణి పెద్ద భ్రాంతితో తికమక లాడిస్తూ వచ్చింది. సారథి అహంకారము అతని నాట్య కౌశలములో నిమ్నమైనది, అది లోకము వైపు ప్రసరించక పోవచ్చు కాని లసత్ సంబంధము గల వ్యక్తులవైపు ప్రేమగా, వాత్సల్యముగా, స్నేహముగా, కామంగా వివిధ రూపాల్లో ప్రసరిస్తుంది. ఆ అహంకారాన్ని జయిస్తే కాని సారథి యోగి కాడు, కాలేడు! భావన ద్వారా, సంకల్పం వల్ల అది జరిగే పని కాదు !

విశ్వనాథ సారథికి ఆపాదించిన యోగిత్వము ఊహ, కల్పన. దానికి ఆయన చూపిన శాస్త్ర ప్రమాణము చాలినది కాదు. బహుశ శ్రీరామకృష్ణ పరమహంస నిర్యాణమునకు పూర్వం వివేకానందునికి తపస్సు ధారవోసిన వైనము గుర్తులో ఉండి ఉండవచ్చునేమో ! కాని ఎక్కడి సామ్యము ! ఐదేళ్ల తర్వాత సారథి తిరిగి రాగా "ఏ స్పర్శ గుణము సారథి శరీరము నుండి కిరీటి శరీరములోనికి ప్రవహించినదో యా స్పర్శ గుణము సారథి శరీరము నుండి వాసంతికి వేవేయి మడుంగు లెక్కువ కనిపించెను. సారథికి వాసంతి యందు గూడ నట్లే కనిపించెను. రంగ భూమియందే యా కౌగలింతలో సనె ఇద్దరి ప్రాణములు శరీరముల నుండి వెడలిపోయెను." ఇది ముగింపు. 'పాపం, ఆ కిరీటి, వాసంతిని గురువుగారి దగ్గర దానము పట్టిన ఆ కిరీటి గతి ఏమి ? సారథిలో ఆ స్పర్శ గుణము ఒకసారి పోవుట యేమి, మళ్లీ తిరిగి వచ్చుట యేమి ? ఇటువంటి వ్రాతలే యోగశాస్త్రాన్ని అపఖ్యాతి పాలుచేసేవి !

సారథి అహంకారమును పోషించుటకు రచయిత పడిన పాట్లు నవలల్లో పెద్దలోపంగా ప్రత్యక్ష మవుతున్నది. రంగనాథము సూత్రధారుడైన కథ, మిగతా పాత్రలలో గల సహజత్వమూ, ఈ నవలలో ఎన్నదగిన విషయాలు. ఇక్కడ మళ్లీ రచయిత ఉద్దేశంతో భేదించే విలువలే, సాహిత్యము దృష్టికి గోచరమవుతున్నాయి !

'ఏకవీర' నుండి 'తెఱచిరాజు' వరకు విశ్వనాథ దృక్పథము పొందిన పరిణామం చూస్తే ఒక ఆవర్తము పూర్తయినట్లు తోస్తుంది. 'ఏకవీర'లోని రససిద్ధి (యోగసిద్ధి) వైపునకే 'తెఱచిరాజు'లో మళ్లీ మరలినట్లు తెలుస్తోంది. కాని మొదటి రచనలో నున్న దర్శనమూ చిత్తశుద్ధీ ఈ ఉత్తరోత్తర రచనలో (తత్త్వం విషయంలో) లోపించి, ఇది కేవలము ఊహాగానముగా తేలిపోయింది. హైందవ సంప్రదాయ నిబద్ధమైన విశ్వనాథవారి దృక్పథము 'ఏకవీర'లో తత్త్వ దర్శనము స్థాయినుండి 'వేయి పడగలు'లో వ్యవస్థా ధర్మ సమర్థనమై, 'చెలియలికట్ట' 'స్వర్గానికి నిచ్చెనలు'లో కేవలం వ్యవస్థ 'తెఱచిరాజు'లో వ్యక్తి సాధనను గూర్చిన ఊహాగానముగా తేలిపోయింది. ప్రవేశికలో సూచించినట్లు విశ్వనాథను ప్రభావితుణ్ణి చేసిన సమకాలీన భావసంచలనములో ముఖ్యమైనవి కాల్పనికవాదము (Romanticism), హేతువాదము. కాల్పనిక వాదాన్ని పరిపుష్టం చేసే తత్త్వ దర్శిగా, హేతువాదానికి ప్రతి ద్వంద్విగా ఆయన సాహిత్యకృషి ప్రారంభించారు. కాని తత్త్వ దర్శనము నుంచి వ్యామోహానికీ,* విశ్వాసం నుంచి విచికిత్సకూ ఆయన ఎలా ప్రయాణం చేశారో పై గ్రంథాలు నిరూపిస్తున్నవి. పోతే ఆ వ్యామోహాన్నీ విచికిత్సనూ అధిగమించే ప్రయత్నం చేసి మానవుణ్ణి వ్యక్తిగా దర్శించే గమ్యం కూడా ఆయన చేరుకున్నట్లు తెలుస్తోంది. ఈ చివరి సంగతి లోకానికి విశేషంగా తెలియక పోవచ్చు. దానికి సాక్ష్యం 'తెఱచిరాజు' నవల.

విశ్వనాథ వారి ప్రతిభను ఆలోచన, భావన దర్శనము అని మూడు విధాల భాగించినప్పుడు ఆలోచనే మిగతా రెండింటి కంటె ఆయన స్వభావానికి ప్రధానమైనదిగా కనిపిస్తుంది. పై పరామర్శించిన చివరి మూడు నవలలూ ఆ విషయం స్పష్టం చేస్తున్నాయి. 'ఏకవీర', 'వేయి పడగలు'లో మినహా ఆయన దర్శనా శక్తి గోచరం కానట్లే! చివరిదైన 'తెఱచిరాజు' నవలలో భావనాశక్తి కూడా కేవలం ఊహాగానంగా తేలిపోయే ప్రమాదం పొడసూపింది. ఆలోచన అంటే తర్కించే గుణం. ఈ గుణం విశ్వాసాన్ని నిలవనీదు. దాన్ని శిథిలం చేసి ముందుకు సాగిపోతుంది. ఒక ఆవర్తం పూర్తి అయితే కాని దాన్ని అధిగమించే స్థితి రాదు. విశ్వనాథలో ఈ ఆవర్తం తత్త్వం నుండి వ్యవస్థకూ, వ్యవస్థ నుండి వ్యక్తికీ, వ్యక్తి నుండి మళ్లీ తత్త్వానికి ప్రయాణంగా రూపొందినట్లు ఆయన సాహిత్యకృషి ద్వారా అవగాహన అవుతున్న విషయం.

సంఘ సంస్కరణం, జాతి పునరుజ్జీవనం, సాహిత్యంలో నవ్యత— ఈ మూడింటి దృష్ట్యా విశ్వనాథ వారి దృక్పథం సంస్కరణకు వ్యతిరేకం, కారణం సంప్రదాయాన్ని చక్కగా అర్థం చేసుకోవటం వల్లే జాతి పునరుజ్జీవనం జరుగుతుందని ఆయన విశ్వాసం. కాని వ్యక్తులలో, పరిస్థితులలో భిన్నత్వం ఉండటం వల్ల, సంప్రదాయం అర్థం చేసుకోవటమంటే సంప్రదాయంలో మార్పు రావటం †అనే సత్యాన్ని ఆయన మొదట్లో గుర్తించలేదు. దాన్ని గుర్తించేందుకు జరిగిన అన్వేషణ ఆయన సాహిత్య కృషిలో ప్రతిఫలించింది. పోతే, విశ్వనాథ నవలను కావ్యంగా రూపొందించారు. అది ఆయన సాహిత్యానికి కూర్చిన నవ్యత, విశ్వసాహితిలో తెలుగు నవలకు స్థానం ఏర్పరచిన నవ్యత.

*"వ్యామోహ మనునది ద్రవ్యమునందు మనుష్యులయందే కాదు— ఒకానొక యూహయందుగూడ వ్యామోహము కలుగును. ఆ యూహ మనకు బాగుగా నచ్చినట్లనిపించును. దానిని యథార్థముగా స్వీకరింతుము, విచారణ చేయము. కొందరకు విచారసహమైన బుద్ధియే యుండదు. ఉన్న వారి మాటయే ఇది." (17వ అధ్యా)— స్వర్గానికి నిచ్చెనలు.

† "An institution appropriate and wholesome for one stage of human development becomes inadequate and even dangerous when another stage has been reached. The cry of conservatism 'it has always been thus' ignores the fundamentals of the theory of relativity in philosophy and practice, in taste and morals, in politics and society, of which the ancient Hindus had a clear grasp ... while there has been continuity with the past, there has also been progress ....There has been no such thing as a uniform staionary unalterable Hinduism whether in point of belief or practice. Hinduism is a movement. not a position; a process not a result; a growing tradition not a fixed revelation. (The Hindu view of life) : S. Radhakrishna.

పగలు యోగులకు రాత్రి' అన్నది. సాంఘిక జీవితంలో నిమగ్నులైనవారు బ్రతుకుతెరువు నేర్చుకుంటారు. తాత్కాలిక భోగాలను పొందుతారు. ఒంటరితనంలో, ఏకాగ్రతలో మనస్సుని లగ్నం చేసినవారు, విశ్వంలో ఉన్న లయను సిద్ధించుకొని శాశ్వత సుఖాన్ని కరతలామలకం చేసుకుంటారు... అస్తిత్వవాదులకు ఆధ్యాత్మికస్పృహ తక్కువ. అందుకని ఒంటరితనం యొక్క ప్రథమదశను, శాశ్వతదశగా భావించి పొరపాటు చేశారు ....'' (పుటలు 114—116) ఒంటరితనం అంటే భయం ఎందుకు ? ఒంటరితనం ద్వారానే 'విశ్వంలో ఉన్న లయను' సిద్ధింపజేసుకోవాలన్న నిశ్చయానికి వచ్చిన గోపీచంద్ పాత్రే అస్తిత్వవాదపు హద్దులను దాటి అద్వైతము వైపు దృష్టి పారించాడు.

''తప్పు చెయ్యటం కంటె తప్పును క్షమించలేకపోవటం పెద్ద తప్పని నేను గ్రహించాను'' అన్న గోపీచంద్, స్నేహితుల కృపణత్వాన్నీ, విమర్శలనూ 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' లో క్షమించలేకపోయాడు ! కాని, ఆ నవల వ్రాయటమే ఒక విముక్తి. కోపతాపాలను ఆ నవలలో క్రుమ్మరించటంతో మనస్సు తేలికపడటమే కాదు, ఆత్మవిశ్వాసము దృఢమై తను త్రొక్కుతున్న దారీ చూస్తున్న లక్ష్యమూ తన ఒక్కడివే కావు, తనతోడివా రందరివీ కూడా అనిపించింది గోపీచంద్‌కు. 'పరమేశ్వరశాస్త్రి వీలునామా' కథాసంవిధానంలో, ముగింపులో, ధ్వనిస్తున్న అర్థం యిదే. మరణశయ్యమీద ఉన్న పరమేశ్వరశాస్త్రి వైదిక సంప్రదాయము. సంస్కృత కళాశాల పేరిట ఆయన చుట్టూ చేరిన సీమంతం మొదలైనవారు ఛాందసులు. కులంలేని సుజాతకూ, పాశ్చాత్య వాసనలుగల కేశవమూర్తికీ ఆయన ఆస్తి దక్కకుండా వాళ్ళు చేసే ప్రయత్నాలు విఫలమై, పరమేశ్వరశాస్త్రి కేశవమూర్తినే తన వారసుడిగా వరిస్తూ వీలునామా వ్రాస్తాడు. శిథిలావస్థలో ఉన్న సంప్రదాయం మరణించిననాడు భారతదేశంలో వైదికసంప్రదాయానికి నిజమైన వారసుడు ప్రాచ్య ప్రతీచీ భేదాలు పాటింపక వ్యక్తిగతమైన సాధన ద్వారా సనాతన ధర్మంవైపు పయనించే మానవుడు అని ధ్వని ! కాని యీ సత్యం యిప్పుడే బయటపడదు ! సంప్రదాయం వ్రాసే వీలునామా కాలం అన్న సీల్డు కవర్‌లో భద్రపరచబడి ఉంది!

ఈ ఆత్మవిశ్వాసంతోనే గోపీచంద్ తన జీవితచరిత్ర అది స్పృశించినంత మేర ఆంధ్రదేశ రాజకీయ చరిత్రా ఒక పెద్ద నవలలో సమన్వయ దృక్పథంనుంచీ వ్రాయటానికి పూనుకున్నాడు. అదే ''చీకటిగదులు'' అనే అసంపూర్ణ రచన. ఈ రచన చూస్తుంటే యిది కూడా 'వీలునామా' లాగే, మనస్సును తేలికపరచుకోటానికీ, కొన్ని ప్రాత బంధాలను మానసికంగా వదలించుకోటానికీ, తన మనస్సులోని చీకటి గదుల్లో తేజః ప్రసారం చేసుకునేందుకూ గోపీచంద్ ప్రారంభించిన ప్రయత్నంగా, సాధనగా మాత్రమే తోస్తుంది. సాహిత్యపరంగా ఎన్నదగింది కాదు.

అతీతమానవుడు (Superman) 'అతీత మానసిక చైతన్యమూ (Supramental Consciousness) లక్ష్యాలుగా సాధన కుపక్రమించిన గోపీచంద్ సామాన్య మానవుని దైనందిన జీవితాన్నీ, అతని ఆర్థిక సమస్యల్నీ మరచిపోలేదు. ఈ లోకంలో తను ప్రేమించిన సామాన్యునికి అతని స్థాయిలో అతని సమస్యలను గూర్చి చర్చిస్తూ ఆత్మవిశ్వాసాన్నీ, జీవితంమీద ఆకాంక్షనీ ప్రోదిచేసే సందేశాన్ని— తన వీడ్కోలు సందేశంగా— గోపీచంద్ నిక్షిప్తం చేసిన నవల 'యమపాశం'. 'అసమర్థుని జీవయాత్ర', 'మెరుపుల మరకలు' నవలల తర్వాత ఎన్నదగిన నవల 'యమపాశం'.

చేస్తున్న ఉద్యోగం, కట్టుకున్న భార్య, అనుకోకుండా పుట్టుకొచ్చిన గంపెడు పిల్లలు—యీ వలయంలో చిక్కుకున్న సామాన్య మానవుడు నారాయణరావు. వలయంలో గానుగెద్దులా తిరుగుతున్న వ్యక్తికి ఆత్మవిశ్వాసం, జీవితంమీద ఆకాంక్ష రానురాను తరుగుతుంది గాని ఎలా పెరుగుతుంది ? సాంప్రదాయికమైన జీవన విధానం శిథిలమైంది, నైతిక ప్రమాణాలు ఎగిరిపోతున్నాయి, సాంఘిక—ఆర్థిక వ్యవస్థల్లో మార్పు వస్తుందనీ క్రొత్త జీవితం ప్రారంభమౌతుందనీ రోజురోజూ పెంచుకున్న ఆశలు ఫలించకుండానే వయస్సు పైబడి ముసలితనం తరుముకువస్తోంది. ఊహావసంలో నిర్మించుకున్న ఆదర్శాల సౌధాలు పగటి కలలుగా మిగిలిపోతున్నాయి. జీవితం యమపాశంలా కంఠం చుట్టూ బిగుస్తూ ఉంటే సామాన్య మానవుడు మృత్యుస్పర్శని అనుభవిస్తూ మృత్యువునే ఆహ్వానించా లనుకుంటాడు. ఈ విస్పృహనుంచీ తేరుకోవడ మెలాగ ? విముక్తిమార్గ మేమిటి ?

''జీవితాన్ని కృత్రిమంగా విభజించి, ఏదో ఒక ముక్కను పట్టుకొని అదే సర్వస్వం అనుకోవటంవల్ల మానవుడు ఒక ఘనీభవించిన పదార్థం అయ్యాడు .... తనకంటే ఘనపదార్థంగా ముడుచుకుపోయింది తన భార్య. తా మిద్దరూ జీవితం అనే గోడకు కొట్టబడి ఎండిపోయిన రెండు పిడకలు ....'' ...''కట్టుబాట్లు పెట్టుకు కూర్చున్నవాళ్ళు చాదస్తులుగా తయారవుతున్నారు. అలా కాకుండా జీవితాన్ని ఎడాపెడా కొట్టేవాళ్ళే విశాల దృక్పథం గడించుకోగలుగుతున్నారు. వాళ్ళు

జీవితాన్ని బహుముఖాలుగా అనుభవిస్తున్నారు. అందువల్ల బహుముఖాలుగా పరిశీలించవలసిన అవసరం కలిగి వారి దృక్పథం విశాలపడుతూ ఉంది.'' .... ''నేటి మన నైతిక విలువలు వట్టి నిషేధాజ్ఞలే..... నిషేధ బుద్ధితో జీవితాన్ని చూచిన ఏ వ్యక్తీ వికసించడు. వికసించని ఏ వ్యక్తికీ విముక్తి లేదు. జీవితాన్ని బహుభంగుల అనుభవించిన వ్యక్తే సంపూర్ణత నుపొందగలుగుతాడు'' .... ''డబ్బు వ్యసనమైతే, భోగాలు ములుకులైతే, ఇంద్రియాలు గుర్రాలైతే, మనస్సొక ముళ్ల కిరీటమైతే ఇక జీవితానికి ఆదర్శం ఏమిటి ? విముక్తి.'' సంప్రదాయమనీ, నైతిక విలువలనీ, ఆదర్శమనీ మానసికంగా ఘనీభవించిపోయి, జీవితాన్ని నిరాకరించటం ద్వారా జీవిత రహస్యం అవగతంకాదు, విముక్తి లభించదు. జీవితాన్ని యథాతథంగా అంగీకరించి అనుభవించాలి. ''జీవితానికి పెడగా నిలుచున్నవానికంటె అన్నివిధాలా జీవితాన్ని అనుభవించేవారంటేనే నాకు ఇష్టం. ఒక్క యిష్టమే కాదు, నమ్మకం కూడాను'' అంటాడు గోపీచంద్.

''పరిస్థితులు మారిపోతున్నాయి. విలువలు మారిపోతున్నాయి. జీవితం మహావేగంగా ప్రవహిస్తూ ముందుకు ఉరకలెత్తుతూ ఉంది. ఆ వేగం ఒరిపిడికి వినూతనమైన అందచందాలు అనేకం బహిర్గతమయి కనులకు మిరుమిట్లు గొల్పుతున్నాయి. అవి క్రొత్తవి గనుక, బహుశా మనకు అందుబాటులో లేవు గనుక, వాటిని నిరసించడం జరుగుతూ ఉంది'' అలా కాకుండా జీవితదృశ్యాన్ని సరిక్రొత్తగా ఉత్సాహంతో అవలోకిస్తూ ఉన్ముఖుడు కావాలి మానవుడు అంటాడు గోపీచంద. మానసికంగా ఒక రకపు విలువలకు అంటిపెట్టుకొని, పరిస్థితుల ప్రభావం అనుల్లంఘనీయమై ''అడుసు తొక్కవలసి వచ్చినప్పుడు ఏడుస్తూ తొక్కి .... కాళ్లు కడగవలసి వచ్చినప్పుడు అంతకంటె ఏడుస్తూ కడుక్కునే'' మనస్తత్వాన్ని వదలిపెట్టుకొమ్మంటాడు గోపీచంద్. విలువలు సాపేక్షము ( Relative ) : ''ప్రతి మానవుడూ జీవితానికి తన పరిస్థితికి అనుకూలమైన అర్థం చెపుతాడు.'' జీవితాన్ని జీవించటమే ప్రధానమైన విలువ. అందుకు అనుబంధమైన విలువలు : మారటం, ముందుకు పోవటం, రిస్కు ( Risk ) తీసుకోవటం అని పేర్కొన్నాడు గోపీచంద్.

కథానాయకుడైన నారాయణరావు ఆలోచన క్రమంగా పై చెప్పిన రీతిగా రూపొందుతుంది. కాని, గతంతో తెగతెంపులు చేసుకునే శక్తి తనలో ఉందా ? అని సందేహిస్తాడు. అతని కొమార్తె అరుంధతి సమాధాన మిస్తుంది : ''ఎందుకు కాదు నాన్నా ? కదలదలచుకొన్నవాళ్లు ఎప్పుడైనా కదలవచ్చు. కాటికి కాళ్లు చాచుకున్న వాళ్లు కూడా కదలవచ్చు.... 'పరిస్థితుల ప్రభావం' అంటున్నారు గాని .... మానవుడు పెరిగినకొద్దీ పరిస్థితుల ప్రభావం క్షీణిస్తుంది .... మన సంకల్పంలో ఏదో లోపం ఉండి, చీటికీ మాటికీ పరిస్థితులను సాకుగా, డాలుగా వాడుకుంటున్నామేమో ననిపిస్తూవుంది నాకు.'' అతని భార్య రాజమ్మ అంటుంది : ''నా మనస్సుకి ఒక కొత్త నడక స్ఫురిస్తూ ఉంది. ఆ నడకను అందుకోగలిగితే ఎవ్వరికీ ఇబ్బంది ఉండదని అనిపిస్తూఉంది. నడక తప్పి మనం బాధపడుతున్నాం గాని, నిజానికి బాధపడవలసిన అవసరం ఈనాడు నాకేమీ కనపడటంలేదు. మనకంటె బీదవాళ్లూ, దురదృష్టవంతులూ ఎంతమంది లేరు ? వాళ్లకు లేని వేదన మనకు ఎందుకు ఉండాలి ? ఎవరి బ్రతుకు వారిది. ఒకరితో పోల్చుకుని వ్యథ పడటం ఎందుకు ? మనం చూడగలగాలే గని ఏ నడకలో ఉన్న మాధుర్యం ఆ నడకలో ఉంది. అడుగు తప్పకుండా పడితే సరి.'' ఇదే గోపీచంద సందేశం.

సాహిత్య వ్యవసాయమూ, సత్యాన్వేషణమూ జీవితంలో ఒకటైన రచయిత గోపీచంద్. ఆయన దృక్పథం 'హేతువాదపు' గట్లు త్రెంచుకొని విస్తరిస్తూ 'ఉత్తిత మానసిక చైతన్య' సాగరంగా రూపొందింది. సమకాలీన భావ సంచలనంతో హేతువాదానికీ, అస్తిత్వవాదానికీ సాహిత్యంలో చక్కని రూపు రేఖలు దిద్దిన ఖ్యాతి గోపీచంద్‌ది. తద్వారా తెలుగు నవల క్రొత్తదారులు తొక్కటం జరిగింది. సంఘ సంస్కరణ, జాతి పునరుజ్జీవనం, సాహిత్యంలో నవ్యత—యీ మూడింటి దృష్ట్యా గోపీచంద దృక్పథం ఒక క్రమ పరిణామానికి లోనై సమవ్యాప్తి సమగ్రతనూ సాధించింది. నవ్యతను అన్వేషించటం జీవ లక్షణమని గోపీచంద్ ప్రగాఢ విశ్వాసం. ''ఎప్పటికప్పుడు ప్రమాదాలను ఎదుర్కోవలసి వచ్చినప్పుడే కదా మానవుడు క్రొత్త క్రొత్త విషయాలను కనిపెట్టేది. మానవునిలో ఉన్న సృజనశక్తి విజృంభించేది. మానవుడు దేవుడయ్యేది.... భౌతికజీవితం మానసిక జీవితాభివృద్ధికి ఉపాధిగా మాత్రమే వ్యవహరించాలి .... మానసిక జీవితం నూతన శక్తులనూ, నూతన విలువలనూ తెచ్చిపెడుతుంది ..... ఈ స్థితిలో మానవుడు ఏ పరిస్థితుల్లోనైనా, ఏ ప్రభావంలోనైనా తన వ్యక్తిత్వాన్ని కాపాడుకోగలుగుతాడు. అన్ని ప్రభావాలనూ, అన్ని పరిస్థితులనూ తనలోనే పొందగలుగుతాడు. దివ్య జీవనాన్ని సృష్టించగలుగుతాడు.'' గోపీచంద్ విచికిత్సకూ విశ్వాసానికీ ఉత్తితమైన సృజనాత్మక దృక్పథాన్నీ అందుకున్నాడు.

# కామన్‌వెల్త్ చిత్రకళా ప్రదర్శన

హాంగ్‌కాంగ్ రెండు మూడు మోడరన్ చిత్రాలను ప్రదర్శించింది. కాని ఏవీ బాగుండలేదు. చైనీసు పద్ధతిలో వేసిన చిత్రాలు బాగున్నాయి. లైమింగ్ చిత్రించిన "Vulture" అన్న చిత్రంలో గ్రద్దలో తీక్ష్ణతను, రేఖలలోని గరకు, సూది మొనలాంటి పద్ధతిని మెచ్చుకోవలసివుంది.

పాకిస్తాన్ అన్నీ అధునాతన చిత్రాలను ఏడింటిని ప్రదర్శించింది. అన్నీ దాదాపు అనుకరణలే. అమెరికన్ చిత్రకారులు Klein కు, John Marin నీటిరంగుల చిత్రాలకు నమూనాలుగ ఉన్నాయి.

నైజీరియా, సెర్రిలియోన్, ఘనా, నార్తరన్ రొడీషియా, ట్రినిడాడ్ అండ్ టొబాగో, సింగపూర్, మాల్టా, మలయా, జమైకా, ఈస్ట్ ఆఫ్రికా (టాంగనికా, ఉగండా, కెన్యా, జాంజిబార్), బ్రిటిష్ గయానాలు చిత్రాలను ప్రదర్శించాయి. ఈ దేశాలవారి చిత్రాలలో ఒకటో రెండో చెప్పుకోతగ్గవి ఉన్నాయి. అంతా చాల, చాల నాసి రకమైన చిత్రాలను ప్రదర్శించాయి.

మొత్తంమీద చిత్రాలు నిరాశను కలుగచేశాయి. మొట్టమొదటి సారిగా ఇంత పెద్ద ఎత్తున దాడి జరిగి కామన్‌వెల్త్ చిత్రకళా ప్రదర్శన గురించి ఒక కాలంలో ఆరు, ఏడు అంగుళాల కంటె ఎక్కువ ఏ పేపరు వ్రాయలేదంటే లండన్‌లో ఎంత సరుకులేని చిత్రాలో గ్రహించగలరు. చిత్రాలలో అధునాతనత్వాన్ని (పాశ్చాత్యులది) తేవాలని ఎంత నాసికరకపు నమూనాలను (పాశ్చాత్య చిత్రాలకు) తయారు చేశారో కామన్‌వెల్త్ దేశపు చిత్రకారులు ఈ ప్రదర్శన తెలుపుతుంది. ఆస్ట్రేలియా అందరి మన్ననలను పొందింది. ప్రాక్ దేశాలన్నీ స్వంతంగా ఒక భావాన్ని బలమైన, నూత్న పద్ధతిలో చెప్పాలంటే చాల కాలం పడుతుందనిపించింది. 85% చెడ్డ చిత్రాలలో మిగిలిన చిత్రాలు మినుకు మినుకుమనే ఈ ప్రదర్శననుండి, ఇంత దూరం రెండు రూపాయలు ఖర్చు పెట్టి ఎందుకు వచ్చానా అనిపించింది. లండన్‌లో ప్రముఖుల ఎందరి ప్రదర్శనలో చూచిన నాకు.

# దశావతారములు క్రమాలంకారము

సీ. శ్రుతి సుధాత్మ భక్త సురజననీ వధూ
మల్ల శంకర ధర్మ మహిత బుద్ధిఁ
గగ, కూర్మ, కిటి, నర, మృగ, కుబ్జ, రామ రా
మానంత, బుద్ధ, కల్క్యాహ్వయముల
నముచి, మందర, కుదానవ బలార్జున పంక్తి
ముఖముష్టిక స్త్రీ విముక్త ఖలులఁ
దద్భుచ్ఛ, కర్పర, దలష్ట్రాగ్ర నఖ పద
పరశు, బాణ, హలాంగ, ఖురపుటములఁ

గీ. జెరివి, తాల్చి, యెత్తి, చీరి, బంధించి, ని
ర్జించి, యేసి, యేర్చి, చెఱిచి, మట్టఁ
గడగుచున్న శౌరి కరుణా విధేయుఁడై
మనల కోర్కులిచ్చి మనుచుఁగాత

సూరయ-శన్నప్ప చరిత్రః

# "నృత్య రత్నావళి"

## శ్రీ నే. శ్రీ. కృష్ణమూర్తి

*(గత సంచిక తరువాయి)*

తంజావూరు సరస్వతీ మహల్ పుస్తక భాండాగారమున B. 11540 : D 1067 L. యను సంఖ్యాసూచితమైన వ్రాతప్రతి * 'నృత్య రత్నావళి నాట్యలక్షణ' మని యున్నది ఈ తాళపత్ర గ్రంథాంతమున (100.B) పుట :

> "సంగీతశాస్త్రం.నృత్య రత్నావళి అధ్యాయాలు (8)
> ఆకులు 100 ట్కి తెలుగు లిపిని పుస్తకం 1
> నగర వెంకటసుబ్బయ్య చాతను వ్రాయించినది.
> కార్తీకమాసం 12 తేదీ సంపూర్ణ మయినది.
> గ్రంథ సంఖ్య శ్లోకాలు 1900 ట్కి పు 1 ఆర్యవర్షం
> రవ్ంజాను నెల 25 తేది సమాప ము."

నాల్గవ అధ్యాయమున కరణ, అంగహారములు వివరింప బడినవి. తరువాత వ్రాత ప్రతియందు దేశీ నృత్య విషయములు ఆరవ అధ్యాయముగా గద్యమున వ్రాసియున్నవి. పిమ్మట ఏడు, ఎనిమిది అధ్యాయములతో గ్రంథము పూర్తియగుచున్నది. కాని 7, 8, అధ్యాయ విషయ వివరణ శీర్షికలు ఆయా గద్యములందు సూచింపబడలేదు.

పంచమాధ్యాయము ఈ తెనుగు లిపియందు మృగ్యము. ఈ కావ్య వస్తు ప్రదర్శనా క్రమమును పరిశీలించిన, ఆ లోటువడిన అధ్యాయము 'రస—భావ' ముల గూర్చి యుండునేమో ! నృత్యశాస్త్ర వివరణలో 'రస—భావ' విషయావిష్కరణము మేరువూస వంటిది. తదితర ప్రతుల పరిశీలించి రస—భావ విషయముల గూర్చి, జాయసేనాని యెట్లు వ్రాసినది తెలిసికొనవలయును.

షష్ఠాధ్యాయమున వివరించిన విషయములలో పేరెన్నదగిన ముఖ్య ప్రస్తావన దేశీలాస్యాంగముల గూర్చినది. ఇవి ముప్పది మూడుగా వివరింప బడినవి.

(1) సుకలాసం, (2) ఉరోంకణ, (3) భావః, (4) ధరహరం, (5) నత్కిర్తు (?), (6) దేశికారం, (7) విజాపణం (8) ఢిల్లాది, (9) నవణిః (10) గీతవాద్యత, (11) అభినయ (12) క్షోఘులికా, (13) ఓయాళ, (14) నికితి, (15) అంగహార, (16) మనోధర్మం, (17) అంగవ్, (18) వివర్తనవ్, (19) ఝుంపక, (20) ముఖరసః (21) విహసి (22) ధనక, (23) తత్థం, (24) ద్వితత్థం, (25) రసవృత్తి, (26) మన్పణత, (27) అనుమాన, (28) ప్రమాణ, (29) లంఘి త, (30) అంశగతి, (31) సుసంధి, (32) పాదపాట, (33) చండ.

(పై లాస్యాంగముల లక్షణములు కొన్ని వ్రాత ప్రతియందు సలక్షణములుగా లేవు.)

సంగీత రత్నాకరమున ఈ క్రింది పది, దేశీలాస్యాంగములుగా వివరింపబడినవి.

(1) చాలి, (2) చాలివడ (3) లఢి, (4) సూక, (5) ఉరోంగణ, (6) ధసక, (7) అంగహార, (8) ఓయారక, (9) విహసి, (10) మన.

జాయ సేనుని (2) ఉరోంకణము, (15) అంగహారము, (21) విహసి, (22) ధసక దేశీ లాస్యాంగముల లక్షణములు శాఢులుని లక్షణములతో సరిపోవుచున్నవి. వ్యత్యాసములకు, లోపించినందులకు కారణములు, ప్రాంతీయత, సాంప్రదాయములే.

జాయసేనాని.

(2) ఉరోంగ (క) ణము.

> ఊర్ధ్వాధః పురతః పశ్చాత్
> స్కంధ యోస్తన యోరపి ।
> ద్రుతం విళంబితం యద్వా
> లలితంతాళ మానతః॥
> పర్యాయాచ్చాలనం యత్ర
> స్యాదుక్తం తదురోంకణం।

పైకి, క్రిందికి, ముందుకు, వెనుకకు స్కంధమును, వక్షః స్థలమును, ద్రుతముగా, విలంబితముగా, లలితముగా, పర్యాయముగా తాళమాత్రము (9") చాలన మొనర్చుట ఉరోంకణము.

శాఢులుడు.

(5) ఉరోంగణము VII. 1211—2.

---

* ఈ తెనుగు లిపి ప్రతిని బ్రహ్మశ్రీయుతుల. ప్రొఫెసర్ నిడదవోలు వేంకటరావుగారు కు ప్రాప్తింపజేసిరి. గ్రంథలిపిలో గల ప్రతి మరొక్కటి సరస్వతీ మహల్‌లో కలదు.

విలంబేనా విలంబేన
కుచయోరు భుజ శీర్షయోః।
లలితం చాలనంతిర్య
క్తజ్ఞాః ప్రాహురురోంగణమ్॥

ద్రుతముగా, విలంబితముగా రొమ్ములను, భుజశీర్షముల అడ్డముగా, లలితముగా చాలనమొనర్చుట ఉరోంగణము.

జాయ సేనాని

(15) అంగహార.

సమర`చాపలతేవాంగ
యష్టి పార్శ్వమయేన చేత్।
సవిలాసా మితాత్తాళ
లయావినః (?) మతిః క్రమాత్॥
హరణా దంతరంగాణా
మంగహార స్తదామతః।

సమరాంగణ మందలి ధనుస్సువలె నర్తకి అంగయష్టిని సవిలాసముగ తాళలయానుసారముగ వంచుట అంగహారము.

సోఢలుడు VII. 1213.

(7) అంగహార

సతాల లలితో పేతా
క్రమాత్కాయార్థ యోర్నతిః.
ధనుర్వదంగ హారఃస్యా
దితి నిఃశంక భాషితమ్॥

తాళ లయలకు సమన్వయించుచు శరీరార్థముల (పై, క్రింది) ధనుస్సువలె లలితముగా వంచుట- అంగహారము.

జాయసేనాని

(21) విహసి.

స్మితం వక్త్రస్య విహసి
పద్మస్యేవ మనోహరం.

ముఖమందలి స్మితము, పద్మమువలె మనోహరముగా నుండినది విహసి.

సోఢలుడు. VII. 1214—15

విహసి.

స్మితం స్యాద్విహసీ యస్తు
శృంగార రసనిర్భరః।
అభ్యస్తాదన్య ఏవాతి
సూక్ష్మ ప్రత్యగ్రభంగి భాక్॥

శృంగారరసాత్మకమైన చిఱునగవు, సూచితా సూచ్యముగ, లలితమై యుండుట. ఈ నగవు అభ్యాసముచే ప్రకటించునదికాదు.

జాయసేనాని

(22) ధసక

చంచరీక సమద్పుష్ప
గుచ్ఛ తీ లానుకారిణోః।
స్తనాధో దేశ ధమసా
దన్యాత్ర స్త్వేవ నర్తకః॥
పాద్యానుప విలాసార్థం
స్తనయో నమనం సకృత్।
మధ్యే మధ్యే ప్రకుద్వీత
నృత్తస్య ధసక స్తథా ॥

తుమ్మెదల దండుచేరి యుండుటచే వ్రాలిన పుష్ప గుచ్ఛముల పోలిన స్తనద్వయమును మధ్యమధ్య వంచుట (?)

సోఢలుడు VII. 1212.

ధసకః స్యాత్సు లలితం
స్తనాదో నమనం లయాత్.

స్తన ప్రదేశమును లాలిత్యముతో వంచుట ధసకము.

ఇందు జాయసేనాని 'అంగహార' మను శబ్దము యొక్క భావమును రమ్యముగా నిరుక్తియించినాడు.

హరణాత్ అంతరంగాణామ్ (సామాజికుల) అంగహార:'

లలితముగా, సౌందర్యయుతముగా వివిధాంగ, ఉపాంగ ప్రత్యంగముల విన్యాస మొనర్చు నర్తకి, సహృదయులయంత రంగముల హరించుననుట తథ్యము. కేవలము లోచనా దృష్టులే చాలును. అంతరంగములు ఆకర్షణాజాలముల లోనగుటకు!

జాయసేనాని విస్తారముగ నృత్య ప్రదర్శనముల వీక్షించి తనకు యనుభవ వేదితములగు నృత్యభంగులను సమీకరించి తర తరములవారికి వీటి రహస్యముల నందించుటకై, నృత్య విషయముల శాస్త్ర నిబద్ధముచేసి 'రత్నాకరము'ను సంకలన మొనర్చెను. సంగీత రత్నాకరమందు దేశి నృత్యమును గూర్చిన విషయావిష్కరణము లఘువైనది,. గౌణమైనది.

షష్ఠాధ్యాయాంతమున దేశీలాస్యాంగముల కనువగు తాళముల గూర్చి, గ్రంధకర్త వర్ణించెను.

## శిక్షాపద్ధతి (ఉపశీర్షిక)

సప్తమాధ్యాయ పూర్వభాగ ముఖమున నృత్యవిద్య ప్రారంభింపవలసిన శుభసమయము, నర్తకీ నర్తకుల వయస్సులు, శిక్షణాపద్ధతి, కళావిద్య పూర్తియైన తరువాత ఆచార్యునకు సమ్మానమును, ప్రదర్శన యోగ్యత ప్రాప్తించునాడు చరమ ప్రబోధముగా గురువు చెప్పవలసిన పంచశీలములు, నేటికివి నర్తన విద్యాభ్యాసము నభిలషించువారికి ఉద్బోధకముగా నున్నవి.

నృత్యారంభమునకు రిక్త తిథులు వర్జనీయములు. మిగిలినవి శుభప్రదములు. బుధ, గురు, శుక్రవారములు, హస్త, శతభిష, పుష్య, అనూరాధ, ధనిష్ఠ, రేవతి, జ్యేష్ఠ నక్షత్ర కాలములు మంగళ సూచకములు.

నాట్య విద్యా శిక్షకు యోగ్యమగు రంగభూమి స్థిరమై, మృదువై, తెలుపుగా గాని, నలుపుగా గాని యుండవలయును. ఈ రంగప్రదేశమునకు, సౌధములు, కేళీవనములు, రమ్యమగు పచ్చిక గల బయళ్లు, శుభమగు మరేవేని స్థలములు యోగ్యములు.

విద్యాప్రాప్తి నభిలషించు నర్తకి ప్రారంభమున 6, 7, 8, 9, (గౌరీ, రోహిణి) సంవత్సరముల వయస్సు గల కన్యలుగా నుండవలెను. వారు అర్ధోరుక (చల్లడములు) వసనాలంకృతులుగ నుండవలెను. వీరికి స్తనోద్గమమైన కంచుకధారణము చేయు వయస్సు దాటరాదు.

విద్య నభ్యసించునపుడు గాత్ర సౌష్ఠవ పరిణామ ప్రాప్తికై, మృదువై, నిర్దోషమై, పట్టుకొనుట కనువైన మూలమునుండి ఏడు గణుపులు గల వేణుకాష్ఠమును స్తంభములపై కట్టి యుంచవలెను. 1 (Barre for Ballet Learners) విద్య నేర్చు కాలమున పై వంశదండమును పట్టుకొని, ఆచార్యోపదేశానుసారముగ మార్గదేశి నృత్యములలో ప్రథమమున సుకరములైనవి, పిదప క్రమముగా కఠినములగు నృత్యభంగులను, నిత్యమును స్వల్ప స్వల్పముగా, యథాశక్తిగా నభ్యసింపవలెను.

ప్రయోగములు సిద్ధించినట్లు గుర్తించిన పిదప, గురువు తాళధ్వనులతో, పిదప వక్త్రవాద్యముతో, అటుపైన గీతముతో ఆయా ప్రయోగములను ఛాత్రులచే చేయింపవలెను.

విద్యాశిక్షణ పూర్తియైన పిదప నాట్యాచార్యుని, శుభదినమున స్వర్ణాంబరాదులతో సత్కరించవలెను.

## ఆచార్యుని చరమప్రబోధము

నర్తకి, గీతవాద్య నర్తనమున ప్రౌఢయైన పిదప, పారంపర్యాగతము, అభ్యాస గోచరము నగు సార్ధశ్లోక పంచకమున, నిబిడీకృతమైయున్న నృత్య విద్యా రహస్యము ఉత్తీర్ణత చెందిన అభినేత్రికి ఆచార్యు డుపదేశము చేయవలయును.

1. గీతాన్వయ వాసంగైః
   భావాన్ దృష్టి విచేష్టితైః।
   హస్తైరర్థం లయా పద్భ్యాం
   వర్ణాన్ పాఠైః ప్రదర్శయేత్॥

2. గీతాక్షర సమం వాద్యం
   ..... గీతమేవచ।
   లాస్యాంగ పాఠహస్తాద్యైః
   తన్మిత్రైః నృత్య మాచరేత్॥

3. ప్రాణేశం భావయంతీ స్వం
   ఆనమంతి సభాపతిం।
   గీతార్థా పతితాన్ భావాన్
   వ్యంజయన్ త్యనురంజయేత్॥

4. యేషు యేషు ప్రయోగేషు
   ప్రేక్షకాణాం రుచిర్భవేత్।
   .... సమ్యక్ జ్ఞానే గీతకావుం
   భంగ్యాతాంస్తాన్ ప్రదర్శయేత్॥

5. రసానాం వినియోగేషు
   యతోహేతోః కరోభవే।
   దృష్టిర్మనశ్చ భావశ్చ
   తత యేవ భవేత్ క్రమాత్॥

   రసానాం పునరుత్పత్తిః
   భావైర్భవతి భావితైః।

(1) గీత భాగములను అంగ విన్యాసములతోను, భావములను దృగ్విలాసములతోను భావ, పద, అర్థములను హస్తములతోను, లయను పాదములతోను, వర్ణములను (స్వర వర్ణముల) పాఠములతోను ప్రదర్శింపవలయును.

(2) వాద్యము గీతాక్షరాను గుణముగ నుండవలెను .. గీతానుగుణములగు లాస్యాంగ, పాఠ, హస్తాదులతో నృత్తమొనర్పవలెను.

(3) ప్రాణేశుని భావించి సభాపతికి నమస్కరించి, గీతార్థమున నేర్పడిన భావములను వ్యక్తీకరించుచు, (సహృదయులను) రంజింపజేయవలయును.

(4) ఏయే ప్రయోగములందు సభ్యులకు అభిరుచి కలదో చక్కగా తెలిసికొని ఆయా ప్రయోగములను ప్రదర్శింపవలయును.

(5) రసముల వినియోగమున హస్తములబట్టి దృష్టిమనస్సు భావముల కేంద్రీకరించవలయును.

భావములను భావింప రసముత్పన్నమగుచున్నది.

---

1. "Barre" Definition taken from 'BALLET' by Arnold Haskell.

198. Barre : 'A rod running round the walls of a dance-Studio which the pupils hold during their first exercises and while they are being placed. It steadies them, taking the place of the partner's hand.

## దేశీ(య)నృత్యములు

సప్తమాధ్యాయ ఉత్తర భాగమున పేరణి దేశీ పద్ధతి ప్రేక్షణము, సూఢ, శుద్ధసాలగ, రాసకం, కలవ్, చర్చరి నాట్యరాసకము, దండరాసకము, చిందు (తు), కందుక నృత్యము, భాండికనృత్యము, ఘటివిశ్రి, చారణ నృత్యము, బహురూప నృత్యము, కోల్హాటక లేక కోలాటము మొదలగు వానిని గూర్చి జాయనార్యుడు నృత్య రత్నావళియందు వివరముగ తెల్పెను.

ఇందు పేరణి, చారణ, కోల్హాటకములగూర్చి శారఙ్గదేవుడును చెప్పెను. నందికేశ్వరుడు తన భరతార్ణవమున పేరణి, ప్రేంఖణి, దండలాస్య, కలసములగూర్చి తెల్పెను. సోదర కృతులనుండి పోలికలకొరకె ఈ వ్యాసమున వను ప్రదర్శనము చేయ

### పేరణీ:

సంగీత రత్నాకరము VII. 1301—1302.

భస్మాదిశ్వేత లిప్తాంగో బిభ్రన్ముండం శిఖాన్వితః।
భ్రాజద్ఘర్ఘరికాజాల జంఘః శరీరపేశలః॥
పంచాంగ కుశలస్తాల కలాలయ విచక్షణః।
సభాజన మనోహారీయో నృత్యతి స పేరణీ॥
ఘర్ఘరో, విషయం భావాశ్రయశ్చక విచారకః।

భరతార్ణవము : పే. 371. శ్లో : 731—732.

భస్మాది శ్వేత లిప్తాంగో బిభ్రత్కన్ధ శిఖం శిరః।
భ్రాజద్ఘర్ఘరికా జాలజంఘః శారీరపేశలః॥
పంచాంగ కుశలస్తాల కలాలయ విచక్షణః।
సభాజన మనోహారీ నృత్తవ్య ప్రేరణీ మతః॥
(నందికేశ్వరుడు ప్రాచీనుడు)

నృత్య రత్నావళి VII అ.

రజంకో రూపసంపన్నః ప్రద్యోతో ఖ్యాతవంశజః
...... రసికస్తాలవేదీ గమక కోవిదః॥
ధ్వని శారీర సంపన్నో రాగాంగాది విచక్షణః।
పంచాంగ కుశలోప్యంగ సర్వ భాషావిశారదః॥
సుముఖః వాద్య విత్ప్రోక్త ప్రస్తావోచితభూషణః।
గాథాగీత ప్రబంధానాం లాస్యాంతాళవ పద్ధతి॥
పేరణీ మతః।
విద్వాన్ ఉత్ప్లుతి పూర్వేషు కరణేషు సలాఘవః॥
భూషణై ర్భూషితో భాస్వద్భ స్మోద్ధూళితవిగ్రహః।
శిఖా వాన్ముండిత శిరం దధత్సున్తఫణాధరః।

బిభ్రద్ఘర్ఘరికా జాలే జంఘయో ర్వృష్టసంయుతే
ఏకతో ద్వంద్వ శోవాపి క్రమాత్పూర్వ ప్రవేశితైః।
చతుర్భిరథ వాషడ్భి దష్టభిర్వాస్న యోథకైః॥
అభితస్సహిత స్వస్యా థధా వైస్త్వల్య వేషతాం।
సమపాదేన వాతిష్ఠన్ భుజంగ త్రాసితేనవా॥
.... తేయువని కాక్షేపే సతిరంగిభువం విశేత్।

(ఇందలి పాఠము Text—సంస్కరింపవలయును).

పేరణీయనగ ఆహార్యాదివేషము ధరించిన యొకపాత్ర. ఈ నటున కుండవలసిన గుణసంపత్తి, ప్రయోగమందుండ వలసిన వేషరూప మిందు వర్ణింపబడినవి.

### పేరణి గుణములు :

రంజకుడు, రూపసంపన్న ప్రద్యోతనుడు, కులీనుడు, రసికుడు, తాళవేది, గమక కోవిదుడు, ధ్వని శారీర సంపన్నుడు, రాగాంగాది విచక్షణుడు, పేరణి ప్రయోగమందుగల పంచాంగము అందు కుశలుడు (నృత్త, కైవార, ఘర్ఘరీ, వికట, గీత) సర్వ భాషా విశారదుడు, సుముఖుడు, వాద్యవిదుడు, ప్రస్తావోచిత భూషణుడు, గాథాగీత ప్రబంధజ్ఞుడు, విద్వాంసుడు, ఎగురుట యందును, కరణముల ప్రయోగమున, లాఘవముగ చేయగల నేర్పరి, భ్రమరీ భంగుల తెలిసినవాడుగనుండు నర్తకుడు పేరణి.

ఈ వేషధారి భూషణములు ధరించవలెను. శరీరము భస్మము పూసికొని, విగ్రహము కాంతియుతముగ నుండదగును. శిరోముండనయుతుడై, శిఖను మాత్రము కల్గి యుండవలెను.

ఒకచేతితో కుటిలకమును (రంగయష్టి)? రెండవ చేత చామరమును ధరించవలెను. తోటిపాత్రములు ఒక్కొక్కర గాని, జంటలుగాగాని, వరుసగాగాని రంగముపై క్రమముగ ప్రవేశింపవలెను. వారందరు 4, 6, 8 మంది పేరణిని చుట్టి వలయాకారముగ నుండవలెను.

ప్రవేశ సమయమున సమపాదముననగాని, భుజంగ త్రాసిత మున గాని, తెరను ప్రక్కకుత్రోసి, రంగ ప్రవేశము చేయ వలయును.

(తరువాత పంచాంగములు, అందలి ఘర్ఘరమందలి యేడు విభాగములు వర్ణింపబడినవి)

### రాసకము

12, 16, 18, నాయికలు వలయాకారముగ (పిండీ భావమున) నృత్య మొనర్చుట. నాయిక ఊరువులు చేలము వస్త్ర ధారణమై యుండవలెను (చేల ఐర్ధోరుకం.) లో చేలముగాని అర్ధోరుకముగాని ధరింపవలయును. కార్పాస (నూలుచొక్కా)ను తొడిగి, ధమ్మిల్లముగాని, వేణిగాని క

మంజీరములు, కంకణములు ధరించవలెను. యవ్వనలై, మనోహరముగానుండి, పీవర ఊరుస్తనములు కల్గియుండవలెను. (కటి ?)

వాద్యములతో జంటలుగా యవనిక గర్భమునుండి, పార్శ్వ భాగములనుండి, రంగముపై ప్రవేశింపవలెను.

(ఇచ్చట ప్రాతప్రతియందు మంచి శ్లోకములలో ముఖ్యాక్షరములు లోపించినవి.)

గాయకులు ఋతువున కనుగుణములగు రాగములతో గానము చేయుచుండ చర్చరీ మొదలగు ప్రబంధములతోను, ఖండమండల చారులతోను, ముఖ్యలాస్యాంగములతోను, గీతార్థాభినయ మొనర్చుచు చిటికెలబూని లయానుసారముగ, చిక్కని దట్టమగు వివిధములగు బంధములతో నృత్యమొనర్పవలెను.

## నాట్యరాసకము [1]

వసంత కాలమున యవ్వనానవ మత్తలగు నాయికంచే దేశియములగు దోలగీతికలతో భూపతి చరితమును పదార్థాభినయము చేయు నృత్యము.

## దండరాసకము

ఇందు 8, 40, 64, 128 నాయిక పాత్రములు పాల్గొనవచ్చును. మూర (అరత్ని) మానముగల పొడవును, అంగుష్ఠ మాత్రము మందముగల్గి కొనన బంగారుతొడుగులుండి, నునుపుగా, చిత్రవర్ణములతోనుండి, మంచిచెక్కతో చేయబడిన దండముల ఇరుచేతులలో ధరించవలెను. అథవా పాలచెట్ల కొయ్యలుగాని, దేశీయ సంప్రదాయాను సరణమగు మ రేవేని దారువులు ప్రయోగార్హములు.

వాదకులచే వాద్యములు మ్రోగుచుండ లాస్యాంగ, భ్రమరీ, పాద, చారులతో, ధనురాకారముగ ఈ బృందము తిరుగవలెను. సవ్యాప సవ్యములుగా, చక్రవలయాకారముగ, సశబ్దముగా అయిదు మారులు ఈ దండముల కలుపవలెను. సభనధ్యక్షించియున్న రాజుకోరిక ననుసరించి యథాక్రమముగా ఈ కోలాట [2] నృత్యమును జరుపవలెను. ప్రౌఢనర్తన శిక్షితములగు నృత్యమును ప్రయోగింపవలెను.

భరతార్ణవమున : పే. 378. శ్లో. 745—749.

యత్ర సంభూయ వనితాః పరస్పర మనోహరమ్ ।
దండైర్దం డైశ్చ నృత్యంతి నృత్యం తద్దండ లాస్యకమ్॥
మాధ్యమాంగులి వత్సూక్ష్మం దీర్ఘంస్యా త్షోడశాంగులమ్ ।
లాస్యే ప్రాధాన్య మిత్యేతల్లక్షణం దేశికర్తృభిః॥
పాటాక్షరేణ సంయుక్తం భ్రమరీ నృత్యమాచరేత్।
సమస్థానక మాశ్రిత్య పశ్చాత్తాలం వినాయకమ్॥
ప్రెక్షాస్థానక షట్ కేష గతిభిశ్చ విశేషితః ।
అవేక్షైః పాదవిన్యాసైర్దండ లాస్యం సమాచరేత్॥

ఈ దండభాగములందు వేంచేసియుండు దేవతలు. 749-50

దండమూలే స్థితో బ్రహ్మ దండమధ్యే సదాశివః ।
దండాగ్రే మాధవో యజ్ఞే దండశబ్దేతు నారదః॥

## చిందు

ఈ దేశి నృత్యము శివోత్సవములందు ప్రయోగార్హము. మృదంగ, శకట (?) కంచుతాళ, కాహళ, వాద్యములు మ్రోగుచుండ, లయానుసారముగ, రుద్రాక్షలు ధరించి, విభూతి పూయబడిన త్రిపుండ్రముల ధరించి, శివలెంకలు వరుసలుగా నిలువబడి, సంతోషముతో చంద్రశేఖరునిగూర్చి గానము చేయుచు, యథోచితములగు అంగములతోను, లాస్యాంగములతోను, పాదగతులతోను, ఎదురెదురుగా నిలుచుండిగాని, వివిధ రూపములగు మండలా కారములుగా నుండి నృత్యమొనర్తురు.

ఈ నృత్యము శివప్రీతికరమైనది. మరియు చిరు తాళములతో కూడిన ధ్వనులను, నోటితో తాళాను గుణ్యమగు మాటలతోను, చారులు, గతులతో కూడిన పాదచలనములతో, గీతాభినయములతో కూడిన ద్విపదములతోను (వీటిపే చిందులందురు) యౌవనవతులు సువేషలై నృత్యమొనర్చుదురు. (ప్రాతప్రతియందు ఈ వర్ణనను కొంత లోపించినది.)

## కందుకనృత్యము [3]

పద్మగోమూత్రిక, నాగ, చక్ర, మొదలగు వాద్యములు ధ్వనించుచుండ, దేశీయ నర్తనమందు పేర్కొనబడిన ప్రబం

---

1. ఈ పేరుతో, సాహిత్య దర్పణము, భావప్రకాశము, నాటక లక్షణము, రత్నకోశము ఇత్యాది గ్రంథములలో ఉపరూపకముగా నాట్యరాసకము వర్ణింపబడినది. వీటి సామంజస్యములు శోధనీయములు.

2. కోలాటమను పదమిచ్చట సామాన్యార్థముతో ప్రయోగింపబడినది.

3. కందుక మన బంతి. దీనిని కృష్ణద్వైపాయనుడు 'వీటి' యని ప్రయోగించెనని, వప్పయభట్టారకుడు కందుకము పిండు యని ప్రయోగించెను. రాకుమారులు క్రీడించుచుండ ఆటలాడు చెండు నూతిలో పడెను. వ్యాసుని రచన ప్రకారము ఇయ్యది నీటిపై తేలియుండగా, ద్రోణుడు తన దృష్టిముష్టి సౌష్ఠవముతో బాణ రజ్జు నిర్మితముచేసి వెలికి తీసెను. నీటిలో పడిన అంగుళీయకమును బాణ మోక్షముచే పైకి తీయగలనని, అట్లు వారి పతిత ముద్రికను తన శస్త్ర కౌశలముచే పైకి తీసెను. వప్పయభట్టారకుని పిండు బావి నీటిలో మునిగి ఆకాశమున నక్షత్రములు ప్రకాశించునట్లు తారవలె భాసించెను. 'వీటి' ని బంతి యనుట సరికాదేమో !

భర్తృ : I—83 (ద్వైత)

"యథా కమ్దకపాతేనోత్పతత్యార్య:."

వర్ణించుటలో కందుకము భూమిపై పడి పైకి ఎగురు

ధము (పాట) లను పీవరహారున్నత భారము కల్గి, సునేత్రలు, కాంతి, యౌవన విభ్రమములతో పరస్పరము ఒప్పుచున్న వనితాద్వయము రెండు బంతులతో నృత్య మొనర్తురు. ఆకందుకములు, బంగారము, వెండి, కంచుతోగాని, కొయ్యతో

---

వట్లని, వజ్జనుని గూర్చి చెప్పెను.

శ్రీనాథుడు III—95 (శృ. నై) 'కాంచనపు బంతి' యని ప్రయోగించెను. రాజభవనమున కాంచనముతో చేసిన చెండ్లుండుట సామాన్యము. కాంచన మన పువ్వనియు, అట్టి పూలతో బంతిని చేసి, నలునంతటివాని భుజదండమున వేయ ఆ పూలు భగ్నము లగును. బంతికి కాంచనపు రక్షణ కల్గి అంతరాళము శూన్యముగ నుండుటచే నీల నీరజవిళేక్షణ విన రుచే ఆ బంతి మిట్టి బిట్టు రవడికొనెను—ఇందు అదృశ్యు డగు నలుని స్కంధయష్టి బలిష్టతను తెలుపుచున్నది. కాని 'వీటి' యన బంతి కాదనియు, దారు నిర్మితమైన, చిల్ల గోడని అర్థనిర్ణయ మైనది. జాయప సేన వర్ణితములైన కందు కములు లోన డొల్లలై, అభ్యంతరములందు ఇనుపగుండు కల్గి వందున పైన ఎగురునప్పుడు ధ్వనించుటకు వీలుగా నుండును. ఈ ధ్వని ఎగురవేసిన విసరునుబట్టి బంతి అంతరాళమున చలించునప్పుడు, వివిధ రీతుల గుండ్రముగా తిరుగునప్పుడు లోని ఇనుపగుండు మనోహరముగ శబ్దము చేయును.

"హేమ్నా రూప్యేణ కాంస్యేన రచితాం దారుణాథవా।
అంతశ్చల దయోగోళ నిస్స్వాన ముఖరీకృతా॥

యామినీ పూర్ణ తిలకా విలాసము : చెళ్లపిళ్ల నరసకవి :
రగడ : బంతి బంతులు సాగి పువ్వులబంతి బంతుల తరమి రువ్వుచు
చెండ్లను రువ్వుచుండగా, అవి నేరుగా (బంతులు సాగి) పోవును
ఆ బంతిపై తారా చిత్రముల రంగుపూత లుండెను.

శ్రీనాథుని కాశీఖండమున : VI ప. 161.
ఒక్కనాడు భవాని యుబుసుపోకకుఁ బ్రైఁడి జలపోస నము కసీసంపుఁ బట్టు
బంతిఁ గుట్టిమ భూమి బాణి పల్లవమున నాస్ఫాల నము చేయు చాడుచుండ.
పైఁడి జలపోసనము కసీసంపుఁ బట్టు బంతి :
వల్లని చెండుపై హేమపు పూతపూసినట్టి బంతితో..

శ్రీనాథుని శృంగారనైషధమందలి కాంచనపు బంతి, సంపెంగ పూలచెండు గాక, రువ్విన పై కెగరగల్గిన బంగారు పూత గల్గిన కందుకమే.

1255 ఏ. డి. నాటికే జాయసేనాని కందుక నిర్మాణము గూర్చి విపులీకరించెను.

గాని, చేయబడి, లోపల డొల్లయై, అంతరాళమున ఇనుప గుండు ధ్వనించుటకై గూర్చబడి యుండవలెను. ఆ చెండ్లు ఎగురవేయబడినప్పుడు ఆకాశమును సరోవరమునందలి మీనాబ్జ ములు సంకలన మొనర్చు రీతి చలించుచుండును. అట్లు ఎగురు కందుకముల లోలాక్షులవీక్షించుచు చారులతో, గతు లతో, లలితములగు లాస్యాంగములతో నృత్యమొనర్చెదరు.

ఉల్లలత్కందుక ప్రాప్తి
యావల్లోలాక్షి లీలయా।
రచయంత్యా విహాకాశం
సరో మీనాబ్జ సంకులం॥

## కోల్హాటము

జాహాళముల, మార్గ, పటహముఁ, కాంస్య తాళముల, మర్దళముల, జయగంటల, భేరి, తంపటముల, వాద్య శబ్దములు ప్రమోగ, అంచితాది కరణముఁతో, చిత్రములగు గమనములతో, ఎత్తయిన గడపై యతి దుష్కరములగు భ్రమణములను చేయుచు, ప్రాణ సందేహకరములగు శస్త్రధారాగ్ర వర్తనము చేయుటయు, మెత్తని శరీరముతో మనుష్య దుర్వహములగు భారముల వహించి, పైకి పక్షులవలె ఎగురుట, శస్త్ర చాలనము చేయుట ఈ నృత్య విశేషములు.

సంగీత రత్నాకరము : VII 1330.
భారస్య భూయసో వోఢో ప్రౌఢో భ్రమరికాదిషు।
రజ్జు సంచార చతురశ్ఛురికా వర్తనే కృతీ॥
శస్త్ర సంకట సంపాతపటుః కోల్హాటి కోమతః।

పారఙ్గదేవుడు రజ్జు సంచారమును, ఛురిక ప్రహార నృత్యమును, క్రింద పాతరలో నుంచిన శస్త్ర సంకటములపై పతన మగుటయు వర్ణించెను. కాని జాయసేనాని :

ప్రాంశోరు పరివంశస్య భ్రమరై రతిదుష్కరైః।
ప్రాణ సందేహ కరణై శ్శస్త్ర ధారాగ్రవర్తనైః (?)॥
మనుష్య దుర్వహైర్భారై ర్మృదంగ పరివర్తనైః।
ఉచ్చైః ఖగ వదుస్వి (?) నైః శస్త్రాణాం చాల నాదిభిః॥

అనియే చెప్పెను.

పై చెప్పిన దేశీయ నృత్యమందలి పేరణి గూర్చి శ్రీనాథుడు శ్రీ కాశీఖండమున పేర్కొనెను. పేజి. 229. ప. 296

సీ. చాముండి యొనరించు జంపె తాళమునకుఁ
భృంగీశ్వరుడాడెఁబేరణంబు.

పై కావ్యమున : పే. 373—ప : 169. వ:
కాశికానగరంబు వేశ్య వాటికలోన గర్వార తిలకవా గణిక యొకతె

యపము పాయకుని యూఅవ పుష్పబాణంబు దత్నేశు
నాస్థాన రంగభూమిః
గుండలి వృత్తంబు గోహ లాద్యాచార్య మతభేదముల
దేశిమార్గ సరణి.

ఇందలి కుండలి (గుండలి) వృత్తమును గూర్చి సంగీత రత్నాకరమున గౌండలీ విధియని సుదీర్ఘ వర్ణనము కలదు. VII—1273—1301. ఇది కర్ణాటక దేశ సంప్రదాయ మని చెప్పబడినది.

కాని ఈ నృత్యమును గౌండినీయని జాయసేనాని వచించెను.

కళ్యాణ కటకే పూర్వం
భూత మాతృ మహోత్సవే ।
సోమేశః కౌతుకీ కాంశ్చిత్
భిల్లి వేష ముపేయుషీమ్॥
నృత్యంతీ మథగాయంతీం
స్వయంప్రేక్ష్య మనోహరం (మనోరమ) ।
ప్రీతో నిర్మిత వాంశ్చిత్రే
త్తేగౌండినీ విధ మిత్యయమ్॥
స్వతోభిల్లి మహారాష్ట్రే
గౌండినీ త్యభిదీయతే ।

పూర్వము కళ్యాణ కటకమున భూత మాతృ దేవతల ఉత్సవమున కౌతుకముతో సోమేశుడు భిల్లి వేషమును దాల్చి, నృత్యము గానము చేయుచుండ ఒకానొక కాంతను తాను చూచి, చిత్తమునందు నిర్మించుకొనెను. అందుచే ఈ నృత్యము గౌండినీయని పేర్గాంచెను.

మహారాష్ట్రమున భిల్లస్త్రీని గోండినీయని పిలుతురు. ఆమె చేయు నృత్యమే గౌండివి యైనది.

శ్రీనాథుని కుండలి (గుండలి) సారఙ్గని గౌండలి విధి, జాయసేనాని గౌండినీ గూర్చి పరిశీలనము చేయదగి యున్నది.

శ్రీనాథ సమేత కవిత్రయము రచించిన వీరగాథ 'పల్నాటి వీర చరిత్ర' 1 అందు పే. 17 — 19 వరకు, 2 పే. 319న గల 72 పంక్తులలో మార్గదేశీ నృత్య ప్రయోగ ప్రదర్శనము ముచ్చటగ వర్ణింపబడినది. స్థలము: మాచెర్ల చెన్నకేశ్వర దేవకులమందలి రంగ మండపము. సభాపతి: నల కామవిభుడు. నర్తకి: కంజలోచన. ఆమె మదను పట్టపుదంతి, మంజులవాణి. ఈమె ఆడిన ఆట ఆసాంతముగ దివ్వదాయుతమగు గేయమున, ప్రదర్శనము నేత్రానురంజకముగనే వర్ణింపబడినది. ఈ ప్రదర్శనము 1178 ఏ. డి. ముందు జరిగినది. ఆనాటికి సారఙ్గదేవుడు, జాయ సేనాని తమ తమ గ్రంథముల వ్రాయలేదు. ఈ భూమిపై అవతరించనులేదు. అనాటికే నృత్య సంప్రదాయము ప్రభుపోషణ కాలవాలమై ప్రజాదరణ పొందినట్లే శ్రీనాథుడు వర్ణించెను. ప్రేరణి, ప్రేంఖణి, శుద్ధ దండిక, కుండలి తదితరములగు నృత్యములు ప్రయోగార్హములుగా యున్నట్లు తెలియుచున్నది. (ఈ 72 పంక్తులు టీకార్థ వ్యాఖ్యానములచే వివరింపవలసి యున్నది.)

'కుండలి' నృత్యము వేరై యున్నట్లు జాయసేనాని వచించెను. పేరణీ లేక ప్రేరణి 13 వ శతాబ్దికి పూర్వమున్నట్లు తేటతెల్లము. తరువాత కాలమునను గ్రంథములందు వీటినిగూర్చి కథన మున్నది. సంగీతార్ణవ చంద్రికయను గ్రంథము నుండి సంగ్రహముగా వ్రాసిన 3 నాట్య మనోరమయందు పేరణీత్యాది నృత్యములు వివరింపబడినవి. అముద్రితమైన 4 సంగీత నారాయణమను గ్రంథమున, 5 చతురదామోదరుడు వ్రాసిన సంగీత దర్పణమందున ఈ దేశీ నృత్యము వర్ణింపబడినది. అట్టి పేరణిగూర్చి జాయసేనాని విస్తరముగనే వర్ణించెను. కుండలీ నృత్యము, గౌండలీ వేరైనవని నృత్య రత్నావళియందున్నది. ఈ కుండలీ నృత్యమనునది, ఒకానొక 'కుండలి' యను నర్తకి అభినయించినందున, ఆ పేరు వచ్చెనట! ఆమె గౌరీదేవి శిష్యురాలట!

కుండలీ నామ వృద్యంగీ
సుఖశ్రీమ్ దివ్యయోషితాప్:
సంగతే కోమలే నృత్తం
శిక్షయా మాస పార్వతీ ।
తన్నృత్తం కుండలీ మాహు
తత్సంబంధాత్ పురాతనా॥

దీని వివరము లింకేమియు జాయనార్యు డివ్వలేదు.

పైన చెప్పిన చతుర దామోదర కృతమగు సంగీత దర్పణము సప్తమాధ్యాయము నృత్య విషయ సంగ్రహము. ఇం దనేకములగు దేశీ నృత్య విషయములున్నవి. ఈ కావ్యము 1570 A. D

---

1. ఉమాశేఖర పండితులు పరిష్కరించినది.
2. ఆచార్య పింగళివారు ఇటీవల పరిష్కరించినది.
3. ఒరిస్సా సాహిత్య అకాడమీ ప్రచురణ, 1959. గ్రంథకర్త రఘునాథరథ.
4. తాళపత్ర గ్రంథము. అసంపూర్ణము. లిపి: ఒరియా ఈ గ్రంథము శ్రీమాన్ యమ్. శఠకోపన్‌గారు నా కొసంగిరి.
5. గుంటూరు మండల చెరుకూరు వాస్తవ్యుడు మొగలు చక్రవర్తి జహంగీరు ఆదరము పొందెను. (తదుపరి యే పండిత రాయలు దారాషుక్ యొక్క అభిమానపాత్రుడయ్యెను.) సంగీత దర్పణమును తంజావురిసరస్వతీమహల్ వారు ప్రచురించిరి.

తరువాత వ్రాయబడినది. అప్పటికి ఈ దేశి నృత్యములు విరివిగా పెరిగినవి. ఈ కవి సంగీత రత్నాకరమును పేర్కొనెను. కాని జాయసేనాని కృతియు లోకమున శార్ఙ్గదేవుని కృతితో విదితముగ నున్నట్లు ఒక వింతయగు సాక్ష్యము గ్రంథ నిబద్ధమై యున్నది.

కాటయ వేముడు 'మాళవిక' నాటకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు, ప్రథమాంకమున ఇట్లు వివరించెను.

మూల ఘట్టము : I పేజీ 9.

గణదాసు :—ఇదానీ మేవ పంచాంగాది కాభినయ ముప దిశ్య మయా విశ్రమ్య.........

ఇందులకు కాటయ వేముడు పై పంచాంగ యుక్తమగు నృత్యము నిట్లు వివరించెను.

''పంచఅంగాని యస్య తత్తథోక్తమ్ ప్రేరణిమిత్యర్థః
తస్యాభినయః ప్రయోగస్తమిదానీ మద్యైవోపదిశ్య శిక్షయిత్వా
ప్రవాతం ప్రశస్తో వాతో యస్మిన్దేశే సతథోక్తస్తమ్
ప్రేరణ సాంగ పంచకయుక్తం సంగీత రత్నాకరే:
''నృత్తం యథా చ కైవారో మర్మరో జాగరం తథా।
గీతం చేతి సమాఖ్యాతం ప్రేరణస్యాంగ పంచకమ్॥

కాటయవేము డుదహరించిన శ్లోకము శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమునందలిదికాదు. ఈ శ్లోకార్థమే కొద్ది మార్పులో జాయసేనాని నృత్య రత్నావళి యందున్నది.

జాయసేనాని, నృ. ర:
పేరణాంగాని పంచాస్యః నృత్తం కైవారర్ఘర్ఘరః
వికటం గీత మిత్యేషాం క్రమాల్లక్ష్మ ప్రచక్ష్మహే॥

ఇందలి కైవారమను పదము జాయసేనాని, పేరణి వర్ణనమందలి పంచ అంగములలో నొక్కటి. నృత్యమున సభాపతిని స్తుతించు కలాపము కైవారము. ఈ పదము అసంస్కృతమైనను, నృత్య పరిభాషా పదమగుటచే, కావ్యకర్త దీనిని సంస్కృతీకరించెను. దేశీ నృత్య విభాగములన్నియు, దేశీయ పదముల (వాడుకలో నున్నమాటల) సంస్కృతముగా చేసియుండ వలెను. కైవార పదమునకు జాయ సేనానియే గీర్వాణ పదములతో సమాన స్థాన మిచ్చినట్లున్నది.

సంగీత రత్నాకరమందు ప్రేరణాంగములగూర్చిన శ్లోకము సం: ర: VII—1303.

సభా జన మనోహారీ యో నృత్యతి సపేరణీ
ఘర్ఘరో, విషమం, భావాశ్రయశ్చ కవి చారకః
గీతం చేతి సమాచష్టు పంచాంగాని హరప్రియః॥
నందికేశ్వరుని భరతార్ణవమున: పే. 373. శ్లో. 733.

ఘర్ఘరో విషమం భావాశ్రయశ్చ కవి చారకః
గీతం చేతి సమాచష్టే పంచాంగాని హరప్రియః

కవిచారకమే కైవారము. ఈ భిన్నరూపము శబ్దోచ్చారణా స్ఖలనమా లేక వేరు వేరు భాషాపదములో తెలిసికొనవలయును. ఈలయిదింటిలో మూడే ప్రయోగార్హమని కాటయవేముడు చెప్పెను:

త్రిభిస్త్వేవత్ర ప్రయోజ్యం స్యాత్కైవారంజాగరం వినా
జాగరమను పేరు పేరణ్యాంగమునకు నూతనమైనది.
జాయ సేనాని వికటమనెను. నందికేశ్వర శార్ఙ్గదేవుల. భావాశ్రయ మనిరి. ఘర్ఘరమే మర్మరము. శబ్దానుకరణ పదము.

## 2

నాట్యశాస్త్ర గ్రంథములందలి దేశీ నృత్యముల పరిశీలించిన వాటి పరిణామము తేటపడగలదు. వీటి సంప్రదాయము భరతుని శాస్త్రమునకన్న ప్రాచీనమైనది. భరతుడు తన నా.శా. మున 6,14 అధ్యాయములలో 'ప్రవృత్తి' యను శీర్షికతో ఈ క్రింది విధముగా చెప్పెను. VI-27—28.

అవంతి దాక్షిణాత్యాచ తథా చైవార్ధ మాగధీ
పాంచాల మధ్యమాచేత్ విజ్ఞేయాస్తు ప్రవృత్తయః

ఇందు నాలుగు ప్రాంతీయములుగా చెప్పబడినవి. ఆ యా ప్రాంతీయ వేష, భాష, ఆచార, వ్యవహారాది జీవిత గుణాది విశేషముల గ్రహించి నాల్గు విభాగములుగా వర్ణింపబడినవి.

ప్రవృత్తి:

పృథివ్యాం నానాదేశ వేష భాషాచారా వార్తాః ఖ్యాపయతీతివృత్తిః ప్రవృత్తిశ్చ నివేదనే।

అట్లైన నాలుగేనా విభాగములని పూర్వ పక్షము. అందులకు సమాధానము.

సమాన లక్షణశ్చాసౌ ప్రయోగః ఉచ్యతే తత్సత్యం,
ఆసాం సమాన లక్షణ ప్రయోగః। కింతు నానాదేశ వేష
భాషా చారో లోక ఇతి కృత్వా లోకానుమతేన వృత్తి
సంశ్రితస్య నాట్య సమయా చతుర్విధత్వ మభిహితం
భారత్యా రభటీ సాత్వతీ కైశికీ చేతు।
వృత్తి సంశ్రితైశ్చ ప్రయోగై రభిహితా దేశాః
యతః ప్రవృత్తి చతుష్టయమభి నిర్వృత్తం ప్రయోగ శ్చోత్పాదితః

తత్ర దక్షిణాపాత్య స్తావద్బహు నృత్త గీత వాద్యాః
కైశికీ ప్రాయాః చతుర మధుర లలితాంగాభినయాశ్చ
దాక్షిణాత్య ప్రవృత్తి మృదులాలిత్య సుగమ, శృంగారముల కాటపట్టు. కైశికీ వృత్తి సంకలితము. కోసల, తోసల, కళింగ,, యవన, ఖస, ద్రావిడ, ఆంధ్ర, మహారాష్ట్ర, వైణ్ణ,

[illegible] ప్ర్యాసము తెలిపి చెప్పె.

I—25—5.

> తృతీయంచ కృతాంతేశ నాసుబిభ్రత్ సుదారుణమ్
> కాపాలిక వపుర్మత్తం ద్వైపం జగతి నృత్యతి.

ద్వైపను కాపాలికాహార్యాదిక వేషమున నృత్యము చేయు చున్నాడు.

నాట్య పరిభాషను ఉపమాలంకారమునకు ఉపయోగ పరచుట, సాహిత్యమందు నరిగిగా చూడవచ్చును

## 4

జాయసేనాని సప్తమాధ్యాయ ఉత్తర భాగమున నర్తకున, నర్తకీ లక్షణములగూర్చి వివరించెను. నర్తకుని సర్వగుణ సంపదల వర్ణించి, ఇతడు నూతన నృత్య సృష్టి చేయుగల సమర్థుడుగా నుండవలెనని చెప్పెను. చెంతనుండి నృత్యము ననుసరించుచు, "నర్తకీ మనసా సార్థ మేకీభావ మిహోగత:" ప్రావీణ్యము కల్గియుండవలెను. ఆట్లే నర్తకీ లక్షణము లును చెప్పబడినవి. అంతఃపుర పురంధ్రులకు, రాజభవన మందలి భర్తృదారికలకు నాట్య విద్య నేర్పుటకై నర్తకియు నర్తకుని గుణ సంపదయే కల్గియుండవలెను.

తరువాత ముఖరీ, ప్రతి ముఖరీ, వాదబృందము, స్వర రీతి, ముఖ్య గాయకుని, గాయనీ బృందము, సభాపతి, సభ్యుల గూర్చి వర్ణించెను.

ముఖరీ:—పాటలు పాడునప్పుడు తాళధ్వనులను స—మాన ముగా నడుపగల శక్తి సంపన్నుడు. మార్దంగ మార్జన విధుల నెరింగిన శబ్దవేది. వాద్యశ్రుతిజ్ఞతను తెలిసినవాడు. ఇతనియందు ముఖ్యగుణమేమనగా ఛిద్రావరణనైపుణ్యము.(Covering the loop holes and pit falls during performance) ప్రయోగమున యనివార్యముగా సంభవించు అకార్య ముల సమర్థించగల శక్తిమంతుడుగ నుండుట. ఇతనికి శబ్ద సౌష్ఠవము, గాత్ర స్వరానుగామిత్వము, ప్రస్థానోచిత క్షైవారత్వము, మార్దంగి వర్మలగ్న హస్తత్వము కల్గియుండవలెను.

ప్రతిముఖరియు ముఖరికి తోడుగా నుండవలయును. (ఇందునుగూర్చి సరిగాలేదు.)

వాద్య బృంద గుణము: వాద్యకారుడు వాద్యములను ప్రయోగమునకై సిద్ధపరచుట. ఇతను శ్రుతి జ్ఞాన పరత్వము, వాద్య గ్రహ మోక్షణములు, తాళయుక్తముగా నెరింగియుండవలెను. ఎదుటి వాద్యగాని ముఖమందు వ్యక్తమగు భావముల నెరింగి, తాను సహాయముగ వాద్యముల ధ్వనింప చేయువలయును.

స్వరరీతి: బృంద మేళన చాతుర్యము. రసికత, అనురంజనము గమకమునందు ప్రావీణ్యము కల్గియుండవలెను. ధ్వనులను గంభీరముగా,మధురముగా, స్నిగ్ధముగా పటుత్వముతో వాయింప వలయును. వివిధాలాప నైపుణ్యముకల్గి యుండవలయును.

ముఖ్య గాయకుడు శుద్ధ సాళగ రాగములందు భాషాంగ ముల యొక్క వాద్య గ్రహ మోక్షములందు, దక్షత, ధీరత, నిర్దుష్టత, సర్వ రీతులందు వైదగ్ధ్యము కల్గియుండవలెను.

కామినుల అంగములు మిక్కిలి కోమలములు, మదు రము లగుటచే, గాయకులు కన్యలకు సంగీతము ఉపదేశింప వలయును.

గాయనీబృందము సమాన స్వరములతో, స్థానత్రయ గమక చాతుర్యముతో, హెచ్చు తగ్గులులేక ఏకాగ్రతతో గానము చేయవలయును.

ఆ బృందము

> బృందం నారీ మయం సర్వం
> అనికార్యం ఎదాపినా
> ద్రష్టుం కౌతుకినాం క్వాప్తం
> సద్భావ స్త్రీ జనైసహ
> రాజ్ఞాం విద్యావతాం । వాగ్రే
> నైభవం ఖ్యాపనాయుచ॥

శుద్ధాంత స్త్రీలతో కలసి, నృత్య ప్రదర్శనమును చూడగోరిన రాజులయొక్కయు, విద్యావంతుల సమక్షమున తన వైభవమును ప్రదర్శించుట కొరకు విలాసియగు నతడు తన బృందమును నారీమయ మొనర్చవలెను.

పాత్ర సమూహమను బృందములు అయిదు విధ ములుగ విభజింపబడినవి.

84 గురువులు ఉత్తమోత్తమ రంగ స్థలమునకు మితి మీరిన సంఖ్య యగుటచే ఆట పాటలు, రాజోత్సవములలో బహిరంగ ప్రదేశములు, రాజవీధులలో ప్రయోగింపదగును.

32 గురువులు మధ్యమము· 24 గురువులు అవర (అవర!)ము. 16 గురువులు కనిష్ఠము.

ఈ పాత్రలు లెవ్వరన, ముఖరీ, ప్రతిముఖరీ, అను వారకులు, హుడుక్క వాయించువాడు, దేశి పాటలపాడు నతడు కాంస్య తాళము ప్రయోగించు నతడు, ఔతకారులు, శంఖముల పూరించువారు, కాహళము వాయించువారు, ముఖ్య గాయక గాయకులు, పరటుపాదకులు, వాంశికా వాదకులు.

తరువాత సభాపతి, సభ్యుల గుణము పేర్కొని సప్త మాధ్యాయమును జాయసేనాని ముగించెను.

అష్టమాధ్యాయము—

నృత్యరత్నావళి ఈ అధ్యాయముతో సంపూర్ణమగుచున్నది. ఇందు నృత్య మండపమునకు రాజు వెడలుట, నర్తకాది బృందము నేపథ్యాదిక రచన మొనరించుకొనుట, నాట్య మండప మున ప్రభువు సభాపతియై, సింహాసనాదిష్ఠుడగుట, పరి వారము వారి వారి స్థానాసీనులగుట, ఇత్యాది విషయముల

చక్కగా వర్ణింపబడినవి. జాయసేనాపతి స్వానుభవముతో వీక్షించిన విషయములే వర్ణించినట్లున్నది. ఈ భాగ వర్ణనము ఇతర నాట్య గ్రంథములందు లేకపోవచ్చును.

రాజు వెడలుట :

ప్రభువు సాయం సమయమున నృత్య సందర్శనోత్సుకుడై, మనోహరము, ఏకాంతము, చిత్రశోభితమగు నేపథ్య భవనమున (Tailette & Dreesing parlour) కర్పూర, అగరు, కస్తూరి, కాశ్మీర (కుంకుమపువ్వు) పన్నీరులతో కూడిన శ్రేష్ఠమగు చందనలిప్తుడై, మల్లికా, కేతకీ, జాతి, చంపకాది పూలమాలల శిరస్సున దాల్చినవాడై, శరచ్చంద్రికా కాంతిహారులగు చీనాంబరముల ధరించినవాడై, మకుటాది పాదాంగుళులవరకు భూషణధారియై యుండగా:—

మంగలైరివ సోత్కంఠైః
కామినీ రూపధారిభిః
ఉందోరివ పరాన్ (?) ప్రాప్తైః
అణిమాద్యది దైవతైః

ఉత్సాహములో కామినీ రూపము ధరించిన మంగళ దేవతలవలెను, శివానుగ్రహమున సిద్ధములైన అణిమాదుల అధిదైవతముంవలెను, ఒప్పుచున్న తరుణీజనము, దృష్టి దోషముల హరించుకొరకై, జ్వలత్కర్పూర దీపములుగల బంగారు పళ్లెరములు రెండు చేతులతో సవిలాసముగా గ్రహించి, కోకిలంవలె పంచమ స్వరమునగాన మొనర్చుచు;

(శుద్ధాం గీతి మివ ప్రేక్ష్యం
కుర్వద్భిర్హ్యంత కాంతిభిః)

తమ కాంతులచే, తాము గానముచేయు గీతికలను దృశ్యములుగా నొనర్చుచు, నానాతోద్యధ్వనులతో కోమలములగు నృత్యమును చేయుచు, నరపతికి హారతి నీయవలెను.

అంతట రాజేంద్రుడు ప్రహృష్టుడై నర్మసచివులతో సభను ప్రవేశించి, ఆ నృత్య మండపమున;

రత్న సానుతలోత్తుంగ
కల్ప శాఖీవ భూపతిః
సింహాసన మధిష్ఠాయ
నిషీదేత్ నిశ్చత్రత:(?)

రత్న సానువుందు (మేరువునందు) కల్పవృక్షమువలె సింహాసనము నధిష్ఠించవలెను. వెనుక బంగారు కల్పవృక్ష ప్రతిమ యుండవలెను. చుట్టును పరివారము కూర్చొనవలెను. స్వర్ణ పేటికలో తాంబూలాది వాసన ద్రవ్యముల చేరబాని, వానుర గ్రాహిణులు చెంతనే యాసీనులగుచుండవలెను.

దివిటీలు చేతని భటులు నిలచియుండవలెను. పూర్వ రంగ పూజాదిక కార్యము ముందుదినమే జరపియుండవలెను. ఇంతలో ప్రధాన నర్తకి తన పాత్ర పరివారము, గాయకులతోను నేపథ్య రచనము పూర్తి చేసికొని, సజ్జీభూతురాలై రంగమునందు ప్రవేశింపవలెను.

తరువాత వాద్యముల క్రమముగా ధ్వనింపచేయవలెను. ఈ ధ్వని సుదాధారణ ఇంపుగా నుండవలెను. ఇట్టివి గీత నృత్య విహీనమగుటచే శుష్క వాద్యమని పిలువబడును. (Back ground music). ప్రదర్శనమైన పిదప, నటులు కోరిన సువర్ణాభరణాంబరములు వారికి ప్రభువు పారితోషికములుగా నొసంగును. ఈ కావ్య గ్రంథము సార్థి ... సేనాని రచించిన చరమశ్లోకము:—

యావత్ సుఖగతి స్సోల
గిరా శేఖర శోభనే
తావ సేనాధి నాథేవ
నృత్త రత్నావళీ కృతా||

ఈ 'రత్నావళి' సూచిముఖ (సూదిమొన) గుచ్చబడిన ఎట్టి గ్రుచ్చబడిన గుణము (సూత్రము) వలె, రత్నములవలె భాగములు కాంతియుతమై యున్నవి. జాయసేనాధిపతిచే ఈ నృత్య రత్నావళి రచింపబడినది.

ఈ వ్యాస రచన:—

సవిద్యాదర్పతో గ్రన్థ ప్రవృత్తి ర్యస్య చింత్యతామ్|
నిర్వర్ణ్మానస వాసాయ గన్తుం పాథేయ మాస్థితమ్||

ఇం. క. VII—1678

[సమాప్తము]



ఉ. నోచిన తల్లిదండ్రికికి తనూభవుఁ డొక్కఁడె చాలుమేటి, చే
సాచనివాఁడు, నర్థులకు చాచిన లేదన కిచ్చువాడు, నో
రాచి నిజంబకాని పలుకాడని వాఁడు, రణంబులోన మే
దాచని వాఁడు భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.

# "నృత్య రత్నావళి"

శ్రీ నే. కృష్ణమూర్తి

కాకతీయ కాలమున ఆంధ్రదేశమున నాట్యకళ రాజపోషణచే వృద్ధి చెందెను. నాట్య మభ్యసించి అభినయించువారికి, వాద్యాది కుతప ప్రయోగవేత్తలకు భూ గృహదానము లిచ్చినట్లు, ధర్మసాగర, చేబ్రోలు, మల్కాపుర శాసనములే అక్షరమగు తార్కాణములు. ప్రతాపరుద్రకాలమున మాచల్దేవియను ప్రఖ్యాత అభినేత్రి యుండినట్లు క్రీడాభిరామ వీథి నాటకమున కలదు. కామ విభుని మాచెర్ల రాజ్యమున కంజలోచనయను నర్తకి నృత్య మొనర్చినట్లు పల్నాటి వీర చరిత్రమందు గలదు. నేటి విజయవాడలో శివాలయమున మాచల్దేవియను నర్తకియు, ఆమెకు నాట్యము నేర్పుచున్నట్లు, నాట్యాచార్యుని ప్రతిమలతో నున్న శాసనము కలదు.

ఇట్టి కళాపోషణగల వాతావరణ స్థితులలో మహా సామ్రాజ్యాధిపతియగు గణపతిదేవుని * బావమరది, గజసాహిణియగు అయ్యవంశజుడైన జాయ సేనాపతి "నృత్య రత్నావళి', 'సంగీత రత్నావళి' యను పుస్తకముల వ్రాయుట సమంజసమగు కళావ్యాప్తి యయ్యెను. ఈనాటి కులీన కులస్త్రీలు ఈ విద్యను నేర్చుటయే కానవచ్చుచున్నదిగాని, పురాతన పుస్తకముల చదివి, అందు నిబిడీకృతమైన సంప్రదాయముల గుర్తెరిగి కళా వ్యాపకముచేయు యత్నములు మృగ్యములు. సరి రాలేని పాశ్చాత్య పోకడల నేటి కళాకారులు మిశ్రమముచేసి, సంకర యుతముగ నృత్య ప్రదర్శనముల విరివిగా లోకమున వ్యాప్తి చేయుచున్నారు. ఇందులకు ముఖ్య కారణము ప్రేక్షకులకు ఈ నృత్య శాస్త్ర మపరిచితముగా నుండుటయే! అక్షరాస్యులు హెచ్చుగుకొలది పురాతన శాస్త్రములు, కళా ప్రసంగ కావ్యములు విరివిగా చదువ వలసిన యుగ కాలమున మనమున్నాము. ఇట్టి శాస్త్ర పరిచయము నాగరికతా చిహ్నము. మాటుననున్న కళారత్న విషయముల వెలికిదీసి, ప్రభుత్వాధిపత్యమున స్థాపింపబడిన కళాసంస్థలు అనతి కాలముననే ఈ కళా విస్తారము చేయవలసియున్నవి. ప్రజలకు కళావిద్యయందు అభిమానము హెచ్చుగు కార్యక్రమముల పథకమార్గముల నడుపవలసియున్నది.

నృత్య రత్నావళి వ్రాత పుస్తకము తెనుగు, గ్రంథ లిపులలో రెండు ప్రతులు తంజావురమున కలవు. దానిని పరిష్కరించి ప్రచురించు కాలము రానున్నది.

తెనుగు లిపియందు గల పుస్తకముల తప్పు లనేకములు కలవు. తప్పులన్నియు వ్రాయసగానివి, తాటియాకుల ధ్వంసము చేయు క్రిమి కీటకములవి.

గ్రంథారంభమున జాయసేనాని నృత్య ప్రయోగము చూడని నేత్రములు నిష్ప్రయోజనములని కవిత్వమున వర్ణించెను.

శ్లో. కల్హారై రనవాప్త చంద్ర కిరణాశ్లేషై రలబ్ధాంబుదైః
....చాతకై రళికులై రప్రాప్త పుష్పాసవైః
సామ్యా పన్నదశా మమూని దధతే నేత్రాణియేషాంపురః
శశ్వన్నావ తరంత్యుదార సుషమానృత్త ప్రయోగక్రమాః॥

(ఏ నేత్రముల ఎదుట తరచుగా నత్యధిక శోభావంతములగు నృత్య ప్రయోగక్రమములు భాసించవో, అట్టి నేత్రములు చంద్ర కిరణముల చూడని కలువలతోడను, మేఘములను చూడని చాతకములతో, అప్రాప్త పుష్పాసవములగు అలి కులములతో సామ్యమును చెందుచున్నవి.)

ఈ నృత్యమును పంచభూతములయొక్క వ్యక్తరూపమైన స్పందనమని కవి ఉగ్గడించెను.

శ్లో. క్షితౌ రక్తం ఛాయా ఫలనముదకే వీచిలలితం
శిఖిన్యర్చిః ప్రేంఖా సహజగతి వైచిత్ర్య మనిలే
తటిత్క్రీడా వ్యోమ్నీత్యతుల సుభగః పంచ సుపరః
ప్రవిష్టో భూతేషు ప్రభవతిహి నృత్తస్య మహిమా॥

(సాటిలేని శోభగల నృత్యమహిమ పంచభూతములయందుమ ప్రవేశించి యొప్పుచున్నది.)

ఎట్లన?

భూమియందు రక్తచ్ఛాయా ఫలన రూపముననను(?) ఉదకమున లలిత తరంగయుతముగను, అగ్నియందు జ్వాలా ప్రేంఖణ విధముగను, వాయువున సహజగతి వైచిత్ర్యముల తోడను, ఆకాశమున తటిత్క్రీడతోను నృత్యము భాసించు చున్నది.

శక్రుడు జయంతుని ఐరావతాది గజములపై యధికారిగ నుంచినట్లు, బావయగు శ్రీ గణపతి సార్వభౌముడు జాయ సేనానిని గజసాహిణిగా నియమించెను. జాయ సేనాని ఆకౌమారాది స్వామి భక్తి పరాయణుడు. రాజువకు చిత్త కైరవ కౌముదివలె ప్రకాశించునట్లు నృత్యరత్నావళిని రచించెను.

మునివాణీ నర్తకీ నూనం
వర్ణనాంగైః మనోహరైః
కరోతి శాస్త్రరంగేస్మిన్
పశ్య నృత్తమతిస్ఫుటం॥

(భరతముని వాణియను నర్తకి, మనోహరములగు వర్ణనాంగములతో శాస్త్ర (నృత్య రత్నావళి) రంగస్థలమున స్ఫుటముగ నృత్య మొనర్చుచున్నది. వీక్షింపుము!)

* * * *

---

* జాయప సేనాని తోబుట్టువులగు నారాంబ, పేరాంబలు గణపతిదేవుని భార్యగా చేకొనిరి.

ఈ నాట్యశాస్త్రము వైవస్వత మన్వంతరమున త్రేతా యుగ కాలమున పురందరాదులు పితామహునొద్దకేగి "దృశ్యం సర్వంచ సర్వేషాం ఇచ్ఛామి క్రీడనీయకం' అని ప్రశ్నింపగా, ఆ నాల్గు మోములుగల విధాత సర్వవేద సారముగ, సార్వవర్ణిక మైన నాట్యవేదమును సృజించి, తన మనసిజుడైన భరతు నకు నేర్పెను. మానవులకు ఆంగికాదులయందుగల సౌష్ఠవ చాతుర్యములను తెలిసికొని, భరతముని శాండిల్యాది పుత్ర శతమునకు ప్రయోగార్హతను చేకూర్చెను. ఇంద్ర ధ్వజోత్సవ సమయమున రసాశ్రయంచతద్‌జ్ఞేయం, వాక్యార్థాభి నయా ర్థకముగు, ఈ కళ ప్రదర్శింపబడెను. అభినయము ప్రయోగ సమయమున అర్థమును సామాజికుల కభిముఖముగా తెచ్చు నదియై వర్ధిల్లుచున్నది. ప్రథమాధ్యాయమున శాఖా, అంకుర నృత్త, నేపథ్య (పుస్త, భూషణ, అంగరచన, సజీవ పరికల్పిత) సాత్త్విక లాస్యాంగముల (చిత్రపద భావికములతో చేర్చి) తాండవము లను విషయముల లక్షణములు తెల్పబడినవి. అంగ నిరూపణ మనునది రెండవ అధ్యాయము. ఇందు అంగములగు శిరస్సు, హస్త (అసంయుత, సంయుత, నృత్త)ములు, వక్షస్థలము పార్శ్వములు, కటి, పాదములును; ప్రత్యంగములగు, గ్రీవము కుక్షి, పృష్ఠ, ఊరువులు, జంఘ, జానువులును; ఉపాంగములగు విలోచన, భ్రూ, నాస, ఓష్ఠ, కపోల, చిబుకముల, వివిధభంగులు వాటి ప్రయోగములు వర్ణింపబడినవి. ఇంకను పాదాంగుళ ముల, అంగుష్ఠముల గూర్చి నిర్వచింపబడినది.

మూడవ అధ్యాయమున 'చారీ' (భూ, ఆకాశ) స్థానక, మండలములగూర్చి వర్ణనములు గలవు. ఈ అధ్యాయ ప్రారంభ మున చెప్పబోవు వస్తు వివరముల సూచించు ముద్రాలంకార శోభితమగు శ్లోకము శ్లాఘనీయమై యున్నది.

శ్లో. లీలోల్ల సచ్చాషగతి ప్రబంధా
మృగీప్లుతో ద్భ్రమరీ మనోజ్ఞాం
సస్యం దితాబ్జాం జనితో రుశోభా
వక్ష్యామి చారీం వనరాజితుల్యాం॥

ఇందు చాషగతి, మృగప్లుత, ఉత్స్యందిత, జనిత మొదలగు భూచారీ ప్రశంస యున్నది. భ్రమరీయను ఆకాశచారీ సూచ నయు గలదు.

ఈ 'చారీ' ప్రసంగ కథనము వనరాజితో సమానమని కవి సంకల్పించెను. ఆ చారీవనము పాల పిట్టల (చాషగతి) గతుల తోను, మృగీప్లుతములచే చెదరిన తుమ్మెదల మనోహరతతోను, అచ్చటి సెలయేళ్ళయందు తామర పుష్ప సంతతులతోను, కల్గి శోభను జనింపచేయుచున్నది.

ఈ చారీ ప్రశంస ముగించునపుడు కవి:—

శ్లో. చరిత మివ సురాజ్ఞాం యుక్త దండాభిరామం
గిరిజ మివభుజంగ త్రాసితా లోకనీయం
జలద మివచ విద్యుద్ భ్రాంత మత్రాశ్వస్తలక్ష్మీ
వ్యరచయ దిహ చారీ లక్షణం జాయనార్యః॥

ఇందు ఆకాశచారులగు 'భుజంగ త్రాసిత, విద్యుద్ భ్రాంతములు సూచింపబడినవి.

ఈ చారీ లక్షణ కథనము ధర్మ పరిపాలనముచేయు రాజ చరితములవలె, గిరులపై పుట్టిన తరువుల చెంతనున్న భుజంగములు త్రాసమును గూర్చు రవ్వలను, మేఘములు విద్యుత్ భ్రాంతమును గూర్చుచు, అత్రాశ్వస్త లక్ష్మీ శోభయు మానముగ నుండును.

* * * *

జాయ సేనుడు భరతుని నాట్య శాస్త్రమునకు ఆది గురువుగా స్వీకరించెను. నాట్య శాస్త్రమందలి శ్లోక ములు, తాను గ్రంథ రచన మొనర్చునప్పుడు చెంత నున్నట్లే విశదమగుచున్నది. భరతుడు చెప్పనివి కొన్ని తాను చెప్పెను. కొన్ని విషయములందు భరతుడట్లు చెప్పుటకు, చెప్పకుండు టకు కారణముల చెప్పెను. భరతుని నాట్య శాస్త్రమేగాక, కీర్తిధరుని కావ్యమునుగూర్చి, అందలి విషయములగూర్చి పలుమారు పేర్కొనెను.

ఈ గజసాహిణి 13 వ శతాబ్ది వాడగుటచే శారఙ్గ దేవునికి సమీప కాలమున నుండెను. కాని యితని కావ్యము వ్యాఖ్యా నములకు గురికాలేదేమో? ఇతని తరువాత వచ్చిన సింగభూపా లుడు, కల్లినాథుడు, సంగీత రత్నాకరమునే వ్యాఖ్యానించిరి. జాయ సేనాని కథనము శారఙ్గదేవుని విషయావిష్కరణము సౌష్ఠ్య మును బొందుచున్నవి.

జాయసేనాని సంస్కృతమందు సిద్ధహస్తుడగుటయే గాక, కవిత్వ పోకడలు పాటించగల విద్వాంసుడు. ఇతని కాల మున నాట్యకళ విరివిగా రాజపోషణ కల్గియుండుట విదితము. సార్వభౌముని మెప్పించుటకే, అనాటి నృత్యకళా ప్రయోగము లను, శాస్త్రమున నిబంధించి కావ్యమును రచించెను. పూర్వ గ్రంథములందు పాటించని, వర్ణించని నూతన విషయము లిందు గలవు. ఇతని గ్రంథమునగల నృత్త నృత్య భంగిమలు ఆనాటి శిల్పులకు దోహదమిచ్చి (motif) నర్తకీ పేర ముల సృష్టించుటకుపకరించి యుండును. రామప్ప దేవాలయ మందలి నృత్యప్రతిమలు ఈ కావ్యమందలి లక్షణ వర్ణనములకు సరివచ్చు నను విషయము శోధింపతగిన కార్యా కావ్యా న్వేషణము. రామప్ప దేవళమేకాదు. కాకతీయ కాలమున ప్రతిష్ఠించి, జీర్ణో ద్ధరణ గావించిన దేవాయతనములందలి నృత్య ప్రతిమల నన్నిటని అన్వేషించి, పరిశీలించి సమన్వయ మొనర్పదగును.

నృత్య రత్నావళియందలి వర్ణనములను ఈ క్రింది గ్రంథములతో పోల్చి చూడవలయును.

1. భరత నాట్య శాస్త్రము. 2. సంగీత రత్నా కరము. 3. భరతార్ణవము. 4. నాట్యశాస్త్ర సంగ్రహము. 5. భరతసారము. 6. హస్తముక్తావళి. 7. హస్త రత్నా వళి. 8. సంగీత నారాయణము. 9. హస్త అధ్యాయము. (7, 8, 9 అముద్రితములు.)

## చారీస్థానక, మండలములు

నర్తకిగాని, నర్తకుడుగాని కేవలము అంగ ప్రత్యంగ ఉపాంగముల వివిధ భంగులందు ప్రసారించిన మాత్రమున

నృత్తముగాని * నృత్యముగాని పూర్ణముగ ప్రయోగింపబడదు. ఇవి చేయుటకు నర్తకి ఒకేచోటున యుండిన చాలును. కాని నృత్యమున శరీర చలన మావశ్యకము. ఈ చలనము తాళమాన లయములతో ఏక సూత్ర నిబద్ధ కార్యక్రమమువలె మేళ వింపవలయును. అంగముల విన్యాసములతో కలిసి పాదచలన మును, ముందునకో, వెనుకకో, ప్రక్కలకో, చరించుటచే రంగ స్థలమే స్పందించుచున్నదాయను భ్రాంతి సహృదయుల హృద యములందు కలుగును. ఈ ప్రయోగము చూచువారికి లోచనా నందమేగాక, వాద్య ప్రసారములచే శ్రవణ సుఖమును గూర్చును. మానవుల శరీరావయవ సంపుటకరణము పూర్వ వాసనల ప్రాతి నిధ్యముచే నిబిడీకృతమై యున్న తత్త్వములు, 'సాధారణీ' కృతయుక్తమైన నృత్య ప్రయోగముచే రేకెత్తి ఆహ్లాద మోద ములనందును. కేవల రూప శబ్దములు ఈ నృత్యమున పరా కాష్ఠ నొందును. అందుచేతనే భరతాచార్యుడు:—

> అత్ర ప్రోచ్యతే నఖల్వర్థం కంచి నృత్త మపేక్షతే
> కింతు శుభం జనయుతిత్యతో నృత్తం ప్రవర్తితుం
> ప్రాయేణ సర్వ లోకస్య నృత్త మిష్టం స్వభావతః
> మాంగల్య మితికృత్వాచ నృత్తమేతత్ప్రకీర్తితమ్.
> భా. నా. శా. IV 269, 270.

ఈ నృత్త, నృత్య ప్రదర్శనము అనిర్వచనీయమగు శోభను మానసికానందమును గూర్చును. మంగళకరములగును.

'చారీ' విషయమును గూర్చి చెప్పుచు, భరతాచార్యుని వలెనే దీని లక్షణమును కటినుండి పాదములవరకుగల అంగ ఉపాంగ చేష్టలే, చారి యని జాయసేనాని చెప్పెను. ఇందు పాద జంఘ ఊరువుల విన్యాసములు స—మానముగా చేయవల యును.

పాదములలో భూమి ఎక్కువగా స్పృశించుచు, ప్రయో గించు విన్యాసములు పదియారు (16) భూచారులనియు, భూమికి పైన (ఎగరక) చేయునవి ఆకాశచారులు పదియారు (16) యని నృత్య రత్నావళియందు వర్ణింపబడినవి. భరతుని నాట్య శాస్త్రమున, శారఙ్గదేవుని సంగీత రత్నాకరము నను నిట్లే చారీ లక్షణములు వర్ణింపబడినవి. †

ప్రతి చారీ చలనమునకు పునాది వంటిది "సమపాద" భూచారి. ఇందు పాదములను ఒకటి తరువాత మరొకటిని పార్ష్ణి భాగములచేర్చి నిలచియుండవలెను. ప్రతి 'చారి' ప్రయో గించుటకుముందు ఈ సమపాద భూచారి చేయునగును. ఇట్లు పదియారు భూచారి వర్ణనములు కలవు. ఇతర గ్రంథము లందు చెప్పని విశేషములు కొన్ని జాయసేనాని రచనయందు గలవు. జాయసేనాని 'నిత' యను భూచారికే "ముసలఘట్టి కా" యను నామాంతరమున్నట్లు చెప్పెను. ఈ నామమును దేశీ నాట్యవిదులు పెట్టినట్లు తెలిపెను. కొన్ని చారుల పేరు లకు అర్థమును నిర్వచించెను. 'శకటాస్య' మన బండిని ముందు నకు జరుపుటయని శారఙ్గదేవుని నిర్వచనముతో జాయ సేనాని యన్వయమును సరిపోవుచున్నది. అడ్డితయను భూచారి లక్షణమును చెప్పుచు, నర్తకి ముందు వెనుకలకు పోవలెనని కీర్తి ధరుని వర్ణనమును స్వీకరించినట్లు తెలిపెను. సమోత్సారిత మత్తల్లియను భూచారినిగూర్చి చెప్పుచు జాయసేనాని దానికి మత్తపాదమను నామాంతర మున్నట్లు తెల్పెను. విద్యుద్భ్రాంతమను ఆకాశచారినిగూర్చి వివరించి, ఈ చారీ ప్రయోగము "లక్ష్యే ఽతి దుష్కరా' యని వ్రాసెను. ఇందు పాదముయొక్క పృష్ఠమును వెనుకగా పైకెత్తి శిరస్సును స్పృశించి, ఆకాలిని వ్యావర్తము చేయనగును. సుశిక్షితులైన కుశలురే ఈ విద్యు ద్భ్రాంతమును చక్కగా చేయుదురని జాయసేనాని మతము.

ఈ చారీ ప్రయోగములతో హస్తములను సుందర ముగా చాలనము చేయనగును. పాదములు నేలపై స్థిరముగా నుండునపుడు హస్తములను అర్ధచంద్రయుతముగా కటి భాగ మున నుంచవలెను. ఈ రూపమున నర్తకి సుందరముగా నుండును.

## స్థానకములు

చారీ ప్రయోగములు కొన్ని చేర్చి శరీరమును అంగ విన్యాసములతో చేర్చిన స్థానకములగును. ఈ స్థానకములు ‡ ఆరుగా విభజింపబడినవి. ఇవి దేవతాధిష్ఠానములు. ఇవిగాక, స్త్రీ స్థానకములని కొన్ని వర్ణింపబడినవి. భరతాచార్యుడు చెప్పనివి శారఙ్గ దేవుడు ఏడు స్త్రీ స్థానకములనే చెప్పెను. కాని, జాయసేనాని || ప్రోష్ణసమను ఎనిమిదవ దాని గూర్చియు వర్ణించెను.

> సమపాదతలాగ్రాభ్యా మంగుళీనాం తలైరపి
> ఆయతీ కృత్యగాత్రం చేన్నిష్ఠే స్యాత్ప్రోష్ణసం తదా
> నాసికా ద్వయ సేతోచే దూర్ధ్వతా మంతరీక్షణే
> ప్రాంశు ప్రాప్య ప్రమాణస్య ఫలాదేః గ్రహణాదిషు."

---

* నృత్తము, నృత్యములు సమానార్థకములుగా నెంచ బడినవి.

† భూచారులు:—(1) సమపాద (2) స్థితావర్త (3) జనిత (4) స్యందిత (5) అపస్యందిత (6) బద్ధా (7) శకటాస్య (8) విచ్యవ (9) ఏలాక్రీడిత (10) చాషగతి (11) ఉత్స్యందిత (12) అడ్డితా (13) సమోత్సారిత మత్తల్లి (14) మత్తల్లి (15) అధ్యర్థికా (16) ఊరూద్వృత్తా.

ఆకాశచారులు:—(1) అతిక్రాన్త (2) అపక్రాన్త (3) పార్శ్వక్రాన్త (4) సూచీ (5) మృగప్లుత (6) భుజంగత్రాసిత (7) అలాత (8) నూపురపాదిక (9) ఆక్షిప్త (10) భ్రమరీ (11) దండపాద (12) విద్యుద్భ్రాంత (13) ఊర్ధ్వజాను (14) ఉద్వృత్త 15) దోలపాద (16) ఆవిద్ధా.

‡ స్థానకములు:—(1) వైష్ణవ (2) సమపాద (3) వైశాఖ (4) మండల (5) ఆలీఢ (6) ప్రత్యాలీఢ.

|| స్త్రీ స్థానకములు:—(1) ఆయత (2) అవహిత్థ (3) అశ్వక్రాన్త (4) గతాగతం (5) వలితం (6) మోటితం (7) వినివర్తితం (8) ప్రోష్ణసమ్.

సమపాద తలాగ్రములపై నిలచి శరీరమును పొడవు చేసిన ప్రోన్నత స్త్రీ చారీ లక్షణమగును. ముఖముపై కెత్తునపుడు నాసికా పుటముల (నాసికాద్వయ) పై నుండు సేతువు (Bridge of the nose) ను పై కెత్తుట. ఇది అంతరిక్షమును చూచుట, వృక్షాగ్రఫలముల కోయుటయందు ప్రయోగార్హము.

## మండలములు

మండలముల విభాగమును వర్ణించుచు, నృత్య రత్నావళి రచించిన కవి శేఖరుడు ఈ క్రింది శ్లోకములతో ప్రారంభించెను.

విచిత్ర భూషా లలిత తాంగి యుష్టి
  సావర్తఫాల భ్రమరాల కా భా
సంక్రాన్తకాంతి ర్విహృతాభిరామ
  నిరూప్యతే మండల రాజి రామా.

మండల రాజి యను స్త్రీ వర్ణింపబడుచున్నది. ఆ సుందరాంగి విచిత్ర భూషణములచే, లలితమగు అంగయష్టి కల్గి, ఫాలమున సంక్రమించిన (వ్రాలిన) వంకరలుగల ముంగురుల కాంతి కల్గి విహారమున మనోహారిణిగా నున్నది. ఇందు 'విహృత' ప్రయోగముచే అభిసారిక సూచితము.

భ్రమర, దండపాద (అంగయష్టి) విహృత, సంక్రాన్తి మొదలగు పదముల లేక వాటి అర్థ సుర్భణముతో పై శ్లోకమున ముద్రాలంకారము సంధింపబడినది.

మండలములను * భూమండలములు పదియుగా † ఆకాశ మండలములు పదియుగా విభజింపబడినవి. వీటి ప్రయోగములలో ఒక్కొక్కదానిలో వివిధ చారులు కలసి యుండును. దక్షిణ వామపాదములు క్రమముగా లక్షణ నిర్ణీతముగా ప్రసారితము లగును.

మండలముల ప్రయోగ మెల్లప్పుడును వాద్య శబ్దములతో లయ మొనర్పబడి, మనోహరమగు రూప శబ్దములు ప్రధానేంద్రియములకు, శ్రవణేంద్రియములకు మోదము గూర్చును. ఈ విషయ వర్ణనమునుకవి ఇట్లు పరి సమాప్తము చేసెను.

ఆవర్త క్రాన్తం లలితం విచిత్రం
అస్కందితం క్రాన్త విధిం దధానమ్
ఇత్య బ్రవీన్మండల లక్ష్మ సుశ్రీ
తురంగ తుల్యం గజసైన్యనాథః.

ఇందు శ్లేషయుతమగు ముద్రాలంకారము గలదు. చక్కని సుశ్రీయుతుడగు గజ సైన్యనాథుడు తురంగముల వంటి మండల లక్షణములను ఇట్లు ప్రవచించెను. గుర్రములు మంచి శుభ్రపదములగు సుడులుగల్గి, లలితమై విచిత్రముగా ఆస్కందన మొనర్చునవి. ఈ మండల లక్షణములును తురంగ గతులు గలవి.

## దేశీ స్థానకములు
## దేశీకరణములు : అంచిత, అలగ, స్పర్శ, లాస్యాంగములు

నృత్య రత్నావళి కావ్యమందలి షష్ఠోమాధ్యాయమును ఆవిష్కరించుచు, జాయసేనాని దైవ ప్రార్థన మిట్లు చేసెను.

వందే శ్రీ కంఠ మందారం
  యత్ర గౌరీ స్తనోద్గమః
ధత్తే విశ్వఫల వ్యక్త్యై
  ప్రథమ స్తబక శ్రియం.

అర్ధ నారీశ్వరుడగు (Concept of Biunity) శ్రీ కంఠుడను కోర్కెల తీర్చు మందార కల్పవృక్షమునకు నమస్కరించుచున్నాను. (అపుణ్య తరువున) గౌరీ స్తనోద్గమము విశ్వ ఫలాభివ్యక్తికొరకై ప్రథమమైన పూల గుత్తివలె శోభను ధరించును.

కావ్యకర్త తాను, జెప్పబోవు "దేశీనృత్య" మన్నిపుడు ప్రౌఢవారాంగనవలె వర్ణించెను.

భాషావేష విభూషణై రసుగుణై స్సైన్యసైర్మనోహారిభిః
నానా దేశ (వ) రుచీన్ విదగ్ధ పురుషా నావర్జయంతీ గుణై ః
భూపాలై రుప లాలితా బహుకలై ః ప్రౌఢేవ వారాంగనా
దేశీ సంప్రతి దంతి సైన్య పతినా సాంద్రాదరం వర్ణ్యతే.

అను గుణములును, మనోహరములునగు ఆ యా భాషా వేష, భూషణముల చేతను, గుణముల చేతను, వివిధ ప్రాంతములకు జెందిన విదగ్ధ పురుషుల నాకర్షించుచు, కళాకోవిదులగు భూపాలురచే లాలింపబడు ప్రౌఢ వారాంగనవలె దేశీ (నృత్యము) ఇపుడు గజసాహిణిచే సత్యాదరముతో వర్ణింపబడుచున్నది.

* * * *

జాయ సేనాని ఇట్లుపక్రమించి కావ్య రచనా కాలమును, కృతిపతినిగూర్చి రమణీయముగా వర్ణించెను.

ఇదానీం భారతే వర్షే
  కాలే వైవస్వతాంతరే

* భూమండలములు:— (1) భ్రమర, (2) అస్కందిత లేక అస్పందిత (3) పిష్టకుట్ట (4) చాషగతి (5) అడ్డిత (6) ఏలకా క్రీడిత (7) అధ్యర్ధ (8) ఆవర్త (9) శకటాస్య (10) సమోత్సారిత.

† ఆకాశమండలములు:— (1) సూచీవిద్ధ (2) అతిక్రాన్త (3) దండపాద (4) అలాతక (5) విచిత్ర (6) విహృత (7), వామవిద్ధ—వామబంధ (8) లలిత సంచార (9) క్రాన్త (10) లలిత.

కలౌ యాతేషు వర్షేషు
 * భూత బాణాగ్ని సాగరైః
మితే ష్వానంద సముజ్జృంభే
 జగదానందదాయిని
శశ్వత్కువలయోల్లాసి
 యశః ప్రాలేయరోచిషి *

క్రీ. శ. 1255 జగదానంద దాయకమగు ఆనంద సంవత్సరమున మహారాజాధిరాజగు ఈ గణపతి చక్రవర్తి సముద్రమునే మేఖలగాగల ఈ భూమిని బాహుబలముతో రక్షించుచుండగా

"యాదేశీ వర్తతే లోకే
సాస్మాభిః కథ్యతేస్ఫుటం."

ఏ దేశీ నృత్యము లోకమున వ్యాప్తిగా నున్నదో, అద్దాని (ఈ కావ్యమున) నాచే స్ఫుటముగా వర్ణింపబడుచున్నది.

కృతిభర్త కాకతి గణపతి చక్రవర్తి. ఆ రాజన్యుడు

ప్రతాప తపన ప్రౌఢి
 తాపితా రాతి మానసే
శత్రు ప్రాణానిలాహార
 క్షీబ కౌక్షేయ కోరగే.
విశ్రాణన పయః పూర
 నిర్ధూత కలి కల్మషే
త్యాగధిక్కృత రాధేయ
 కామధేను సురద్రుమే.
రూప లావణ్య సౌభాగ్య
 స్వప్రథ మకరధ్వజే
శౌర్య త్రితయ విజ్ఞాన
 మహస్తత్త్వ విశారదే.
మార్గ దేశీ విభాగ స్య
 వివేచన విచక్షణే
మహా రాజాధిరాజేస్మిన్
 గణపత్య వనీశ్వరే.
సముద్ర మేఖలా మేనాం
 బహు నా రక్షతి క్షమాన్
యాదేశీ వర్తతే లోకే
 సాస్మాభిః కథ్యతే స్ఫుటం.

(1) కువలయమునకు (భూమండలమునకు) ఉల్లాసకరమగు కీర్తియను వెన్నెల కలవాడు.

(2) ప్రతాప మనెడి సూర్యుని ప్రౌఢిమచే తపింప చేయబడిన శత్రు మానసము కలవాడు.

(3) శత్రువుల ప్రాణవాయువులను ఆహారము గొనుటచే మదించి ఖడ్గ మనెడి ఉరగము కలవాడు.

(4) దాన జలముచే కడిగి వేయబడిన కలి కల్మషము కలవాడు.

(5) త్యాగముచే ధిక్కరింపబడిన కర్ణ, కామధేను, కల్పవృక్షములు కలవాడు.

(6) రూప లావణ్య సౌభాగ్యములచే మన్మథుని పోలిన వాడు.

(7) శౌర్యత్రిక మహత్తుల నెరింగిన విశారదుడు.

(8) మార్గ దేశీ నృత్య విభాగముల వివేచనమున విచక్షణుడు.

ఈ అష గుణ సంపన్నుడగు కృతి భర్తను జాయ సేనాని తన కావ్యమునకు చేకూర్చెను.

ఈ దేశీ నృత్య మనగా లక్షణ మిట్టిదని ఈ క్రింది విధముగ జాయసేనాని తెల్పెను.

భవంతి ధరణీపాలాః
 ప్రాయేణాభినవ ప్రియాః
అతస్తత్ప్రీతయేద్యాపి
 యద్య దుత్పాద్యతే నవం
నృత్త తత్త స్మృతం దేశీ
 తత్త దేశాను సారతః.
భూతవ్ శాస్త్రముఖాత్ జ్ఞేయం
 భవిష్యం నావగద్యతే
భవన్ని రూపణం (నై) యస్మాత్
 నృత్యం దేశీతి సంజ్ఞితం.

"ధరణి పాలురు సహజముగా అభినవ ప్రియులు. కావున వారి ప్రీతికై నేటికిని (1255 A—D) వివిధ దేశానుసారముగ యే యే నృత్యము నవ నవముగా నుత్పాదింపబడుచున్నదో అయ్యది దేశియని పిలువబడుచున్నది.

పూర్వమున వృద్ధి చెందిన నృత్యమును శాస్త్రములందు నిబంధింపబడినందున తద్వారా తెలిసికొనవచ్చును. రాబోవు కాలమునాటి కళను గూర్చి చెప్పుట సంభవింపదు. ఈనాడు (సమకాలిక ప్రపంచమున) దేశమున వ్యాప్తినొందియుండు దేశీ నృత్యమును నిరూపించెదను."

ఈ కృతి వచ్చిన 1255 A—D ఆనంద సంవత్సరము కాకతి వంశ చరిత్రలో శ్రేష్ఠమైనది. చరిత్రకారులు 1254—1256 నాటి శాసనముల పరిశీలించి, గణపతిదేవుడు తన రాజధానిని హనుమకొండనుండి, ఏకశిలా నగరమునకు మార్చినట్లు తెల్పియున్నారు. ఆ శుభ సంవత్సరము 1255 A—D దిగా ఈ కృతి కాలమునుబట్టి దృఢ పరచవచ్చును. ఏకశిలా నగరమును సామ్రాజ్య ముఖ్య స్థానముగా స్థాపించు మంగళ

* భూత=5 బాణ=5, అగ్ని=3, సాగరైః=4=5534. ఈ సంఖ్యను విధిదాయకముగా 4355 యని తెలిసికొనవలయును. నేటికి కలియుగము 5063 అనగా 708 సం. పూర్వము 1963—708=1255 A. D. కావ్య రచనా కాలము.

కరమగు సమయమున నృత్య రత్నావళికి రాజభర్తతో కళ్యాణము ప్రాప్తించెను.

*  *  *  *

ఆ నాటికే (1210—1247 A–D) "సంగీత రత్నాకర" గ్రంథమును సోఢలుని తనయుడగు శార్ఙ్గదేవుడు రచించెనని తెలియుచున్నది. అందు ఏడవ అధ్యాయము నృత్య విషయా విష్కరణము. ఈ కవి దేవగిరి యాదవుల ప్రభు పోషణ యందుండెను. జాయసేనాని సోఢలుడును, భరతముని కీర్తిధరుల ప్రాచీన గ్రంథముల తరచి చూచినట్లు వారి కావ్య మండలి రచనయే తెల్పుచున్నది. దేశీ నృత్యమును గూర్చి శార్ఙ్గదేవుడు విపులముగా వర్ణింపలేదు. స్థాలీపులాకముగనే క్లుప్తముగా స్పృశించినట్లు తెలియుచున్నది. గ్రంథ విస్తీర భీతిచే సంక్షిప్తము చేసితినని వ్రాసికొనెను, కాని సంగీత రత్నాకర మండలి దేశీ నృత్య విభాగమును చదివిన, గ్రంథకర్త తన జీవితమున పెక్కు దేశీ నృత్య ప్రదర్శనముల వీక్షించినట్లు లేదు.

కాని, కాకతి రాజ్య గజసాహిణి దేశీ నృత్య విశేషముల ఆసాంతముగ, విరివిగా, వీక్షించి, ముందు కాలమువారికి ఆదేశీ నృత్య వ్యాసంగముల కైవసము చేయుటకై ఆ కళాఖండముల, శాస్త్రమున నిబంధించినట్లు నృత్య రత్నావళి రచనచే దృఢముగు చున్నది. ఇంతయేగాక, నర్తకీ, నర్తక, సంగీత వాద్య విద్వాంసులకు భూ, గృహ దానము లిచ్చినట్లు శాసన శిఖరములున్నవి.

*  *  *  *

ఈ పంచమాధ్యాయమున (1)* దేశీ స్థానకములు ఇరువదిరెండు. (2) అంచిత కరణములు పదునాలుగు. (3) అంగములు నాలుగు. (4) లోహడీలు ఎనిమిది. (5) దర్ప సరణములు మూడు. (6) కపాలాది స్పర్శములు నాల్గు (7) దేశీ లాస్యాంగములు ముప్పదిమూడు, (8) తాళయుక్తమగు గతుల గూర్చి వివరణోపేతమగు వర్ణనము గలదు.

దేశీ స్థానకముల వివరము రెండు రత్నాకరములందును, నాట్య శాస్త్ర సంగ్రహ గ్రంథమునందును సమానము. జాయసేనాని "వ్రాతప్రతి" యందు ఒకటినుండి పదివరకు లక్షణములు కానరావు.

1 అంచిత కరణముల నటిప్లుత మొనర్చుట. నర్తకి సమముగా నిలచి, ఎగిరి భూమిపై నిలచుట. ఈ ఉప్లుత కరణముల పదునాల్గను జాయసేనాని పూర్తిగా వర్ణించెను. (నేటికి లభ్యమైన తెనుగు లిపి ప్రతియందు (11) అంగుష్ఠ బద్ధాంచిత, లక్షణములుప్తమైనది.) (9) లంకాదాహాంచిత, (12) బలబద్ధాంచితముల లక్షణములు వ్రాత లోపముచే నవ్యమగు వర్ణము నిచ్చుటలేదు. సోఢలుడు 1 నుండి 4, 6, 8, 10 అంచితములను మాత్రము, నూతనముగ సమపాదాంచితమును చేర్చి లక్షణముల పేర్కొనెను.

2 నాల్గు అంగములు.

ఎగురుట, కూర్చొనుట, మొగ్గ వేయుట మొదలగు విన్యాస పూరితములు. ఇరువది సంవత్సరముల పూర్వము పేజవాణీలలో కళావంత కులజులు ఈ నృత్య ప్రయోగముల ప్రదర్శించు చుండెడివారు.

3 ఎనిమిది లోహడీలు.

ఇందును మొగ్గవాలుట, ఎగిరి నలు దిక్కులకు తిరుగుట మొదలగు విన్యాసము లొనర్చు నృత్యము. ఇందు విక్షిప్తాంత లక్షణము వ్రాతప్రతియందు నష్టము.

4 దర్ప సరణములు మూడు, 5 స్పర్శములు నాలుగు లక్షణ రహితముగ నామమాత్రముగ సూచింపబడినవి. ఇవి 'సంగీత రత్నాకర'మందు గలవు. శార్ఙ్గ దేవుడు, అంచితముల, అంగముల, లోహడీల, సరణముల, స్పర్శముల, కొన్నింటినే చెప్పి భ్రమరముచేర్చి ముప్పది చారీంటిని వర్ణించెను.

---

* (1) సమపాద, (2) ఏకపార్శ్వ, (3) స్వస్తిక, (4) వృషభాసన, (5) బ్రాహ్మ, (6) వైష్ణవ, (7) శైవ, (8) గారుడ (9) సంహత, (10) పృష్ఠోత్తానతలం (లేదు), (11) వర్ధమాన,, (12) కూర్మాసన, (13) నంద్యావర్త, (14) పరావృత్త, (15) పార్ష్ణిపార్శ్వగత, (16) ఏకజానుక, (17) పార్ష్ణివిద్ధ, (18) ఏకపాద, (19) నాగబంధ, (20) సమసూచీ, (21) విషమసూచీ, (22) ఖండసూచీ.

1. అంచితం. (2) కర్తర్యంచితం. (3) ఖేచరాంచితం. (4) ఏకపాదాంచితం. (5) క్షేత్రాంచితం. (6) స్కంధాంచితం. (7) లోహిణ్యంచితం. (8) దండ ప్రమాణాంచితం. (9) లంకాదాహాంచితం. (10) భ్రాంత పాదాంచితం. (11) అంగుష్ఠ బద్ధాంచితం. (12) బలి బద్ధాంచితం. (13) అంగాంచితం. (14) సమ కర్తర్యంచితం.

2. అంగములు (1) అంగం, (2) కూర్మాంగ, (3) ఊర్ధ్వాంగ, (4) అంతరాంగ.

3. (1) లోహడీ, (2) కర్తరీ లోహడీ, (3) సమ కర్తరీ లోహడీ, (4) బాహుబంధ (బద్ధ), (5) చిత్రాఖ్య, (6) ఏకపాద, (7) చతుర్ముఖ, (8) విక్షిప్తాంత.

4. (1) దర్పసరణ, (2) జంతయున, (3) నాగబంధ.

5. స్పర్శములు:—(1) కపాల స్పర్శన, (2) మాధ్యంతము, (3) మత్స్యకరణము, (4) కరస్పర్శ.

# పోతన*

శ్రీ నోరి నరసింహశాస్త్రి

ఇది భారతీయ సాహితీవేత్తలు, అను శీర్షికతో నేషనలుబుక్ ట్రస్టు వారు భారతీయ భాషలలో ముఖ్యములైన తొమ్మిదింటిలోనికిని ఆంగ్లములోనికిని అనువదింపజేసి భారతీయకవి ప్రకాండులను భారతదేశము లోని అన్ని ప్రాంతముల వారికే కాక ప్రపంచ సాహితీవేత్తలందరికి పరిచయముచేయు ఉదాత్తాశయముతో ప్రచురింపబడిన గ్రంథములలో ఒకటి. ఆంధ్ర భాషా కవులలో మహనీయులెందరో ఉన్నను, ముందు పోతనను గ్రహించుట సమంజసముగా నున్నది. పోతన వలె పండిత పామరులకు సమానముగా అభిమాన గౌరవ పాత్రుడైన ఆంధ్ర కవి ఇంకొకడు లేడు గదా! భారతీయ భాషా కవులలో పోతనకు తులసీదాసుతో సమానమగు స్థానము కలదు.

ఇట్టి గ్రంథమును వ్రాయుటకు శ్రీ వేంకటరావు గారిని ఎన్నుకొనుట సర్వవిధముల యుక్తముగా నున్నది. ఆంధ్ర కవితా విమర్శనలోను పరిశోధనలోను వారికి విశేషానుభవ మున్నది. వారికి గ్రంథ రచనలో అభ్యాసము కూడా అపారముగా నున్నది.

ప్రచురణకర్తలు తమపై పెట్టిన భారమును నిర్వహించుటకు శ్రీ వేంకటరావుగారు ఎంతో శ్రద్ధగా సర్వతోముఖముగా ఆలోచించి విశేష శ్రమపడి ఈ గ్రంథము రచించినారు. దీనిని సర్వవిధముల సంపూర్ణముగా చేయుటకు వారు చేసిన కృషి ఈ గ్రంథములో సర్వత్ర గోచరించుచున్నది. బహు గ్రంథకర్తలైన వీరు తమ రచనలలో నెల్ల 'పోతన' రచనకు అపరిమిత శ్రద్ధ వహించిరనుటకు ఎట్టి సందేహమును లేదు.

విషయ సూచిక చూచిన మాత్రముననే వారిది ఎంత ఆలోచనా పూర్వకముగా రచించిరో విస్పష్టము కాగలదు. అవతారికలో పోతనను ఆంధ్ర శుక యోగిగా వర్ణించి, రెండవ ప్రకరణములో భారతీయ భాషలలోని భాగవతానువాదము లన్నిటిలో పోతన భాగవత విశిష్టతను నిరూపించుచు పోతనను తులసీదాసుతో పోల్చి వారిద్దరు రామకృష్ణ భక్తి సాహిత్యములకు తీర్థభూతులని నిర్వచించిరి. ఆ తర్వాత పోతన అవతరించు నాటి దేశకాల మత పరిస్థితులను ఒక ప్రకరణములో తెలిపి, మరియొక ప్రకరణములో పోతన ఇతర కృతులను తెలిపిరి. 5 వ ప్రకరణములో పోతన ఏయే స్కంధములు వ్రాసినది విమర్శించిరి. 6 వ ప్రకరణములో పోతన ఆంధ్రీకరణ విధానమును ఉదాహరించిరి. ఆ తర్వాతి దానిలో పోతన కవితా లక్షణములను తొమ్మిదింటిని పేర్కొనిరి. 8 వ దానిలో పోతనలో మూడు భక్తి రీతులు కలవని వివేచించిరి. పిమ్మటి ప్రకరణములో శ్రీనాథ పోతనల గూర్చిన మహత్త్వ కథలు వర్ణించిరి. 10 వ దానిలో పోతన అనుసరించిన పూర్వ కవులను, పోతన ననుసరించిన ఇతర కవులను విపులీకరించిరి. 29 పుటలున్న ఈ ప్రకరణములో ఒకటి రెండు పేజీలు తప్ప తక్కినదంతయు ఉదాహరణ రూపమైనదే. 11 వ దానిలో పోతన వ్రాయని ఇతర స్కంధములు వ్రాసిన కవులను గంగన నుండి నేటి కాలపు శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారి వరకు తెలిపిరి. ఆ తర్వాత భాగవతములోని ఉపాఖ్యానములను భాగవతా దర్శమును తెలుపుటకు ఒక ప్రకరణము ప్రత్యేకించిరి కాని అది రెండు పేజీలపైన కొద్ది పంక్తులు మాత్రమే కలదు. పరీక్ష పేపరు వ్రాయు విద్యార్థులు ఉత్తరము వ్రాయుట కిచ్చిన సమయమో స్థలమో అయిపోవుటచేత చివరి భాగము సంకోచించి వ్రాసినట్లే సరిగా ఈ చివరి ప్రకరణ ముండుట శోచనీయము.

ఆ తర్వాత అనుబంధమున్నది. అందులో ముందు పోతన భాగవత మహాత్మ్యమును గూర్చి 'సాక్షి!' నుండి అరున్నర పేజీలతో తెలిపిరి. పిమ్మట మరి ఆరున్నర పేజీలతో పోతనను స్తుతించిన కవుల స్తుతులను శ్రీ వేంకటరావు గారి వరకు ఉదాహరించిరి. ఇందులోనే పోతన వంశమును గూర్చి ప్రస్తావించిరి గాని ఆ విషయ మెందువల్లనో గాని తగినంతగా విస్తరింపలేదు. 3 వ అనుబంధములో సంకలన గ్రంథములలో నుదాహరించిన భాగవత పద్యములు తెలిపిరి. చివరి అనుబంధములో భాగవతమును అనువదించిన వారియు అనుసరించిన వారియు వివరములను విమర్శలను పీఠికాదులను వ్యాసాదులను తెలిపిరి. ఈ విధముగా ఈ గ్రంథ రచనకు గ్రంథకర్త చేసిన విస్తార పరిశ్రమను ముఖ్యముగా అభినందించు

---

* గ్రంథకర్త : శ్రీ నిడుదవోలు వేంకటరావు. ప్రకాశకులు : నేషనల్ బుక్ ట్రస్టు వారు—భారత ప్రభుత్వ సమాచార, రేడియో మంత్రిత్వశాఖ, ప్రచురణ విభాగము, డెమ్మీ 1/8 పేజీలు. 288 వెల : రు. 2-75.

కాని ఇంత శ్రమ చేసి వీరు వ్రాసిన పుస్తకము ఉద్దిష్టమైన ప్రధాన ప్రయోజనమును సాధింపగలదా అను సందేహము మాత్రము, గ్రంథమును అశ్రద్ధగా తిరగవేసిన వారికి కూడ కలుగకపోదు. గ్రంథములో సగముకంటె ఎక్కువ పాలు ఉదాహృత పద్యములతోనే నిండి పోయినది. ఇతర భాషల లోనికి అనువదించినపుడు వాని ప్రాణము పోవును. అనుసరణములోను, అనుకరణములలోను ప్రధానముగా శబ్ద సామ్యముండుటచే, అవి భాషాంతరీకరణములలో ఎంతమాత్రము బోధపడవు. పోతన కవిత్వమునకు ఉదాహరణములైనచో నవి తప్పవు. కాని ఇట్లుదాహరించిన వానిలో పోతన పద్యములెన్నో, అంతకంటె ఇతరులవే ఎక్కువేమో అనిపించునంతగా నున్నవి. ఈ గ్రంథానువాదములు ఆంధ్రేతరులు చదివి పోతన అతిశయమును తెలిసికొనుటకు ఉద్దేశింపబడినదను భావముతో చూచినచో, గ్రంథకర్త దూర మాలోచించినట్లు తోచదు. వారి ఉత్సాహాతిశయము ఉచితజ్ఞతను మరపింప జేసినది.

మరల నట్టిదే మరియొక పొరపాటు రెండవ ప్రకరణములో చేసినట్లు తోచును. అందులో దేశ భాషలలో వచ్చిన భాగవతానువాదములలోనెల్ల పోతన భాగవతము ఉత్తమమైనదని ప్రతిపాదించిరి. తమ తమ భాషలలో ప్రసిద్ధులైన కవులమీద ఈగ వాలినను సహింపని దురభిమానము ప్రతి భాషాభిమానులకు విపరీతముగా నేటి కాలములో వృద్ధి పొందుచున్న సంగతి జగద్విదితము. అందువల్ల ఆ యా భాషలలోని భాగవతములను గూర్చి వ్రాయు మాటలు ఆ యా భాషాభిమానులకు నొప్పి కలిగింపకుండ వ్రాయుట అత్యవసరము. శ్రీ వేంకటరావుగారు సూరసాగర్‌ను గూర్చి వ్రాసినది హిందీ ప్రాంతమువారు గాని, జగన్నాథదాసు భాగవతమును గూర్చినది ఓఢ్రులుగాని, ఏకనాథుని గూర్చినది మహారాష్ట్రులుగాని, ఎజుతచ్చన్‌ను గూర్చి వ్రాసినది మళయాళులుగాని చదివి హర్షింపరు. జగన్నాథదాసు భాగవతమునకు ఉత్కళదేశమున దేవాలయములు గూడ కట్టుచుండునంత భక్తిభావము కలదు. అస్సామీ, భాషలో శంకరదేవుని భాగవతమును గూర్చి వ్రాసిన దానినిబట్టి, శ్రీ వేంకటరావుగారికి దాని మంచి చెడుగులు తెలియవని స్పష్టమగుచున్నది. ఇతర భాషల భాగవతముల గూర్చియు వారికి తగినంతగా తెలిసినట్లు లేదు. కొన్నిటికి ఆ భాషా కవి పూర్తిగా వ్రాయలేదని లోపము చూపిరి. అది పోతనకును అన్వయించును గదా! కొందరు కొన్ని భాగములనే ప్రధానముగా పెట్టుకుని పెంచినారని లోపముగా చూపిరి. పే. 83 లో పోతన దశమ స్కంధమును గూర్చి వ్రాయుచు "ఈ స్కంధము మూలముకన్న మూడు నాలుగు రెట్లు తెలుగు సేతలో పెరిగినది" అని వ్రాసిరి. అందుచే ఆ లోపము పోతనకు కూడ అన్వయింపవచ్చును. ఒరియా భాషలోని భాగవతములో వంగ వైష్ణవ సంప్రదాయములు కనబడుట లోపముగా చెప్పినారు.

అద్వైత మార్గ మవలంబించుట పోతన లోపముగా వారు గణింపగూడదా? కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణగారు వైష్ణవ పరమైన భాగవత మూలమును అద్వైత పరము చేసి పోతన తారుమారు చేసెనని ఉపన్యాసములలో ఉద్ఘాటించెడివారు.

అందువలన ద్వితీయ ప్రకరణాంత భాగములో "దీనిని బట్టి యా యా భాషలలో భాగవతానువాదమునకు పోతన వంటి సమర్థుడగు మహాకవి జన్మించలేదని చెప్పవలసియున్నది" అని వ్రాసిన మాటలు ఇతర భాషలవారికి రుచింపవనియు, వారికి పోతనలో లోపములు వెదుకవలెనను పట్టుదల పెరుగుననియు గ్రంథకర్త ఆలోచించి యుండవలసినది. అదికాక సర్వ భాషల భాగవతములను పరిశోధించిన వారే కాని యట్టి యభిప్రాయ మిచ్చుటకు అధికారులు కారు. అట్టి యధికారము గ్రంథకర్తకు లేదని స్పష్టము. ఈ సందర్భములో గ్రంథకర్త ఉత్సాహాభిమానములు జాగరూకతను పోగొట్టినవి. "పోతన యనుసరించిన మార్గములో అది ఉత్కృష్టమైనది" అని వ్రాసినచో ఎవరికిని బాధ కలిగియుండదు, పోతన ప్రత్యేకతయు అతిశయమును తగ్గియుండదు.

మరియు ఈ గ్రంథములో పెక్కు తావులలో నిష్కృష్టమైన హేతువాదము లోపించినది : ఉదా:

(1) 123–124 'నవ విధ భక్తి' అను శీర్షిక క్రింద ప్రహ్లాద చరిత్రలోని 'ఈ తొమ్మిది భక్తిమార్గములు' అని యున్న ప్రసిద్ధ పద్యమును ఉదాహరించి, దాని మూల శ్లోకములో 'నవ లక్షణా' అని ఉన్న మాటను చూపిరి. ఆపైన శరీరమునకు నవ ద్వారము లున్నట్లే నవ విధ భక్తి మార్గములు ఉన్నవనియు, ఈ నవ శబ్దమునకు నూతనము అను నర్థము కూడకలదు కావున ఇది నూతన మార్గమనియు ఏమేమో వ్రాసిరి. ఈ సందర్భములో పోతన నవ శబ్దమే వాడలేదను మాట మరచిరి. మరి యెందు కింత వ్యాఖ్యానము!

(2) పేజీ 94 : 'శ్రీధరాచార్యుని వ్యాఖ్యానము ననుసరించుటచేత పోతన రచించిన భాగములెల్ల అద్వైత పరములుగా నున్నవి' అని పైని తెలిపి, క్రింద "శివాద్వైతి కావున పోతన, యద్వైత వ్యాఖ్యానమునే యనుసరించెను" అని వ్రాసిరి. శ్రీధర వ్యాఖ్యానము శివాద్వైత వ్యాఖ్యానము కాదు కదా! శ్రీధరుని దృష్టిలో శివాద్వైతమునకును (వైష్ణవ) విశిష్టాద్వైతమునకును ఎక్కువ భేదముండదు.

(3) § 100 : "ఇచట విశిష్టాద్వైత సిద్ధాంతము లున్నవి గాన, ఈ భాగము దశమ స్కంధోత్తర భాగము పోతనది కాదనియు కొందఱు విమర్శకులు చెప్పవచ్చును కాని యది సహేతుకము గాదు! ఏలయనగా, సమదర్శుడగు పోతన తనచట ప్రధానముగా కేవలము విష్ణు పరమైన తత్త్వమును గూర్చిన ఘట్టమున, తన కాలమున ప్రచుర ప్రచారములో నున్న విశిష్టాద్వైత సిద్ధాంతమును గూడ సూచించుట సమంజసమే"—ఇట్టి వ్రాతలు హేతువాదమునకు నిలువ

జాలవు. మహా భాగవతములో విష్ణుపరము కానిదేమున్నది? ఇక్కడనే విశిష్టాద్వైత పరముగా నుండుటకు కారణమేమి? ఆ భాగమునకు పూర్వమే 'ఇక్కడి నుండి నారయ రచనము' అని ఉన్నదానిని త్రోసివేయుచు గ్రంథకర్త నిర్ధారణ యుండుటచేత, తన సిద్ధాంతమునకు విరుద్ధముగా ఉన్న విషయమును ఎదుర్కొనలేక చెప్పిన సాకు. బుద్ధిమంతు లిట్టి వితండవాదమునకు హర్షింపరు. ఇట్టి వింకను ఎన్నో గ్రంథ మందంతట గలవు.

మహా భాగవతములో పోతన ఏయే భాగములు వ్రాసెను, అనునది క్లిష్టమైన సమస్య, విప్పలేని చిక్కుముడి. మొత్తము మీద స్కంధాంత గద్యలను బట్టి గ్రంథకర్త సిద్ధాంతము చేసెను. ఉపలభ్యమైన వ్రాతప్రతులన్నీ సూక్ష్మముగా పరిశీలన చేసి వాని కాలము నిర్ధారణ చేయవలె. సమగ్రముగా మూలమూ మూల పాఠభేదాలు వ్యాఖ్యానాలు పరిశోధించవలె. అప్పుడు కాని కొంత ధైర్యముగా సిద్ధాంతము చేయుటకు వీలులేని దీ విషయము! ఆపని ఒకరు కాదు, నూరుమంది చేయవలసినది. అట్టిది లేకుండా నేడు చేయు నిర్ధారణలు ఊహలు మాత్రమే. ఊహలు సిద్ధాంతములుగా ప్రకటించుట శాస్త్రీయమైన పరిశోధకుల పద్ధతి కాదు. అలెగ్జాండరు గార్డియను ముడిని ఛేదించి విజయము సాధించినాడట. అట్లే ఈ గ్రంథకర్త ఈ చిక్కుముడిని కోసివేసిరి. విజ్ఞానము విస్తరించిన ఈ కాలములో సాహిత్యవేత్తలంపకే శ్రీ వెంకటరావుగారిని అగ్గింపరు. ఈ సందర్భములో గ్రంథకర్త చేసిన వాదములో హేతువు లెన్ని యున్నవో హేత్వాభాసములును అన్ని యున్నవి. రెండవ స్కంధములోను దశమ స్కంధము ఉత్తర భాగములోను కొంతదూరము పోయిన తర్వాత 'వెలిగందల నారయ కవిత్వము' అని కొన్ని వ్రాతప్రతులలో కనిపించుచున్నది. ఆ భాగములలో కొన్ని భాగములు అద్వైత పరములుగాను, కొన్ని విశిష్టాద్వైత పరములుగాను కనిపించుచున్నవి. కవిత్వ స్థాయి కూడ కొన్ని చోట్ల పోతన స్థాయిలోను, ఎన్నో చోట్ల మిక్కిలి దిగజారియు కనబడుచున్నది. ఇవి యన్నియు సమగ్రముగా నాలోచించుట చేనే ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన శ్రీ మహా భాగవత పీఠిక ముగించుచు "ఈ విషయము లోతుగా పర్యాలోచించినప్పుడు మూల గ్రంథము పూర్తిగా నష్టమైనట్లు తోచదు. ఆ యా భాగాలలో, నత్తగుల్లలలో ముత్తెపు చిప్పలవలె పఱుటాకులలో పారిజాతముల లాగున, మహాకవి అమృతవాణి చెవి తాకి చిత్తమును చిగిరింపజేయుచున్నది" అని వ్రాసిరి.

పోతన రచించిన ఇతర గ్రంథము లేవి యనునది కూడ నట్టి చిక్కు సమస్యయే. వీరభద్ర విజయము పూర్తిగా చదివినవారికి ఇది పోతన కృతియా యను సందేహము కలుగక మానదు. బాల్యకృతి యని యవతారికలో నున్నను, భాగవత రచన పిమ్మటిదని స్పష్టముచేయు పద్యము కూడ ఒకటి యున్నది. ఆ పద్యము కొన్ని వ్రాతప్రతులలో లేదట. అందువల్ల నది ప్రక్షిప్తమని నిర్ధారణ చేసినారు. మన వాదమునకు అడ్డువచ్చిన వానిని ప్రక్షిప్తములని త్రోసివేయుట తేలిక. ఆ పద్యము ప్రక్షిప్తము చేయుటకు కారణమేమో, ఏ వ్రాతప్రతులలో ఉన్నదో, దేనిలో లేదో సమగ్రముగా విచారణ చేయనిది నిశ్చయింప వీలులేదు. అందులో పోతన వీరమాహేశ్వరాచారవిభుడైన ఇవ్వటూరి సోమశేఖరారాధ్యుల శిష్యుడనియు, వీరభద్ర ప్రసాద లబ్ధ కవితాతిశయము కలవాడనియు గూడ కలదు. ఆ గురువుల సంగతి కాని కవిత్వమునకు వీరభద్ర ప్రసాదము కారణమను సంగతి కాని పోతన భాగవతములో కానరాదు. పైపెచ్చు విష్ణువు పారమ్యము ప్రతిపాదించు ఘట్టములును, శివుని తక్కువచేయు ఘట్టములును మూలము కంటె విస్తరించి కూడ భాగవతములో వ్రాసెను. వీరమాహేశ్వరాచారుడైనవాడు అట్లు చేయునా అను సందేహము కలుగక మానదు. తర్వాత పోతన మతము మార్చుకొనెనందుమా, ఈ గ్రంథకర్త పోతనను మొదటి నుండి చివరివరకు 'వీరశైవు'నిగానే వర్ణించిరి. వీరభద్ర విజయములో కొన్ని పద్యములు పోతనవే యనుపించును. కొన్ని ఎంత చిన్నతనములోనైనను పోతన యిట్లు వ్రాసియుండునా యనిపించును. అవతారిక యంతయు ఎవరో 'వీరశైవు'లు చేర్చిరా యనియు సందేహింపవచ్చును. సాధక బాధకము లన్నియు నిష్పక్షపాతముగా ప్రదర్శించి ఆపైన తమకున్న అభిప్రాయము తెలుపుట న్యాయము. అట్టి దీ గ్రంథకర్త చేయలేదు.

పేజీలు 22—28: "దేశ కాల మత పరిస్థితులు తెలుగు సాహిత్యము. మత సామరస్యము" అను శీర్షికల క్రింద వ్రాసిన దేమా వారికి తెలిసినట్లు లేదు. పైగా ఆ ప్రస్తావమును "నేటి సాహితీ లోకమున వీరశైవ మతమును గూర్చియు, నా వాఙ్మయమునకు సంబంధించిన శివ కవులు అనువారి గ్రంథములను గూర్చియు వ్రాసిన విమర్శనములు.... వీరశైవ మత సంప్రదాయమునకు మూల భూతములగు గ్రంథములను చక్కగా చదివి యవగాహనము చేసికొని.. వ్రాసినవి కావని నిరూపింపవచ్చును" అని ప్రారంభము చేసి, "పై చర్చనుబట్టి వీరశైవమున విష్ణు ప్రసక్తి యున్నదనియు, వైష్ణవమున శివ ప్రసక్తి లేదనియు నట్లు లేక పోయినను తెలుగు సాహిత్యమున కవులు సామరస్య భావమున కృతులు రచించిరనియు విశదమగుచున్నది" అని పూర్తి చేసిరి. ఈ భాగములోను అందలి విషయములను విస్తరించిన తక్కిన గ్రంథ భాగములలోను నేటి సాహితీ లోకమున విమర్శనములు చేయువారిని గూర్చియు, వారికి మత మూల గ్రంథములు బాగుగా తెలియవనియు చెప్పిన మాటలు అక్షరశః ఈ గ్రంథకర్తకు అన్వయించు ననుమాట నిశ్చయముగా కానవచ్చుచున్నది.

“వీర శైవులు విష్ణు పారమ్యము నంగీకరింపరే గాని విష్ణువు నెంతమాత్రము ద్వేషింపరు” అని గ్రంథకర్త వ్రాసినది కొంత నిజమే. కాని యట్లే శ్రీ రామానుజ వైష్ణవులు గూడ శివ పారమ్యము నంగీకరింపరే కాని శివు నెంత మాత్రము ద్వేషింపరనియు, శివుని విష్ణు భక్తాగ్రేసరునిగా నెన్నుదురనియు శ్రీ వెంకటరావు గారికి తెలియదా? విష్ణు క్షేత్రములకు క్షేత్ర పాలక శివాలయ ముండుట సర్వ సామాన్యము కాదా? విష్ణు సహస్ర నామములలో ‘శివాయనమః’ అను నామము రెండు మార్లు ‘స్థాణవే నమః’ అని మూడు మార్లు, వచ్చుటే కాక, శంభవే నమః, రుద్రాయ నమః, ఉగ్రాయ నమః, స్కందాయ నమః, శర్వాయనమః స్కందాయనమః, గుహాయనమః శరభాయనమః అను నిత్యాది నామము లున్నవి గదా! ప్రసిద్ధమైన లక్ష్మీ అష్టోత్తర శత నామములలో ‘శివాయై నమః, బ్రహ్మ విష్ణు శివాత్మికాయై నమః’ ఇత్యాది నామము లున్నవి కదా! ఈమధ్య ఎక్కువ ప్రసిద్ధికి వచ్చిన శ్రీ వెంకటేశ్వర సహస్ర నామములలో, ‘శివ వాక్సుష్ట మానసాయ నమః, మహేశ్వర సంస్తుత్యాయనమః’ అను నిత్యాది నామము లున్నవి గదా! వైఖానస వైష్ణవములో గూడ కుంభ దీప విధానములో ‘అర్చనా నవనీతము’లో “......దీపే లక్ష్మీం సమర్చయేత్. ధూమే భవం సమారాధ్య......” ఇత్యాదిగా నున్నది. కాబట్టి పే. 28 వ ‘వైష్ణవమున శివ ప్రసక్తి లేదు’ అన్న మాటలు నిరాధారములు.

వీర శైవులకు విష్ణు ద్వేషము లేదనుటకు గ్రంథ కర్త చెప్పిన కారణములలో, ‘పాలకురికి సోమనాథుని తండ్రి పేరు విష్ణురామదేవుడు, తల్లి పేరు శ్రియా దేవి యనియు, శివభక్తులలో సిద్ధరామయ్య, ఏకాంతరామయ్య అను విష్ణు నామాంకితులు కలరు’ అనియు నొక హేతువుగా పేర్కొనిరి. ఈ హేతువు కేమైన బలమున్నదా? ఆ భక్తులవి వారు పుట్టిన కొద్ది కాలమునకే వారి తల్లిదండ్రులు పెట్టిన వ్యవహార నామములు కాని, వారు శి: దీక్ష తీసికున్నప్పుడు గురువులు పెట్టిన నామములు కాదు గదా! ఇక సోమనాథుడు ఎంత శివభక్తుడైనను తన తల్లి దండ్రుల పేర్లు మార్చగలడా? ఐనను అత డెక్కువ సాహసుడు కావున వీరశైవము ముదిరిన పిమ్మట వ్రాసిన పండితారాధ్య చరిత్రములో అవి కూడ మార్చివేసి తాను ‘శ్రీ మద్గురు లింగ ఘన కరుణా హస్త గర్భ సంభవుడ’ననియు, ‘బసవన్నయలు పుట్టు బానిస కొడుక’ ననియు చెప్పి విధిలేక, వైష్ణవ నామములతో నున్న యా నామములు కూడ వ్రాయుట కిష్టములేక ‘మును బసవ పురాణమున నెన్నంబడిన సెనుపాల జనులకు సేవకుడు కొడుక’ నని చెప్పి కొనెను గదా! ఇది, వీర శైవులలో కొందరికైనను విష్ణు ద్వేషము లేదనుటకు ఉదాహరింపవలసినది!

నేటి విమర్శకులే కాక పూర్వ కవులు గ్రంథకర్తలు కూడ మత నామములను పేర్కొనుటలో స్పష్టమైన వ్యవస్థ చేసికున్నట్లు లేదు. కాని ‘వీర’ శబ్దము ఏ మతమునకు విశేషణముగా వాడినను దాని ప్రధాన లక్షణము ఒక్కటే,—అది చాతుర్వర్ణ్య బద్ధమైన వ్యవస్థను ధిక్కరించుట. ఆ లక్షణము ననుసరించి వారు శ్రౌత స్మార్త కర్మలయందు శ్రద్ధ చూపకుండుటయు, వేద భాగములను కొన్నిటిని ఉపయోగించుకొనుచున్నను వేదమును పరమ ప్రమాణముగా నంగీకరింపకుండుటయు, తమకు ఇష్టమైన ఆగమములతో, తంత్రములతో, శాస్త్రములతో పరమ ప్రమాణములుగా గ్రహించుటయు జరిగినది. వారికి రెండే కులములు. తమ కభిమాన మైన దేవత పారమ్యము నంగీకరించి కొలుచువారు, అట్లు చేయనివారు. ఈ లక్షణ మున్నవారినే ‘వీర’ విశేషణముతో వ్యవహరించుట యుక్తము — వీర శైవులు, వీర వైష్ణవులు, వీర శాక్తులు బసవన ఉపనయనాది స్మార్త కర్మ లుజ్జగించి అన్ని కులముల శివ భక్తులతో కూడుచున్నందున వీర శైవుడన జెల్లెను. పల్నాటి వీర చరిత్రములో చాపకూడు కుడిచిన వైష్ణవులును వీర వైష్ణవులు. అంతేకాని వర్ణ వ్యవస్థను తీవ్రతరముగా పాటించు నాంధ్ర దేశములోని ఆరాధ్య బ్రాహ్మణులను గాని శ్రీ వైష్ణవులను గాని ‘వీర’ విశేషణముతో వ్యవహరించుట యుక్తము కాదు. అట్లు వ్యవహరించిన స్థలములలో ‘వీర’ శబ్దమును మత పరముగా కాక, శ్రద్ధా విశేషము వర్ణించు విశేషణముగా గ్రహించుట భావ్యము. ‘వీర శైవ’ శబ్దము ఇష్టలింగ ధారణము ఆచారముగా నున్న వారందరికి శ్రీ వెంకటరావుగారు అన్వయించినట్లు తోచుచున్నది.

అదియు గాక బసవ మతము, రామానుజ మతము వ్యాప్తిలోనికి రాకముందున్న శివభక్తులయు విష్ణు భక్తులయు రచనలును కథలును, ఆ తర్వాత రూపాంతరము పొందినవి. ఆ మెట్లు వేరు చేయక నేటి స్థితిని బట్టి కలగూరగంపగా మత విషయములు సిద్ధాంతములు చేయబూనుకొనుట సాహసము. ఈ సందర్భములో పూజ్యులగు శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు ప్రారంభించిన శాస్త్రీయ పరిశోధన పద్ధతి ఈ కాలములో ముందుకు పోక వెనుక వెనుకకు పోవుచుండుట శోచనీయము. వారు పండితారాధ్యుల ‘శివ తత్త్వ సారము’నకు వ్రాసిన ఉపోద్ఘాతములో “ఇప్పటి స్మార్తులకు శివ కేశవులు సమానులయినను ఒకప్పుడు కొందరకు నప్పయ దీక్షితులవలె శివుని యందును, కొందరకు బోతనవలె విష్ణువునందును భక్తి యధికము (పే. 31) అనియు, “ఈ గ్రంథమునందు శివాధిక్యతను గురించి ఎక్కువగ జెప్పబడినను, లింగధారణను గురించి ఎంత మాత్రము జెప్పబడి యుండక పోవుట యాశ్చర్యము! (పే. 35)” అనియు వ్రాసిరనుట గమనింపదగినది.

ఇక ఈ గ్రంథములో నెట్లు వ్రాసిరో పరిశీలింతము! పే. 31 లో “బసవన అవైదికమగు జంగమ సంప్రదాయమునకును పండితారాధ్యులు సవైదికమగు నారాధ్య సంప్రదాయమునకును ప్రవర్తకులు” అనియు, పే. 23 లో “బసవేశ్వరుడు ప్రవర్తిల్లజేసిన వీర శైవ జంగమ సంప్రదాయ

మును, పండితారాధ్యుడు ప్రవర్తిల్లజేసిన సవైదికారాధ్య వీర శైవ సంప్రదాయమును'' అని వ్రాసినారు. ఇట్లే గ్రంథ మందు పలు తావులందు వీర శైవములో అవైదికము సవైదికము అను రెండు భేదము లున్నట్లు గ్రంథకర్త తెలిపినారు. శైవముగాని వీర శైవముగాని 'వైదికము' అని వాడక 'సవైదికము' అని వాడుటలో గ్రంథకర్త ఉద్దేశము నాకు బోధపడ లేదు. 'సవైదికము' అను పద ప్రయోగమువలన నా మతము వేదోక్తము కాని వేద విరుద్ధ మతమనియు, అందులో కొన్ని వైదిక లక్షణములు కలసినవనియు నర్థము వచ్చును. ఆ యుద్దేశముతో గ్రంథకర్త పద ప్రయోగము చేసినట్లు తోచదు. ఆ యుద్దేశమే వారి కున్నచో వా రభిమానించు ఆరాధ్య బ్రాహ్మణులు వేద విరుద్ధ మతస్థులని ఏర్పడును. ఆ భావము ఆరాధ్య బ్రాహ్మణు లెంత మాత్రము హర్షించునది కాదు. ఇంతకూ వైదికము అవైదికము అను స్పష్టమైన రెండు శబ్దము లుండగా వానిలో 'వైదిక' శబ్దము వదలివేసి, అపార్థమిచ్చు 'సవైదిక' గ్రంథ మందంతటను ప్రయోగించుటకు కారణము శ్రీ నిడుదవోలు వారికి తెలియవలెను! పే. 18 లో, ''తన గద్యయందు 'సహజ పాండిత్య పోతనామాత్య' అని వ్రాసుకొని యుండుట చేత నాతడు తెలుగు దేశమున మంత్రులు మహా కవులు మహావీరులు జన్మించిన నియోగి శాఖకు జెందినవాడు'' అని వ్రాసి ఒక శాఖాభిమానము కూడ ప్రదర్శించిరి.

ఏర్చూరి సింగనను గూర్చి చెప్పుచు పే. 168 లో ''తాను మంత్రి శేఖరుడనని చెప్పుకొనుటచే నీత డార్వేల నియోగి'' అని వ్రాసి, శాఖలో అంతర శాఖాభిమానము కూడ గ్రంథకర్త ప్రదర్శించిరి. అతడు, పోపము, పాకనాటి నియోగి యైనా కాకూడదా? కాదు. ఎందువల్ల? గ్రంథకర్తకు ఆ యాంతర శాఖమీదనున్న అభిమానమువల్లననియే మనమూహింపవలెను. ఈ విధమైన యసందర్భపు వ్రాతలు కొందరు తరుచుగా వ్రాయుచుండుట పరిపాటియైనది.

పోతనాదు లెవ్వరును తాము నియోగులమనిగాని ఆరువేల నియోగులమని గాని చెప్పకొనలేదు. అమాత్య శబ్దము కాని అమాత్య పదవికాని ఏ కాలములోనైనా ఒక శాఖవారి సొమ్ము కాదు. నియోగిశాఖ ఎప్పుడు పరిణమించినదో నిర్ధారింప నలవి కాదు. కంకంటి పాపరాజు కాలమునాటికున్నది కాని పోతన కాలమున కున్నట్లు నిశ్చయాధారము లేదు. ఆ కాలములో ఒకే కుటుంబములో ఒకరు అమాత్య పదవి నిర్వహించుచుండగా అతని సోదరుడే విద్వాంసుడై అగ్రహార దాన పరిగ్రహము చేసినట్లు నిదర్శనములు కలవు. అమాత్య శబ్దము ఒక శాఖకే వర్తించునని కొంతకాలమునుండి అంధ పరంపరా న్యాయముగా ప్రచార మగుచున్నదే కాని అందులో సత్యము లేదని పరిశోధకులగు శ్రీ నిడుదవోలువారికి తెలియకుండుట ఆశ్చర్యకరము. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు తమ 'రెడ్డి రాజ్య చరిత్రలో 'ఆంధ్ర బ్రాహ్మణులలో ఈ శాఖా భేదము చివరి రెడ్డిరాజుల పాలనలోగాని ప్రారంభము కాలేదు' అని వ్రాసినది శాఖాభిమానులు ముఖ్యముగా గమనింపదగిన విషయము! పోతన యీ శాఖా భేదము పరిణమించుచున్న కాలమువాడు. అతడు ఏ శాఖవాడో నిర్ణయింప సాధ్యము కాదు.

పోతనను వీరశైవుడని గ్రంథ మంతట నుద్ఘాటించుచు సందర్భ వశమున కవి ధూర్జటి మొదలగు వారిని గూడ వీర శైవులని గ్రంథకర్త చెప్పుచు వచ్చినారు. వీర శైవమునకు ఇష్టలింగ ధారణము శివ పారమ్యము మాత్రమే అంగీకరించుట ప్రధాన లక్షణములైనట్లు గ్రంథకర్త అభిప్రాయమని తోచుచున్నది. ఈ రెండు ప్రధాన లక్షణములు మాత్రము కవి ధూర్జటి కన్వయింపవు. అతడు శివభక్తాగ్రేసరుడే కాని శ్రీ కాళహస్తి మహాత్మ్యము ద్వితీయాశ్వాసములో చంద్రవర్ణనము చేయుచు 131 వ పద్యములో, ''సకలా పూర్ణుడు నీలవర్ణుడనుటల్.. అభవుడద్వైతుండు భేదంబు గామికిం దెల్లంబుగ నల్పు తల్పుగ ధరన్ వించెన్ శశాంకాకృతిక'' అని వర్ణించుటలో శివ కేశవుల కభేదము స్పష్టపరచినాడు. శ్రీ కాళ హస్తీశ్వర శతకము 102 వ పద్యము 'భసితోద్ధూళన ధూసరాంగులు' ఇత్యాదిలో తనకు పూజ్యులైన వారి చిహ్నములలో భస్మరుద్రాక్ష ధారణము పంచవర్ణ జపమే చెప్పెను గాని ఇష్ట లింగ ధారణము చెప్పలేదు. భస్మ ధారణము రుద్రాక్ష ధారణము పాశుపత దీక్షాంగముగా సూత సంహిత చెప్పుచున్నది. అది స్మార్తులకు అభిమాన పాత్రమైన సంహిత. అందులో ఇష్టలింగ ధారణము లేదు. అప్పయ దీక్షితులు, ఎఱ్ఱయ, శ్రీనాథుడు, ధూర్జటి, గణపతిదేవుని దీక్షా గురువగు విశ్వేశ్వర శంభు దేశికులు స్పష్టముగా ఆ కోవలోనివారు. శివ తత్త్వ సారకర్తయగు పండితారాధ్యునిలో కొంత విశేష మున్నను, వారి కాలమున గూడ ఇష్టలింగధారణ మున్నట్లు నిశ్చయింపలేము. నిజ మిట్లుండగా గ్రంథకర్త ప్రతివారిని 'వీర శైవు'లనుగా వర్ణించుట సంభావ్యము కాదు.

ఇక పోతన మత విషయము ఎన్నో సంశయములతో కూడకొన్నది. ఆతడు ముందు శ్రీ కైవల్య పద కాంక్షతో మహా నందాంగనా డింభకుని చింతించినాడు. తర్వాత శూలికి ధాతకు వందనము చేసి 'అని నిఖిల ప్రధాన దేవతా వందనంబు సేసి' కొంతదూరము పోయి 'మంగళమహా శ్రీ లవుటకున్న' యగు దుర్గను మహత్త్వ కవిత్వ పటుత్వ సంపద లీవుత' మన్నాడు. ఈ దుర్గయే మొదటి పద్యము నని మహానందాంగనయా యను సందేహము కలుగును. లేనిచో నందునికి మహద్విశేషణము పాద పూరణ మనవలసి వచ్చును. తర్వాత 'మదీయ పూర్వ జన్మ సహస్ర సంచిత తపః ఫలంబున శ్రీ మన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుండనై' అని గంగా స్నానమునకు వెళ్లెను. అక్కడ స్నానానంతరమున 'మహేశ్వర ధ్యానంబు' చేయుచు కొంచెము కన్నులు తెరచగా 'రాజ ముఖ్యు' డొకడు ప్రత్యక్షమై, ఆ 'రాజ శేఖరుడు' తాను రామభద్రుడనని తెలిపి తన కంకితముగా భాగవతము వ్రాయు

మని ఆదేశించి తిరోహితు డయ్యెను. ఆ తర్వాత కూడ షష్ఠ్యంత పద్యములు నాల్గింటిలోను శ్రీ కృష్ణుడే కాని శ్రీరాముని పేరే లేదు. ఆశ్వాసాద్యంతములలో మరల శ్రీరాముడే ఉన్నాడు. జన్మ సార్థక మగుటకు ఆయనకు అవసరమని చెప్పిన కర్తవ్యములు 'చేతులారంగ శివుని పూజించుట నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువుట.'

ఇక నాతని వంశము చూచినచో తండ్రి కేసన్న (కేశవ శబ్ద భవము) శైవ శాస్త్ర మతము గన్నవాడు. ''శైవ శాస్త్ర మత మనగా వీర శైవములో సర్వాధికమగు నారాధ్య సంప్రదాయము'' (పేర 19) అని గ్రంథకర్త చేసిన వ్యాఖ్యానము సిద్ధాంతముగా గ్రహింపదగినది కాదు. దాని కాధారము గ్రంథకర్త అభిమానమే. తల్లి లక్కసాని (లక్ష్మీదేవి)' సదాశివ పాదయుగార్చన'చేయునది. అన్న తిప్పయ 'ఈశ్వర సేవాకారుడు' వీరభద్ర విజయమును, దాని యవతారికయు పోతయే వ్రాసియున్నచో అందు 'భవి జూడక భవి డాయక' ఉండు వారు పూజ్యులే కాదు, 'వారి ప్రసాద కరుణా విశేష సంవర్ధమాన కవితా మహత్వ సంపన్నుండ' నని కూడ చెప్పుకన్నాడు. ఇక నారాయణ శతకము కూడ నాతడే రచించినాడని నిశ్చయించినచో (అదియు వీరభద్ర విజయము నాటి కవితా పరిణతినే సూచించును) అందులో నారాయణుడు ''మన వారిజ చకేంద్ర జాధిపతికి నమస్త్రాగ్ర మాణిక్యమై'' అని ప.7 లోను, ప. 19 వ దానిలో త్రిపుర విజయమునకు కూడ నారాయణుడే కారకునిగాను ప. 39 లో నారాయణ భక్తాగ్రేసరులలో ముందు 'హరునిన్' అనియు ప. 73 లో 'వేదంబు లను నిశ్చయుం డగు మహా వేల్పెవ్వడో' యని మునీశ్వరులు వెదుకగా శ్రీరంగ నారాయణుడే కాని వేరొండు లేడని నిశ్చయించిరనియు ప. 92 వ

''నీలగ్రీవుఁడు చేతి పుర్రె విడిచెన్ నీ యంతి భిక్షంబునన్
నీలగ్రీవుఁడు ఈశ్వరాఖ్యఁడనరెన్ నీ నామజప్యంబునన్
నీలగ్రీవుఁడు మించి త్రుంచె నీ బురములన్ నీ ప్రాపు సేవించినన్
నీలగ్రీవ ముఖాబ్జ భాస్కర కృపా నిత్యాత్మ నారాయణా!''

అని వ్రాసినాడనియు గమనింపవలెను. నారాయణ శతకము పోతనయే వ్రాసెనని గ్రంథకర్త నిశ్చయము! విష్ణు పారమ్యమే కాక శివుని అల్పత్వమును గూడ నంగీకరించు వీర శైవుడన్నమాట పోతన !

ఇట్టి పోతనను గ్రంథకర్త వీరశైవుడనియు వీరమాహేశ్వరు డనియు మరల మరల వర్ణించుటఎంత సంగతమో బుద్ధిమంతులే ఊహింతురుగాక ! ఈ శాఖా భేదముల సంగతియు మతముల సంగతియు ప్రస్తావించుట మాకు ఇష్టము కాకున్నను, అప సిద్ధాంతములు అంధ పరంపరగా ప్రచార మగుచు లోక వ్యాప్తిని నిరాఘాటముగా నందుచుండుట చేతను, ఈ గ్రంథము నందంతట నదియే విస్తారముగా కానవచ్చుచుండుట చేతను, తప్పనిసరియై ఈ ప్రస్తావము కావింపవలసి వచ్చినది.

పోతన మీది అభిమానము చేతనే యనను హేతువాదమునకు నిలవని ఊహలు గ్రంథకర్త ఎన్నో చేసినాడు. అట్టివి నవలా రచయితలకు ఒక్కొక్కప్పుడు గ్రాహ్యములు కావచ్చును గాని చరిత్రకారులకు కావు అవి పరస్పర విరుద్ధ వ్యాఘాతములతో నున్నప్పుడు ఎవరికిని గ్రాహ్యములు కావు అట్టి వానిని కొన్నిటిని క్రింద తెలుపుచున్నాను.

(1) పే. 37 ''పోతన వీరభద్ర గ్రంథ రచనా కాలమున నవే, వీరభద్రారాధనము, కొలువులు దేశమందు వ్యాప్తములై నవి.''— ఆ వెంటనే పే. 38 ''పోతన కాలమునకు కొంచెము ముందుగానే, తెలుగు దేశమున, గుంటూరు మండలమున తాడువాయి గ్రామములోను, తూర్పు గోదావరి మండలమున పట్టి సక్షేత్రమునను వీరభద్రాలయములు వెలసినవి.'' వీరభద్రారాధనము అప్పటికే వ్యాప్తిలో లేనిది ఆలయములు వెలసి యుండునా ? తెలుగు దేశమునకు మొదటి వీరభద్రాలయము ఎప్పుడు పుట్టినదో శ్రీ నిడుదవోలు వారు పరిశోధించిరా ? ఆ పైని ఇంకొకటి : పే. 38 ''ఓరుగల్లునకు పడమట నున్న 'కొలివి' యందు వీరభద్రాలయ ముండుట కూడ, పోతన వీరభద్ర విజయ కర్తృత్వ నిర్ధారణమునకు తోడ్పడుచున్నది.'' ఆ రెండింటికి కార్యకారణ భావ మెట్టిదో బోధపడుట లేదు. 'కొలివి'లో వీరభద్రాలయ ప్రతిష్ఠ ఎప్పుడు జరిగినదో గ్రంథకర్త చెప్పలేదు. పోతన నాటికే ఉన్నదన్నచో, పై వాదము మరింత బలహీన మగును. ఇదికాక వీరభద్ర విజయములో కొలివిలో వెలసిన వీరభద్రుని ప్రశంస ఉన్నదా యను ప్రశ్న పుట్టును. పోతన తర్వాతి దన్నచో, పై వాదమునకు ఆధారాభాసము కూడ అంతరించును. ఇంకను పైన ఇట్లు వ్రాసిరి. పే. 38 ''ఈ క్షేత్రములకు ప్రత్యేక క్షేత్ర మహాత్మ్యములు లేకపోయినను, పోతన వీరభద్ర విజయము వలన, వాని ప్రాభవ మినుమడించినదని చెప్పుటలో యతిశయోక్తి లేదు'' ప్రాభవ మినుమడించిన దనుటకు ఆధారమేమి ? దానికి కారణము పోతన గ్రంథ మనుటకు ఆధారమేమి ? వెంటనే ఉన్న వాక్యము చూడుడు : ''వీరభద్ర విజయ గాథ, వాఙ్మయమున ప్రచారము గాంచుట పోతన కృతి వలననే గావున, బాల్యకృతి యయ్యును ఇది వాఙ్మయ చరిత్రమున చిరప్రతిష్ఠ వడసి ప్రబంధ, యక్షగాన, శతక, గేయ రూపముల వెలసినట్లు కథాంతరమైనది.'' వీరభద్ర విజయ గాథ బహుపురాణ ప్రసిద్ధము ! దక్షాధ్వర ధ్వంసము, త్రిపుర దాహము, హాలాహల భక్షణము శివపురాణ కథలలో మిన్నటాయుమానములు. అవి ఏదో యొక రూపమున భాగవతము కూడ వదలలేక గ్రహింపవలసి వచ్చినది. వీరభద్ర విజయగాథ

ప్రచారము గాంచుటకు పోతన బాల్యకృతియే యనుట ఆస్తికులకు శివాపరాధముగా స్ఫురించును. ఆ మాటలు విన్నచో పోతన చెవులు మూసికొని యుండును. వీరభద్ర విజయము పోతన కృతమే యన్న యెడల నాతడు తన కవిత్వమునకు వీరభద్ర ప్రసాదమే కారణమని అవతారికలో నున్న మాటలు గమనింప దగినవి.

(2) భాగవత రచనకు పూర్వము చంద్రగ్రహణ సమయమున స్నానమాడ బోయిన గంగ గోదావరియే యని పలువురు విమర్శకుల వలెనే గ్రంథకర్తయు నిర్ధారణ చేసెను. భాగీరథ గంగ కాదనలేము కాని గోదావరీ గంగయే శత విధాల నై ఉండు ననుట సంభావ్యమే. కాని ఆ స్నానము చేసిన చోటు నేటి భద్రాద్రి రామాలయ మున్నచోటే అని గ్రంథకర్త ఊహించినారు. పే. 15 "గోపన్న యాలయము గట్టుటకా ప్రత్యేక స్థలమే యేల నిర్దిష్టము కావలెను ? అది పోతనకు రామభద్రుండు ప్రత్యక్షమైన చోటు ! ఇది రామభద్రుని సంకల్పమును. ఆంధ్రుల పూర్వపుణ్య పరిపాకము." ఈ ఊహ నవలాకారుడో కేవల భక్తుడో చేసిన చో ఆపాత మధురముగా నుండును. కాని ఇటువంటి గ్రంథములో సమంజసము కాదు. జాగ్రఫీ చిక్కు కూడా ఒకటున్నది. ఓరుగల్లు ప్రాంతము నుండి గోదావరీ స్నానమునకు వెళ్లువారు ఏ రేవుకు వెళ్లినను ఇవతలి దరిని స్నానము చేయుదురు కాని ప్రత్యేక కారణము లేనిది అవలి దరికి దాటి స్నానము చేసిరారు. భద్రాచల క్షేత్రము అవలి దరి నున్న దనుమాట ఉత్సాహాతిశయములో స్ఫురణకు రాలేదేమో ! అప్పటికే భద్రాద్రి రామాలయ మున్నదన్నచో గంగ దాటుటకు పోతనకు కారణముండును. అది యవతారికలో చెప్పి యుండును. మరి పోతన "గంగ కద్దరి వేలిద్దరి కీడునుం గలదు" అని విశ్వసించినవాడా ?

(3) పే. 17: "శ్రీరామ భక్తుడగు పోతన భాస్కర రామాయణము నెఱిగి యున్నట్లుగా నందలి యనుసరణములే గాక 'భాస్కరుండు బరగెను గాని రామాయణమును బెండ్లిక్కింపనా' పోతన ప్రతిజ్ఞయు దెలుపుచున్నది" అని వ్రాసిరి. పోతన ఈ ప్రతిజ్ఞ ఎక్కడ చేసినాడు ? తన యల్పత్వమును అహంభావమును పోతన కంటగట్టిన మిథ్యా కథకుల మాటలు శిలాశాసన వాక్యము లైనట్లు ప్రతిజ్ఞగా పేర్కొనుట పోతన వ్యక్తిత్వమును గౌరవించుట కానేరదు. పోతన నాటికున్నది ఒక్క భాస్కర రామాయణమే కాదు. ఎఱ్ఱయ రామాయణము తిక్కన ఉత్తర రామాయణము కూడా ఉన్నది. "ఒకరన్ సన్నయు తిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్ తెనుగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో తెనుగుం జేయరు మున్ను భాగవతమున్" అని వినీతుడై వ్రాసిన పోతనకు పై మాట అంటగట్టుట ఎంత యనుచితమో గ్రంథకర్త దూరమాలోచించినట్లు లేదు. కవిత్రయములోని ఎఱ్ఱయ రామాయణము కూడా పోగా, నేటికిని ప్రధానముగా ఆంధ్రుల కభిమానపాత్ర మైనది - భాస్కర రామాయణమే అనుమాట మరవరాదు. పోతనను ప్రత్యేకముగా 'శ్రీ రామభక్తు'డని నిర్దేశించుటయు సరికాదని భాగవతావతారికాదుల వలన స్పష్టపడును.

(4) పే. 123 "శ్రీ కృష్ణ గోపికా శృంగారలీలా ప్రదర్శనమున పోతన ప్రదర్శించిన లోకోత్తర ప్రతిభ, భక్తి తత్త్వము, వంగ దేశమున చైతన్యస్వామి ప్రతిపాదించిన మధుర భక్తి భావమునకు నాధారమైనది." చైతన్యస్వామి పోతన కించుక తర్వాతి వాడు. ఆయన ఆంధ్రదేశములో గూడ సంచారము చేసెను. అప్పుడు పోతన భాగవతమును శ్రవణ మొనర్చి ప్రభావితు డైనట్లును, అంతకుముందా భావము లాయనకు లేనట్లును ఏదో కొంత యాధారమైన జూపనిది పై నుదాహరించిన వాక్యమునకు విలువ యుండదు. ఇట్టి ప్రయత్నమైనను గ్రంథకర్త చేయలేదు !

ఇక గ్రంథ రచనలో ఎన్నో భాగములలో ఊరకే అనవసరముగా గ్రంథము పెరిగినది. ముఖ్యముగా పద్యములుదాహరించుటలో గ్రంథము విపరీతముగా పెరిగినది. ప్రత్యేకముగా అనవసరముగా పెంపుదలయైన భాగములు కొన్ని యుదాహరింతుము.

(1) భోగినీ దండకము సంగతి 3½ పేజీలలో వ్రాసినారు. పే. 48—51. ఆ భాగములో ఇంకను అన్ని పేజీలున్నను అనవసర మనలేము. కాని ఆ పిమ్మట పే. 52 "భోగినీ దండకము నాందిగా వాఙ్మయమున వెలసిన కొన్ని శృంగార దండకములను పేర్కొనుట యప్రస్తుతము కాదు." అని ప్రారంభించి వానిని పేర్కొని యూరకొనక రెండు పేజీలు ఉదాహరణలతో నింపుట అప్రస్తుతమే.

(2) పే. 163—188 ఇతర కవికృత స్కంధములు అని 11వ ప్రకరణమున్నది. అతి కఠినముగా విచారించినచో ఈ ప్రకరణమే అనవసర మనవచ్చును. కాని కొంత సంబంధమున్నది కనుక ప్రకరణము చేర్చుట సమంజసమే. కాని అంతయు క్లుప్తముగా చెప్పవలసినది. వాని భాషాంతరీకరణ విధానములు తెలుపుటకు మూలము, వ్యాఖ్యానము, తెలుగు ఉదాహరించుకుని పోవుట యనవసరము. ఇక నా సందర్భములో 'కవుల షష్ఠము లేక శృంగార షష్ఠము' అను శీర్షిక క్రింద రావముల్లువారి షష్ఠము అను నామాంతరము గలదానిని ప్రస్తావించి "ఆ గ్రంథము మనకు పూర్తిగ లభించలేదు గాని లాక్షణికు లుదాహరించిన పద్యములను బట్టి చూడగా నిందలి కవితా రచన యత్యంత రసోల్లసితమైన దని చెప్పవచ్చును. వారుదాహరించిన పద్యము లన్నిటిని నిందుతో పఱచుచున్నాము" అని వ్రాసి వరుసగా 3 పేజీలపై చిలుకు పూర్ణాపూర్ణ పద్యములతో నింపుట యనవసరము. గ్రంథకర్త శ్రమపడి పరిశోధించిన దంతయు నిక్కడ ప్రస్తుతము కాదు. ఆ పిమ్మట

నేటి కాలమున శ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారి వరకు భాగవత భాగములు వ్రాసిన వారి వివరములు తెలుపుకొని పోవుట కూడ వృథా విడంబనమే !

(3) పోతన యనుసరించిన పూర్వకవులు అను 10 వ ప్రకరణములో 20 పేజీలు ఉదాహరణ పద్యములు కలవు. అందులో కొంతవరకైనను అనుసరమే కాని పే. 153 నుండి 162 వరకు పోతన ననుసరించిన కవుల నుదాహరించుట యనవసరము. పోతన తర్వాత పోతనచే ప్రభావితుడు కాని ఆంధ్రకవి ఉన్నాడా ?

(4) శ్రీనాథ పోతనలు— భక్తి మాహాత్మ్య కథలు అను 9వ ప్రకరణములో ఆ కథలు సత్యములని నమ్మినట్లే గ్రంథకర్త వ్రాసినట్లు తోచును. ఇతర కవుల స్వప్నాదులను బహుతర తీక్ష్ణ హేతువు తో విచారణ చేసెడి శ్రీ నిడుదవోలు వారు ఈ కథను ప్రసిద్ధిని బట్టి తెలుపుచున్నాని వ్రాసి ఊరుకొనక నిజములని నమ్మినట్లు ఏల వ్రాసిరో తెలియదు. తక్కిన వాని సంగతి యెట్లున్నను ''బాల రసాల సాల నవ పల్లవ కోమల కావ్య కన్యకన్'' అను ప్రసిద్ధ పద్యము అంతకు ముందెన్నడో మంచెన రచించిన కేయూర బాహు చరిత్రము లోని దని యైన చెప్పకపోవుటే కాక, దానిని బట్టి పోతన హాలికుడే యైనట్లు అంగీకరించి ప్రకరణము వ్రాయుట అనవసరపు పెంపుదలయే !

(5) అనుబంధము 192—198లో పోతన భాగవత మాహాత్మ్యమును తెలుపున దను 'సాక్షి' వ్యాసము కేవల మనవసరము. ఈ మధ్య 'భక్త పోతన' వెండితెర కథ కూడా ఈ పద్ధతిన వ్రాసి యుండవచ్చును.

(6) 2 వ అనుబంధము పోతనను స్తుతించిన కవులు అని 198—214 వరకు సింగన షష్ఠస్కంధము నుండి నిడుదవోలు వేంకటరావు వరకు 77 మంది (ఎక్కువ మంది అనామక కవులు) కవుల పద్యములుదాహరించుట యనవసరము పోతనను స్తుతింపని కవి యరుదు కనుక ప్రతి యూరిలోను వదుల వందలు పద్యములు దొరుకును.

ఈ విధముగా నిర్ణీతమైన పుటలు నింపుటకు గ్రంథము పెంచినారేమో యను సందేహము కలుగవచ్చును కాని యది సత్యము కాదు. ముఖ్యముగా పెరుగదగిన భాగములు కొన్ని అతిగా సంకోచము చేయబడినవి. ఈ క్రిందివి అందుకు కొన్ని యుదాహరణములు :

(1) 'భాగవతాదర్శము— ఉపాఖ్యానములు' అను చివరి ప్రకరణము రెండు పేజీలపైన ఐదు పంక్తులే ఉన్నది. ఉపాఖ్యాన విషయములు 8 శీర్షికల క్రింద టెలిగ్రాపు భాషలో సంకోచింప బడినవి.

(2) 'పోతన యవతరణ' అను 3 వ ప్రకరణములో 'దేశకాల మత పరిస్థితులు' అను శీర్షిక క్రింద వీరశైవులకు విష్ణు ద్వేషము లేదను వాదమునకే ప్రాధాన్య మిచ్చిరి కాని ఆ కాలపు రాజకీయ పరిస్థితులు కాని సాంఘిక పరిస్థితులు కాని తుదకు మత పరిస్థితులు కాని విపులముగా వర్ణింప లేదు.

(3) పోతన తర్వాత ఆయన వంశములో పలువురు కవులున్నారు. అనుబంధములో పోతనకు స్తుతించిన కవులలో కేసన మల్లనలు అని శీర్షిక క్రింద రెండు పేజీలు పోతన వంశీయులను గూర్చి తెలిపిరి. నేడు బమ్మెరలో పోతన వంశస్థులమని చెప్పుకొనువారు గొప్ప భూస్థితి గలవారై 'దొరలు' అను వ్యవహారమున నున్నారనియు, వారి ఇప్పటి ఇంటి పేరు నెల్లూట్ల వారనియు, వారి పూర్వులు వైష్ణవము పుచ్చుకొని రనియు 'బమ్మెర పోతన' అను వందపేజీల గ్రంథములో అయ్యంకి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తెలిపినారు. ఆ విషయము లెందువల్లనో గ్రంథకర్త ప్రస్తావింపలేదు. 'బమ్మెరలో పోతన భాగవతము రచించినప్పటి చిహ్నముల గూడ వారు చూపెదరు. బమ్మెరలో నుండు చెఱువొకటి పోతన తల్లియగు లక్కాంబ పేర లక్కమ్మ చెఱువని పేర్కొనబడుచున్నదట'' అనియు శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. పై విషయములు బమ్మెర వెళ్లినచో తెలిసి యుండును గదా ! పై వాక్యములు నిజమైనచో పోతన దారిద్ర్యముతో బాధపడె ననుకథలు బండారము కూడ తేలిపోయెడిది. పోతన తల్లి లక్కాంబ 'విరాగణ కరణలు విడువదు' అనియు నివారిత దీన మానవ గ్లాని' అనియు 'దాన ధర్మమతి' అనియు, తండ్రి 'కేసన దాన మాన నీతిఘనుడు' అనియు పోతన చేసిన వర్ణనను బట్టి పోతన కుటుంబము అన్న వస్త్రముల కెంత మాత్రము లోపము లేని సంపన్న కుటుంబ మనిపించును.

మరి రెండు విషయములు ప్రస్తావించి ముగింతును !

వైరి సమాసములు, వలపల గిలక ప్రాసలు, ద్వ్యర్థకేకార సంధులు ఇత్యాదులు ఒక్క శివకవుల సొమ్మే యట్లు అది శివకవి సంప్రదాయ మని, దానిని పోతన యనుసరించె నని గ్రంథకర్త పలుచోట్ల సూచించినారు. ఆ స్వాతంత్ర్యము నన్నయ నుండి నేటివరకు వారి వారి పాండిత్యములకు అభిరుచులకు తగినట్లుగా కొద్దిగానో గొప్పగానో కవులందరు నవలంబించుచునే యున్నారు. అదేమియు శివకవుల ప్రత్యేక లక్షణము కాదు.

గ్రంథ రచన కుపక్రమించినప్పుడు గ్రంథకర్త ప్రణాళిక ఏర్పరచుకున్నప్పటి శ్రద్ధ చివరలో చూపలేదనుటకు 'పోతన కవితా లక్షణములు' అను 7వ ప్రకరణము బలమైన దర్శనము. అందులో ముందు ఒక పట్టికగా 1. మంజుల మధుర ధారాశుద్ధి 2. ప్రసన్న గంభీరత 3. సుకుమార మాధుర్య పద సంపద 4. రసోద్దీపకత 5. అన్వయ సౌలభ్యము 6. శయ్యా సౌభాగ్యము 7. శబ్దాలంకార వైచిత్రి 8. సహజ మనోహరత 9. భక్తి భావనా బంధురత అని 'నవ విధ భక్తి మార్గముల నవరీతులు గల కవితా రచన నవలంబించి యున్నాడు' అని

ఉపక్రమించిరి. ఈ విషయముగా చెప్పుకొని వెయునచో తొమ్మి దింటితో నాగునా అను ప్రశ్న మేము వేయుట లేదు. ఆ ప్రకరణ ముతో సగసగాలో వైమిత్తమా గాదనో ఈ తొమ్మిది లక్షణ ముల వివరణము నుండుట క్రమ పద్ధతి. ప్రకరణములో అదే లేకపోగా ఇతరము లేవేవో ఉండుట బుద్ధిమంతులైన పాఠకులను చకితుల నొనర్చును. ఇక ఆ వ్రాసిన దానిలో కవిత్రయము వారి శైలికిని పోతన శైలికిని భేదములు కనిపించుచున్నవని జాబితాగా ఏడింటి నిచ్చిరి. వానిలో మూడిం టిని మాత్ర ముదాహరింతుము :

| | |
|---|---|
| ''కవిత్రయము | పోతన |
| 3. ఆంధ్ర పద బాహుళ్యము | సంస్కృత పద బాహుళ్యము |
| 6. పదవాక్య సౌష్ఠవము | రసోచిత రచనా వైఖరి |
| 7. అర్థ సారస్యము | రస సౌభాగ్యము.'' |

పై భేదముల ఔచిత్యము వేరుగా వివరింప నక్కర లేదు. గ్రంథకర్త 'పోతన'ను గూర్చి వ్రాయుచున్నారు కనుక, కవిత్రయము వారి కవిత పద వాక్యముల కూర్పు అర్థ సౌష్ఠవ ముతో నాగిపోగా, పోతన మాత్రమే రసస్థాయి నందుకొన్నా డని తెలుపుచున్నది. ఏ వ్రతమును గూర్చి చెప్పినను చిల్లర పురాణములు అదియే 'వ్రతానా ముత్తమా వ్రతమ్' అని చెప్పు చుండు స్థాయిలోనికి దిగజారినది. పోతనయందు మనకెంత భక్తియున్నను, కవిత్రయముతో పోల్చుచున్నామను జాగ రూకత యక్కర లేదా ? ఇది చదివిన ఇతర రాష్ట్రముల పాఠకులకు కవిత్రయముపై నెట్టి యభిప్రాయము కలు గునో అనియైన ఆలోచింప నక్కర లేదా ?

ఏ విధముగా చూచినను ఈ గ్రంథము ఉద్దిష్ట ప్రయోజనమును సాధించు స్థాయిలో లేదని చెప్పవలసి వందుకు విచార పడుచున్నాము.

ఇక ప్రచురణ కర్తలకు సంబంధించిన దొక్కటి తెలిపి ముగింతుము. అది అచ్చు తప్పులను గూర్చినది. మధ్య కాలములో వచ్చిన మజిలీ పుస్తకముల అచ్చు తప్పులతో సమాన స్థాయిని ఇందులోని తప్పులు కొంచెము హెచ్చు తగ్గుగా అందుకొన్నవి. స్పేసింగు అనవసరమైన చోట్ల ఉండి అవసరమైన చోట్ల నుండదు. వత్తులు తరుచుగా వదలి వేయబడినవి. అందులో ముఖ్యముగా తవత్తు టవత్తు గానే తరుచుగా ఉన్నది. సంస్కృత శ్లోకములలో తప్పులు లెక్కలేనన్ని యున్నవి. ఈ మాట అతిశయోక్తులుగా పాఠకు లకు తోచునేమో యని రెండు ఉదాహరణములు మాత్రము క్రింద నిచ్చుచున్నాము :

పే. 175: తల్లి దండ్రియు దైవంబుఁ దలఁప గురుఁడ
కాదె యుఁడఁ డేమి చేసినఁ గసల నగునె ?

పై రెండు పంక్తులలో ఆరు స్పేసింగు తప్పులు.

పే. 178 :

| తప్పు | ఒప్పు |
|---|---|
| పం. 5 పరీక్షత్తు | క్షి |
| '' 8 బహు సమర్థతో | సమర్థతతో, |
| '' 9 నీలకంఠస్తన ప్రశంస | స్తవ |
| '' 12 వైవస్వమను | వైవస్వతమను |
| '' 19 స్వపిత్రాణాం | స్వపిత్ర్యాణాం |

పై 178 పేజీ వానిలో అచ్చు సరిగా అంటక సందే హాస్పదములుగా నున్న తప్పులును, స్పేసింగు తప్పులును వదిలి వేసి సరిగ చూపినాను



# తెలుగు ఛందస్సు ఎలాగ ఏర్పడి ఉంటుంది?

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

నన్నయగారికి ముందే చిరకాలమునుంచీ తెనుగులో పద్యాలు వ్రాసే సాంప్రదాయ ముండినది. రగడలూ, తరువోజలూ సీసపద్యాలూ, ఆయనకు పూర్వముండిన శాసనాలలో గోచరిస్తున్నాయి. ఆయన కన్నడకావ్యాల్ని ఎరిగినవాడు కనక వాటిలోని పద్యరీతుల్ని తెలుగులోకి తెచ్చి, సంస్కృతవృత్తాల్ని స్వీకరించీ, తెలుగు జాతీయ ఛందస్సులను ఇంచుకంత సంస్కరించీ, మొత్తంగా చాలా వైవిధ్యముండేటట్లు "ఆదికావ్య" రచన చేశారు. తెలుగు కవులు— కొందరెవరో ద్విపదలలో రచించినా—మొత్తమ్మీద అందరూ ఆ పద్యాలలోనే తమ రచనలు చేశారూ, కావ్యాలు పద్యాలలోనే ఉండాలి అన్న— ఎవరూ వ్రాసిపెట్టని —నియమము అమలులోకి వచ్చేసింది. సంస్కృత వృత్తాలలో లేని యతిప్రాస నియమాలు తెలుగులో ప్రవేశించాయీ, ఆ వృత్తాలలో ఉన్న విరామము తెలుగులో మాయమైంది. అన్ని నియమాలకూ లోబడి కవులు కావ్య రచన చేశారూ, ఈ నియమ వ్యతిక్రమము జరిగిన చోట్ల విమర్శకులు కవులను దుయ్యబట్టారు. ఛందో నియమాలు దేవదత్తములే అనేటంత పట్టుదల ఉంది ఈనాటి విద్యావంతులలో. ఆధునికులు వచన పద్యాలు వ్రాస్తుంటే ఉపేక్షించడమే కాకుండా అవి అరాజకపు వ్రాతలనీ సభాముఖాన్ని వినిపించరానివనీ వెక్కిరిస్తున్నారు కూడాను పద్య రచయితలు. పూర్వము కూడా పద్యాలలో కాక ద్విపదంలో కావ్యాలు వ్రాసిన వారిని 'ముది విటులు, విధవ లంజలు' తో జతచేసి ఆక్షేపించారు పెద్ద పెద్ద కవులు. అంత ఉన్నత స్థాయిలో ఉంచి మనవారు గౌరవిస్తున్న ఛందస్సు ఏ రీతిగా ఏర్పడి ఉంటుంది? అనే జిజ్ఞాసతో ఎక్కువగా వాడుకలో ఉన్న పద్యరీతులను పరిశీలించినాను 'అంతర సాక్ష్యము దొరుకుతుంది గదా' అని. 'పద్యాలు కూడా పాటలు ఉపయోగించే అవృతాలనే ఉపయోగించుకున్నాయి' అన్న అనుమానాని ( inference )కి వచ్చాను. జూన్ నెల భారతిలోని నా "కవిత్వములో ఛందస్సు ఉండి తీరాలా" అన్న వ్యాసములో ఈ సత్యమును సూచించే ఉండినాను.

బాహ్య సాక్ష్యము కోసము డాక్టరు గిడుగు సీతాపతి గారి 'తెలుగులో ఛందో రీతులు' అన్న గ్రంథమును చూచినాను. దాన లభించిన వస్తు విది : (తెలుగు) వృత్తములలో అక్షర సంఖ్యా నియమము ప్రధానమయినది. జాతులలో (గణ నియమమే కాని) అక్షర సంఖ్యా నియమము లేదు. అక్షరములు ఒకటి మొదలు 26 వరకును (నాలుగు పాదములలోనూ) గలిగిన (వృత్తముల) వి 26 ఛందములు గలవు. మొదటి ఛందములో ఒక గురువు కానీ ఒక లఘువు కానీ ఉంటుంది ఒక్కొక్క పాదములో. కనుక మొదటి ఛందములో రెండు వేర్వేరు వృత్తాలుండ గలవు. రెండో ఛందములో ప్రతి పాదమునకూ ఉండవలసిన రెండు అక్షరముల కూర్పులో మొత్తము నాలుగు భేదాలు (గగ, గల, లగ, లలములు) ఏర్పడ గలవు. కనుక రెండో ఛందములో నాలుగు సమవృత్త (భేద) ములుండగలవు. ఈరీతిగా 3, 4, 5 .... 26 అక్షరములు గల వృత్తభేదములన్నీ లెక్కవేస్తే అవి మొత్తము 134217726 గా తేలాయి. వృత్తములకు చివరి అక్షరము గురువు గానే ఉండవలెనన్న నియమమువల్ల ఇవి పై సంఖ్యలో సగము అనగా

67108863 అవుతాయి. మనకు పరిచితములైన 'మదన విలసితము, విద్యున్మాలా, ఉపేంద్రవజ్రము=తోటకము, స్రగ్విణి భుజంగప్రయాతము, మాలిని, పంచ చామరము, శిఖరిణి=మందాక్రాంత, మత్తకోకిల, శార్దూల విక్రీడితము, మత్తేభ విక్రీడితము=ఉత్పలమాల, చంపకమాల=స్రగ్ధర, మహాస్రగ్ధర, కవిరాజ విరాజితము, మంగళ మహాశ్రీ, వృత్తాలు వరుసగా 7, 8, 11, 12, 15, 16, 17, 18, 19, 20, 21, 22, 23, 26 ఛందస్సులలోని వృత్తభేదములు.''

ఏతావాతా, 67108863 సాధ్య వృత్తములలో మనకు పరిచితములైన కొద్ది వృత్తాలే ఈనాటికి నిలిచినవి. చిత్రకవి పెద్దన 263 గురించి చెప్పగా అప్పకవి 227 చెప్పినాడట (వడ్లమూడివారి 'పరిచయము'.) ఈ వృత్తముల సమగ్ర లక్ష్య లక్షణ నామకరణ విచారమును డాక్టరు సీతాపతిగారి* వంటి పండితులకే వదలి మనము ప్రస్తుతము ఛందోపావిత్ర్యమును గురించి ఆలోచిద్దాము. నేను మొదటలో చెప్పిన అంతర సాక్ష్యాన్నీ బాహ్య సాక్ష్యాన్నీ జతచేసి తర్కిస్తే ''లెక్కకు సాధ్యమైన ఆరుకోట్ల డెబ్బయి లక్షల వృత్తాలలోనూ కవులకు సుమారు యాభయి వరసలే స్వీకారము లైనవి'' అన్న తీర్మాన మేర్పడుతుంది. ఈ యాభయ్యీ, ఏ సుగుణము వల్ల ఎంచుకోబడ్డవి అంటే, ''వాటిలో లయ స్ఫుటముగా ఉండుట వల్ల'' అని జవాబు వస్తున్న దంటున్నాను; సీతాపతిగారు చెప్పనే చెప్పినారు : ''త్ర్యస్ర గతిలో నున్నవి; పంచచామరము, సుగంధి, ఉత్సాహ, తరళ, తరలి; చతురస్ర లోనివి, పాదప, తోటక, రమణక, మానిని, కవిరాజ విరాజిత, మలయజ, స్రగ్వి, లాక్షణి, స్వాగత, వంశస్థ, విద్యున్మాల, క్రౌంచ పదమూ; ఖండ గతిలో నున్నవి, స్రగ్విణి, భుజంగ ప్రయాత, వనమయూరము, వసంత తిలక, మంగళ మహాశ్రీ; మిశ్రగతి లోనివి మత్తకోకిల, ధ్రువకోకిల'', అని. ఇక మిగిలిన వాటిలో కందము చతురస్రగతిదీ, ఉత్పలమాల, చంపకమాల, ప్రభు, వృత్తాలు చతురస్రగతి లోనివి. ద్విపద, తరువోజ, సీసము, లయవిభాతి, లయగ్రాహి ఖండగతివి. గీతము రెండు త్ర్యస్ర—, రెండు ఖండ—, మళ్లీ రెండు త్ర్యస్ర—, మాత్రాగణాల మిశ్రమము కాగా, అటవెలది మూడు త్ర్యస్ర—, రెండు ఖండ— ఆ వృతాల మిశ్రమమైంది. ఈ పద్యాలకు వాడుటకు వీలున్న గణములు ఇన్ని ఈ టీకవు వింగడింపులకు లొంగివచ్చేటంత అనుకూలములు కావు కాని నలములకు బదులు అయిదు మాత్రల గణాలు వాడినవే అటవెలదీ, తేటగీతీ, సీసమూ సరిగా నడచునని అందరూ ఎరిగిన విషయమే. కనుక ఆ పద్యాలలో నలములు పట్టువు కక్కూర్తికి వేస్తే లయ కుంటునడుతుంది. పద్యాల్ని పాడినప్పుడు మాత్రానియమము ఎగిరిపోతుంది కనక ఆ గొడవే అక్కర లేదు పద్య గాయకులకు. ప్రతీ పద్యాన్నీ దాని నడక స్ఫురించే రీతిగా చదివినప్పుడే ఈ గతులు నిలిచో, తెగిపోయో స్ఫురిస్తాయి.

ఏతా వాతా, పరిచిత గతులు గర్భీకృతము చేసుకున్న ఛందోరీతులే తరచు వాడుతున్నారు కవులు. ఈ గతులు, పాటలలో స్ఫురించే సమయమే ప్రాణముగా గలట్టివి. మరి పద్య ఛందస్సు అవతరించి సాధించిన ఘనకార్య మేమిటి ? అని. ఆ లయను క్లిష్టమూ, కష్టమూ చేసింది. ఎలాగా ? అంటారా, మనవి చేస్తున్నా.

శార్దూల విక్రీడితము చూడండి సంస్కృతానిది :<br>
బర్హోత్తంస విలాసి కున్తల భరం<br>
మాధుర్య మగ్నాననం

అన్నది ఒక పాదం. యతి దగ్గర విరామం ఉంటుంది సంస్కృతంలో. దీని లయ—నడక—పూర్వార్ధంలో క్లిష్టము. రెండో భాగములో రెండు అయిదు మాత్రల గణాలూ, ఒక గురువూ తెలుస్తున్నాయి. పాదాంతమందు మూడు మాత్రల కాలం ఆగవచ్చును మూడో అయిదు మాత్రల గణానికి. మొదటి భాగంలో చతురస్రగతిలో నాలుగు ఆవృతాలు దాటి ఒక్క గురువున్నది. ఇంకొక్క రెండు మాత్రల కాల విరామంతో అయిదు ఆవృతాలౌతాయి. చివర పూర్ణానుస్వార మున్నది కనుక రెండు మాత్రల కాలమూ ఆగడము అనుకూలమే. దీన్ని తెలుగులోకి తెచ్చుకుని, విరామం ఎగగొట్టి, పాదాంతమందేనా విరతి లేకుండా తరిమితే దీని గతి దుర్గతి కాక వేరేమి కాగలదు? సీతాపతిగారు తెలుగు శార్దూలాన్ని విశ్లేషించి యతిని చతురస్ర గణము లోపల టూర్చినారు. దాని పూర్తిగా చతురస్ర గతియే సిద్ధించినది. ''లయ (ఏదయితేనేం?) గుప్తముగా.. ఉన్నదని'' వారూ తేల్చినారు. లయ లేని పద్యాలను ఎవరూ వ్రాయలేకపోవడముతో అవిలోపించి పోయినవి. 'మహాస్రగ్ధర' పేరుగొప్ప కోసమే కాక పోతే దానిని వ్రాసినవారు కొద్దిమందీ మూసివేసి ఉందురు.

కనుక తెలుగు పద్య ఛందస్సు కవిత్వములు—వాల్మీకి శోకాన్ని లాగ—విశ్లేషిస్తే వచ్చినట్టిది కాదు. అంటే సహజము కాదు; కృతకమే కనుక ఇది అనివార్యము కాదు. అయితే, కృతకముకాని ఛందస్సు ఎక్కడేనా ఉన్నదా అని అడుగుతారు పాఠకులు. ఛందస్సు ఒకటి నడపున్నదన్న స్ఫురణ వదు

* పద్య భేదములను గురించి వారు ''1919 నుండి'' శ్రమిస్తున్నారు. పూర్తి చేసిన గౌరవము వారికి దక్కుటే న్యాయము.

వరికి కలగకుండా ఏ ఛందస్సులో రాసినా అది సహజమే. ఇక్కడ ఒక్క మాట. త్యాగరాజు ''ఎంత నేర్చినా ఎంత జూచినా, కాంత దాసులే'' అన్న పల్లవిని విని చకితులైనవా రందరూ, ఆ తరువాతి ''సంతతంబు శ్రీ కాంత స్వాంత సిద్ధాంతమైన మార్గ చింతలేని వారెంత నేర్చినా'' అని వినగానే'' ''అయితే ఫరవాలేద''ను కున్నట్టుగా, పద్యాలు రచించే వారందరూ చక్కగానే వ్రాస్తున్నామనుకుంటారు. ఎవరి పద్యాల్లోనైనా కేవల ఛందోస్ఫురణ అక్కడక్కడ కలుగుతుంది. కనుకనే అన్నాను పద్యమే కృతకమని. వేమన్నకు ఆటవెలది, ధూర్జటికి వృత్తమూ శ్రీనాథుడికి సీసమూ చాలా మట్టుకు సహజాలు. వాటిల్లో వారి రచన మొత్తం మీద ఛందస్సు కట్లకు లోనైనట్లు కానరాదు. అయితే వారికీ అన్ని పద్యాలూ సహజంగా కుదరవు. ఉమాకాన్తంగారన్న ఛందో వ్యతిక్రమాలూ భాషా వ్యతిక్రమాలు కట్టుబాట్ల వల్లనే కలుగుతాయి. కనుక 'ఈ ఛందస్సు' లో వ్రాయాలనీ ఈ వృత్తాల్లోనే పూర్తిచెయ్యాలనీ ఉద్యమించకండి. మీ భావాలు చదువరికి చక్కగా అందేటట్లు వ్రాయండి అంటున్నాను.

నాలుగు 'ర' గణాలు చేర్చితే స్రగ్విణి, అవే 'య' గణాలైతే భుజంగప్రయాతమూ, 'భ' గణాలైతే పాదపమూ (దీనితో చివరి లఘువులు రెండూ గురువైనాయి), 'స'గణాలైతే తోటకమూ, 'న' గణాలైతే తరళమూ, నలములైతే రమణకమూ, ఏర్పడుతున్నాయి. అదొకటీ ఇదొకటీ అదొకటీ ఇదొకటీ చొప్పున చేర్చితే తరలి, మలయజ, సార్వీ, లయ విభాతి ఏర్పడుతున్నాయి. ఇలాగ సామాన్య గణాల్ని పేర్చి కృతకంగా నిర్మించినట్టిదే గాని ఛందస్సూ, కవితా రచనలు చాలా చాలా రచించిన తర్వాత, ''ఇంచక్కగా కుదిరేయే ఇవేమిటీ ?'' అని విశ్లేషించుకున్నట్టిది కాదు. అలాగ జరిగి ఉంటే ప్రకృతి సిద్ధమైన వరసలు కొన్నయినా సిద్ధించి ఉండును. ఇప్పుడు జరిగిన దేమిటి—? పాటల వరసలో వాడుతున్న వాటినే రెండు ఆ వృతాలలోని సమీపాక్షరాలను అతికి గురువు చేసి (ఉత్పలమాలలో రెండో నాలుగు మాత్రల గణాన్నీ మూడో నాలుగు మాత్రల గణాన్నీ గురువుగా అతికినట్లు) ఆ వృత్తాల్ని అతికి పద్య వరస చేశారు. సరిగ్గా ఇలాగే ఉన్న మరో వరసని చంపకమాల అన్నారు. ఇలాగ ఆవృతాల సరాలకు వేర్వేరు పేర్లు పెట్టి, యతిప్రాసల్ని తగిలించారు. ఈ ఛందస్సు అనివార్యము ఎందుకొత్తుంది ? కానే కాదు.

ఛందస్సుకి శాస్త్రసిద్ధమైన నిర్మాణ మున్నది గదా, దానిని కృతక మనుటేలా ? అని అనుమానిస్తారు పాఠకులు. ఆ నిర్మాణపు లెక్కని ఈ వ్యాసములోని మొదటి నాలుగు అక్షరాలూ ఒక వృత్తము. తర్వాతి రెండు రెండు అక్షరాలూ (నాలుగు రెండ్లు) ఒక వృత్తము. మూడు మూడు ఇంకొక వృత్తము. నాలుగు నాలుగులూ, నాలుగు అయిదులూ, నాలుగు ఆరులూ, ఇలాగ నాలుగు ఇరవైయార్లు వరకూ 26 ఛందస్సులకూ ఉదాహరణలైన ఇరవైయారు వృత్తాలు ! చివరి అక్షరాలు దీర్ఘాలు చెయ్యడమూ, యతులు కుదర్చడమూ కష్టమేమీ కాదు లెండి. పనికిరానంత విశాలముగా ఉంది ఛందశ్శాస్త్రము. సీతాపతిగారు పట్టిన సీస భేదములూ, కంద భేదములూ ఇతర పద్యాల అవతారములూ అన్నీ చేర్చి ఛందస్సు చెప్పే 134217726 లో ఎన్నవ వంతో! ఇంకా చాలా మిగిలి ఉంది పరిశోధన !

'కవిత్వానికి ఏదో వరస ఉండి తీరాలి' అంటున్నారు కొందరు. ఆ వరస యేదో కవికి వదిలేయండి. వరస అక్కరలేదనుకుని కవి వచన పద్యాలు రచిస్తే ఏదో నేరము జరిగినట్లు 'పొలికేక'లు పెట్టడమేలా ? కవే ఎంచుకుంటాడు కావలసిన వరసని. మీస్కేలు బద్దలూ ప్రొట్రాక్టరులూ పట్టుకుని తిర్ప బోతారెందుకూ అతని సృష్టిని ? అది బాగుండకపోతే బాగులేని రచనలకూపంలో పడిపోతుంది, బాగుంటేనే నిలుస్తుంది.

## అకాడమీ బహుమతులు: శ్రీ విలాయత్ ఖాన్ విమర్శ

ప్రముఖ సితార్ విద్వాంసుడు ఉస్తాద్ విలాయత్‌ఖాన్ కేంద్ర సంగీత నాటక అకాడమీవారు తనకివ్వజూపిన బహుమతిని తిరస్కరించారు. ఇందుకు కారణాలను ఆయన వివరిస్తూ ఈ బహుమతులు ఇవ్వడానికి నిర్ణయాలు జరుగుతున్న తీరు సవ్యంగా లేదనే విషయం ప్రజలదృష్టికి, ప్రభుత్వం దృష్టికి తీసుకరావాలని, కావాలనే బహుమతి స్వీకరణకు తాను నిరాకరించినట్లు తెలియ జేశారు.

ఈ బహుమతుల నిర్ణయ పద్ధతి పూర్తిగా మారిపోవాలని, అలా జరిగినప్పుడే అకాడమీ నిర్ణయాలు ప్రజల యొక్క కళాకారులయొక్క మన్ననలు పొందగలవనికూడా శ్రీ విలాయత్ ఖాన్ స్పష్టం చేశారు. అకాడమీ నిర్ణయాలు కళాకారుని ప్రతిభనుబట్టి, సూత్రబద్ధంగా కాకుండా నిరంకుశంగా జరుగుతున్నాయని అంటూ తనకు బహుమతి ఇవ్వాలని ఏ పరీక్ష లేదా సూత్రాల ప్రకారం నిర్ణయించారో తెలియ జేయమని అకాడమీ వారికి లేఖ వ్రాసినా, దానికి స్పష్టమైన సమాధానం రాలేదన్నారు. అందువల్లనే బహుమతిని తిరస్కరిస్తున్నట్లు మరొక లేఖ వ్రాశానని కూడా తెల్పారు.

# తిక్కన రచనా కాలము

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

నేను అగస్టునెల 'భారతి' లో వ్రాసిన విషయములలో తిక్కన రచనా కాలమును గుఱించి శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు సెప్టెంబరు భారతిలో కొన్ని సంశయములను లేవనెత్తి వానికి నివృత్తి కోరిరి. వెంటనే వ్రాయుటకు ప్రారంభింపగా ఏవేవో నూతనాంశములు స్ఫురింపసాగినవి. మరల నొకమారు ఆయా శాసనములను చూచుకొని ఇదే శ్రీ రెడ్డిగారికి సమాధానము వ్రాయుచున్నాను.

(1) విజయాదిత్యుడు విజయగండ గోపాలుడు.

'అల్లుందిక్క' లేక అల్లు తిరుకాళదేవ మహారాజునకు తమ్ముడు విజయాదిత్య మహారాజని నెల్లూరి శాసనములలో కనబడినందున, విజయాదిత్య గండగోపాలు డితడే యనియు, వీరిరువురునే 'తిక్కన బయ్యనలు' గా నుండరేమో యనియు నేను ప్రతిపాదించిన దానిని ఆక్షేపించి శ్రీ రెడ్డిగారు 'అప్పటికిని తలంప వీలులేదని కందుకూరు తాలూకా పెంట్రాల శిలాశాసనము (నెల్లూరు శాసనములు, కందుకూరు 62) శాసించుచున్నది' అని వ్రాసి ఆ శాసనము నుండి 'శ్రీ మన్మహా మండలేశ్వర ఇమ్మడి గండ గోపాళ విజయాదిత్య మహారాజులకు రాజ్యాభివృద్ధి ....' (సం 2 పు. 60) అని ఉదహరించినారు.

'వీడు వాడే' అని శాసనములలో వ్రాసిపెట్టి యుండునా? అట్లుండిన ఎట్టి కష్టమును లేదు గదా. మన పరిశోధన ఎందులకు ? మనము చారిత్రక పునర్నిర్మాణమును గుర్తింప వలసి యున్నది. అందులకు నా యుపపత్తులను నేను చూపితిని. ఈ శాసనమును ప్రమాణముగా గ్రహించి శ్రీ రెడ్డిగారు కాదనుచున్నారు. కాదనుటకు ఈ శాసనము బొత్తిగా చాలదు. పూర్తి శాసన మిదిగో—(సం 2 కందుకూరు శా. 62. పుట 60. అని అచ్చు తప్పు. పుట 599)—''శ్రీ శుభవ రుషంబులు ౧౧౭౧ అగునేంటి రవుద్రి సంవత్సర చైత్రశుద్ధ ౫ గురువారాన శ్రీ మన్మహా మండలేశ్వరు ముక్కంటి కాడ్వెట్టు వంశావతారులైన అందులూరి విజయదిత్త దేచిని మనుమండు మదుసూదనదేవ మహారాజు శ్రీ మన్మహా మండలేశ్వర ఇమ్మడి గండ గోపాళ విజయాదిత్తదేవ మహారాజులకు రాజ్యా గాను శ్రీమంతు వేదమార్గ ప్రతిష్ఠాచార్యులైన మార్గము పహిండిముక్కల వీర తిరువెంగళ కుమారుని పురుష కారాన మార్గ నారాయణ పెరుమాండ్ల పురోహితులకు వెలిగండ్లయిన మార్గ నారాయణపురము అగ్రహారము ఆచంద్రార్కముగా నిస్తిమి.''

దీనిబట్టి ఏమి తెలియుచున్నది ? ఇమ్మడి విజయాదిత్య గండగోపాలుడను రాజు ఆ కాలమున పాలించుచుండెనని మాత్రమే గాని ఇక వేఱేమియు కాదుగదా. అప్పటికిని తలంప వీలు లేదు' అని దీనిబట్టి ఎట్లు వ్రాయగలరు ? మఱియొకని సోదరుడని యో, లేక అట్టి భావమునకు తగిన ఆధారమో దొరకిన గదా. లేదే ! దీనిబట్టి నేను కావించిన నిర్ణయమునకు ఎట్టి బాధకమును లేదు. ఇది రౌద్ర (క్రీ. శ. 1260) సంవత్సరముది గదా, నేనుదాహరించిన శాసనము అంతకు చాల ముందుది, ప్లవంగ (1247—48) నాఁటిది (20). అన్న పాలించుచుండగా నీతడు యువరాజు, ఇప్పుడు పండ్రెండేండ్ల తర్వాత రాజు. ఇందులో అన్న పేరెట్లు కనబడును ? అల్లుందిరుకాళత్తి దేవుడు గండగోపాల బిరుదాంకుడ గదా, తమ్ముడు ఇప్పుడు రాజై, ఇమ్మడి గండగోపాలుడగుటలో నాశ్చర్యమేమి ?

మఱియొక విషయమును గుర్తింపవలెను. మొదటి తిక్కరాజు గండగోపాల బిరుదాంకుడు గదా, అల్లుం దిక్కరాజు కూడ గండగోపాల బిరుదాంకుడే గదా, ఆటు తర్వాతివాడైన యీ విజయాదిత్యుడు ఇమ్మడి గండగోపాల బిరుదెట్లు తాల్చి నాడు ? ఇతడు మూడవవాడుగా గదా కావలెను. లేకపోయిన ఇతనికి ముందొక విజయాదిత్య గండగోపాలు డుండెనా ? కాన రాడే ! కాబట్టి అల్లుం దిక్కరాజు నుండియే లెక్కపెట్టుకొని తన్ను ఇమ్మడి గండగోపాలుడని చెప్పించుకొన్నాడు.

శాసనములను పరికింతము— (K. V. 38) క్రీ. శ. 1227—28 మొదటి తిక్కరాజు 'గండగోపాల తిరుకాళదేవ చోడరాజు' అనబడెను. (K. V. 45) 1229—30 లో మరలనట్లే తర్వాత కొన్ని శాసనములలో 'మధురాన్తక పొత్తపి

చోడచేరియ న్నది. ఇట్లే 1243 వఱకును పెక్కు శాసనములు కనబడుచున్నవి.

ఉదయగిరి 3 లో (క్రోధి) 1244—45 లో అల్లుం దిక్కరాజు పట్టి అల్లుడు మాత్రమే. తన రాజ్య సంవత్సరమును బిరుదును చెప్పుకొనలేదు. శాసనమందలి దీర్ఘ బిరుదావళి మామగారిది. అట్లే ఉదయగిరి 14లోను (1245-46) మామ బిరుదావళియే. ఆత్మకూరు 7, (1246—47) లోను అంతేగాక తన్ను గణించిన విషయమును తాను కాంచీపురమున రాజుగా నున్నట్లును. తన మామ కాంచీపురాధీశ్వరుడైనట్లు పైవానిలో పేర్కొని ఇందులో తాను కాంచీపురవరాధీశ్వరుడని వ్రాసికొనుట విశేషముగదా—"స్వస్తి సమస్త్యయు (ప్రభు) మహాంకమాది (వి) కా ప్రశస్తి సహితం శ్రీమను మహా మండలేశ్వర అల్లు తిరుకాళదేవ మహారాజు కాంచీ పట్టణంబున సుఖసత్కథా వినోదంబున రాజ్యంబు సేయు చుండి తమ మామ తిరుకాళదేవ మహారాజునకు పుణ్యముగాను, తనకు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థముగాను శ్రీ అత్మాకూరిలోన ...." ఇందులో గండగోపాల బిరుదు కానరాదు. గూడూరు 77 శాసనమును తన మామదగు సంవత్సర మున్నాడు గాని శకసంవత్సర మీయలేదు. ఇందులో అల్లుం దిక్కరాజు గండగోపాలుడే. కాగా నేమి తేలుచున్నదనగా మొదటి తిక్కరాజు గతింపగానే అతని కుమారుని త్రోసిరాజని అల్లుడు తిక్కరాజు తాను రాజై తత్సూచకమైన గండగోపాల బిరుదమును ధరించెను. ఆ తరువాత 1247—48 (రాపూరు 20) లో తమ్ముడు విజయాదిత్యుడు మహారాజని పేర్కొనబడియున్నాడు. ఇచ్చట తమ్మునికి గండగోపాల బిరుదుండుటకు అవకాశము లేదు. ఏలయన అన్న రాజుగా నున్నాడు.

దీనిని బలపఱచునది మనుమసిద్ధి చరిత్ర. అతడు మొదటి తిక్కరాజు కుమారుడు గదా, అతని గతి యేమైనది ? ఈతని మొదటి శాసనము రాపూరులోనే (53) కలదు. తారీఖు క్రీ. శ. 1243—44, తమిళము— "స్వస్తి శ్రీ. శుభం. . . శ్రీ మన్మహామండలేశ్వరన్ మధురాన్తక పొత్తప్పిచ్చోళనాన తిలక నారాయణన్ మనుమ శిత్తరశన్ మహారాజ్యత్తిలే. . . ." దీనికి తర్వాతి కాలముదే అల్లుందిక్క ఉదయగిరి శాసనము. రాపూరు నెల్లూరికి దక్షిణము, ఉదయగిరి ఉత్తరము. దాదాపు ఏక కాలములో ఇరువురును రాజ్యములో రెండు ప్రాంతములలోను తమతమ యధికారములను ప్రకటించు కొనుచున్నారు. తర్వాత అల్లుందిక్క దేశమును ఆక్రమించుకొని కాంచీపురమును రాజధానిగా చేసికొనుచున్నాడు. ఇది ఆత్మకూరు 7, 1247 వలన స్పష్టము గదా. ఇతని రాజ్యము, ఈ శాసనము వలన కంచి నుండి ఆతుకూరు (నేటి అత్మకూరు) వఱకు వ్యాపించి యుండెనని తెలియుచున్నది. క్రీ. శ. 1243—44 లో మనుమసిద్ధి యుండిన రాపూరులో క్రీ. శ. 1247—48 లో విజయాదిత్యుడున్నాడు. రాజ్యము ఇప్పుడు అల్లుందిక్క రాజుది. (శ్రీమతు అలుతిరుకాళ దే చోడ రాజ్యంబున శ్రీమతు ఆ రాజు తమ్ముండు విజయాదిత్య దేవచోడ మహారాజులకు. . . .) దీనిని బట్టి మనుమసిద్ధి తన రాజ్యమును పోగొట్టుకొనెనని స్పష్టము గదా.

వటి యుద్ధదెబ్బటకి పోయినాడుగా, కడపలో క్రీ. శ. 1249 లో (V R I నె 812) ఒక శాసనము మనుమసిద్ధి తన తండ్రి రోగము నుండి విముక్తుడైనందులకు దానము చేసినట్లున్నది. ఇందలి తారీఖు కొంత సందేహాస్పదము. పరిశీలనార్హము. ఒకటి నిశ్చయము, మనుమసిద్ధి తండ్రి తిక్కరాజు చివరి దినములలో వ్యాధిగ్రస్తుడై యుండినట్లును, అతడు గతింపగా, కుమారుడు చెంత నుండెనో లేదో, తెలియదు గాని, అల్లుడు మాత్రము మామక పుణ్యముగా దానము లొసరించి రాజ్యమును హరించెనని స్పష్టము.

ఈ తర్వాతను మనుమసిద్ధి శాసనములు నెల్లూరిలో కానరావు. అల్లుందిక్కరాజు ఎంతకాలము పాలించెనో తెలియదు గాని ఇతని చివరితారీఖు క్రీ. శ. 1248—49గా కనబడుచున్నది. ఇదులక తోడ ఇమ్మడి గండగోపాలుని (విజయాదిత్యుని) శాసనములు అతని రాజ్య వర్షములలో నుండుట చేత, అతని ప్రారంభకాలమును సులువుగా నిర్ణయింపవచ్చును. ఇతని 29వ సంవత్సరము క్రీ. శ. 1278—9 (పండరాపు శాసనము A R నెం 423 of 1911). దీనిం బట్టి మొదటి సంవత్సరము క్రీ. శ. 1249—50 యగుచున్నది. ఇట్లే గూడూరు పల్లాం శాసనములు (69) 21వ సం. (74) 21వ సం (75). సం. (80) 27వ సం. (116) 19వ సం. ఇందులో వీనికి 'త్రిభువన చక్రవర్తి' యనియు 'చిత్రమేళ' యనియు బిరుదులు. వీనిం బట్టి తెలియునదేమనగా అల్లుందిక్కరాజు గతించినది మొదలు తన రాజ్య సంవత్సరములను లెక్కించుకొన్నాడనుట విశదము. తన యన్న గండగోపాలుడగుటచేత తాను ఇమ్మడి గండగోపాలుడని చెప్పుకొని మొదటి తిక్కరాజును లెక్కపెట్టలేదని తెలియుచున్నది గదా. ఈ యిరువురును మామలేని రాజ్యమును తామపహరించి మనుమసిద్ధిని పెడద్రోవ తామే యనుభవించసాగిరని ఇంతకన్న వేఱు ప్రమాణము కావలయునా ? విజయాదిత్యుడు తన పేరునకు 'విజయ' కూడ చేర్చుకొని 'విజయ గండ గోపాలు'డైనాడు.

ఈ తిక్కరాజును విజయాదిత్యుడును తిక్కన బయ్యనలై యుండునియు, వీరిని తర్వాతి కావ్యకర్తలు పొరపాటున దాయాదులని వ్రాసియుందురనుటలో తప్పు లేదు. అల్లుం దిక్క విజయాదిత్యులే తిక్కన బయ్యలనుటకు ఎంత మాత్రము సందేహింప నక్కఱలేదు. ఇందులకు ఇంకను ఈ కాలమున, మనుమసిద్ధి తర్వాతి చరిత్ర తోడుపడుచున్నది.

మనుమసిద్ధి యొక్క ప్రవాసము

అల్లుందిక్కరాజు కాలముననే యాతడు నెల్లూరి రాజ్యమును వదలి వలస వచ్చెను గదా. క్రీ. శ. 1243 - 44

ప్రాంతమును నెల్లూరులోని రాపూరులో నుండిన యీతడు 1249లో కడపకు చేరుకొన్నాడు గదా. అంతకు ముందుండియే యీతడు దేశ సంచారము చేయుచుండె ననుటకు క్రీ. శ. 1239లో గుంటూరు జిల్లా పువ్వాడ (సత్తెనపల్లి తాలూకా) మహేశ్వరుని కీతడు దానమిచ్చినట్లు కలదు (247 of 1934-35). ఇందువలన నీతడు తండ్రి జీవిత కాలమందే అల్లుంద్ర చేత తఱుమబడెనా యని సందేహము కలుగుచున్నది. ఆ రాజు చివరి దినములలో వ్యాధిగ్రస్తుడైనట్లు కూడ తెలియుట చేత ఏదో అంతఃపుర విద్రోహము జరిగి యుండవలెను. రాపూరు శాసనము వలన, గుంటూరిలో 1239లో నుండిన యీతడు 1243-44కు మరల తన మండలమునకు వచ్చి, అట్లు తర్వాత కడప మండలమునకు పోయి యుండును. కడపలోనే గాక ఇతడు 1249లో వినుకొండలో కూడ నుండినట్లు శాసనములు దొరికి యున్నవి. (338 of 1934-35) ఇది ములకపాడులో దేవదానము. కాబట్టి 1249కి చాలా ముందే, ఇది అల్లుందిక్కరాజు మూడవ సంవత్సరము కాబట్టి 1249-3 = 1246 నాటికే, అనగా తండ్రి గతించిన తర్వాతనే దేశాంతరగతుడాయె ననియు, నాటి నుండి నెల్లూరి రాజ్యము అల్లుం దిక్కరాజు పాలనలో పడిన దనియు విశదము.

క్రీ. శ. 1249వ సంవత్సరమున నెల్లూరి చరిత్రలో పెక్కు విశేషములు జరిగినట్లున్నది. ఒకవైపు విజయగండగోపాలుడు రాజ్యమునకు వచ్చినట్లు గగా, కాకతీయ గణపతి దండయాత్ర కూడ ఆ సంవత్సరమే జరిగినట్లున్నది. కాకతీయ సేనాధిపతి సామంత భోజుడను నాతడు కంచిని 1449లో తాకెను. (IA, XXi పుటలు 197 నుండి) ఈ సామంత భోజుని శాసనమొకటి కాళహస్తిలో కూడ నున్నది. ఈ కాలమున గణపతి చక్రవర్తి దక్షిణదేశ దండయాత్ర ఎందులకు వచ్చెనో మనకు సిద్ధేశ్వరచరిత్ర వలన తెలియుచున్నది. తిక్కన బయ్యన సహాయమున మనుమసిద్ధికి నెల్లూరి రాజ్యము నిప్పించుట కొఱకే గదా. మనుమసిద్ధి గణపతి సాయమపేక్షించెనని తర్వాతి కాలపు సిద్ధేశ్వర చరిత్రయే గాక సమకాలిక శాసనములును చెప్పుచున్నవి. (1) మనుమసిద్ధి నందవారు శాసనము, క్రి. శ. 1257—58 నాటిది (AR 580 of 1907) ఇట్లు చెప్పుచున్నది.

"యస్సాహాయ్యా విధిత్సుః గణపతి నృపతేః స్వేచ్ఛయా సంగరాగ్రే గోదావర్యాం పరితి నృపతిః చక్రమయాష్ట్ర నిస్సృత్య కాళింగం స్వాన్కళింగా సభిముఖ మకరో దే వీరస్త దానీమ్"

ఈ గోదావరీ సంగర మెప్పుడు జరిగినదో గాని మనుమసిద్ధి స్వకార్యసిద్ధికై గణపతిని ఎంతగా ఆశ్రయించెనో, ఎట్టి స్నేహము సంపాదించెనో తెలియుచున్నది. తిక్కన పోయి భారతమును పఠించి గణపతిని ప్రార్థింపగా, మనుమసిద్ధి గణపతి సైన్యమునకే సేనాధిపతిగా నుండి కాళింగులను జయింపగా, గణపతియే బయలుదేరివచ్చి తిక్కన బయ్యనలను జయించినట్లు, చెప్పుటకు గణపతి నాయుని వల్లి శాసనము, తారీఖులేనిది, సాయపడుచున్నది.— "మహా మండలేశ్వరులైన కాకతి గణపతిదేవ మహారాజులు దిగ్విజయము సేసి పర మండలములు సాధించి దక్షిణ దిగ్భాగమున నెల్లూరు గాల్చి తద్విరోధులైన పడిహారి బయ్యన తిక్కనల వెరసిన శాత్రవ శిర బులుంగంటుక క్రీడా వినోదము సలిపి ద్రవిళ మండలమున కులోత్తుంగ రాజేంద్ర చోడనిచ్చికొని నెల్లూరిరాజు చేత ఏనుంగులం గానిక గొనివచ్చి. . ." దీనిం గూర్చి వివరముగా చర్చించి, రాజేంద్ర కులోత్తుంగ చోళదేవుడెవడు, అతనిని ఏల గణపతి ద్రవిళ మండలమున పట్టవలసి వచ్చెను, ఈ తిక్కన బయ్యనలకును అతనికిని ఎట్టి సంబంధము కలదు అను విషయమును గూర్చి శ్రీ వేటూరు వేంకట రమణయ్యగారు, తారణ, మాఘ భారతిలో 'కాకతి గణపతి దేవుడు— కులోత్తుంగ రాజేంద్ర చోళుడు' అను వ్యాసమును వ్రాసియున్నారు. సిద్ధేశ్వర చరిత్ర సోమదేవ రాజీయముల భేదములను గుర్తించుచు, అక్కన బయ్యనలు 'సిద్ధిరాయుని పాఱదోలి' అని పైదాని యందును 'పట్టి యునిచి' అని దానికి ప్రత్యక్ష విరుద్ధముగా ఱెండవ దాని యందును, 'దాయాదు' లనుమాట యుదాహృత సిద్ధేశ్వర చరిత్ర గ్రంథ భాగమున కానరాదు, అన్యత్ర కానవచ్చునేమో' అనియు హెచ్చరించి యున్నారు. అక్కన బయ్యనలే తిక్కన బయ్యనలను నిర్ణయమునకు వారు మఱియొక విధమున వచ్చిరి. పైగా వీరు మనుమసిద్ధికి దాయాదులు కారనియు, శాసనమును బట్టి 'పడిహారులు' (ప్రతీహారులు) అనియు తెలియవచ్చుచున్నది గదా. పై శాసనమందు కులోత్తుంగ రాజేంద్ర చోడ డొక్కడే యుండగా సిద్ధేశ్వర చరిత్ర యందు వెలనాటిని గెల్చిన తర్వాత నెల్లూరికి వచ్చినట్లును, సోమదేవ రాజీయమందు 'వెలనాటి ధరణీపతుల' అనియు నుండుటను గుర్తించి, "సిద్ధేశ్వర చరిత్ర వెలనాటి ధరణీశ్వరు డొక్కడనియే తెలుపుచుండగా సోమదేవ రాజీయము 'ధరణీపతుల' 'వారల' 'అందఱ'ని పెక్కుఱు వెలనాటిపై ప్రభుత్వము నెఱపుచుండినట్లు చెప్పుటకు గారణము విశదముగాదు" అని పరిశీలించి తుదకు ఈ నిర్ణయమును చేసినారు. "పై మూడు అంశములందు తప్ప తక్కిన తావుల నీరెండు గ్రంథములకును భేదము గానరాదు. తక్కిన విషయమంతయు రెంటికిని సామాన్యమే. వీనియందుక్తమైన విషయము సత్యమనియు చరిత్రాత్మక మనియు గణపతిదేవుడు వేయించిన నాయనిపల్లి శిలాశాసనము ఋజువు సేయుచున్నది. శాసనములోని బయ్యన తిక్కనలే సిద్ధేశ్వర చరిత్ర సోమదేవ రాజీయములందు పేర్కొనబడిన యక్కన బయ్యనలు. తిక్కనకు బదు లక్కనయని పేరు ప్రమాద వశమున గ్రంథస్థమైనది. బయ్యన తిక్కన శాసన నామక్రమము గ్రంథములందు అ(తి)క్కన బయ్యనలని తారుమారైనది. ఇవి యంతగ పాటింప దగిన యంశములు గావు. మిగిలిన విషయములు గ్రంథముల యందుండునవియే శాసనములందును గానవచ్చుచున్నవి." (భారతి— తారణ మాఘము. పుట 164).

తర్వాత వెలనాటి చరిత్రను చర్చించి, కులోత్తుంగ రాజేంద్రచోడుని గుర్తించి, వెలనాటి పృథ్వీశ్వరుని తిక్కరాజు చోళచక్రవర్తి సాయమున చంపి 'చోళ చక్రవర్తి ప్రాసాదమున ఏలువ గుంటూరు మున్నగు రాష్ట్రములను స్వాధీన' పరచుకొనెనని యు వ్రాసిరి. పై చేర్కొన బడిన విషయముల నన్నిటిని సమాలోచనము జేసి చూడగా నెల్లూరు తెలుగు చోళరాజులు చోళచక్రవర్తి యనుగ్రహమును బొంది తత్పూర్వము వెలనాటి రాజుల పాలనయందుండిన గుంటూరి ప్రాంత దేశమును దమ యధికారము క్రిందికి దెచ్చుకొని రని తోచుచున్నది. (పుట 55) పార్థివ జ్యేష్ఠము ). . . 'పృథ్వీశ్వరునికి తర్వాత. . . పోయిన రాజ్యమును మరల ప్రతిష్ఠ సేయ దలపెట్టిన వారిలో ప్రముఖుడు కులోత్తుంగ రాజేంద్రుడు చోడుడు. . . ఇతడు కంచి పర్యంతము గల దేశముపై క్రీ. శ. 1230 ప్రాంతమున నొకమారును, 1256 ప్రాంతమున నొకమారును రెండు పర్యాయములు దండు వెడలి పోయినట్లు తెలియవచ్చుచున్నది. (ఆషాఢము పు. 57). . . వెలనాటి రాజులకు గాకతీయులతో నొక ప్రక్కను, నెల్లూరు తెలుగు చోడులతో మఱియొక ప్రక్కను తరతరముల నుండియు వైరము గలదు. . వారి రాజ్యమున పశ్చిమ భాగము తెలుగు చోళుల యధీనమున నుండెను. వెంగి మండల మంతయు కాకతీయులు కబళించిరి. (పుట 65). . ముమ్మడి కులోత్తుంగ రాజేంద్ర చోడుడు. . . పోయిన రాజ్యమును మరల సంపాదించుకొనుటకు దన కుల క్రమాగత శత్రువులైన కాకతీయులకును, నెల్లూరు చోడులకును శత్రువైన కళింగ భూపాలుడగు ముమ్మడి యని యంకభీముని నాశ్రయించి యతని వెంబడి ద్రావిడ దేశమునకు బోయెను. కాని హొయ్యల చోళ నెల్లూరు చోళ సైన్యము లేకీభవించి యుద్ధము సేయగా నెదుర్కొన జాలక పరాజయమునంది కళింగ సైన్యములతో గూడ వెనుదిరిగి స్వదేశమునకు బోయి చేరెను.'' (పుట 67)

నాయనిపల్లి గణపతి శాసనములో తారీఖు లేదుగాని ఈ విషయములు ఎప్పుడు జరిగినవో ఒక విధముగా ఊహించుటకు అవకాశములు గలవు. ఇంతఃకు చూడగా నిర్వచనోత్తర రామాయణ దశకుమార చరిత్రలలో గణపతి ప్రస్తావముగా అక్కన బయ్యనల సంగతి గాని ఏదియు లేక విజయుని మాత్రము గెలిచినట్లుండుట వలన, క్రీ. శ. 1243కు తర్వాత, తండ్రి మరణానంతరము మనుమసిద్ధి రాజ్యమునకు రాగా ఆతనిని తిక్కరాజును విజయాదిత్యుడును దాక్షిణాత్యుల సాయమున నెదుర్కొనగా మనుమసిద్ధి వారిని ఎదుర్కొని 'ప్రాయేరు' ఏఱకు తఱిమి విజయము గాంచెను. తర్వాతనే బయ్యనలు క్రీ. శ. 1244—46ల నడుమ రేగి నెల్లూరిని ఆక్రమించిరి గదా. కాబట్టి క్రీ. శ. 1243లో మనుమసిద్ధి రాజ్యమునకు వచ్చి విజయాదిత్యుని ఓడించి మరలివచ్చి, రాజ్యము పూర్తిగా నష్టమై పోయి తాను విదేశాంతరగతుడగుటకు ముందు, అనగా క్రీ. శ. 1243—46 మధ్యకాలమున నిర్వచనోత్తర రామాయణమును అంకితము నందియుండును.

ఈ మధ్యలో దీనికి తర్వాత కేతన దశకుమార చరిత్రను తిక్కని అంకితనందియుండును. క్రీ. శ. 1246కు ముందే ఈ గ్రంథములు రచన యని ఇప్పుడు దృఢముగా చెప్పవచ్చును. తిక్కన గంగని జయించుట 'మహారాష్ట్ర సామంత సారంగుం దోలి తురంగముం గొనుట'యు ఈ కాలమందే అని నిశ్చయింప వలయును. తర్వాత అల్లుందిక్కరాజు అతని సోదరుడును బలపడి క్రీ. శ. 1246నకు కొంత ముందు, తిరిగి మనుమసిద్ధి కాకతీయుల నాశ్రయించి వారి సాయముతో క్రీ. శ. 1249 నాటికి మరల నెల్లూర పునరభిషేకమును జేసికొనెను. తిక్కన బయ్యనలకు వెలనాటి కులోత్తుంగ రాజేంద్రుని యొక్కయు కళింగరాజు అని యంకభీముని సాయమును కలిగినట్లు తెలియుచున్నది. వెలనాటిని జయించి కులోత్తుంగ రాజేంద్రుని గణపతి ద్రవిడ దేశమందు పెట్టుకొనగా కళింగులను గోదావరి తీరమందు మనుమసిద్ధి ఓడించెనని అతని నందలూరు శాసనమువలన తెలియుచున్నది గదా. క్రీ. శ. 1249 నాటికి గణపతి దక్షిణదేశమున నుండినట్లు అతని శాసనముల వలన తెలియుచుండగా సరిగా ఆ కాలమునకే అల్లుం దిక్కరాజు శాసనములు ముగియుట చేత తిక్కరాజు గతించి బయ్యన విజృంభించిన కాలమున, అదనుచూచి, కాకతీయులు ఎత్తివచ్చిరని తలంపవలెను. పైగా నాయనిపల్లి శాసనమునందలి వ్రాతలనుబట్టి తిక్కన బయ్యనలను గూర్చి చంపెనని తలంచుటకు లేదు. శాసనమున 'దుర్విరోధులైన పరిహార బయ్యన తిక్కనల వెరసిన శాత్రవశిరంబులం గందుక క్రీడా వినోద మ్మొనరిపి' అని యున్నది. విజయాదిత్యుడు తర్వాత బ్రతికియే యున్నాడు. తిక్కరాజు లేడు. తిక్కరాజు ఈరణమందే గతి-చావో లేక తత్పూర్వమే గతించెనోగాని శాసనము ప్రకారము వీరిని పెనసిన (=చేరిన) శాత్రవుల శిరంబుల అని గ్రహించుట యుక్తము.

తిక్కన బయ్యనలను గూర్చి వ్రాయుచు శ్రీ చాగంటి శేషయ్యగారు త్రోవగుంట శాసనము నుదాహరించి (నెల్లూరు జిల్లా, ఒంగోలు తాలూకా, నె.శా. సం. 1125 పుట) శ్రీ మన్మహామండలేశ్వర బయ్యన మహారాజ చినబయ్యన మహారాజులను చూపినారు. శాసనమందు తారీఖు లేనందున 'వీ రెవ్వరో ఏ కాలమువారో, మనుమసిద్ధికిని వీరికిని సంబంధమున్నదో లేదో చెప్పజాలము' అని వ్రాసినారు. (ఆం. క. త. 2 సం. పు. 218) తిక్కన బయ్యనలు గాక బయ్యన చినబయ్యన లనుట చేతను, నాటి రాజకీయములలో వీరి పాత్ర లేమి తెలియ నందునను తిక్కన బయ్యనలను వీరిని గ్రహించుట సాధ్యము కాదు.

(2) రణ మరణము మనుమసిద్ధిదే.

వీరగండ గోపాలబిరుదము ఏ కోశములోను లేని యీ విజయాదిత్యుడు రణమరణమును 1263 లో పొందినాడని శ్రీ రెడ్డిగారు ఎట్లు ప్రతిపాదింపగల్గిరో నా కాశ్చర్యముగా నున్నది. ఏలయన క్రీ. శ. 1262—63 లో గతించియుండిన

మొదల అతడెట్లు క్రీ. శ. 1278—9 లో తన 29 వ యేట నందలూరిలో శాసనము వేయించి యుండగలడు. ఈతడు మతియొకడనుటకు బొత్తిగా అవకాశము లేదు. తర్వాతి చరిత్రను అరయుదము.

మనుమసిద్ధి విజయాదిత్యులు శత్రువులనుట నిర్వివాదాంశము. తిక్కన సెక్ష్యము త్రోసివేయరానిది గాన దానిం గూర్చిన వివరము అనవసరము. రణాంగణ మందినవాడు విజయాదిత్యుడా, మనుమసిద్ధియా యనునదే శ్రీ రెడ్డిగారు లేవనెత్తిన ప్రశ్న. ఈ క్రింది కారణములచేత విజయాదిత్యుడు కాడని నిశ్చయించుచున్నాను.

(1) విజయాదిత్యుడు విజయగండ గోపాలుడుగాని వీర గండ గోపాలుడు కాడు. అట్లనుటకు ఒక్క శాసనముగాని లేదు. 'విజయ' 'వీర' కానేరదు. 'వీర' శబ్ద మాతని బిరుద ములతో కలియలేదు.

(2) మనుమసిద్ధికి "గండగోపాల బిరుదున్నట్లు శాసనములలో లేదు అని వీరు పెంట్రాల శిలాశాసనముల నుదాహరించి, అందుచేత 'వీరగండ గోపాల విపిన దావదహన' యన్న సుందరపాండ్యుని చిదంబర శాసన గత బిరుదము మనుమసిద్ధిని సూచించుటలేదని, అందువలన పెంట్రాల శిలాశాసనములలో ఒకదానిలో విజయాదిత్యుని పేరుండుటచేత, చంపబడినవాడు విజయాదిత్యుడని ప్రతిపాదించినారు. చాల పొరపాటు. పెంట్రాల (కందుకూరు తాలూకా) లో నాలుగు శాసనములు మనకు ముఖ్యములు. (1) నెం 60. కాళయుక్తిది. శ్రీ మన్మహా మండలేశ్వర భుజబల వీర మన్మసిద్ధయదేవ మహా రాజులు చేసిన దానము (1258—59 ?), (2) నెం. 61, సిద్ధార్థి, ఈ మన్మసిద్ధి 'రాజ్యాభివృద్ధికి' గాను చేయబడినదే (1259—60 ?); (3) నెం. 62 రౌద్రి, శ్రీ మన్మహా మండలేశ్వర ఇమ్మడిగండ గోపాల విజయాదిత్య దేవమహారాజులకు రాజ్యాభివృద్ధి (కి) గాను చేయబడినది. (1260—61); (4) నెం 63. దుర్మతి—'భుజబల వీర మన్మయసిద్ధియ దేవ చోడ మహారాజులకు రాజ్యాభివృద్ధికిగాను' చేయబడినది. ఈ నాలుగింటిలో మూడు మనుమసిద్ధివి. ఒకటి విజయాదిత్యునిది. అట్లని శాసన సంపాదకులే ఇట్లు హెచ్చరించి యున్నారు. పుట. 605. నెల్లూరి శాసనములు. (NoI) "In this series of Pentrala inscriptions ......The appearance of Gandagopala in the course of Vira Manma Siddhaya's reign is not understood." అని. వారికే సందేహము నాటికే కలిగినది. రౌద్రి శాసనకర్త వేఱని వారికి తోచినది.

ఇది సరియే. ఎందువలన ననగా ఈ నెల్లూరి శాసనము లలో ఎచ్చటను మనుమసిద్ధి పేరుతో కలసి గండగోపాల బిరుదము కానరాదు. అంతమాత్రము చేత గండగోపాల బిరుదముగాని మనుమసిద్ధికి లేదని సిద్ధాంతము చేయుట పొరపాటు. పెంట్రాల శాసనోక్త పురుషులు ఇరువురు. ఒకడు మనుమసిద్ధి, రెండవవాడు విజయాదిత్యుడు. మొదటి రెండును మనుమసిద్ధివి, మూడవది విజయునిది. ఇట్లే నాలుగును ఒక్క యూరిలోనే దొరకుట కూడ గొప్ప చరిత్రాంశ మునకే దారితీయునేమో. పైగా 1257—58 లో మనుమ సిద్ధి (గణపతి సాహాయ్యమును కోరుచు) నంద వారిలో నున్నాడు. నందలూరిని కలిపి నెల్లూరిని ఏలుచుండెనో లేక అచ్చటి నుండి నెల్లూరిని మరల జయించి వచ్చెనో నిర్ణయింప వలసి యున్నది. క్రీ. శ. 1249 కి తర్వాత మరల రాజ్యము పోయినట్లున్నది. 1249—1257 మధ్యకాలమున నీతని శాసనములు పాకనాటిలో కానరావు. ఈతడు 1257 లోనే గాక 1249 లో కూడ నందలూరిలో నున్నట్లు మతి యొక శాసనము (598 of 1907) వలన తెలియుచున్నది. ఇందు మనుమసిద్ధికి 'మధురాన్తక పొత్తప్పిచ్చోళ గండగోపాళ మనుమ శిత్తరశర్' అని స్పష్టముగా నున్నది. నెల్లూరిజిల్లా శాసనములలో లేకపోవుట యొక కొఱత కాదు. పైగా నెల్లూరి శాసనములలో ఈ బిరుదుల నన్నిటిని వదలక పూర్తిగా వ్రాయుట కానరాదు. కొంత అశ్రద్ధ కనబడుచున్నది. మొదటి తిక్కరాజు శాసనములలో కూడ కొన్ని గండగోపాల బిరుదులేనివి కలవు. ఆతనికి పూర్వ మీ బిరుద మున్నట్లు కానరాదు. అతని తోనే ప్రారంభమైనట్లున్నది. అతని తర్వాత అల్లుండ్రు దాల్చినారు. కాని ఇంత బాధ ఎందులకు. తిక్కనయే నిర్వచ నోత్తర రామాయణమున సందేహమునకు అవకాశములేని యట్లు వ్రాసినాడు. తండ్రి కొడుకుల్కు ఇరువురకును గండ గోపాల బిరుదమున్నది. తిక్కరాజును గూర్చి 'రాయగండ గోపాలు ..... దిక్కధరణి విభు ....' (ప్రథ. ఆ. 33) అనియు మనుమసిద్ధిని గూర్చి సప్తమాశ్వాసాంతమున (160 పద్యము) 'ఫలితామర తరు శాఖా తులిత భుజుం ..... రాయగండ గోపాలు డిలన్' అనియు తిక్కన వ్రాసినది చాలును. గండగోపాల బిరుదము కుదిరినది. 'వీర' ను చూతము. మనుమసిద్ధికి 'భుజబల వీర' బిరుదమున్నది. విజయాదిత్యునికి 'వీర' ఎచ్చటను లేదు. వీరగండ గోపాలు డొకడు, విజయాదిత్యుడు కానివాడు ఈ కాలమున స్పష్టముగా నుండెనని గూడూరు (మలాం) శాసనము నెం. 67 (N D I) అతని తొమ్మిదవ సంవత్సరమునది చెప్పుచున్నది. ఇచ్చటనే విజయగండ గోపాలునివి కూడ నుండుటచే ఇరువురు భిన్నులనుట నిక్కము. మొదట 'గండగోపాలుడు' గా నుండి విజయాదిత్యునిమీది పగయు పంతము నను అధికరించుకొలది వీరపదము నీతడు తాల్చినాడని ఈ శాసనముచే నిర్ణయింపవచ్చును.

ఇందులకు అనుగుణముగానే జటావర్మ సుందర పాండ్యుని శాసనములను చూచినచో కొన్నిటిలో 'గండ గోపాల' యనియు, కొన్నిట 'వీరగండ గోపాల' యనియు కనబడుచునే యున్నది. "హత్వా చేరమ పాణ్డ్య హొయ్సళ పతిం విద్రావ్య చోళేశ్వరం జిత్వా కాటక గణ్డగోప గణపత్యాదీన్

రాతి నపి వీరసున్దర పాణ్డ్య దేవ నృపతిః కృత్వా తులారోహణం చక్రేతాణ్డ విన శ్మశాంక కలికా చూడస్య హైమీం సభామ్'' [South Indian Inscripsions iv —625, 626, 630). కొన్నిట 'వీర' చేర్చియు, కొన్నిట వదలియు, కొన్నిట 'కాంచీపతి' యనియు వీరని శాసనములలో కలదు. 'వీరగండ గోపాల విపినదావ దహన కాఞ్చీపుర వరాధీశ్వర, గణపతి హరిణ శార్దూల, నెల్లూరు పుర విరచిత వీరాభిషేక, ప్రణతరాజ ప్రతిష్ఠాపన' (S. I. I. iv 631) గణ్డగోపాలుని చంపుటచేతనే తాను కాంచీపుర వరాధీశ్వరుడైనట్లు ఇందు స్పష్టము. నెల్లూరినుండి కంచి వఱకు వీరి రాజ్యము కదా. ఈ కాలమున నెల్లూరివారి శాసనములు కంచిలో చాల గలవు. తమిళ శాసనములలో 'వీర' ను వదలి 'కఠూర్ గండగోపాలన్' అని కలదు. ఇచ్చట కఠూర్ అనగా గండపెండేరమని యర్థము. భాషాంతరీకరణ మొనర్చి వ్రాయుట గమనింపదగినది. ఇందు వలన మనుమసిద్ధి ఎంతటి వీరుడో తెలియగలదు. దీనిని గుఱించి వ్రాయుచు శ్రీ నీలకంఠశాస్త్రిగారు—

'......and it is quite possible that Vira in the Sanskrit expression is not an integral part of the name' అని తమ The Pandyan Kingdom లో (పుట 169) వ్రాసియున్నారు.

పైగా జటావర్మ చంపినది కాకతి గణపతితో చేరిన (వీర)గండ గోపాలుని గదా. విజయగండగోపాలుడు కాకతీయులతో మైత్రి నెఱపిన ట్లిచ్చటను లేదు.

(3) విజయగండ గోపాలుడు క్రీ. శ. 1263 లో చావలేదని ముందే వివరింపబడినది. ఇతని చివరి శాసనము క్రీ. శ. 1232 ది. (A R137 of 1916) ఇతని శాసనములు నెల్లూరు కడప కంచి త్రిపురాంతకములలో గలవు.

(4) సుందరపాండ్యుడు (జటావర్మ) గండగోపాలుని చంపిన తర్వాత నెల్లూరి రాజ్యమును ఆతని తమ్ములకు (సహోదరులకు ?) ఇచ్చెనని యొక తమిళ శాసనము కలదు. (ఇదికూడ చిదంబరము నటరాజాలయములోనిదే. ఎందుచేతనో డిపార్టుమెంటువారు ప్రకటింపలేదు. 'సెందమిళ్' అను తమిళ పత్రికలో ప్రకటింపబడినది.) ఆ వాక్యములు. 'వాక్కియల్ సెందమిழ் సుందర పాండియన్ వాళమరిల్! వీక్కియవన్ కఠూర్ గండగోపాలనై విణ్ణులకిన్! పోక్కియ పిన్పవన్ తంబియర్ పోత్ర పురన్దరంశ! వాక్కియ వార్తై పదినాలులకము మానదులే‖' ఈ 'తంబియవర్' ఎవరోగాని మనుమసిద్ధికి సహోదరులుండినట్లు కానరాదు. దాయాదులుగా నుండియుందురు.

(5) క్రీ. శ. 1263 కు తర్వాత ఈ 'తంబియర్' ఎంతకాలము పాలించిరో తెలియదు గాని, కడపటి చోళ చక్రవర్తి మూడవ వీరరాజేంద్రచోళుడు 1268 వఱకు పాలించుచుండెను. ఈతడు మొదటి తిక్కరాజునకును మనుమసిద్ధికిని కూడ సమకాలికుడు. (చూ. నెల్లూరు శా. g 39, 85, 90 u 48) ఆ సంవత్సరము కాకతి రుద్రమదేవి సామంతుడు నాగదేవమహారాజు నెల్లూరిని జయించి పాలింప నారంభించెను. ఐదారేండ్లు పాలించినట్లు తెలియుచున్నది. (న. శా. A 51, K. V. 48, N 21) క్రీ. శ. 1279—80 ప్రాంతము నుండియు ఈ నాగరాజు కమ్మనాటిలో కనబడుచున్నాడు. ఒంగోలు తాలూకాలో 1280 వఱకు నీతని శాసనములున్నవి. క్రీ. శ. 1278 నాటికి మనుమసిద్ధి కుమారుడు రెండవ తిరుకాళదేవుడు (రెండవ తిక్కరాజు) తలయెత్తినాడు గదా (గూడూరు తాలూకా మడమనూరు శాసనము.) ఇత డెట్లు రాజ్యమునకు వచ్చెనో గాని ఒకటి కనబడుచున్నది. నెల్లూరిని ఇమ్మడి తిరుకాళదేవుడు పట్టుకొన్న కాలమునకు సరిగా విజయగండ గోపాలదేవుడు నందలూరు ప్రాంతమున కాయస్థ రాజ్యముపై దాడి సలిపినట్లు అతని 29 వ సంవత్సరపు శాసనము దొరికియున్నది. (A R 423 of 1911) నెల్లూరుజిల్లాలోని గూడూరు తాలూకాయును, చిత్తూరు, కాళహస్తి, తిరుపతి ప్రాంతములు (అనగా తర్వాతి విజయనగర రాజుల కాలపు చంద్రగిరి రాజ్యము) విజయగండ గోపాలుని స్వాధీనమున నుండినట్లు శాసనము లున్నవి. నెల్లూరులో ఉత్తర భాగము నాగదేవరాజు స్వాధీనమున నుండెను. గదా. దీనినిబట్టి రెండవ తిక్కరాజు గూడూరు, నెల్లూరు ప్రాంత దేశమును పట్టుకొనగానే విజయుడు ప్రతిక్రియగానో లేక తిక్కరాజుయొక్క సహాయులను బాధించుటకో అటు దండెత్తి యుండునని చరిత్రకారుల యభిప్రాయము. క్రీ. శ. 1263 లో మనుమసిద్ధి చావలేదని శ్రీ రెడ్డిగారూహించిరి గదా అట్లుండిన యెడల ఈ కాలమున రాజ్యమును మరల జయించుటకు తాను రాక కుమారుని పంపునా ?

(6) చిరమున శాసనము క్రీ. శ. 1284—85 నాటిది గదా. ఇందలి విజయగండ గోపాలుని నిర్దేశించి శ్రీ రెడ్డిగారు ఇమ్మడి మనుమసిద్ధి క్రీ. శ. 1284—85 వఱకు జీవించియుండెననియు, 'విజయగండ గోపాల మహారాజు రాజ్యమున మఱియొక రాజ్యము స్థాపించినట్లు కలదు.' అనియు, 'విజయగండ గోపాలుని రాజ్యమును (మనుమసిద్ధి మొదలగు) రాజులు యుద్ధము చేసి జయించినట్లు కనబడుచున్నది' అనియు వ్రాసినారు.

ఇదంతయు చారిత్రక విషయములను నెమ్మదిగా సమన్వయపఱచుకొనకపోవుటచే కలిగిన గందరగోళము. ఇచ్చట శ్రీ రెడ్డిగారు బొత్తిగా విస్మరించిన విషయము ఒకటి కలదు. క్రీ. శ. 1278—9 నాటికే రెండవ తిక్కరాజు, మనుమసిద్ధి రాజ్యమునకు వచ్చియుండగా, అంతకు ఎంతో ముందే గతించిన మనుమసిద్ధి వచ్చి యుద్ధమెట్లు చేయును ? తండ్రి యుండగానే కుమారుడు రాజ్యమునకు వచ్చి ఆతడు అంతలో అస్తమించి మరల తండ్రి రాజ్య ప్రయత్నము చేసెననుటకు ఆధారము ఎక్కడ నున్నది ? కాబట్టి ఇదంతయు అసంభవము. ఇది వీరికి ఏ ప్రమాణమును

చేత తోచినదోగాని ఆ శాసనములో ఎవరో రాజ్యము స్థాపించి నట్లు గాని, యుద్ధము చేసినట్లుగాని, అన్నిటిని మించి మనుమసిద్ధికి దీనితో సంబంధమున్నదని తలంచుటకుగాని ఆధార మేమియు లేదు. ఆ శాసనమిదిగో (నె. శా. పుట 233—34).

"శక వరుషంబులు ౧౨౦౪ గునేంటి భాద్రపద శుద్ధ త్రయోదశి గురువారమునాండు స్వస్తి సర్వవంశోద్భవ భారద్వాజ గోత్ర పవిత్ర ఖట్వాంగ ధ్వజ వృషభ లాంచన కాంచీపుర వరాధీశ్వర కామకోట్యంబికా లబ్ధ వరప్రసాద జగద గోపాళ నామాది ప్రశస్తి సహితం శ్రీ మన్మహా మండలేశ్వరం విజయగండ గోపాళ మహారాజు రాజ్యమున స్వస్తిగుణమణి కిరణాలంకృత కేయూర హార ఒరయూరి పురవరాధీశ్వర గండరగండ ప్రజమెచ్చు గండ పండిత పుండరీక షండ మార్తాండ బురాగండ నితల గోపగండ బద్య మహారాజ స్థాపనాచార్య నామాది ప్రశస్తి సహితం శ్రీమతు గొల్లపూండి కేశవనాయని కొడుకులు శ్రీ కామయ నాయకుండును, దేవి నాయకుండును ధర్మప్రవిత్తులైన చిలుమున మల్లికార్జున దేవరగుడి రంగభోగార్థముగాను భోగమువారికిచ్చిన వరిచేను ...."

తర్వాత దానము యొక్క వివరములు, ఇచ్చట రాజులు గాని, మనుమసిద్ధిగాని, యుద్ధము చేయుటగాని బొత్తిగా కనబడవే! ఇట్లుండగా శ్రీ రెడ్డిగారు ఎట్లు ఈ అభిప్రాయమునకు వచ్చిరో నా ఊహకు అందుట లేదు. ఏదో ఒక దానికి మఱియొకటి అనుకొనియుందురు. 'బద్యమహారాజ స్థాపనాచార్య' అన్నది కూడ గొల్లపూండి నాయకులకు వర్తించుచున్నది. ఈ బద్యమహారాజెవరో తర్వాత చూతము. మనుమసిద్ధి మాత్రము కానరాడు గదా!

(7) ఈ విజయగండ గోపాలుడు నాటివాడే యగునో కాడో, మరల ఆత్మకూరు తాలూకాలో చిరమన కెట్లు రాగలిగెనో పరిశోధింపవలసియున్నది గాని, మనుమసిద్ధి యొక్క శత్రువైన యెడల తన రాజ్యసంవత్సరమును ఇందు చెప్పక పోవుట యెందులకో! విచార్యము. కాని, క్రీ. శ. 1278—9 లో నందలూరి వఱకు వచ్చిన విజయాదిత్యుడు 1281 వఱకు జీవించియుండినట్లు కంచి శాసనముచే తెలియవచ్చుట చేత, నందలూరు ప్రాంతమునుండి ఆత్మకూరు చిరమనలో శాసనము వేయించి యుండదగును. దీర్ఘకాలము జీవించి యుండినట్లున్నాడు.

ఈ కాలమున నొక మనుమగండ గోపాలుడు కనబడుచున్నాడు గాని అతడు మన రెండవ మనుమసిద్ధి మాత్రము కాడు. క్రీ. శ. 1279 లో నెల్లూరిని మరల గ్రహించిన రెండవ తిక్కరాజు ఎంతకాలము పాలించెనో తెలియదు గాని మనుమగండ గోపాలుని శాసనములు మాత్రము శ 1204 (క్రీ. శ. 1282—3) నుండి కనబడుటచే నీతని రాజ్యకాలము మూడు నాలుగేండ్లవఱకు మించలేదని విశదము. మనుమగండ గోపాలు డెంతకాలము పాలించెనోగాని ఇతని తర్వాత రాజగండ గోపాల బిరుదాంకుడు మధురాన్తక పొత్తపి చోళ రంగనాథుడు నెల్లూరులో క్రీ. శ. 1290 లో పాలించుచుండెను. మనుమగండ గోపాలుని అంత్యకాలమెప్పుడో గాని ఇతనిది కూడ రణ మరణమే. కాకతి రుద్రమదేవి కాలమున ప్రతాపరుద్రుని సకల సేనాధిపతియైన అడిదము మల్లు అనునతడు 'మనుమగండ గోపాల శిరఃఖండన' యను బిరుదును ధరించి యున్నాడు. (SI I X 479).

(౩) తిక్కన భారత రచనా కాలము.

'సత్య మెట్టిదో తెలుప వేడికోలు' అని జిజ్ఞాసువులై శ్రీ రెడ్డిగారు కోరినందున ఇంతదూరము వివరించి వ్రాయవలసి వచ్చినది. సత్యమే చరిత్ర కెక్కును. సత్యేతర మెక్కదు గదా. అది నవలలకు పనికివచ్చును. "శ్రీ శాస్త్రిగారి పరిశోధన ప్రకారము ఇమ్మడి మనుమసిద్ధి క్రీ. శ. 1284—85 ప్రాంతము వఱకు నజీవుడై యుండి తిక్కన కావ్యమును కృతి నందియుండవలెనని అభిప్రాయపడుచున్నారు" అని రెడ్డిగారు వ్రాయుటకు బొత్తిగా ఆధారము లేదు అనుటయేగాని అనిపించుటకుగాని నా రచనలో ఎచ్చటను అవకాశము లేదు. తిక్కనచే మనుమసిద్ధి నిర్వచనోత్తర రామాయణమును కృతి నందినది క్రీ. శ. 1243—46 ల నడిమి కాలమని స్పష్టీకరించితిని గదా. మనుమసిద్ధి మరణము క్రీ. శ. 1263 కు లేక కొంత ముందని గంట వాయించినట్లు తెలిపితిని గదా. ఇంక నెట్లు వ్రాయవలయునో తెలియుట లేదు.

మనుమసిద్ధి మరణానంతరమే మహాభారత రచన యని ఇదివరలో వ్రాసితిని. తిక్కన ఒయ్యనను అల్లుని తిక్కరాజును ఆతని సోదరుడు నని తెల్పితిని గదా. భారతము నాంధ్రీకరించి, కాకతి గణపతికి దానిని వినిపించి ఆతని సాయమును తిక్కన సంపాదించెనని సిద్ధేశ్వర చరిత్రాదులలో నుండుటచే, క్రీ. శ. 1249 కి ముందే మరల నెల్లూరికి గణపతి వచ్చియుండుట చేత క్రీ. శ. 1246—49 నడిమి కాలమున మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడగుటకు ముందు, నిర్వచనోత్తర రామాయణ దశకుమార చరిత్రలకు తర్వాత, తిక్కన భారతాంధ్రీకరణమును ప్రారంభించి, గణపతి చక్రవర్తిని సందర్శించిన సందర్భమున ఆతనికి వినిపించియుండుట సుసంభవము. జరిగి యుండునని తలంచుటకు అవకాశము కలదు. భారతాంధ్రీకర

ణము పూర్తియగు లోపల మనుమసిద్ధి గతించి తర్వాత తిక్కన హరిహరనాథుని కంకితమిచ్చియుండునని పండితాభిప్రాయముగా నుండెను.

కాని ఇంతదూరము తర్కించిన తర్వాత నా కొకటి తోచుచున్నది. తిక్కన భారతములో మనుమసిద్ధి ప్రస్తావము లేకపోయినను, స్వప్నములో తిక్కనకు కనబడిన 'తండ్రి' నాటి విషాద విషమ రాజకీయ పరిస్థితులను వేటినిగాని సూచింపక భగవంతుని యనుగ్రహప్రకారమును తెలిపి తన వెంట వచ్చిన ఆ దేవునే చూపుటయు, దేవుడు దర్శన మిచ్చుటయు, అంకితము కోరుటయు, తిక్కన 'ఇమ్మహాభారతంబు సమస్త దురితాపహంబును నభిమత శుభావహంబును గావున నొక్క మహాఫలంబు గోరి జనమేజయుడు .... వినిన కథ' అని వ్రాసి మరల తాను ఆ భారతమునే వ్రాసి వినిపించుటయు చూడగా తానును ఏదో 'మహాఫలము' ను కోరియే వ్రాసి వినిపించినట్లు ధ్వనించుచున్నది. ఏదో అనిష్టము తొలగిపోవుటకు చేసిన పనిగా కనబడుచున్నది. 'తిక్కన బయ్యనలను జయించుటయే ధ్యేయమై యుండినయెడల అది సిద్ధించుటకే భారతాంధ్రీకరణమై యుండును. దానినే గణపతిచక్రవర్తికి వినిపించియుండును. దశకుమారచరిత్ర యందు గణపత్యాదుల ప్రస్తావము లేనట్లే అనంతర రాజకీయ కల్లోలాదికములకు గాని, రణమరణ మందిన మనుమసిద్ధికి గాని ఎట్టి సూచనయు భారత మందు లేదు. సిద్ధేశ్వర చరిత్రలోని వృత్తాంతము— గణపతి 'తిక్కన బయ్యనలను' నిర్జించుట చరిత్రాంశముగా తేలినది గదా. కాబట్టి—తిక్కనయు భారతములో సోమయాజి యని మాత్రము వ్రాసికొని, మనుమసిద్ధిని రాజ్యమందు తాను కుదురుపరచినట్లు చెప్పకపోవుటచేత భారతము కూడ మనుమసిద్ధి యుండగానే, అతని రాజ్యలబ్ధి కొఱకే భగవదారాధనగా వ్రాసి యుండునేమో ! ఇది యొక మ్రొక్కువంటిది గావునను,

స్వప్నవృత్తాంతమునుబట్టి అంకితము దేవునికే దైవనిర్ణీతమైనందువలనను రాజు అంకితము కోరలేదని తోచుచున్నది. 'తిక్కన బయ్యనల' చరిత్ర సత్యమై యుండగా, మనుమసిద్ధి గణపతి సాయమును కోరినది శాసనస్థమై యుండగా, తిక్కన భారతము నంత దీక్షతో వ్రాసియుండగా, గణపతికి భారతమును వినిపించినది మాత్ర మెట్లు అసత్యమగును ? గణపతిని దర్శించు నాటికే తిక్కన సోమయాజి యైనాడని సిద్ధేశ్వర చరిత్ర వ్యక్తము చేయుచున్నది. 'అట్టి మహాత్ముని నా సోమయాజి' అని.

ఇదంతయు క్రీ. శ. 1263 కు ముందేయని తేలుచున్నది గదా. ఇంకను సూక్ష్మముగా పోయిన 'తిక్కన బయ్యనలు' ఇరువురును—అల్లుందిక్క విజయాదిత్యులు—సజీవులై యుండిన కాలమునకు క్రీ. శ. 1249 కి ముందే జరిగి యుండవలెను. మనుమసిద్ధి పాండ్యుల తోడి రణమున మరణమందిన కాలమునకు తిక్కనయున్నాడో గతించెనో. ఏలయన భారతము రచించు నాటికి తిక్కనకు తండ్రి లేదు. నిర్వచనోత్తర రామాయణము నాటికే తిక్కనను మనుమసిద్ధి మామ యని పిలిచెడు వాడు. క్రీ. శ. 1243 నాటికే మహావీరుడై విజయములు గాంచిన మనుమసిద్ధి బాలుడుగా నుండడు. 1243 నుండి 1263 వఱకు దాదాపిరువది ఏండ్లు రాజ్యమునకై పోరాడియున్నాడు. ఇరువది ఏండ్లకే రాజ్యమునకు వచ్చెనని తలంచినను గతించునాటికి మనుమసిద్ధికి నలువదియైన నుండవలదా. కాని అల్లుని తమ్ముడు 1281 వఱకో లేక 1284 వఱకో జీవించియుండినట్లు కనుబడుచుండుట చేత అల్లునికన్న చిన్నవాడైనను, అల్లుని తమ్మునితో సమ వయస్కుడై యుండవచ్చునుగదా. విజయాదిత్యుడు దాదాపు నలువది యేండ్లు (1243—1283) పోరాడి యున్నాడు గదా. 1243 నాటికి ఇరువదేండ్ల వాడన్నను అఱువదేండ్లు జీవించి యుండవలయును. కాని నాటి రాజకీయ వాతావరణమును చూచిన యెడల అంతకన్న పెద్దవాడైయే యుండవలెనని తోచుచున్నది. మనుమసిద్ధియు రణ మరణమందు నాటికి దాదాపేబది యేండ్లవాడుగా నుండియుండును నాటికి తిక్కన సోమయాజి గతించియుండును. లేనిచో ఆంధ్ర మహా భారతానంతరము ఆయన ఏమియు వ్రాసినట్లు లేదు. ఏవేవో గ్రంథములు ఆయనకు ఆరోపితములైనవి. తర్వాతి వారికి మార్గదర్శకుడై పూజ్యుడైన కవిబ్రహ్మయొక్క గ్రంథములు నశించిపోవునా? కావునను, ఇతర కారణములచేతను వానిని పండితులు తిక్కనవి కావని తలంచినారు.

# తిక్కన రచనాకాలము

పైగా తిక్కన ఒక కాళయుక్తి సంవత్సరము గతించి నట్లొక పద్యము మెకంజీగారి సంచయమున దొరకి యున్నది.

''అంబర రవి శశి శాకా
బ్దంబులు చన గాళయుక్తి భాద్రపదపు మా
సంబున సంబరమణి చిం
బంబన దగు తిక్క యజ్వ బ్రహ్మము చేరెన్.''

దీనింబట్టి శా. శ. 1120, క్రీ. శ. 1198 అగుచున్నది. కాళయుక్తి సరియేగాని క్రీ. శ. 1198 నిధన కాలమగుట అసంభవముగదా. తర్వాతి కాళయుక్తి యగునేని క్రీ. శ. 1258 అగుచున్నది. క్రీ. శ. 1249 కి ముందే భారత రచనయేని నాటికి గణపతి నెల్లూరి పఱకుసుపచ్చి కంచిని కూడ జయించినను విజయాదిత్యుడు పట్టు వదలేదు. మనుమసిద్ధియు నెల్లూర పాలింపలేదు. పెంట్రాల శాసన మునాటికి మరల వచ్చియున్నాడు. మరల నొక సంవత్సర మున కొండ్రిలో, మధ్య, 1260 కి విజయాదిత్యుడు ఉచ్చటనే శాసనము వేసియున్నాడు. మరల దుర్ముఖిలో మనుమసిద్ధి వచ్చి యున్నాడు. ఇరువురు రాజులను పోటీలు వేసికొని అయాగారిలోనే శాసనములు వేయించుట, పైగా 'తమ రాజ్యాభివృద్ధికి' అని వ్రాయించుకొనుట చూడగా యుద్ధములలో పరస్పరము జయించుచు ఓడిపోవుచునుండిరని తోచుచున్నది. తుదకు ఇదంతయు 1263 నాటి ముత్తుకూరు యుద్ధమునకు దారితీసియుండును. గణపత్యాదులు మనుమసిద్ధికి సాయమై వచ్చినను దైవము ప్రతికూలమైనది. తిక్కన సోమయాజిని పోషించిన ప్రభువునకు ఆయువు తీరినది. కాగా రాజకీయ విప్లవవాదుచే నెమ్మదిలేక తిక్కనకవి భారతానంతరమ్ము ఏమియు వ్రాసి యుండడు. క్రీ. శ. 1258 (కాళయుక్తియే) నాటికి మనుమసిద్ధి కందుకూరు సీమలో నుండుట, అడ్డులేక మూడేండ్లుండిన యనంతరము విజయాదిత్యుడు వచ్చుట చూడగా, క్రీ. శ. 1249 లో నొకమారు విజయము గాంచి నను క్రీ. శ. 1258 (కాళయుక్తి) నాటికి మనుమసిద్ధి నెల్లూరిలో స్థిరపడినట్లున్నాడు. ఆ సంవత్సరమే, కార్య సాఫల్యా, నంతరమే తిక్కన సోమయాజియు 'బ్రహ్మము' చేరి యుండును. ఇది ఈ చారిత్రక పునర్నిర్మాణమునకు సరిపడుచున్నది.

కావున తిక్కన 1280 ప్రాంతమున గ్రంథ రచనలు చేయుచు మనుమసిద్ధికి అంకితమిచ్చుచు కాలక్షేపము చేయుచుండెననుట ఎంతమాత్రము కుదరదని శ్రీ రెడ్డిగారికి నా విన్నపము.

సారాంశము—(1) విజయాదిత్య గండ గోపాలుడు బయ్యారియే. (2) సుందరపాండ్యునిచే చంపబడినవాడు విజయాదిత్యుడు కాడు (3) వీరగండ గోపాలుడు మనుమసిద్ధియే. (4) నిర్వచనోత్తర రామాయణ దశకుమార చరిత్రల రచనా కాలము క్రీ. శ. 1243—46 లకు నడుమ. (5) ఆంధ్ర మహా భారత రచనా కాలము క్రీ. శ. 1246—49 లకు నడుమ. (6) తిక్కన నిధన కాలము క్రీ. శ. 1258. (7) మనుమసిద్ధి నిధనకాలము 1263. (8) రెండవ తిక్కరాజు రాజ్యమునకు వచ్చినది 1279— జక్కన తాత కాలము.

శ్రీ రెడ్డిగారు ప్రతిపాదించినవి కుదురవు.



# చిత్రకవి సింగరార్యుఁడు

## శ్రీ రావూరి దొరస్వామిశర్మ

కందుకూరి వీరేశలింగం పంతులుగారు కవుల చరిత్ర తృతీయ భాగమున 'ఈ కవి యారువేల నియోగి బ్రాహ్మణుఁడు' అని వ్రాసియున్నారని, 'అసలీ చిత్రకవి సింగరాచార్యుడు నెల్లూరుజిల్లా, కందుకూరు తాలూకా, చిత్రకవివారిపాలెం నివాసం. శ్రీవైష్ణవ బ్రాహ్మణుడు. చక్కని విశిష్టాద్వైత సాంప్రదాయము కల వంశము. నేటికిని వీరి బంధువర్గమే గాక పుత్ర పౌత్రులును ఉన్నారు ..... యదార్థ మిట్లుండగా కవి చరిత్రకారు లెల్లరు (ఆధునిక రచయితలు కూడ) మూక యుమ్మడిగ నొకటే త్రోవన నీతనిని నియోగి యని వ్రాయ సాహసించిరి.' అని శ్రీ కొమండూరి రామానుజాచార్యులు భారతి 1963 నవంబరు సంచికలో లేఖలలో 'చిత్రకవి సింగరాచార్యుడు నియోగియా ?' అను శీర్షిక క్రింద వ్రాసిరి. (పుట 100)

పంతులుగారి వ్రాఁత ప్రామాదిక మనుటలోను ఆచార్యులవారి నిర్ణయము సమీచీన మనుటలోను సందియము లేదు. ఈ నిర్ణయమున నా యెఱిగిన కొన్ని క్రొత్త విషయములు పండితలోకమునకుఁ దెలుప నుద్దేశించి యిది వ్రాయుచున్నాను.

చిత్ర కవిసింగరార్యుడు రచించిన గ్రంథము బిల్హణీయము (తెలుగు పద్య కావ్యము). నేఁ డుపలబ్ధ ముద్రిత బిల్హణీయమునఁ దత్కర్త 'పండిపెద్ది కృష్ణస్వామి' యని యున్నది. చిత్ర కవిసింగరార్యుని పేరు గానరాదు. అందలి యవతారికలో నిట్లున్నది—

(కృతికర్త పండిపెద్ది కృష్ణస్వామి వాక్యములు) అని యివ్విధంబున నిష్ట దేవతా నమస్కరణంబును సత్కవి పురస్కరణంబును సుకవి తిరస్కరణంబునుం గావించి యే నొక్కనాఁడు .... హృద్య విద్యానవద్యులగు విద్వదాద్యులు గొలువం గొలువుకూటంబున్ నధివసించి ..... దీపించు నవసరంబున.

గీ. చిత్ర కవివంశ దుగ్ధాబ్ధి శీతభానుఁ
డనుప మానోక్తి శ్రీ సింగరార్య సూనుఁ
డమిత కవితా విశేషజ్ఞుఁ డనఁగ వెలయు
నారసింహార్యకవి వచ్చి నన్ను మెచ్చి.
సీ. గీ. పండిపెద్ది కులీన సంపన్నిధాన
పాలిత కవీంద్ర శ్రీ కృష్ణ పండితేంద్ర.

వచనము. అని వినుతించి .... లోకంబులఁ గృతి ముఖంబుగాఁ గీర్తి నిత్యంబగు నట్టి కృతులయందు నాంధ్రం బతి రమణీయంబు గావున నొక్క పురాతన కథ నాంధ్ర ప్రబంధంబుగా రచియించి రామాంకితంబు చేసి యా చంద్రతారకంబగు సత్కీర్తింగాంచు మనిన నేనును సంతోషితాంతరంగుండ నగుచు.

క. మున్నింద్ర తనూభవునకు
వెన్నుండు సహాయుఁడైన విధమున నే నా
సన్నుత సద్గుణ సం
పన్నుండగు కవివరాధిప సహాయమునన్.

వ. అంకితంబుగా నా యొనర్పం బూనిన బిల్హణోపాఖ్యానంబను మహాప్రబంధంబునకు.... (పీఠిక 5, 6, 8, 9, 10 పద్యములు.)

చిత్రకవి సింగరార్యుని కుమారుఁడు నారసింహార్యకవి పండిపెద్ది కృష్ణస్వామి వద్దకు వచ్చి కృతి రచింపఁ బ్రోత్సహించినట్లు పీఠిక చెప్పుచున్నది. మఱి యీ గ్రంథ రచనలోఁ నారసింహార్యకవి సహాయపడినట్లు దెలుపబడినది.

కృత్యవతరణిక యిట్లున్నను నిజమైన గ్రంథకర్త చిత్రకవి సింగరార్యుఁడే యనియు, నాతని యనంతర మాతని పుత్రుఁడు నారసింహార్యుఁడు కృష్ణస్వామి యను సంపన్నున కీ కృతి నిచ్చుటే కాక ద్రవ్యలోభమునఁ గృతి కర్తృత్వము సంతత వ్యాతు పేర వెలయించెనని తెలియవచ్చె ౧. కృష్ణస్వామి రచించినట్లు కృత్యాది పద్యముల మార్చి యిచ్చుటలో నారసింహార్యకవి సహాయపడెనని తలంపనగును.

ఏందును ఆశ్వాసాంత గద్యలందును కృష్ణస్వామియే రచించినట్లు చెప్పఁబడి యున్నను, ప్రథమాశ్వాసాంత మందలి యీ క్రింది చక్రబంధ పద్యము వలన 'సింగరార్యకవి—కర్త' యని తెలియవచ్చుచున్నది.

శా. 'ధన్యాసింహాభ చంద్రకీర్తివర విద్యా పండితార్యక్రమా
గణ్యా గర్వి ధనంజయా శివదముక్తా కృత్యగంకప్రభా
జన్యారాజిత భూరి శాత్రవ కుభృజ్జాతి ప్రభావిక్రమా
మాన్యారాధన త్యాగ భోగ జయధామా నవ్య భాగ్యోత్తమా.''

ఈ చక్రబంధములోని మూఁడవ వలయమున (అనఁగా ప్రతి పాదమున కేవల నావల మూఁడవ యక్షరములు వరుసగా గలిపి చదివినచో మొదటి మూఁడు పాదములకే యీ నియమము) 'సింగరార్యకవి' యను పేరు వచ్చును. ఈ చక్రబంధ రహస్యము తెలిసియో తెలియకయో నారసింహార్యకవి ఈ పద్య మట్లే యుంచి తండ్రిపేరు నిలిపినవాఁ డయ్యెను.

చక్రబంధాక్షరాంకిత సింగరార్యకవి కృత్యవలారికలోని చిత్రకవి నారసింహార్యకవి తండ్రి యనుట విస్పష్టము. ఇది కృష్ణస్వామి కవి కీర్తి కాంక్షను దెలుపుచున్నది. కృష్ణస్వామి కవిపోషకుఁడని కృత్యాది సాక్ష్య మిచ్చుచున్నది. కొందఱు సంపన్నులు కవి యశః ప్రార్థులై ధనమిచ్చి కొని యితరుల కావ్యములను దమపేర వెలయించుకొందురు. భీమకవి ప్రణీత కవి జనాశ్రయమును రేచనయు, రంగనాథ రామాయణమును గోన బుద్ధారెడ్డియు, శ్రీనాథుని క్రీడాభిరామమును వల్లభరాయలును ఇంకను మఱికొంద రిట్లే యితరుల కృతులను దమపేర (కృతికర్తలుగా) వెలయించుకొని ధన్యులయిన మాన్యులు గలరు. *వీని కర్తృత్వ వాదోపవాదములు మనకిం దప్రస్తుతము.

కందుకూరివారు సాధారణముగా కవి పేరి చివర అమాత్యశబ్ద మున్నచో అట్టి కవుల నందఱిని నియోగి బ్రాహ్మణులని నిర్ణయించిరి. సింగరార్య కవి పేరులో అట్టి అమాత్య శబ్దము లేదు. అట్లున్నప్పుడు పంతులుగారు ఇతఁ డార్వేల నియోగి యని చెప్పుట కాధార మేమై యుండు ననుట యరయఁదగును. నా కిట్లు తోఁచెను—చిత్రకవియని యింటి పేరుగల కవులు మఱి ముగ్గురు కవులు చరిత్ర కెక్కియున్నారు.

చిత్రకవి పెద్దన—ప్రసిద్ధ లాక్షణికుఁడు—లక్షణసార సంగ్రహకర్త, అతని పుత్రుఁడు చిత్రకవి అనంతకవి—ఇందుమతీ పరిణయ ప్రబంధకర్త—హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యాత, మనుమఁడు చిత్రకవి వెంకటరమణకవి—సాంబవిలాస కావ్యకర్త.

(చూ. కందుకూరి కవుల చరిత్ర—ద్వితీయభాగము)

చిత్రకవి పెద్దన శుక్లయజుశ్శాఖీయుఁడు అని లక్షణసారసంగ్రహమువలనఁ దెలియుచున్నది. దీనింబట్టి చిత్రకవి పెద్దన ప్రథమశాఖా నియోగి బ్రాహ్మణుఁ డగును. కందుకూరివా రన్నట్లు ఆర్వేల నియోగి యనుట కాధారములేదు. చిత్రకవి పెద్దనను ఆఱువేల నియోగి యని నిర్ణయించెను గాన పంతులుగారు తద్వంశీయుఁ డనుకొని మన చిత్రకవి సింగరార్యుని సయితము ఆర్వేల నియోగి శాఖలోఁ జేర్చి వైచెను. పంతులుగా రార్వేల నియోగి, వారి శాఖాభిమాన మట్టిది కాఁబోలు !

ఈ చిత్రకవి పెద్దనాదిత్రయమునకు సింగరార్యున కెట్టి సంబంధమును లేదని పరిశీలనవలన నెఱుఁగ నగుచున్నది. చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహము ప్రతి వ్రాసికొన్న చిత్రకవి రామానుజార్యుఁ డొకఁడు గలఁడు. అతఁడు రఘునందన విలాస కృతికర్త. అతఁడు వైష్ణవుఁడని ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ప్రకటించిన లక్షణ సారసంగ్రహోపోద్ఘాతములోఁ దెల్పినారు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు. చిత్రకవి వారలలో వైష్ణవులును గల రనుట కిదియు నొక యాధారము.

చిత్రకవి సింగరార్యుఁడు వైష్ణవ బ్రాహ్మణుఁ డనుటకు గ్రంథస్థాధారమును గలదు అది యీ క్రిందిది—

'రాఘవ వాసుదేవీయము' అను ద్వ్యర్థి కావ్యము చిత్రకవి సింగరార్య కృతము. ఇది యముద్రితము. దీని వ్రాత ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునఁ గలదు. ( D. No. 688)

ఈ ద్వ్యర్థి కావ్యము కామినేని కులసంజాతుఁడగు బంగారు అంకభూపాలున కంకితము. కృతిపతి కవిని బిల్చి పల్కినట్లున్న పద్యము—

'నను నారాయణమౌని పాదవిల సన్నాళీక సేవామరం
ద నితాంతాంచిత పాననీత కవితాధారా సువర్ణాంధ్ర వా
గ్జనితానేక విచిత్ర కావ్య ఘటనా శ్లాఘ్యున్ మహాశ్లిష్ట క
ల్పను శ్రీవైష్ణవ వంశవార్ధి శశీ బిల్వంబంచి పల్కెం
గృపన్.'

కవి స్వ విషయము—

వ. రంగాచార్యులకును కోనమాంబకు సింగరాచార్య సమాఖ్యుఁడనగు నే నాదిగా నలుగురు ముద్భవించితిమి.

గీ. అనెడు నన్ను బుధుల్ గొనియాడి బిల్హ
ణంబు మొదలైన కృతులు విన్నాము తెలుఁగు

* 'అయ్యగారి వీరభద్రకవి రాఘవ యాదవ పాండవీయము—వఝ్ఝల నారాయణ విద్వత్కవీంద్రుని రచన' అని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వంగూరి సుబ్బారావుగారి ఆంధ్ర వాఙ్మయ చరిత్రానుబంధములో (పు—459) వ్రాసియున్నారు.

నిపుడు భగవత్కృపాప్తి నూహించునట్టి
కావ్యము రచించు శ్లేషోక్తి కవులు మెచ్చ.

గద్య—ఇది శ్రీ మదళహ సింగరి స్వరూప శ్రీమన్నారాయణముని గురుచరణ సేవా సంప్రాప్త కవితా సామ్రాజ్య ధౌరేయాత్రేయ గోత్ర పవిత్ర క్రొత్తపల్లి రంగాచార్య పుత్ర చిత్రకవి సింగరార్య ప్రణీతంబైన రాఘవ వాసుదేవీయము.

రాఘవ వాసుదేవీయమునఁ గూడ బిల్హణీయ మందువలె ప్రథమాశ్వాసాంతమందే అదే ఎత్తుగడతో చక్రబంధ శార్దూలము గలదు. చూఁడుడు—

'ధన్యా సింహ సువీర్య వైభవ పరార్థ్య భూరి శౌర్యక్రమా
జన్యా గమ్యవరాంగ శాత్రవహరా జ్యావర్ణభా కృత్ప్రభా
ధన్యారాధిత క్రమ ధాతువర విద్యారమ్య కాంతి క్షమా
మాన్యారాధన రాజతాద్రి ధరధామా అంక భాగ్యోత్తమా.'

ఇందు మూఁడవ వలయమున 'సింగరార్య కృతి' అని, ఆఱవ వలయమున 'వీరాంక భూవర' అని కృతికర్తృ కృతి భర్తృ నామములు వచ్చును.

ఈ రాఘవ వాసుదేవీయ రచనను బట్టి చిత్ర కవిసింగరార్యుఁడు శ్రీవైష్ణవుఁడు, ఆత్రేయ గోత్రజుఁడు అనుట స్పష్టము, నిర్వివాదము. వీరి యస లింటిపేరు క్రొత్తపల్లి వారని, చిత్రకవి యన్నది బిరుదనామమని, రాఘవ వాసుదేవీయమునకుఁ బూర్వము బిల్హణీయము రచించెనని విదితమగుచున్నది. పూర్వ వ్యాసకర్త తద్వంశీయుల వలన విన్న మాటకు (శ్రీవైష్ణవుఁ డనుటకు) గ్రంథ ప్రామాణ్యమే లభించినది గాన వీఁక సందేహింపఁ బనిలేదు. కందుకూరివారిది యూహా మాత్రమే.

రాఘవ వాసుదేవీయమును పంతులుగారి తరువాత వెలసిన కవి చరిత్రకారులు, వాఙ్మయ చరిత్రకారులు పరిశీలింపలేదని తోఁచెడు. వావిళ్లవారు ముద్రించిన బిల్హణీయ పీఠికలో రాఘవ వాసుదేవీయ ప్రస్తావము గలదు. ఇదిగూడ నేఁటి కవి చరిత్రకారుల దృష్టికి రాకపోయినది.

ఈ కవి విషయమందే కాదు, ఇంకను బెక్కు విషయములలోఁ దరువాతి కవి చరిత్రకారులు అపరిశీలితముగ పంతులు గారి వ్రాఁతలను యథాతథముగా గ్రంథస్థము చేసియున్నారు. అప్రస్తుతమే యయ్యును దీనిని నిరూపింప నొక యుదాహృతి చూపెదను—కవి సంజీవని యను లక్షణ గ్రంథమును రచించిన ముద్దరాజు రామనను గూర్చి తెలుపుచోట 'ఇతఁడు మఱియు రాఘవ పాండవీయమునకు వ్యాఖ్యానము గూడఁ జేసెను' అని వ్రాసిరి పంతులుగారు (కవుల చరిత్ర ద్వితీయ భాగము—పుట 305) ఈ వ్రాఁత నాధారముగాఁ గొని ఆంధ్ర కవి తరంగిణీకర్తలు 'ఈ కవి పింగళ సూరనార్యకృత రాఘవ పాండవీయమునకు వ్యాఖ్య వ్రాసియున్నట్లు తెలియుచున్నది. కాని నాకా వ్యాఖ్య లభింపలేదు.' అని వ్రాసిరి. (XI సంపుటము—పుట 213—1954 సం. ముద్రితము) తరువాతివారిట్లే యనువదించిరి.

రాఘవ పాండవీయ వ్యాఖ్యానము రచించినది ముద్దరాజు రామన గాదు. ఇతని యన్న పెదరామన దాని వ్యాఖ్యాత. ఈ పెదరామన వ్యాఖ్యతోఁ జిరకాలముగా రాఘవ పాండవీయము ముద్రితమై ప్రచారములో నున్నది. వావిళ్లవారు గూడ నీ వ్యాఖ్యతోనే రాఘవ పాండవీయమును బ్రకటించి యున్నారు. ఈ వ్యాఖ్యాంత గద్యను బరిశీలింపకయే పంతులు గారి వ్రాఁత ననుసరించి తక్కిన కవి చరిత్రకారులు ప్రమాదమునకు లోనయిరి. రామన సోదరులలోఁ గలిగిన యీ పొరపాటును గూర్చి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో (ఛందోదర్పణ సమీక్ష, అనంతుని ప్రశస్తి—అను వ్యాసము—1949—50 సం. 38 సంపుటము—పుటలు 25—26) వ్రాసియున్నాను.

ఇఁకఁ బ్రసక్తాను ప్రసక్తముగా మఱియొక విషయము దెలుపఁ దలఁచితి.

రాఘవ వాసుదేవీయ కృతిపతి అంక భూపాలుని కాలము వాఙ్మయ చరిత్రకారులు నిర్ణయింపవలసి యున్నది. బిల్హణీయస్థ చక్రబంధములోని ఆఱవ వలయములో 'చెన్నభూప కృతి' అని కలదు. ఆ చెన్నభూపాలు డెవఁడో ? అంకభూపాలుని కాలనిర్ణయము చేసినచో చెన్నభూపతి యెవఁడో ఏర్పడవచ్చును. సింగరార్యకవి అంకభూపాల చెన్నభూపాలుర కాలములో నున్నవాఁడు. పండిపెద్ది కృష్ణస్వామి కాలములోనో యాతని కించుక పూర్వమో వెలసినవాఁడు (సింగరార్యసూనుఁడు కృష్ణస్వామి సమకాలికుఁడు గదా) కందుకూరివారు 'ఈ కావ్యము 150 సం. కుఁ బూర్వము రచియింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది.' అని వ్రాసిరి. 'ఈ కవి కాలము నిర్ణయించుటకు నితని సంతతిలోని నాలుగైదు తరమువారిప్పుడు కందుకూరు సీమలోని చిత్రకవివారి యగ్రహారమను గ్రామమందును మఱియు నా ప్రాంతములందును నివసించుచున్నారు, గావున నీ కవి సుమారు 120. సం. కు లోపువాఁడని యూహ గలుగుచున్నది' అని వావిళ్లవారి బిల్హణీయము పీఠికలోఁ దెలుపఁబడినది (1914 సం.)

మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో నున్న బిల్హణీయము వ్రాఁత ప్రతిలో (R. No. 148) 'తారణ సం.

శ్రావణ. శు. శుక్రవారం రోజున బిల్హణోపాఖ్యానము వ్రాయుట మయినది' అని కలదు. ఇది కవి వ్రాతయో ? ప్రతి లేఖకుని వ్రాతయో ? ఈ గ్రంథాలయ త్రైవార్షిక సూచికలో (Triennial Catalogue — 1917) 'Pandipeddi Krishnaswami who lived only a few decades ago' అని యున్నది.

'బిల్హణీయ కర్తగా నున్న పండిపెద్ది కృష్ణస్వామి ఆర్కాటు నవాబునకు దుబాసి. ఇతఁడు ఆంధ్ర సాహిత్య పరిషత్ స్థాపకులలో నొకరగు దివాన్‌బహదూర్ ఆదినారాయణకు మేనమామ. ఆదినారాయణ రెవెన్యూ సెటిల్మెంటు కమీషనరుగా నుండెను.' అని కీ. శే. వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులు వారితో నొకసారి చెప్పిరి.

బిల్హణీయ చక్రబంధమునుబట్టి యీ గ్రంథము చెన్నభూపాలుని కంకితమని తెలియవచ్చెడు. ఉషాపరిణయ ప్రబంధకర్తయగు దామెర అంకభూపాలుని తండ్రి చెన్న భూపతి యొకఁడు గలఁడు. ఇతఁడొక సామంతరాజని యెరుగనయ్యెడు (చూ. కవితరంగిణి సం—57 పుట) ఇతని పేరనే నేటి చెన్నపట్టణము (మదరాసు) నిర్మితము (1639 సం. లో) దామెర్లవారు కర్ణాటక రాజులకు సామంతులు. చెన్నభూపుని రాజధాని ఉత్తరార్కాడు మండలములోని రాయవేలూరు. ఈ చెన్నభూపతి వెలుగోటి కస్తూరి రంగ నాయకుని యల్లుఁడు బంగారు యాచమనాయని సోదరీ భర్త. (చూ. కవితరంగిణి సం. 57 పుట)

ఈ యంశములుబట్టి దామెర్లవారికిని (చెన్నభూపతి వంశమునకును) వెంకటగిరి సంస్థానాధిపతులగు వెలుగోటివారనబడు బంగారు వారికిని (బంగారంక భూపతి యెండెవరో నిర్ణయింపవలసి యున్నది) సంబంధ బాంధవ్యములున్నవనుట తెల్లమగుచున్నది. సింగరార్యకవి యీ రెండు వంశములవారి నాశ్రయించి కృతుల నిచ్చెను. ఈ యంశములన్నియు మన కవి కాలనిర్ణయములో భావి పరిశోధకులకు నుపకరించునని నివేదించితిని.

ఈ రాఘవ వాసుదేవీయ మజ్ఞాతముగా నుండుట చేతనే సింగరార్యకవి విషయము విజ్ఞాతముగాక యున్నది. ఇట్టి యమూల్య గ్రంథములు ఇంకను పండలకొలఁది వ్రాతప్రతుల యవస్థను దాఁటక నానాఁటికి జీర్ణించుచు నటనట లైబ్రరీలలో మూలఁబడి యున్నవి. శిథిలప్రాయములుగా నున్న లక్షణ గ్రంథముల ముద్రణావశ్యకతను గూర్చి నా రచించిన తెనుఁగు ఛందోరీతులను గ్రంథములో సవిస్తరముగాఁ దెల్పి యున్నాను లిఖితావస్థలో నున్న యీ గ్రంథముల నుద్ధరింప నొక చక్కని ప్రణాళిక నేర్పఱచి వీటి నెఱిఁగిన విద్వాంసుల సహాయమునఁ బరిష్కరింపించి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీ ముద్రించి ప్రకటించి సాహిత్యలోకము మన్ననలుగాంచి చరితార్థ మగుఁగాక.

ఈ వ్యాసములో నా తెల్పిన విషయసారము :

చిత్రకవి సింగరార్యుఁడు నియోగికాఁడు, శ్రీవైష్ణవ బ్రాహ్మణుఁడు. బిల్హణీయమునే కాక రాఘవ వాసుదేవీయము గూడ రచించెను. ఇతఁడు చెన్నభూపాల అంకభూపాలుర కాశ్రితుఁడు.

ఇఁక పరిశోధకు లీతని కాలమును నిర్ణయింతురుగాక.

# మొల్లరామాయణము
# కాలవిమర్శ పరిశీలన

శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

నా వ్యాసమును వెనుకటి భారతిలో శ్రీ తురగా కృష్ణమూర్తిగారు విమర్శించుటలో మొల్లకవయిత్రి నేనన్నట్లు అళియరామరాయల కాలమునాటిది కాదని, తా మన్నట్లు 'రసికుఁడైనట్టి శ్రీనాథుని' సమకాలికురాలని మరల సిద్ధాంతము చేసిరి. కాని, నా కిప్పటికిని ఆ రాద్ధాంతము నచ్చలేదు.

కావ్యాంత భరతవాక్య మందలి 'వర్ణమిళిత' పదప్రయోగము మొల్ల శ్లేషార్థ స్ఫురణకునై చేసినదే కాని ప్రత్యేక దృష్టితో తన కాల నిర్ణయ విధానమునకు వ్యంజకముగ వాడినదిగాదని చెప్ప సాహసించు(ట) సరికాదు.

శబ్దశక్తి మూలక ధ్వని చరిత్ర వాచ్య చరిత్ర కంటె శ్రేష్ఠమైన దైనను, సందేహగ్రస్తుల కది నిత్య శంకగా మిగులుట నైజము.

'వర్ణ మిళితంబు .... యవనులందుననే కా(దు), 'గుర్వు లింగ జంగమార్చన' యందును కలదు. కాబట్టి, మొల్ల తన తండ్రి వీరశైవ మత వర్ణ సాంకర్యమును మరచిపోయి, అన్య మ్లేచ్ఛ మత 'వర్ణ మిళిత' సాంకర్యమును మాత్రమే శ్లేషగా వర్ణించిన దనుట కంటే దేశ చరిత్రనే శబ్దశక్తి మూలక ధ్వనితో వ్యంజకము చేసిన దనుట యుక్తి యుక్తము.

కల్క్యవతార 'మ్లేచ్ఛ' దండయాత్రా సాదృశ్యమును 'రామావతార' 'యవన' దండయాత్రా చరిత్రగా మార్చుట రూపక సమ్మతమైనను, ప్రయోజన రహిత మనుట హేతువాదము కాదు.

'తౌరంగిక ఖడ్గ ఖండిత సమస్త మ్లేచ్ఛ తుచ్ఛాంగ' పురాణ కల్కియుద్ధ చరిత్రనే మొల్ల కాలమునాటి చారిత్రక రామరాజ్యములో జరిగినట్లు మార్చి చెప్పుట నిష్ప్రయోజన మెంతమాత్రము కాదు.

అళియ రామరాయ కాలమునాటి కవుల యభిప్రాయము లెట్టివో పరిశీలించుట ముఖ్యము.

చింత కవులందుఁ దపసుల చిత్తమందు
వర్ణ మిళితంబు చిత్తరువందు యవను
లందుననె కాని యొండెడఁ జెందకుండ
లీల ధరయేలె రామ భూపాలవరుఁడు.
'ఈ రామచరిత్ర మెప్పుడుఁ (మేలుసెందు).

బీజప్రాయముగా మొల్ల వ్యంజకము చేసిన రామ చరిత్రను, భట్టుమూర్తి వాచ్య రామచరిత్రగా మార్చి వర్ణించి, వ్యాఖ్యానించినట్లు కనబడుచున్నది.

శరణన్న మల్కు నిజాముని కభయం బొ
సంగి తదీయ రాజ్యంబు నిలిపె
నవని యంతయు రామరాజ్యంబు సేసె
దన గుణంబులు కవి కల్పితములుగాఁగ
నలవియె రచింప సత్కావ్యములను వెలయ
భూమి నొకరాజ మాత్రుఁడే రామవిభుఁడు.

అతఁడు కలియుగ నవ్య రామావతార
చారుతా సార్థ నామ ప్రచారుఁడగుచు
వెలయు బ్రహ్మాండ పేటికా వితత కీర్తి
ధనుఁడు శ్రీరంగ విభు రామ ధరణిభవుఁడు.

క్రీ. శ. 16 శతాబ్దమునాటి రామరాజ్యము, నవ్య రామావతారము—చారిత్రచారుభూతి—సార్థ నామము. ఇది ప్రచార వ్యంగ్య చరిత్ర యనుటలో నా తప్పు కాని, మొల్ల తప్పు కాని లేదనిపించుచున్నది.

'సీతా కల్యాణ కాలముననే 'యవనులు' హిందూ దేశమున నుండిరని చెప్పుటకు మొల్ల సాహసించుట !' తప్పు కాదు. అది వ్యాస భారత స్వయంవర సాంప్రదాయమునకు చెందినదే.

ద్రౌపదీ స్వయంవర ప్రేక్షకులుగా 'యవనాధిపాంశ్చ—యవనాధిపులును' పాల్గొన్నట్లు వ్యాస భారతమందు

వర్ణించుట తప్పు కానప్పుడు, ఆ సాంప్రదాయమును మొల్ల వర్ణించుట తప్పెట్లగునో తెలియదు. తెనుగు భారతములో నన్నయ స్వయంవర ఘట్టములో దీనిని చేర్పక మడి కట్టు కొన్నను, రాజసూయ దిగ్విజయములో 'ద్రవిడ యవన కరహాట భూపాలకుల నోడిచి' నట్లును, 'అట సహదేవుడు దక్షిణ దిక్కున కరిగి సుమిత్ర శూరసేన దంతవక్త్ర యవనులను గోశృంగ గిరి నివాసులను జయించి కుంతిభోజా చేతం బ్రియపూర్వకంబున సత్కృతుండయి' నట్లును వ్రాయుటయే కాక, 'మఱియు .... కీచక వనవాసులయిన గుళింద పారద బర్బర తురుష్క చెంకణ కొంకణాధిపతులును వశగతులై' నట్లు కూడ వ్రాసెను. వ్యాస భారతములో దీనికి భిన్నముగా తూర్పుదిక్కున భీముడు 'మ్లేచ్ఛ నృపతీన్—మ్లేచ్ఛ నృపతులను' జయించినట్లు మార్పు కనబడుచున్నది. ఒక్క శ్లోకములోనే 'మ్లేచ్ఛాన్, యవనాన్, శకాన్' అను జాతులు పేర్కొనబడినవి. అందుచేత 'నీ 'యవన' దేశ ప్రశంస కొంత అధునాతన' మన వీలులేదు.

కలియుగాదిలో కల్క్యవతార కాలము నుండియు 'మ్లేచ్ఛ—యవన' జాతులు చారిత్రకముగా కలవనుట పురాణ సమ్మతము.

మఱియును, ఆది రఘురామ చరితము నాదరమున విన్నఁ గ్రొత్తయై లక్షణసం పాదమై పుణ్యస్థితి పేటమై తోఁచకున్న వెఱ్ఱినె చెప్పన్. అని మొల్ల హెచ్చరించుటలో 'క్రొత్త—రామచరిత — (కన్నడ) లక్షణ సంపాదమై—తోఁచకున్న' దేమో,వ్యంగ్య దృష్టితో చూచి, ఆలోచించి నిర్ణయింపవలసియుండును.

క్రీ. శ. 997—1008 మధ్యకాల మందలి కన్నడ కావ్యములో 'రన్న కవి' వాచ్యముగా 'కృతి—గదాయుద్ధం, కృతి పతి)—చక్రవర్తి ''సాహస భీమం'' అని నిరూపించినట్లే—క్రీ. శ. 1542—64 మధ్య కాలములో వ్యంగ్య వసు రూపముగా కథానాయక—కృతినాయకా భేద దృష్టితో రామాయణమును మొల్ల కూడ చెప్పినట్లున్నదన వీలున్నది.

వారాంగన శ్రీరాముని
పేరిడి రాచిలుకఁ బిలిచి పెంపు వహించెన్
నేరుపుగల చందంబున
నా రాముని వినుతి సేయ హర్షము రాదే !

ఈ రామనామ మాహాత్మ్యములో 'ఆ రాముని వినుతి—నా రాముని వినుతి'శ్లేష చమత్కార చరిత్ర వ్యంజక మగుచున్నది.

మొల్ల వారాంగనయో, బసిలియో పోలికన —వ్య క్తి నిర్ణయము చేయకూడదు కాని, పురాణ కాలమునాటి ఆ రాముని తన కాలమునాటి నా రాముని చరిత్రను నామైకదేశ నామగ్రహణ మిషతో వ్యంజకము చేసినట్లు కావ్యాంత భరత వాక్య 'యవన వర్గ మిళిత' వ్యంగ్య చరిత్ర సమర్థనము రూపించుచున్నది.

మొల్ల రామాయణ రచనా కాలము చారిత్రకముగా నిర్ణయము చేయవలయు నన్నచో కావ్యాది యందలి 'రసిక వినుత వాగ్విభవ కళామల్లుల' నామైకదేశ నామ చరిత్రను క్రీ. శ. 1520 ప్రాంతమందలి 'రాచమల్లు కవుల—రాచ మల్లు మల్లుల' రసికవినుతితో రూపించ వీలున్నదో, లేదో విజ్ఞులు తేల్చవలసి యుండును.

నెల్లూరుజిల్లా, రాపూరు తాలూకాలో చిన్న గోపవరము—పెద్ద గోపవరమూ అను రెంటు పేటలు సుమారొక మైలు దూరములో కలవు. పెద్ద గోపవరము పేరే విఖ్యాత గోపవరమని మార్చి చెప్పిన ట్లున్నది. దీనికి నాలుగు—అయిదు మైళ్ళ దూరములో ఆత్మకూరు తాలూకా సరిహద్దున చింతలాతుకూరున్నది. చింతలు—చింతచెట్టు—గుర్తు లోపించగా ఆతుకూరు మిగులుచున్నది. ఆతుకూరుకే సమీపాన ఇంటిపేరే కలిగినట్లున్నది. ఈ యింటి ఆడపడుచే ఆతుకూరు మొల్ల కవయిత్రి. ఆమెకు పెండ్లి అయినట్లు చెప్పలేదు. ఆతుకూరును విడిచిపెట్టి పెదగోపవరము చేరుటయు కారణము కూడ తెలియదు. ఆ పెద గోపవరములో 'శ్రీకంఠ మల్లేశ—శ్రీ గౌరీశ్వర' దేవాలయ మిప్పుడున్నదో, శిథిలమైనదో స్పష్టముగా తెలియలేదు.

క్రీ. శ. 1542—43 తేది ఉదయగిరి కొండవీడు శాసనములో 'అళియ రామరాయ దేవ మహారాజులుంగారు—రామరాజా తిమ్మయ్య దేవ మహారాజులుగారు—పాలించిన ఉదయగిరి దుర్గరాజ్యం' పేరున్నది.

సదాశివరాయల రాజ్యారంభ కాలమందు అళియ రామ రాజాదులు పరిపాలించిన ఉదయగిరి రాజ్యములోనివే మొల్ల నివాసగ్రామములైన ఆతుకూరు, చిన్న, పెద్ద గోపవరము లనుట నిర్వివాదము. అందుచేత సమకాలికురాలైన మొల్ల తన రామాయణములో తన దేశ ప్రభువగు అళియ రామ రాయల రామరాజ్య ప్రశంస కావించినట్లు కనబడుచున్నది.

అతని తమ్ముని కాలములో యవనుల తేగడి(క)' సాన్ని శ్యము నరస భూపాలీయము చెప్పుచున్నది.

'—నే నధివసియించుట యెట్లు బహువిధ—వంక సంభవు లందు .... గోఘాత పాతకులయందు .... దేవతాద్రోహకరు

లందు ననుచు యువనులఁ దెగడి తన్నాశ్రయించువారి' రక్షించుట చారిత్రకముగా క్రీ. శ. 16 శతాబ్దములోను, పౌరాణికముగా కల్కి కలియుగారంభములోను జరిగినట్లు మొల్ల భావించి, రూపకాభేద మిషతో భరతవాక్యములో రామరాజ్య స్థాపన కావించినది. 'ఆ రాజును, దైవమైన రఘురాము నుతించినఁ దప్పు గల్గునే ?' అని ప్రశ్నించినట్లే—'చిల్లర రాజలోకమును జేకొని మెచ్చఁగ నిచ్చ పుట్టునే ?'

అని మరల ప్రశ్నించుట వుల్లవిరుపు మాటగా భావించ వీలున్నను, ఏదో యొక యుక్తివాద సమర్థన సత్యములేక పోదని నా విశ్వాసము.

భట్టుమూర్తి వాచ్యముగా చెప్పినట్లు—

'అవని యంతయు రామరాజ్యంబు సేసె.'

'అతడు కలియుగ నవ్య రామావతార
చారుతా సార్థ నామ ప్రచారుఁ డగుచు.'

వెలయు అళియరామయ దేవ మహారాజును చిల్లర రాజలోకమున చేర్చుటకు వీలు లేదనియే మొల్ల యుక్తివాదము. కనుకనే 'ఆ రాముని, నా రాముని వినుతిసేయ హర్షముఁ రాదే!' అని తన వాదము నెగ్గించుకొన్నది. అయినప్పటికిని పురాణ పురుషుడైన యా రాముని, నా అంతరాత్మలోని నా యాత్మారాముని నుతించిన తప్పులేదు గద ! అని మరియొక యుక్తివాదము.

'శ్రీ గౌరీశ్వర వరప్రసాద లబ్ధ గురులింగ జంగమార్చన వినోద .... మొల్ల .... శ్రీ రామాయణ మహా కావ్యంబు' రచించుట వీరశైవ మత భవి వ్రతమునకు విరుద్ధము కదా ? అన్న అట్టి విరోధము లేదనుచున్నది.

అయోధ్యాకాండలో అరణ్యావాసమేగునప్పుడు '..... ప్రధాన జనంబులును సైన్యంబులును బరివారంబులు విన్ననై యున్న నాసన్న యెఱింగి రామచంద్రుండు రాజచిహ్నంబులు త్యజించి జటావిభూతి వల్కలంబులు దాల్చి ధనుర్ధరుండై యున్నంత' అనుటలో శ్రీరామచంద్రుండు శివభక్తు డగుట చేత 'విభూతి—దాల్చి' నట్లు చెప్పి, శివభక్తుల చరిత్ర వ్రాయుట వీరశైవమత విరుద్ధము కాదనుట 'సూరిజన వినుత కవితా చమత్కార' యుక్తివాదము.

శ్రీరామచంద్రునికిని, అళియరామునికిని పట్టాభిషేక విపర్యయ మగుట పురాణ—చారిత్రక సాదృశ్యము.

కలికి కౌతుకును, అళియరామునికిని యువన దుష్ట శిక్షణ—హిందూ శిష్ట రక్షణ—ధర్మస్థాపన—సాదృశ్యము పురాణ—చారిత్రక ప్రసిద్ధము.

పురుషార్థ నికరంబుఁ బ్రోవఁ జాలు
సిద్ధి విద్యానురాగ ప్రసిద్ధుఁడైన
రాజచంద్రుం డితండని రాజులెల్ల
సన్నుతింపంగ విలసిల్లె జగతియందు
భాగ్య విస్ఫూర్తి రామభూపాలశౌరి.

ఈ రామచరిత మెప్పుడు .... శ్రీరాముని కరుణ మేలు పెందు ......

తెనుగు వాఙ్మయ చరిత్రలో వ్యంగ్య లక్షణ సంపాదమ్మగునటూ ది రఘురాము చరితమును మార్చి క్రొత్తయై తోచునట్లు నవ్య అళియరామ చరితము చెప్పు కీర్తి మొట్ట మొదట మొల్లకే దక్కవలసియున్నట్లు నాకు తోచుచున్నది. కన్నడములో వాచ్యముగా చెల్లు కవి సమయము (గదా యుద్ధాదులు) తెనుగులో వ్యంగ్య వస్తువుగా చెల్లు కవి సమయము (మొల్ల రామాయణాదులు) క్రొత్త లక్షణ సంపాదన కాదనుట సాహసమే యగును. తెనుగు కుమారసంభవ కావ్యములో కృతినాయక—కథానాయకా భేదము వాచ్యముగా చెప్పినట్లే, మొల్ల రామాయణములో కృతినాయక—కథానాయక భేదము వ్యంగ్యముగా చెప్పిన దనుట క్రొత్త లక్షణ సంపాదమ్మని తోచుచున్నది.

కొన్ని చాటు పద్యములనుబట్టి మొల్ల—తెనాలి రామకృష్ణు లిద్దరు సమకాలికులని స్పష్టమగుచున్నది. అందలి సత్యాసత్యము లెట్లున్నను కావ్యమందలి అళియరామ వ్యంగ్య ప్రశంసనుబట్టి క్రీ. శ. 16 శతాబ్దికి చెందినదే కాని, విమర్శకు లన్నట్లు క్రీ. శ. 15 శతాబ్దికి చెందినది కాదనిపించుచున్నది.

(ఈ చర్చకు ఇంతటితో స్వస్తి.—సం. భా.)

# దత్తత

‘‘రంగడాప్

‘‘ధ్యానమే వరమైన గంగాస్నానమే’’ అన్న పాటరేడియో లోంచి వినవస్తోంది. శర్మగారు పూజా గృహంలో కూచుని ఎదురుగా సింహాసనంలోని విగ్రహాలమీద నిర్మాల్యాన్ని తీసి, పూజకు ఆయత్తమౌతున్న సమయం అది. అంటే ప్రొద్దున ఎనిమిది గంట లైందన్నమాట.

ఆ పూజాగృహం మధ్యగా, యంత్ర స్థాపితం చేసి, నవరత్నాల్నీ పొదిగిన మండపం, ఆ మండపంమీద పంచాయతన విగ్రహాలున్న సింహాసనం. ఆ మందిరంనిండా దేవుళ్ల పటాలూ, భగవదారాధనా ద్రవ్యాలే. మండపాని కెదురుగా పీటంమీద శర్మ గారూ, ఆయన భార్యా కూచొని పూజ చేస్తారు. ఆ గృహంలో ఒకమూల రేడియో, ఆ రేడియోలోంచి అనవరతంగా వినవచ్చే శాస్త్రీయ, దైవ సంబంధ సంగీతం చెవుల్లో పడుతూంటే ఆయన తన నిత్య కార్యక్రమం జరుపుకుంటూంటారు. శర్మ గారు నిజమైన భగవద్భక్తులు.

ఆయన వయస్సు అరవై యేళ్ళు. రోజూ విధిగా సూర్య నమస్కారాలు చెయ్యడంవలన, ఆరోగ్యం బాగుండి, కాయ శరీరంగా మారిన, పచ్చని విగ్రహం. మున్నటి గుండు మీద చిన్న పిలక. కళ్లజోడూ, విభూతి బాగా పూసిన నుదురూ, మొహాన్ని చిరునవ్వూ, మెళ్లో రుద్రాక్షలూ, వీటి అలంకరణతో ఆయన దర్శనం చూపరుల నందరినీ ఆక ర్షిస్తుంది.

ఆయన చిన్నతనం నుండీ ఈ దైవారాధన అవిచ్ఛి న్నంగా జరుపుకు వస్తున్నారు. గవర్నమెంటు సర్వీసులో ముప్ఫైఏళ్లు గడిపి, అనేక ఊళ్లు తిరిగి, చివరకు రిటైరై పదివేల రూపాయలతో ఏలూరులో ఒక ఇల్లు కట్టుకుని, అందులో తనకు నచ్చిన విధంగా పూజా గృహాన్ని ఏర్పరచు కొని, శేషించిన జీవితాన్ని కూడా దైవసన్నిధిలోనే గడిపెయ్యా దల్చారు. రోజూ ఎలా లేదన్నా, ధ్యానం, జపం, పూజా, సూర్య నమస్కారాలూ మొదలైన కార్యక్రమం ప్రొద్దున్నపూట ఆరేడు గంటల కాలం తీసుకుంటుంది. రాత్రి మళ్లీ జపం, స్తోత్ర పఠన, హారతీ వగైరా మూడు నాలుగు గంటలు పడుతుంది. ఇదికాక రాత్రి భోజనం అయ్యాక భజనలు గాని, సంగీత కచ్చేరీలు గాని ఉంటే వాటికి కాల నియమం లేదు.

ఇంతకాలమూ ఈ కార్యక్రమానికి భంగం లేకుండా జరుపుకుంటూ వచ్చారంటే ఆయనలో ముఖ్యంగా ఉన్న పట్టుదలే కారణం. ఒక వ్యక్తి మంచికార్యం చేస్తున్నాడంటే హర్షించేవాళ్లకన్నా, అనుమానించేవాళ్ళూ, పరీక్షించేవాళ్లూ అవహేళన చేసేవాళ్లూ ఎక్కువ మంది ఉంటారు. మొదట్లో శర్మగారి పూజల్ని చూసి, ‘ఇదం దంభః!’ అన్నారు కొందరు అసలిందులో ఏదో కిటుకు ఉందేమో ? అని మరికొందరు అనుమానించారు. కొందరు ‘ఇలాటివి చాలా చూశాము’ అంటూ కేవలం కాంతా కనకాలమీద వ్యామోహంతో చేస్తున్నా డని, దుష్ప్రచారం చేశారు. కాని, క్రమంగా వీరంతా కూడా ఆయన శిష్యులుగా మారారు. ఆయనవద్ద పూజా విధానం, సూర్య నమస్కారాలూ నేర్చుకున్నారు. చివరకు ఆయన ఒక మహాత్ముడిగా భావించడే స్థితికి వచ్చారు. ఆయన మాత్రం వీరి నందరినీ అప్పుడూ ఇప్పుడూ ఒకలాగే ఆదరించారు. స్వచ్ఛమైన మనస్సుతో అందరి ప్రేమా పొందారు.

ఒక పవిత్రమైన నదీ ప్రవాహంతో ఆయన జీవితాన్ని పోల్చవచ్చు. ఆ నదిలో అందరూ స్నానంచేసి తమ మాలిన్యాన్ని వదలగొట్టుకుంటూంటారు. ఆ నదిలో నీరు త్రాగి తమ దాహం తీర్చుకుంటారు. ఇంతమందిని కాపాడిన ఆ నది, తన స్వచ్ఛతను తనలోనే నిలుపుకొని మళ్లీ తన దారిన అది సాగి పోతూంటుంది. అదేవిధంగా ఆయన తన వద్దకు వచ్చినవా రందరికీ దైవభక్తి కలిగిస్తూంటారు. వారిని ఆదరంతో, ప్రేమతో, సానుభూతితో పల్కరించి వారి కష్టాలకూ, దుఃఖాలకూ తనకు తోచిన నివృత్తి మార్గం ఉపదేశిస్తూం టారు. ఎందుకంటే, ఆయనకు జ్యోతిషం కూడా వచ్చు. అందువలన ఆయా వ్యక్తుల జాతకాల్ని పరిశీలించి మంచీ చెడులను తెల్పగలరు.

అంతేకాక ఆయన ఇల్లొక సత్రంలా ఉండేది. ఆయ నకు పిల్లలు లేరు. భార్యా భర్తలూ, అత్తగారే అవటంవల్ల,

# అద్దంకి - అమ్మిరాజప్రధాని

శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు

ఈ కవి తిలకుడు—శారదాచరణ మంజీర ఝళంఝళారవ ధారావేగమున 'నపూర్వ మనోహర నవరస సంభరితమగు 'నరసింహ గురు చరిత్రంబను— నాల్గాశ్వాసముల మహా కావ్యమును గ్రథియించి—'దళదంభోరుహతులసీదళమాలాలోల మరవదళిగా కళావిలసిత శృంగారునకును లలిత శ్రీ వేంకటాచల విహారున కంకితమిచ్చి ధన్యుడైనాడు. సకల సుకవిరత్నహార హీరమణి—సప్త సంతానములలో ఖిలము గాకుండునది ధాత్రిలోకృతియెకదా!

**నివాసము:** ఈకవి గుంటూరు మండలాంతర్గతంబై—చారిత్రక ప్రసిద్ధిగాంచి—రెడ్డిరాజుల కాలమున భువన మోహనమై—వేమ పృథ్వీపతి యాస్థాన కవిసార్వభౌములకు విహారాRamaమై వెలసిన—అద్దంకి గ్రామ నివాసి. ఈతని వంగసము ఆ ప్రాంతమున తామర తంపరగా వ్యాపించియున్నది. ఆనాడి 'యద్దంకి'నాడు నెల్లూరు మండలాంతర్గతము. నేడు—గుంటూరు మండలాంతర్గతము—నాటి కవి చరిత్రనుబట్టి అమ్మిరాజకవి—నెల్లూరు సీమవాసియే.

ఈతడు ఈ ప్రబంధమందలి—కావ్యాదినిబట్టియు—పూర్వ కవీంద్ర సంస్తుతినిబట్టియు—కవిత్వమునుబట్టియు ఈ తాళపత్ర గ్రంథములోని—భాష—రచనా విధానముల ననుసరించియు మూడు, నాల్గు శతాబ్దములకు బూర్వపు వాడని ద్యోతకమగుచున్నది. ఈ గ్రంథముననున్న తిరువేంగళార్య దా. ౨౦ డరుదుగ రఘునాయకుండు—అమరగ వ్రాసెన్. పరగ ప్రతినున్న మాడ్కిని, గరిమన్ నరసింహగురుని కథ పెంపొందన్ అన్న పద్యమునుబట్టి ఇది వీ రిరువురుగలసి వ్రాసికొన్న ప్రతియని తెలియుచున్నది. పైగా ఇద్దరి వ్రాతయు వేర్వేరుగ కనుపడుచున్నది. దీనినిబట్టియే కావ్య ప్రాచీనత నుగ్గడింప వచ్చు—అట్లయినచో కవికాలము మరియొక శతాబ్దము ముందునకు పోవలసియుండును. ఇక పూర్వ కవిస్తుతితో—నన్నపార్యు దలచి—సమధికతోషి తిక్కన మనీషి ప్రార్థించి ఎర్రన ప్రెగ్గడ శ్రీనాధ—భాస్కర—అల్లసాని పెద్దన—ధూర్జటి—శంభుదాసు సూరనార్యుని—నాచనసోముని రామభద్రకవిని సోము (పిడపర్తి) నర్చింతు భావమలర అని స్తుతించినాడు. ఈ కవుల కాలమును బట్టియైనను క్రీ. శ. 16 వ శతాబ్దపు టుత్తర భాగము వాడు కావలయును. కావ్య గర్భమున నింతకుమించిన యాధారము లెవ్వియు కనుపడలేదు. పరిశీలకు లెవ్వరేని యెరింగి యున్న సకారణముగ నిరూపింతురుగాక! ఆంధ్ర గ్రంథమాల అముద్రితా ముద్రిత గ్రంథ సర్వస్వ పట్టికలో—నీ కవిపేరు గాని— కావ్యము పేరుగాని కనుపడలేదు. ఇతర కృతు లెవ్వియు కనుపడవు. ఇతరము లెవ్వియు లేకుండియుండవు. తద్వంశీకు లెవ్వరికడనైననుండి—దేవతార్చనపు పెట్టెలలోనో—కుడ్యో పరి భాగములనో నిద్రించుచు—పొగచూరుచుండు నటలో సందియ మిసుమంతయులేదు. అట్లు బయటపడిన గ్రంథములో కొన్ని "చంద్రవర్మ చరిత్ర, వకుళ భూషణ, భాస్కరోదయము" మున్నగునవి కలవు. ఎవరేని మహా మహు లా గ్రంథములకు—సూర్యాలోకన భాగ్యము కలిగింతురుగాక! అది—ముద్రణా యంత్రములులేని కాలమగుటచేత గ్రంథముల పోషించు గ్రంథాలయములులేని కాలమగుటచేతను ఆ యా పల్లెపట్టులలో వెలసిన మహా కవుల కావ్యము లిట్టి దుర్గతికి పాలైనవి. రాజపోషణ యున్న కవుల గ్రంథములన్నియు వెలుగులోకి వచ్చినవి. తగు పోషణతో 'సరస్వతీ మహల్'వంటి గ్రంథాలయములో—భద్రపరుపపడియున్నవి.

**కులగోత్రములు:—**

'ఇది శ్రీ మదన గోపాలకృష్ణ ప్రసాద సమాసాదిత—కవితాచిత్ర—అద్దంకి వేంకటాద్రిపుత్ర—తిరుమల—తిరువేంగళాచార్య చరణ కైంకర్య లీలా విధేయ—అమ్మిరాజనామ

ధేయకవి ప్రణీతంబైన—'నరసింహ గురు చరిత్రంబను—మహా ప్రబంధంబునందు—ప్రథమాశ్వాసము—ఈ కావ్యాంత గద్యయేగాక

సీ. "శ్రీ రుక్మిణీ వధూటీ రతోత్సవకేళి కాలోల మదన
గోపాల కృష్ణ
కరుణా కటాక్ష వీక్షణ సమాసాదిత మధుర చిత్రాశు
నిర్మల కవిత్వ
తత్వ సంవేది వద్దంకి వల మ—రాజకుల భూషణుడవు
లలితమతివి
కౌండిన్యముని గోత్రస్థుడ వాపస్తంబ సూత్ర చిత్ర
చరిత్ర శోభితుడవు
మంత్రి శ్రీ వేంకటాద్రి కుమారకుడవు
సరస తిరువేంగళాచార్య చరణ పద్మ
రచిత కైంకర్య లక్ష్మిచే ప్రబలినావు!
సద్గుణ నిధాన అమ్మిరాజ ప్రధాన"

అను పద్యము వలనను—కవి ఇంటిపేరు అద్దంకి యనియు—కౌండిన్యగోత్ర శుభాపస్తంబ సత్సూత్రుడనియు మంత్రి శ్రీ వేంకటాద్రి తండ్రియనియు—మధుర చిత్రాశు విర్మల కవిత్వ సంవేదియనియు—స్వాచార్యుడు, తిరుమల తిరువేంగళాచార్యుడనియు తెలియుటేగాక—పీఠికలోని పద్య గద్యముల మూలమున ఈ కవి వంశము వారెల్లరు—ఏడు మూడు పుర్వ షాంతరములనుండియు కవులై, పండితులై ఉన్నట్లు తెలియ్యచున్నది. ఈ అద్దంకివారు యార్వేల వియోగులవియు, శ్రీ విశిష్టాద్వైత మతావలంబకులనియు నవగతమగుచున్నది. ఈ కావ్య నాయకుడైన—నరసింహగురుడు శ్రీ వైష్ణవుడు—శఠమర్షణ గోత్రుడు.

**కావ్యావిర్భావము:—**

ఈ కవి యొకనాడు అపూర్వ మనోహర నవరస బంధుర ప్రబంధ రచనా కౌతూహలాదక్షుండై యున్న యవసరంబున—

సీ. "సిరిని యేచినయన్న గిరిని మోచిన వెన్న
కరిని గాచిన చెన్న గలుగువాడు
లీలజూపిన డాలు కేలనాపిన వాలు
నాలమేపిన మేలు నందువాడు
మనము మీరిన యేపు దినము సేరిన చూపు
ఘనము గేరిన రూపు నెనయువాడు
రోట వాగిన బొజ్జ నీట పొంగిన హజ్జ
మాట రేగిన నజ్జ నీటువాడు
వలువ చెలువగు పచ్చని వలువవాడు
మోముకళలకు సోముని గోమువాడు
కంబు కంఠంబువాడు లోకంబు లేలు
కరుణనా కనుగవ మ్రోల గానబడియె"

ఇట్టి వల్లవి వల్లవ తల్లజుడగు నల్లనయ్య చల్లగా గనుపడగా—అద్దేవతా సార్వభౌముని దివ్యరూపావృత ధారాని కాయంబుల పానంబుజేయుచు. . . . సాష్టాంగ ప్రణామంబు లాచరించిన నాతడు 'అంభోధర గంభీర మధుర సల్లాప భాషణం బుల—కృపారసంబు విడంబింప నిట్లనియె.

"శ్రీ మద్వేంకట శైల భర్తనుజామీ చింతివగా నేను ని
న్నామోదంబున బ్రోచు కోరికలనే సాక్షాత్కృతిన్ బొందితిన్
భూమిన్ దిర్మల నంబిమౌని చరితంబున్ సత్కృతిన్
జేయునీ
సామర్థ్యంబున మత్కృపాన్విత కటాక్ష శ్రీల తోడ్పాటు
నన్"—

అని యనుచు—మదీయ భక్తులును—పరమ భాగవతోత్తములును—శఠ మర్షణ మౌనిగోత్ర సంభవులున—తిరుమల పెద సింగరాచార్యుండు మొదలు భవద్గురుండైన—తిరువేంగళాచార్య పర్యంతంబుగా కలుగు—తిరుమల, అద్దంకి వంశ సంభూతులును—దానజన దీక్షా విచక్షణులగు దేశికోత్తముల చరిత్రంబు మహా ప్రబంధంబు గావించి—మాపేర నంకితము సేయుమని తిరోహితుండైనాడట—ఆ దేవదేవుని యనుజ్ఞ ననుసరించి—నీ కావ్యమునకు నాందీ ప్రస్తావన మాచరించినాడట ఈ పరమ భాగవత కవిశేఖరుడు.

ఇక నా తరువాత—మేల్కొని కాంచనాంబరు విజ భక్తజన పారతంత్ర్యమునకు—నభినందింపుచు అనంతరము ఇందిరా సుందరీ కృపాతరంగి కాపాంగ సమాసాదిత వైభవుడును—రామాయణ భారత భాగవత వైష్ణవాది బహు పురాణ రహస్యార్థ భాషానుభావ సంవిద్వి శారదుండును—తిరువేంకటార్యుడును పితృవ్యుండగు చిన సింగరి సద్గురుండును తిరుమల అద్దంకి వంశాలంకారుండగు—శింగరాచార్యమూర్ధన్యుని చతుష్షష్టి కళా సమన్వితులగు—పండిత కవి గాయకాది వివిధ జనంబులు—పరివేష్టించియుండగా—నీ కవి—వినయ వినమిత మస్తకుండై సాష్టాంగ ప్రణామంబు లాచరించి తన స్వాప్నిక వృత్తాంతమును వివిపింపగా 'ఆనంద కందళిత హృదయార విందుడై "వినుము తిరుమల నంబినన్మౌని వరేణ్యు మహిమ—పెద సింగరాచార్యమౌని లేడి కలరి—మోక్షం బొసంగిన యతుల కథల సత్కృతిఘటింపు సుకవులు సన్నుతింప, అని యస్మదాచార్య వర్యుండైన తిరువేంగళాచార్య గురుండు నన్నాదరణంబున

# అద్దంకి అమ్మిరాజ ప్రధాని

గనుంగొని శ్రీ వేంకటాచల ధాముం డానతిచ్చిన విధంబున మదీయ వంశాను చరితంబులు కృతి సేయుమని—బహుమాన పురస్సరంబుగ—దుకూలాంబర కనకమణి భూషణ కర్పూర తాంబూల మ్మొసగిన గైకొని లలిత శ్రీ వేంకటాచల విహారునకు సమర్పితంబుగా యొనర్పంబూనిన—నరసింహ గురు చరిత్రంబను—మహా ప్రబంధ రత్నంబునకు—నవరసానుభవ పాత్రంబునకు—కథాక్రమంబెట్టిదనిన—అని ఈ కావ్యశ్రీకి కవి శ్రీకారము జుట్టినాడు.

**కథా విధానము :**

అనవరత సుమనోభిరామంబై—రామచరిత్రంబు లీల—విభీషణ సంస్థాపన విశేషంబై—అర్జున రథంబు భాతి—దివ్య గంధర్వ లీలాకృతంబై—వర్ణాశ్రమ ధర్మంబుల యనువున పుణ్య జన విహారంబై—గుణవంతుని గౌరవంబు విధంబున సమారంభసత్రంబై యొప్పు నైమిశంబున—సత్రయాగంబులు సేయుచు సనకాది మహాముని జనంబు లొకనాడు సరసగోష్ఠి, హరికథా కర్ణానంద మతిశయింప,

> "పారాశర్య ముఖోది తాఖిల మహాభా ష్యత్పురాణోతిహా
> సారూ ఘార్థ ము లాలకించితిమి సూతా! విష్ణు భక్తాగ్రణుల్
> ధీరుల్ భాగవతాగ్ర గణ్యుల సుధాత్రిం బొల్తు రెవ్వారహా
> వారిం బేర్కొని తచ్చరిత్రములు శేవన్—మా కెరిం
> గింపుమా"

> వ్యాస ప్రసార మతి నితి
> హాస పురాణార్థ విడుడవది కాక గుణో
> ల్లాసివి—కలియుగమున హరి
> దాసుల చరితములు విని యెదము తెల్పనగున్.

అని—పరమ భాగవత కథా విధానా కర్ణనావధాన ప్రధాన మానసాంభోజులయి— శుక సనకాది మహామునులు సూతుని ప్రార్థింప, నాతడు 'సురమౌనులార వినుడిక నెరిగించెద మీకు మోద మెదలో బోదలగ శ్రీ హరిదాసుల కథనంబులు గురు తామస జన్యమానగుణ నిధనంబుల్' అని ఈ కథలను జెప్పుట కుపక్రమించినాడట.

శ్రీ వైష్ణవ సంప్రదాయముతో—భగవ ద్వైభవము కంటె—భాగవత వైభవ మతివేలమని సిద్ధాంతము గలదు—భాగవత వైభవ మనగా నాచార్య వైభవమని యర్థము. ఈ సిద్ధాంతము శ్రీ రామాయణమున సర్వాత్మనా సిద్ధాంత మొనర్చినారు శ్రీ వాల్మీకులు. అటులనే శ్రీ నరసింహ దేశికులు భాగవత గోష్ఠిలో నద్వితీయులు. ఈయన శీల సౌభాగ్య మప్రతిమము. సత్యవాక్యసరణి యనుపమానము—యుక్త వాదిత్వ మతి గంభీరము—వ్రత దార్ఢ్యము ప్రదుష్యము. సామర్థ్యము సర్వ సంప్రతిపన్నమగుట—నీ ఇతివృత్తము కవిగ్రైకొని యుండనోపు.

**ఇతివృత్తము — కావ్య విమర్శ .**

తొలి యాశ్వాసమున—నైమిశారణ్య వర్ణనంబును—శుక సనకాది మహామునులు—భాగవతోత్తముల చరిత్రల ప్రశంసన సేయుటయు సూతుండు—తిరుమలనంబి—పెద సింగరాచార్యుల ప్రభావంబు దెలుపుటయు శ్రీ వేంకటేశ్వర స్తుతియు తిరుపతి పురవర్ణనంబును— తిరుమంజనపురతంత్రుడై యున్న తిరుమలనంబిని—శేషాచలవాసుడు తాతయని పిల్చుటయు అను విశేషములు కలవు. ఈ యాశ్వాసముననే ప్రబంధ వర్ణనమునకు బీజావాపన మొనర్చుట తిరుపతి నగర వర్ణనతో ప్రారంభమైనది. చక్కని చిక్కని వర్ణన, ఇతర కవులు సీసములో చెప్పగల వర్ణనను—ఈ కవి కందముననే సాలంకారముగ జెప్పి పండితునేగాక—పామరుని గూడా ఆహా యని యనిపించగల దిట్ట. పాత పద్ధతియైనను—వర్ణన నవీన మార్గాన్వేషియై యున్నది. ఉదాహరణకు :

> కానీ తా జతురాననుండగుటకున్ కంజాత సంజాతుడెం
> తేనిత్యంబు ముకుంద సేవ గనెనే దివ్య ప్రబంధాను సం
> ధానంబున్ ఘటియించెనే యని మదిన్ దత్పట్ట ణాచార్య వి
> ప్రానీకంబుదలంచు నుల్లసిత విద్యాశేముషీ ప్రౌఢిమన్—అ—1

ఇట్టి హృద్యమైన కల్పనలతో కల్పనా నిపుణ కవిః అన్న వాక్యము సార్థక పరచినాడు:—

ఇక రెండవ యాశ్వాసము—తిరుమలనంబివలన[1] 'రామానుజ గురుండు—రామాయణ రహస్యంబులుపదేశంబు గొనుటయు—ప్రావృట్కాల వర్ణనంబును—తిరుమల నంబి వంశానుసరణంబును—అందు శ్రీ వేంకట తాతయాచార్యుండు ద్రవిడ రాజ పరిభూతుండై తిరుమల పట్టనము విడచి అద్దంకిపురము జేరి యధివసించుటయు పరిణయం బాడుటయు అమ్మవింద్రునకు—[2]సింగరికొండ నృసింహ దేవుని కృప పెద సింగరాచార్య—చిన సింగరాచార్యు లుదయించుటయు అందురే చినసింగర గురుండు—వీటూరిధాముడై—రాయగురుండన—శ్రీ కాంచీపురంబున కరుగుటయు—పెద సింగర దేశికేంద్రుడు—అద్దంకినుండి ధర్మపురి నృసింహ సేవార్థంబుగా నరుగుటయు—నందు

1. గురు పరంపరా ప్రభావమందలి విషయమని తోచెడిని.
2. ఈ సింగరి కొండ అద్దంకికి షుమారు రెండు మైళ్ళ దూరముననున్న ప్రఖ్యాతనృసింహక్షేత్రము. ఇపుడా ప్రాంతము నిత్య కల్యాణముగ నెగడచుచున్నది.
3. కాంచీపురమున— కోటి కన్యాదానము వారని బహు కుటుంబములు వ్యాపించి యున్నవి.

మధ్యే మార్గమున మద్దిరాలయను గ్రామంబున మారి శక్తికి మాధవి యను దాస్యనామంబిడుటయు — ఆ శక్తికి పంచ సంస్కారంబులు ప్రసాదించుటయు — భిల్ల భల్ల పీడితంబై — తమ్ము నాశ్రయించిన కురంగంబునకు—నమ్మునీంద్రుండు మోక్ష మొసంగుటయు చిత్రసేనుండను గంధర్వుని వృత్తాంతంబును—వన విహారంబును సరోవర్ణనంబును — జలక్రీడయు—నారదుండు—చిత్రసేనుని హరిణయోనిం సంభవింపుమని శపించి—శాప విమోచన కారణంబులు చెప్పుటయు—పోతురాజు పల్లకి మోయుటయు—శింగర గురుండు ధర్మపురంబు చేరుటయు అను వివిధ విశేష సంకలిత మీ యధ్యాయము.

ఈ యాశ్వాసమున నుద్యానసలిల క్రీడలు—సలక్షణ మధుర శైలిలో—వరి తములు. కాని చిత్రసేనుని వృత్తాంతము (మాలదాసరి కథవలె) కావ్యేతివృత్తమున కతుకలేదు. పైన ద్రావిడ ప్రాణాయామమువలె—ముండ్లతిగ సరిదీసినట్లు కథను నడిపినాడేకాని సరసత్వ ప్రతిభా కళా సమన్వితముగ తొలి యాశ్వాసమువలె నడువలేదు—శైలియు కొంత మారినది—రీతియు మార్పు జెందినది—ఈ భాగమున తిరుమంత్రార్థములోని విషయములు గురు పరంపరా ప్రభావాది పూర్వాచార కృత సాంప్రదాయ రహస్య గ్రంథములలోని విశేషములు సూచనా ప్రాయమున సూచించినాడు. మద్దిరాల మారిశక్తికి—సమాశ్రయణ మొనర్చు ఘట్టము (లు) హృ ్యతిహృద్యవలగా వర్ణించినాడు. ఇట మానవశక్తి సామర్థ్యములు సర్వరీతుల వ్యక్తీకరించినాడు. ఈ యాశ్వాసమందు — భారతమందలి యుపాఖ్యానములవలె నన్నియు చిన్న చిన్న యుపాఖ్యానములుగా నున్నవి— ప్రతి చిన్న కథయు చక్కని నీతిని నిరూపించుటేగాక—అతి సూక్ష్మములైన—ఆధ్యాత్మిక తత్త్వ రహస్యములను చర్చించి నిరూపించినాడు. ఇత డీ విషయమున దిట్ట యని యుట్టంకింపనగును. శక్తికిని వీరికిని జరిగిన సంభాషణ ఘట్టము క్రమముగా మహా సంకుల మాయెను. ఆ ఘట్టమున రౌద్ర భీభత్స రసములు పోషింపబడినవి. తన ప్రతిజ్ఞ నెరవేర్చి కొనవలయునని కవి యనేక చిత్రములైన విశేషముల వర్ణించి 'జక్కన'వలె కొన్ని పట్టు లభూతకల్పనలాయు నున్నట్లుగా గూడ జూపినాడు.

ఇక మూడవ యాశ్వాసమున హరిణంబు శాప విముక్తంబై గంధర్వుడగుటయు—వసంత ఋతు వర్ణనంబును కామినీ జనపరివృతుండై చిత్రసేనుండు మంధరాచలంబున కరుగుటయు అందు పవన విహారంబును—సరోవర్ణనంబును—జలక్రీడయు నారదాగమంబును కుపితుడై నారదుండు శపించుటయు శాపమోచనంబు నిర్దేశించుటయు నృసింహగురుండు 4 రేడికి మోక్షమొసంగుటయు పొద్దుటూరను గ్రామంబునకు జనుటయు పోతురాజ ప్రశంసయు అమ్మునీంద్రుడు ధర్మపురికింబోయి లక్ష్మీనృసింహుని సేవించుటయు నృసింహావతార సూచనంబును—ప్రహ్లాదునకు పెండ్లియు ధర్మపురి నృసింహుండు సాక్షాత్కరించుటయు నరసింహగురుండు నరకంఠీరవుని శాంతింపజేయుటయు అను విషయములు మనోహరముగ వర్ణించినాడు. ఈ యాశ్వాసమున 'ఉద్యాన సలిల క్రీడలు' వర్ణింపబడినవి. కావ్యమున కాయువు పట్టు నీ యాశ్వాసమే—రసపుష్టి వలయునంతవరకు చక్కగ పరిపోషింపబడి బంధ పారుష్య రహితమై నాతి దీర్ఘ సమాసములతో గమన గాంభీర్యముతో లేఖిని నడిచినది. ఇట భాషయు భావములును పరిణామ రమణీయములైనవి. సంస్కృతాంధ్రములు సమపాళముగ నుండి కవిత్రయ కమనీయకవితా రీతులను ప్రబంధ కవుల రమణీయములగు భావములను పుణికి పుచ్చికొనినట్లున్నది. ఈతడు ఏ లక్షణము త్రోసి వ్రాసినట్లు లేదు కొల్లని మహా మనీషిగా కనుపడుచున్నాడు. ఈ భావము మనము నందిడికొని—ఈ పద్యము జదివిన ఈతని లక్ష్య సిద్ధి మనకు గోచరమగును.

"అరయన్ రీతు లలంక్రియ ధ్వనులు, శయ్యా పాకముల్ భావశ
బ్దార్థంబులు, నాటకక్రమము ఛందః ప్రక్రియాక్ సత్కవీ
శ్వర వృత్తుల్ దెలియంగ నేర్చిన కవా నంధిల్లను త్ఫుల్ల పం
కరుహామోది సుగంధ మంజుకవితా గంభీర వాగ్గుంభనల్"

ఈ పద్యమందలి ప్రతియలంకార లక్షణమును చక్కగ పోషించినాడు—ఇందేదియు విడువలేదు. కావ్యమునందు నీ లక్షణ మునమన్వయ పడుటయేగాక 'పంకరుహామోది సుగంధ మంజుకవితా గంభీర వాగ్గుంభనల్, అన్న తుతీయ చరణము ప్రత్యక్షర సత్యము. ఇందలి పద్మ సుగంధము—విశిష్టాద్వైత సుగంధము గంభీర వాగ్గుంభనము. కావ్యమున సమయానుకూలముగ ఔచిత్యమనుసరించి లేఖిని నడచినది. 'నాటక క్రమము' ఈ తృతీయాశ్వాసమున నరసింహగురుండు ధర్మపురికింబోయి. . . . . నరసింహుడు సాక్షాత్కరించుట వరకు నాటక ఫక్కి గలదు. 'దీనికి—"హిరణ్య కసిపుని వధ" అను పేరుగల చక్కని రూపకము కాగలదు. ఇచ్చట సంభాషణలు మాధురీధురీణ రస సల్లాపంబులు కలవిగా నుండి—

4. ఈ వృత్తాంతము పునరుక్తిగా నున్నది. కారణమ సరిగాలేదు.

యనిర్వచనీయమైన ఆనందము కలిగించుచున్నవి. ఇందు చిత్రసేనుని కథయు కల్పించి కలిపినాడే కవి అంత యవసరము గనుపడదు. అతుకుల బొంతగా నున్నది. ప్రబంధ కల్పనా కథయని కల్పనజేసి—ఆ లక్షణము బట్టించినాడు—కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నములని వసుచరిత్రకారుడు నిరసించినను—కళాపూర్ణోదయమువంటి మహా కావ్యములకు కల్గిన లోటేమియులేదు కదా! ఈ కల్పనవలన కొంత రమ్యత సమకూరునని కవి భావించియుండును.

ఇక నాల్గవ యాశ్వాసమున తిరుమల పెదసింగరార్యుండు ధర్మపురి నరసింహుని శాంతింపజేసి సకలోత్సవముల గావింప జేసి—వత్సరంబటనే యధివసించి లాంగూల గజపతికి పంచ సంస్కారంబులు ప్రసాదించి—అద్దంకి పట్టణంబు జేరుటయు అతడు ఘటికాచలంబున రఘునాధుని సేవించుటయు హరి యాజ్ఞంచేసి వానమామలై పెరియజీయర్ తపోధనులవలన నుభయ వేదాంతములు సాభిప్రాయంబుగా నుపదేశంబు గొను టయు—తిరుమల పెద సింగరాచార్య వంశాను చరితంబును ఈ కృతి నెత్తివ్రాసికొనిన తిరువేంగళాచార్యుని వంశ విస్తా రంబును విపులముగ వర్ణించి కావ్యమును మంగళాంతము గావించినాడు.

ఇంక నీ యాశ్వాసమున కావ్య పరి సమాప్త మొన రించు దృష్టితో కావలయు కథా గమనము కూలంకషమై యురవళ్ళు పరవళ్ళు త్రొక్కినది. అయ్యు శబ్దా ర్థౌచిత్యము రసభావాలంకార యుక్తి చమత్కృతులన్నియు పొంకముగ బింకముగ నడచినవి. కవికి శబ్దము లొంగినది. పైననే వర్ణ నయు నూత్న మార్గ మన్వేషించినదేకాని పాత పద తిలో నఖ శిఖ పర్యంతము పాడినదే పాడలేదు. సంధికాలము వాడవుట పూర్వా పరములను సమన్వయ పరచి—కడుంగడు రమణీయ ముగ సమకాలీనులైన సుకవులు సన్నుతింప నాల్గాశ్వాసముల మహా ప్రబంధమును సంతరించినాడు.

అటనట తరుణకుసుమ తుంబురువలె జాతీయములు అలంకారములు ఘ మ ఘుమలాడుచు— వలపు గొలుపుచున్నవి— పూస గ్రుచ్చిన చందాన, పెన్నిధి గన్న పేద విధము, కానున్నది కాకపోదు, ఇత్యాది లోకోక్తులతో గూడి సమయోచితములగు చక్కని పద్య రత్నములును నిక్కోశమున విరాజిల్లుచున్నవి.

**ఛందో వ్యాకరణ విశేషములు**

నరసింహగురు చరిత్రమున—రేఫద్వయ మైత్రి కొన్ని యెడ పాటించినాడు. ఈ మైత్రిని లాక్షణికులు దోషమనినను కవి త్రయ ప్రయోగములే కలవు. ఇంక ఉపనది, రుషి, చేత్స వాడను, ఇట్లు పద్యాంతమున గనూ, వలపలగిలక శృంగ్గరాయ బిడ్డ నుపయో, ఇత్యాదులు కనుపడుచున్నవి. వ్యాకరణ విర ద్ధములైన ప్రయోగములంతగా నగుపింపవు.

ఛందో లక్షణమున నతనికి చిత్ర కవిత్వము కూడా కొట్టిన పిండిగా నున్నది. భిన్న వృత్తములగు తరళవ రా— రగడ, మానిని, భుజంగ ప్రయాతము, స్రగ్ధరలు—తోటకము, వినయవృత్తము—ఉపేంద్ర వజ్ర మున్నగు వాటిని "వృత్తౌ చిత్యము" ననుసరించి వాడినాడు. మూడవ యాశ్వాసమున నృసింహా విర్భావ సమయమున ప్రహ్లాదునిచే ప్రార్థించు పట్టున 'స్రగ్విణీయుగళ మందారదామ దండకము" రచించి నాడు. ఇట్టులెన్నియో నీతని కలమునుండి జాలువారినవి—కందము మా కందముగ నుండును సీసములు శ్రీనాధుని సంస్మరింప జేయును—శార్దూల మత్తేభాదులు పోతనను జ్ఞప్తికి దెచ్చును.

అటనట పూర్వ కవుల కవితా ఛాయలు గోచరించు చున్నవి. బహుళ కావ్య పరిశీలకు డగుట నా యా ప్రబంధము లలోని "ప్రబంధాను సంధాన ధ్యానము' వంటి వాక్యములు కనుపడుచున్నవి. తెలుగుపదముల సొగసులు వెలుగఁజేయగలడు. సంస్కృత పదముల సారస్యము చక్కగ నెరిగి యుపయో గింపగలడు. మొత్తముమీద నతని గురుభక్తి కొండంతది. అది ప్రధానముగ కావ్యము వ్రాసిన వారగుట—భక్తిరసము పాలు కొంచెము హెచ్చు—శృంగార వీర కరుణాద్భుతాది రస ములు పరిపోషింపబడినవి : అంగిరసము భక్తిరసమే!

**సంప్రదాయసంబంధమైన పదములు .—**

(1) ఏకాంగులు, (2) ఆళవందార్, (3) కులశేఖర వ్రాత (4) కైంకర్యము, (5) తిరుమంజనము, (6) తిరుక్కొ డము, (7) పెరియ జీయకర్ (8) ప్రపత్తి, (9) త్రిదండి, (10) సాయించుట మున్నగు పదములు గలవు.

ఈ కవికి సాంప్రదాయకమేగాక—ఆ యా శాస్త్ర విస్తృత రహస్యము లెన్నియో రసపై వ్యత్యము చేయు నట్లున్నది—స్వాచార్య ప్రసాదిత అను గ్రహలాభ సంజనితు డట—వాఙ్మయ సంద్రమునకేతమెత్తి. చక్కని—సారవంత మైన నరసింహ గురుచరిత్రమును పంటను పండించినాడు— తన వంశము పునీతమైనది—మాతృఋణము దీర్చికొని— ధన్యుడైనాడు.

ఈ నరసింహగురుని వంశము నేడు తామర తంపరయై నేల నాల్గు చెరగులందు మద్రాసు, నెల్లూరు, చీరాల, తక్కె ళ్ళపాడు, కాంచీపురము, ఒంగోలు మున్నగు గ్రామము లందీ కుటుంబములు వెలసియున్నవి. 18, 19, 20 శతాబ్దము లలో నీ వంశమున నెందరో మహాకవులు, త్యాగ నిరతు లావిర్భ వించి తమ వాగమృతముచే చేతనోజ్జీవనార్థముగ ననేక దేశ ములు పర్యటించి కీర్తికాయులైరి.

5. ఈ గ్రామ మెచ్చట నున్నదో?

ఇంతటి నవరస సంభరితమై గంభీర విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకమైన నీ మహా కావ్యము సూర్యాలోకన భాగ్యము నొందకపోవుట సాహిత్య లోకమునకు తీరని నష్టము.

ఇట్టి మహా కావ్యములను ఆంధ్ర సాహిత్య అకాడమీ వారుద్ధరింప యత్నము జేయుదురుగాక. ఈ కవి కావ్య శరీరమునైనను—పరిరక్షింతురుగాక:

ఇక నీ తాళ పత్ర గ్రంథమున నుండు పత్రముల సంఖ్య 67 అరువదియేడు: కావ్యమున నేభాగమును ఖిలము కాలేదు. ఈ ప్రతి నొసగిన వారు నరసింహ వరువంశాలంకారభూతులు మేఘనాథ విజయ వ్యాయోగాది, కావ్యకర్తలును 'విద్యా భూషణ బిరుదాభి రాములగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ అద్దంకి తిరుమల సమయోద్దండ కోలాహల— లక్ష్మీ నృసింహ కుమార సింగరాచార్యులయ్యవార్లంగారు. వీరికి నా కృతజ్ఞతా పూర్వక వందనము లర్పించుచున్నాను. కవితా శైలి కీ పద్యములు చదివి చూచెదరుగాక:—

శ్రీ యలమేలు మంగ నెదజేరిచి కౌస్తుభ రత్న భూషణ
శ్రీయుతుడై మహా మహిమచే చెలువౌ భగవంతు డాదినా
రాయణు డాద్యుడంజన ధరాధరధాముడు వేంకటేశ్వరుం
డాయతనిత్య సౌఖ్యము—దయామతి నీవుత భక్తికోటికిన్.

హరి కారుణ్య కటాక్ష వీక్షణము లాయావేళ సూచింపగా
పరమంబౌ చర మార్గమున్ దెలుపుచున్ భక్తావళిన్ బ్రోచుచున్
పరుసన్ లోకము నుద్ధరించు పసులన్ వర్ధించు నైన్యాధిపున్
సరసున్ సూత్రవతీ మనోహరుని విష్వక్సేను ప్రార్థించెదన్.

# పాలరాయి: ఎఱ్ఱ ఇసుక రాయి: శివలింగాలు

## సోమరాజుపల్లి చెంచయ్య

గత మేనెల భారతి సంచిక యందు శ్రీ శ్రీపాద గోపాల కృష్ణ మూర్తిగారు వ్రాసిన వ్యాసము చదివితిని. అందు వారు ఇంత వరకు వివిధ ప్రాంతముల యందు దొరికిన పాలరాతి శివ లింగములను గురించి ఉదాహరించిరి.

ఇలాగే నెల్లూరు జిల్లా, కందుకూరు తాలూకా — కొండపి పంచాయతీ సమితికి జెందిన, పెట్లూరు గ్రామంలో ఉండే, శ్రీ భీమేశ్వరస్వామివారి ఆలయము నందలి శివ లింగము పాలరాతిదే. ఇచ్చట చాళుక్యుల కాలమునాటి శిలా శాసనము గూడా ఉన్నది!

ఈ శాసన పాఠమును దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారు తమ "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర" పీఠిక యందుదాహరించిరి.

ఆలయము ఆవరణము నందు రెండు మూడు జైన విగ్రహములు, శిథిలము జేయబడినవి — నేటికిని, అచట గలవు. ఇంకను, ఆలయమునకు సమీపము నందున్న "దేవతల బావి" — మంచినీటి బావి దగ్గిర గూడా, మరికొన్ని శిలా విగ్రహములున్నవి. అక్కడ గూడా, కొన్ని శిలా విగ్రహముల శిరస్సులు విరుగగొట్ట బడినవి.

ఈ శివాలయము తొలుత జైన మతానుయాయులకు జెందినదనిపించు చున్నది. పూర్వపు ప్రాకార, సింహ ద్వారములు మూసివేయ బడినవి. ఎట్లన ? ఇక్కడికి, ఒకటిన్నర మైలు దూరమునందుండెడి, "ధర్మవరం" అను గ్రామము ఒకప్పుడు జైన మతానుయాయులకు, ప్రముఖ విద్యా కేంద్రముగా యుండియుండెడిదని, స్వర్గీయ శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, అక్షయనామ సంవత్సరము (1928) సంవత్సరాది సంచిక యందు —"ప్రాచీన విద్యా పీఠములు" — శీర్షికను రాసిన, వ్యాసమునందుదాహరించిరి.

ఇక కందుకూరు తాలూకా, శాఖవరం గ్రామంలో, ఉండే శ్రీ మల్లేశ్వరస్వామి వారి ఆలయము నందు ప్రతిష్ఠింప బడిన లింగము ఎఱ్ఱ ఇసుక రాతి లింగము. ఈ గ్రామము నాస్వగ్రామము. నాకు బాగుగా యూహ వచ్చునంతవరకు — చెరువు కట్టలో, ఈ లింగమునకు చాలా చిన్న గుడి కట్టబడి యుండెడిది. ఈ శివ లింగావతరణమును గురించి స్థానికులు ఇట్లా చెబుతారు.: "జంగము వారి ఇంటబుట్టి పెరుగు చుండిన, "మల్లయ్య" అను కుర్రవాడు తోటి పిల్లలతో, తమ గేదెలను కాయుటకు నిత్యము వచ్చెడు వాడనియు., ఒకనాడు ఆ ఊరి చెరువు నీరు ప్రవహించెడి తూము నందు ప్రవేశించి — తోటి పిల్లలు వెలుపలికి రమ్మని ఎంత పిల్చినను "ఓ" యని బదులు పలుకునే గాని, — ఆ కుర్రవాడు తూములో నుంచి వెలుపలికి రాలేదట ! ఈ సమాచారము విన్న అతని తలిదండ్రులు. గ్రామస్థులు అచటికి వచ్చి తూము పగులగొట్టి చూడగా — ఆ తూము చూడగా — ఆ తూము మధ్య "లింగము" వెలిసి యుండెననియు — అంతట, ఆ గ్రామస్థులు లింగమును పెకలించి మరియొక ప్రదేశము నందు ప్రతిష్ఠింప దలచి ప్రయత్నించి విఫలులై — ఆఖరుకు ఆతూము రాళ్లతోటే ఒక చిన్న ఆలయము నిర్మించి — చెరువు తూము మరియొకటి ఆలయమునకు ఎడమవేపున నిర్మించి — నిత్య నైవేద్య ధూప దీపారాధనలకు గాను కొంత మాన్యము ఏర్పాటు చేసిరిరని, చెప్పెదరు.

నాకుఊహ వచ్చునంతవరకు, తొలినాటి ఆలయమే ఉండెడిది. ఆలయము తూములో నిర్మించ బడినట్లు చిహ్నములు గూడా కనుపించు చుండెడివి. 1935 లో, స్థానికులు, ఆలయాన్ని పునర్నిర్మించిరి. ఈ ఆలయమునకు సంబంధించిన చరిత్రను తెలియ జేయు శాసనాదులు ఇచట లేవు. జిల్లా రికార్డులలో దొరుకునేమో ? చూడాల్సింటుంది.